# తొలి పలుకు

అనుభవముతోకూడిన వచన రచనములు, సాధనా పటిమ గలిగిన ఏకాగ్రతవలన సాధ్యము. ఆ ఏకాగ్రతచే జ్ఞానమును, 'ఏక విజ్ఞానేన సర్వ విజ్ఞానం భవతి' అజ్ఞానముచే సర్వ విజ్ఞానములు కలుగుచున్నవనిగదా శాస్త్రము. అదికూడ పూర్వజన్మ సుకృతలభ్యమే!

శ్రీ అనుభవానంద స్వాములవారు, సకల సమన్వయావతార మగు శ్రీ రామకృష్ణదేవుని సర్వాదర్శమూర్తిగా ఆరాధించిన మహ నీయులగుటచేనేమో, వారి వచన రచనము లందు ఆ సమత్వము వ్యక్తమగుచుండును. ఆ సమత్వము వారి సకల గ్రంథములలో ప్రవహించుచుండును. అట్టి గ్రంథమే 'సర్వ సిద్ధాంత సౌరభము'. ఆ పేరులోనే ఆ సమరసత్వము వ్యక్తము.

''సర్వ వేదాంత సిద్ధాంత సారసంగ్రహము''ను శ్రీ శంకరు లును, ''సర్వ సిద్ధాంత లేశ సంగ్రహము''ను శ్రీ అప్పయ్య దీక్షితులును రచించినట్లుగా 'సర్వ సిద్ధాంత సౌరభము'ను శ్రీ అనుభవా నంద స్వాములవారును రచించిరి. పుష్పముల సువాసన నాఘ్రా ణించినవారు, ఆ కుసుమము ఎచ్చట నున్నదో అని అన్వేషించి, ఆ వృక్షమును కనుగొని సంతసించినట్లు సిద్ధాంతమను పుష్ప సౌరభ మును గాంచినవారుకూడ గవేషణము సలిపి, ఆ సిద్ధాంత వృక్షరాజ మును కనుగొని ఆనందించవలయునని శ్రీ స్వాములవారి ఉద్దేశము. ఏ పూవు విలువ సుగంధములు దానివే! అట్లే ఏ సిద్ధాంత విశిష్టత

దానిదే! ఆ సమత్వ గ్రహణమునకే, ఆచరణమునకే యీ 'సౌరభ' రచనము. ఆ సామరస్యముచే సంకుచితత్త్వము బాసి, పర మత దూషణములు మాని, విశాలమును విశ్వతోముఖము నగు ఆనంద మును పొందనగును.

ఇదియే శ్రీ రామకృష్ణదేవుని ప్రత్యేక సాధనా విధానము! ఇదియే ప్రత్యక్ష అనుభవస్థితి! సాధనలనేకములు గాని అనుభవము ఒక్కటే! సిద్ధాంతములు బహుళములుగాని గమ్యమొక్కటే! సకలాను భవ స్వరూపుడైన శ్రీ రామకృష్ణుని సమస్త సాధనా విధానములను, సర్వమత సామరస్యమును, సకలానుభవ రహస్యములను వ్యక్తము చేయుటకే యీ శ్రీ అనుభవానంద గ్రంథమాలను శ్రీ అనుభవానంద స్వాములవారు సంస్థాపించిరి.

పాఠకులు దీనిని పఠించి మన మహర్షుల భౌతికాభౌతిక విజ్ఞాన సంపదకు వారసులై, మన ప్రాచీన భారతీయాధ్యాత్మిక సంస్కృతీ ప్రవాహమున నీదులాడి, యదార్థ భారతీయులై మనెదరు గాక!

ఈ గ్రంథ ముద్రణకు శ్రీ తిరుమల తిరుపతి దేవస్థానము వారు రు. 7396-00 లు ఆర్థిక సహాయముచేసి, మా గ్రంథమాల కృషికి ప్రోత్సహించినందులకు వారికి మా కృతజ్ఞతలు.

మాతాజీ
త్యాగీశానంద

# సమర్పణము



శ్రీరామాది దశావతారములకున్, శ్రీలక్ష్మి వాణీ ఉమా
తారాశక్తులకున్, త్రిమూర్తులకు స్వస్థానంబుగానొప్పు నా
పారావారము, రామకృష్ణగురు, సర్వాధ్యాత్మిక స్థానమున్
ఆరాధించుచు గ్రంథ మిచ్చెదను సర్వాధ్యాత్మికాన్వేషినై

శ్రీవిద్యా ప్రతిభాస్వరూపులు, మహోత్కృష్టానుభూతస్థితుల్
భావాతీతులు, తత్త్వసిద్ధులును, సర్వాధ్యాత్మికాచార్యులై
భావిన్ భూతము వర్తమానములలో భాసిల్లు తత్త్వజ్ఞులన్
భావించే నిడువాడ గ్రంథమును సర్వాధ్యాత్మికాన్వేషినై

శుభమై, సుందరమై, సుఖప్రదమునై శోభిల్లు తత్త్వార్థ సు
ప్రభ కన్వేషకులౌ ముముక్షులకు సర్వాధ్యాత్మికోత్కృష్టతా
విభవార్థంబు ననుగ్రహింపగల దేవిన్ 'సర్వ సిద్ధాంత సౌ
రభమున్' నేను సమర్పణం బిడుదు సర్వాధ్యాత్మికాన్వేషినై

ఓం

శ్రీ శారదా రామకృష్ణాభ్యాం నమః



# సర్వసిద్ధాంత సౌరభము



—:అష్టమ సంపుటము:—

## ముఖపరిబంధము

### సర్వ సిద్ధాంత సౌరభము

కస్తూరీతిలకం లలాటఫలకే వక్షస్థలే కౌస్తుభం
నాసాగ్రే నవమౌక్తిక కంఠతలే వేణుం కరే కంకణం।
సర్వాంగే హరిచందనం చ కలయం కంఠే చ ముక్తావళీం
గోపస్త్రీపరివేష్టితో విజయతే గోపాలచూడామణిః॥

అని కీర్తింపబడిన శ్రీకృష్ణపరమాత్ముని అనుగ్రహవిశేషమున, మన సౌరభ గ్రంథము ఏడు సంపుటముల బూర్తిజేసి, అష్టమమున బ్రవేశించుట కడుంగడు ముదావహము. ఆధునిక ప్రపంచమునగల సంక్షుభిత వాతావరణమును తిలకించి, నిత్యభయాందోళిత హృదయముల బరికించి, సత్యాహింస అమానిత్వాది దివ్యగుణ బహిష్కారణమునకు జింతించి

భక్తి జ్ఞాన వైరాగ్యాభ్యుదయలక్షణ విలక్షణ పరిస్థితుల గమనించి, పరిశీలించి, విచారించి, కారణముల వితర్కించి, లోకమున శాంతి దూతగ 1954 వ సంవత్సరమున శ్రీశారదా శతవార్షిక జయంత్యుత్సవ సందర్భమున సౌరభము ముందునకు దుమికియున్నది. అవతారమూర్తుల వలె శిక్షింప రక్షింప దానను దేరలేదు. మహాఋషిపుంగవులచందము ఆదేశింప వచ్చుటయు గాదు, ఆచార్యులరీతి ఉపదేశించి నియమింపను గూడ నామె ప్రవేశింపలేదు. సాధకులలో సాధకురాలై, జిజ్ఞాసువు లలో జిజ్ఞాసువుపై, తత్వాన్వేషణమును సాగించి, సహృదయత సంఘ మున సాధించి, పరస్పర సాహాయ్యమున విద్యాభ్యాసముల మునింగి, చేదోడువాదోడుగా సంఘముతోసహ పారమార్థిక మహాగమ్యమును ఆకళించుకొని, సాధ్యమైన కబళించుకొని, తదాస్వాదనమాధుర్య రుచుల నానందపారవశ్యము నొంద నవకాశముకొరకే సౌరభముయొక్క పరమ కార్యదీక్ష, అదియే ఆమె హస్తకంకణము. అదియే ఆమెకు హృదయగత పరమావధి.

## ప్రథమ సంపుటము

అందులకై తొల్దొలుత బరమర్షిపుంగవుడు, కరుణాసింధువు, భౌతికాధ్యాత్మికశాస్త్రవిదుడు అగు 'ఆదివిద్వాన్' గపిలాచార్యుని సంస్తుతి వాక్యస్మరణముతో సౌరభము, తన తొలి సంపుటమునకు నాంది పాడినది. అందు ఆచార్యుని జీవితకాలము ప్రస్తుత సృష్ట్యాదిని స్వాయంభువ మనువు కాలముగ దీర్మానించి, అతని జ్ఞానవైరాగ్యముల నుగ్గడించి, ఆతని సర్వతోముఖ విద్యావైదుష్యమును నిరూపించు సాంఖ్యసిద్ధాంత

మును సోదాహరణముగ, సప్రమాణముగ, ప్రాచీనాధునిక పండితా గ్రేసరుల వాక్యసమూహములతో వివరించి, సౌరభము ధన్యయయ్యెను. అటులే కపిల బహుకాలాంతర జన్మమైనను, కాపిల సాంఖ్య సిద్ధాంత సౌందర్యముల నవలోకించి, దాని నాధ్యాత్మికసౌధ శిఖరారోహణమునకు బ్రముఖ నిశ్శ్రేణిగ స్వీకరించి, ఉత్పాదనా ఫలసిద్ధికై హిరణ్యగర్భు నుండి పారంపర్యముగ నడచెంచుచున్న చిత్తవృత్తినిరోధరూప యోగ మార్గమును, మానసిక తత్వశాస్త్ర చక్రవర్తియగు పతంజలి మునీంద్రుడు వివరించుటచే సౌరభము, యోగ సిద్ధాంత వివరణమును, ఆ మౌనిచంద్రుని జీవితముతోపాటు ప్రథమ సంపుటమున చేర్చి ముచ్చటించెను.

## ద్వితీయ సంపుటము

అంత ద్వితీయ సంపుటమున, మనోవాక్కాయములమాత్రమే గాక, భౌతికాభౌతిక సృష్టిస్థితిలను గలయజూచి, నిష్ప్రయోజక బాహ్యమును ద్రోసి, అంతర అవ్యయానంద నిమగ్న చిత్తుడై, జాతరూప ధరుడై, అనికేతనుడై, పరమహంస పరివ్రాజకుడై యుండెడు కణాద ఋషివరేణ్యుని సిద్ధాంతమైన వైశేషికమును సౌరభము స్వీకరించెను. ఆ మునికులాలంకారుని భౌతిక, రసాయనిక, పారమార్థిక విజ్ఞానసంపన్నతను విశదము చేసి, స్థూలత్వమునుండి సూక్ష్మత్వమునకెట్లు సాధకు డెగబ్రాకగలడో శ్రవణము గావించుకొంటిమి. వీనినన్నింట దోచు అసంఖ్యాక సందేహములకు వెరచి, పలాయనమగు సాధకుల విశ్రాంతి కాకరమగు అచ్ఛాదనముగ, ఓన యమేయ తార్కిక పితార్కిక వాదము

లను ఆయుధములచే ధరించి నిలచిన, న్యాయశాస్త్ర సార్వభౌముడగు గౌతమమహర్షి శేఖరుని జీవిత సిద్ధాంతములు విశదపరుపబడెను.

## తృతీయ సంపుటము

సౌరభము స్థూలసూక్ష్మముల నిట్లు ప్రథమ, ద్వితీయ సంపుటముల నిరూపించి, తృతీయమున నతి సూక్ష్మాతి సూక్ష్మమైన తత్వపదార్థ నిర్ణయముపైకి దృష్టిసారించి, అలౌకికానందమునకై చిత్తశుద్ధి కారణమైన కర్మనిరతి జైమిని మహామునిచంద్రుని అనుసరించి, ఇహసుఖముల బ్రక్కనునిచి, పరసుఖములపైకి జూడ్కుల జాచెను. అందును శబ్దశాస్త్రము, రసాయనికశాస్త్రములలో ఆ మహర్షి భాస్కరుని ప్రౌఢత్వమును గని, సౌరభము ఆశ్చర్యమును వ్యక్త పరచెను. పాంచభౌతిక ప్రపంచగత సుఖములల్పములుగ రోసి, పరానందములకై మింటికెగబ్రాకజాలు విధానముల నా మునిశ్రేష్ఠుని చెంత సౌరభము గాంచెను. కాని అంతలో నా పరములుగూడ నిహములవలె నత్యల్పములు, క్షణికములు అని గ్రహించి, ఉపనిషత్తుల బిండి, సారమును దీసి, సూత్రరూపమున సంసిద్ధముగ వేదాంతమును చేసియున్న వేదవ్యాసమహర్షి వాక్యతాత్పర్యము. అత్యవసరమగుటచే, సౌరభము మూడవదియగు నలౌకిక సంపుటమున వివరించెను. ఈ వేదాంత సూత్రపాఠము సకలేతర సిద్ధాంత ప్రతిపాదనమునకు ప్రాతిపదికమై, ఆధారమై, శరణ్యమై, ద్వైత, అద్వైత, విశిష్టాద్వైతములకు మాత్రమేగాక, వానివలె బ్రముఖముగాని అఖిలేతర మతవాదములకు

గూడ ఆశ్రయమైయున్నది. ఈ విధముగ సౌరభ గ్రంథము మొదటి సంపుట త్రయములలో సర్వతాత్త్విక విచారణమునకు అధిష్ఠాన భూతమైన దర్శనషట్కమును విచారించి, వివరించి, అసంఖ్యాక సాధక, పండిత, పామర సంస్తుతులచే నలంకృతయై రాణించెను. అది ఆమెకు ఆనందకారణమేగాక సాధకలోకమున కెల్ల సమ్మోదకారణము.

## చతుర్థ సంపుటము

చతుర్థ సంపుటము, ప్రాచీన భారతీయ సంస్కృతీ మాహాత్మ్యము జాటి, సర్వాధునిక భౌతిక విజ్ఞాన సిద్ధాంతముల నైజమును బ్రకటించి, అవి ప్రాచీన భారతమున రూపాంతరమున దెలియబడియే యుండెనని నిరూపించి, భారతీయ సంస్కృతీ వైశిష్ట్యమును బ్రదర్శించెను. అంత, సర్వ భౌతికాభౌతికతర్కముల బరిశీలించి, సమన్వయించి, సమన్వయించి, భౌతికము మృణప్రాయముగ భ్రాంతిరూపముగ గాలదన్ను శక్తిసామర్థ్యములచే విభూషితయైన అద్వైతసిద్ధాంత జననాదుల నిందు సౌరభము ఎత్తిచూపెను. అద్వైతస్రవంతి వేదజన్యమని నిరూపించెను, వేదోపనిషత్పురాణేతిహాసస్మృతులనేగాక, జైన బౌద్ధములగూడ నద్వైతము ఎట్లు ఆవరించినదియు జూపి, శ్రీశంకరాచార్యుని పరమ గురువైన గౌడపాదాచార్యుని మాండూక్యకారికా వ్యాఖ్యతో నాల్గవ సంపుటము సమాప్తము.

## పంచమ సంపుటము

అయిదవ సంపుటమున, యువక యతి చక్రవర్తియైన శ్రీశంకర భగవత్పాదాచార్యుని సవిమర్శక జీవితముతో బ్రారంభింపబడి, ఆ మహా

పురుషుని మహాప్రసాదములుగ బ్రపంచమున బహుళ వ్యాప్తినొందిన, సన్న్యాస, అద్వైత సిద్ధాంతములు వివరింపబడెను. సన్న్యాసము యొక్క ప్రాచీనతయేగాక, సమీచీనతయు, ఔచిత్యముగూడ బలపరుప బడెను. అటులే శ్రీశంకరాద్వైతవాదమున జూపబడు అసంఖ్యాక సంశయములుసయితము, ఆ యాచార్యవర్యుని గ్రంథప్రమాణమున నివారింపబడెను. అద్వైత సిద్ధాంతము శ్రుతి యుక్తి అనుభవములచే నజేయమనియు నిర్ణయింపబడెను.

## షష్ఠమ సంపుటము

ఆరవ సంపుటము, ఉద్దండపండితులైన శ్రీశంకరాచార్య శిష్య వర్గముయొక్క సిద్ధాంత సమీక్ష గావించెను. సురేశ్వర, వాచస్పతి, విద్యారణ్య, నిశ్చలదాసులు, తమ తమ సిద్ధాంతముల నెఱకపరచిరి, ఇందు 'వివరణప్రస్థాన' 'భామతీప్రస్థాన' ములు వివరింపబడియున్నవి. ఆ విధముగ నీ మూడు సంపుటముల నద్వైతసుధాబ్ధి జిజ్ఞాసువులకు దెపవబడి పంచిపెట్టబడియెను. ఆధ్యాత్మికానందముయొక్క పర్యవసానము ఎల్లరకందుబాటు గావింపబడెను.

## సప్తమ సంపుటము

అంత, నేడవ సంపుటముతో వైష్ణవ ఖండము ప్రారంభము. అవాఙ్మానసగోచరుడైన బ్రహ్మము సర్వగోచరుడై యొప్పారెను. నిరాకార నిర్గుణుడైన పరమాత్మ సాకారుడై, సద్గుణరాశియై, భక్తుని

యెదుట నిలచి భగవంతుడై యలరారును. సాధకుని హృదయమునగల నిరాశాతాపము పటాపంచలై, భగవదనుగ్రహవృష్టిచే జల్లారి సస్యశ్యామల మయ్యెను. అతని హృదయము ప్రపంచావనికవవ్వల గల ఆప్తుని కొరకై ప్రసరించి, సాధించి, ఆ కరుణామయు కృపామనంబున నానందపారవశ్యము నొంది నాట్యము సల్పెను. ఈ సంపుటమున, వైష్ణవసిద్ధాంతము వేదములనుండి జనితమని అనేకవిధముల నిరూపించి, అది పురాణేతిహాసముల నెట్లు వెల్లివిరిసినదియు జూపించి, దాని గ్రహించి, ఆనందించిన ఆళ్వారుల నుతించి, సౌరభము భక్తిస్రవంతి నందుకొనెను. అంత నీ వైష్ణవ, భాగవత, సాత్వతాది యనేక రూపముల అవిస్పష్టముగ శాస్త్రముల ప్రసరించియున్న సిద్ధాంతభాగముల గ్రోడీకరించి, ప్రస్థాన త్రయమునకు జోడించి, పురాణేతిహాసముల నన్వయించి. విశిష్టాద్వైత సిద్ధాంతమును నిఖిల సాధకులకు ప్రసాదించి యున్న యతిరాజు శ్రీమద్రామానుజాచార్యుల జీవితమును సౌరభము తెలిపెను. అంత, నాతని విశిష్టాద్వైతవాదమును సమీక్షించి, బ్రహ్మము నెల్లరకందుబాటు గావించుటయందు సౌరభము తోడ్పడినది.

## అష్టమ సంపుటము

ఇక నీ అష్టమ సంపుటము, వైష్ణవమున ద్వితీయభాగమై, కృష్ణభక్తి ప్రధానమైన వైష్ణవాచార్యుల జీవిత విశేషముల, వారి మహాత్కార్యముల సూచించును. భక్తి ప్రధానమైన యీ యాచార్యుల రచనముల తాత్త్విక విచారణము స్వల్పమగుట నీ సంపుటమున, తత్త్వమీమాంస ఇసుమంత లోపించు ననిపించును. కాని, వీరికి

మఃఖ్యాధారమూర్తియైన శ్రీకృష్ణ పరమాత్ముని పుట్టుపూర్వోత్తరములు, పరిశీలనాదృష్టి యిందు ఉపోద్ఘాతమున పరిశీలింపబడును. అదేవిధముగ సద్వ్యాదర్శక మహనీయమూర్తియగు శ్రీరామచంద్రప్రభువుకూడ, అవతారములన్నిటింంటె శ్రీకృష్ణునివలె భక్తకోటి నాకర్షించిన మహవ్యక్తి. అతని సర్వాదర్శ ప్రవర్తనము సర్వతోముఖత్వము అద్భుతము. కాన శ్రీరామరాజ్య ఆదర్శ నిర్మాతనుగూడ, సాధకలోకము వైష్ణవమున అర్చామూర్తిగ గైకొని, ఆరాధించి, అనుసరించి, ఆనందించియుండుట సువిస్పష్టముగదా!

ఈ విధముగ సర్వ సిద్ధాంత సౌరభ మహాప్రస్థానమున, పదియారు సోపానములలో ఎనిమిది మెట్లను అధిరోహింప గలిగితిమి. షోడశకళా ప్రపూర్ణుడైన బ్రహ్మమున అష్టకళా విభూతిని గాంచియుంటిమి. అంతయు నా పరమేశ్వర కృపామహిమావిశేషమేగదా! పై బేర్కొనబడినట్లు, దర్శన, అద్వైత, వైష్ణవఖండ త్రయము సధిగమించి, షోడశకళల నెనిమిదికళల నాస్వాదించి, మార్గమధ్యమునకు సౌరభము మనల జేర్చియున్నది. అదేవిధముగ సమీపకాలమున శైవ, బౌద్ధ, సమన్వయరూప ఖండత్రయమునుగల అష్టసంపుటముగూడ నా భగవంతుని అపారకరుణా ప్రభావమున సౌరభము వెలువరించి, మముక్షువుల సేవాభాగ్యము నొందుముగాక అని ఆశించుచున్నాము.

# సర్వసిద్ధాంత సౌరభము

## వైష్ణవ ఖండము

## వైష్ణవ సిద్ధాంతము



పరమార్థంబును దెల్పి భక్తులకు బ్రా
పై యొప్పు రామానుజున్
గురుమధ్వాది మహాత్ములన్ గొలుతు పై
కుంఠంబు వాంఛించుచున్

శ్రీ అనుభవానంద స్వామి



# సర్వసిద్ధాంత సౌరభము

## ఉపోద్ఘాతము



### సంస్కృతీ పర్యవసానము

If Alexander, capable of organising the largest number of his fellows most effectually for a combination of military, commerciaḷ, and scientific ends, - if Alexander be taken as the tyPe of Occidental genius, సైనిక, వ్యాపార, వైజ్ఞానిక సమష్టి ప్రయోజనార్థము సమర్థముగ నలెగ్జాండరు అత్యధికసంఖ్యాకులైన తన యనుచరుల గూడదీయగలిగినచో, ఆ యలెగ్జాండరు అసాధారణ పాశ్చాత్య ప్రజ్ఞాసౌష్ఠవమునకుదాహరణ మగుచో, then, as the culminating example of the Oriental, we must name Buddha; for clear and int-nse conceptions of perfect renunciation and inner illumination are the hidden spriags of Hindu living (1) అంత ప్రాక్తత్త్వ పర్యవసాన దృష్టాంతముగ మనము బుద్ధుని గైకొనవలెను. సువిస్పష్ట తీవ్ర పరిశుద్ధ విరాగభావములు, అంతరంగ వికాసములు, హిందూజీవన గుప్త స్రవంతులుగదా! అని వేదాంతవాక్య సుధాస్రవంతుల పాశ్చాత్యమును

(1) Sister Nivedita : The Web of Indian Life, p. 114

ముంచి, పునీతము గావించి, వేదాంత గర్భార్ధములచే నంకలి వ్యతిరేక తర్కముల బారదోలి, వినిర్మల అద్భుత అపార భారతీయ సంస్కృతి ప్రభావమును, అఖిలప్రపంచమున అజేయమును జేగీయమానవిధానమున బ్రకటించి, అమరత్వమును సాధించిన ఆధునిక యతికుల సార్వభౌముడు వివేకానందుని ముఖ్య పాశ్చాత్యశిష్యురాలు సోదరి నివేదిత సత్యవాణి.

'పరవిద్యైవ చ సర్వవిద్యా ప్రతిష్ఠా' (శ్రీభాష్య. 1.2.2) బ్రహ్మవిద్య సర్వవిద్యలకును ఆశ్రయమగునను పరమార్థమును విశ్వసించి, సత్య మారసి, For certainly, man is of kin to the beasts by his body, and if he is not of kin to God by his spirit, he is a base and ignoble creature సత్యముగ మానవుడు, తన శారీరకముగ పశు సన్నిహితుడు, తన యంతరంగ మూలమున నతడు పరమాత్మతో ననుసంధింపనిచో, నతడు హేయమున తుచ్ఛుడు నైనవాడగునను Bacon బేకను వాక్యసత్యమును నాడే గ్రహించి. పవిత్ర భారతీయ ప్రాచీనాచార్యులు తపించి, కృషించి, సాధించి, అత్యంతాద్భుతామూల్య సంస్కృతి పెన్నిధిని బౌరసులకు మహాప్రసాదముగ నిర్మించి యుండిరి. అందుచేత సోదరి నివేదిత యు Truly the East is eternally the mother of religions, (2) ప్రాగ్దేశము శాశ్వతముగ మతములకు దల్లి యని యాథార్థ్యమును బ్రకటించెను. అంతియగాక, ఆచార్య శిశిర కుమార మిత్ర వాక్యములలో The culture of India Was ljke a sky-high tower of light

(2) Sister Nivedsta: The Web of Indian Life. p. 76

shedding its lustre on the surrounding countries...., illuminating the mind of man, exalting his heart, ennobling his life and, above all, beckoning him on to the realisation of his highest spiritual destiny. 3 మానవుని చిత్తమును బ్రికాశింపజేయుచు, నాతని హృదయము నున్నతస్థితి నుంచుచు, నాతని జీవనపద్ధతిని దివ్యత్వము గావించుచు, ముఖ్యముగ నాతని సర్వోన్నత పారమార్థిక గమ్యసిద్ధికై తనని హెచ్చరించుచు, భారతీయ సంస్కృతి పరిసర దేశముల దన దివ్యజ్యోతిని ప్రసరింప జేయు గగనోన్నత జ్యోతిస్థంభమువలె నున్నదని స్పష్టము.

## భారతీయ సంస్కృతి

అయిన నట్టిస్థానము సర్వప్రపంచమున, ననాదికాలములనుండి ఎట్లు సంప్రాప్తించినది? పరమాత్మను బొందయత్నించు దేశములు ప్రపంచమున నెన్నిలేవు? కాని యట్టి పూజ్యస్థానము భారతికే ఎందులకు దక్కెను? It is not enough of we only try to approch the Supreme Spirit; we must know how to do it, having the right attitude. (4) పరమాత్మను చేర యత్నము మాత్రము చాలదు; దాని నెట్లు నిర్వహింపవలయునో మనమెరుగ వలెను. దానికనుగుణప్రవృత్తముగూడ అవసరమని యతీశ్వరానంద స్వామియొక్క హెచ్చరిక వచనము. ఆ పరమాత్మని బొంది యానందింప కేవల మారాటపడుటమాత్రముగాక, అట్టి సౌభాగ్యము

3) Prof. Sisir Kumar : The Vision of India p 161
(4) Swami Yatiswarananda : Vedanta Kesari, 1957, p. 186

నకు దగు యర్హతల నన్వేషించి, మహాత్ముల సేవించి, కాంచి, వాని సాధించి. మోక్షమును బొందుట సముచిత విధానము. అదియే ప్రాజ్ఞతయు గూడ నగును. అట్టి అర్హతను సంపాదించుటయే సంస్కృతియు నాబరగును. Mathew Arnold మాత్యూఆర్నాల్డు అభిప్రాయమున Culture is acquainting ourselves with the best that has been known (5) తెలియబడిన యుత్కృష్టాంశముల సాంగత్యమునొందుటయే సంస్కృతి యగును. అనగ, సర్వ-సద్గుణముల నార్జించి అనుష్ఠించుట సంస్కృతియని అతని తాత్పర్యము. ఈ సంస్కృతి లోపించిన నాగిరకత నిష్ఫలము. సంస్కృతీ మహిమచే నరుడు అవిద్యావనికను దొలగించి, భాస్వర తేజోమయ ఆధ్యాత్మికానందసంధానము ననుభవించునుగాని. కేవల నాగరికతవలన అట్టి మహాభాగ్యము దూరము.

## సంస్కృతి - నాగరికత

ఈ విషయమును గురించి యోచించియున్న ధీరేంద్రనథ రాయ్ మహాశయుడు (Civilization) implies the act of marking one civil or social. It is act of man which serves to socialize him in all his relationships. Civilization in this respect is synonymous with socialization. It makes man feel his oneness with others. (6) మానవుని సాంఘిక

(5) Dr. Harendaranath Datta : Indian Culture, p. 3
(6) Sri Dherendranath Roy : The Spirit of Indian Culture, p. 26

ముగ చేయు కృషిని నాగరికత యన్వయించును. అతని సర్వసంబం ధములలో సాంఘిక దృష్టిని పెంపొందునట్లు చేయుట అది యగును. ఈ భావమున, నాగరికత యన సాంఘిక ప్రవర్తనము అననగును. మానవు నవి యితరులతో నేకత్వమును గ్రహింపజేయునని తెలిపెను, ఈ నిర్వచనము ననుసరించి, వ్యక్తి స్వార్థమును బరులయందును, బరుల, స్వార్థమునందును మేళనము గావించి, కొన్ని సద్గుణముల కధికారి కాగలుగును. కాని Civilization in that form of society confines itself mostly in the outward show of behaviour without a corresponding inward refinement of life. (7) అట్టి సంఘమున నాగరికత బాహ్యప్రదర్శిత ప్రవర్తన మునకుమాత్రమే యన్వయించి, తదనుగుణ అంతరజీవన లాలిత్యమునకు సంబంధింపదు. అంత, మానవునిలో స్వాభావిక సామాన్యరూప ద్వంద్వవ్యక్తిత్వము పరిణమించును. బాహ్యప్రపంచ సంబంధ ముల నాతడు, స్వాభావిక వ్యక్తిత్వమును మరుగుపరచి, సామాన్య వ్యక్తిత్వమును బ్రకటించి, నాగరికునివలె జలామణిని పొందియుండును. అందుచే నీ విధానమున Civilization may thus make him smart. clever, and pretentious, but not truly refined. It makes him civil but not good (7) నాగరికత యతని, చురుకుదనమైనవానిగను, తెలివిగలవానిగను కపటునిగను చేయగల్గును గాని, యథార్థమున సంస్కారవంతునిగ చేయజాలదు.

---

(7) Sri Dherendranath Roy : The Spirit of Indian Culture, p. 28 29

అట్లైన నాగరికత సంస్కృతి పదములకర్థము ఏమి? అవి ఏకార్థకములా అన్యార్థకములా యను ప్రశ్న యుదయించును. అవును. వానికన్వయములు అన్యత్వము గలిగి, అయినను సాపేక్షికములై యొప్పారును. కాన వీని యన్వయవ్యత్యాసములు గమనార్హములు. MathewArnold మాథ్యూ ఆర్నాల్డు అభిప్రాయమున సంస్కృతియన 'Sweetness and light' మధురత్వవికాసములు Schiller షిల్లరు తాత్పర్యమున, grace and dignity లాలిత్య గౌరవములు. కొందరు సంస్కృతీ నాగరికతలకు విభేదమునే చూడరు. Aristotle అరిస్టోటలు భావమున, a particular civilization is the matter whose form is its culture (8) సంస్కృతీ రూపమునకు నాగరికత ప్రత్యేక వస్తువు. అనగా పుష్పమున సుగంధమువలె నాగరికతకు సంస్కృతి యని అతని యుద్దేశ్యము. అందుచే సంస్కృతి వివిధ జాతుల పుష్పంబుల ననుసరించి పరిమళ వ్యత్యాసము గలుగు చందము, మారుచుండును, నాగరికతా సంఘమునుండి యుద్భవించిన ప్రత్యేక తత్త్వమే సంస్కృతి యనియు ధీరేంద్ర నాథుని తలంపు. It is that intangible yet all - pervasive something in the whole structure of a civilization which seeks to cultivate the inner and the outer life of the people possessing that civilization (8) నాగరికతగల సంఘమున, బాహ్యాభ్యంతర జీవనము నభివృద్ధిపరుప యత్నించు నాగరికతా నిర్మాణమున సప్రత్య

(8) Sri Dherendranath Roy : The Spirit of Indien Culture. p. 94

క్షమై, యనునది వ్యాప్తమైయుండు తత్వమే Culture సంస్కృతి యని అతని గాఢ విశ్వాసము.

ఈ సంస్కృతి నిర్వచన విషయములను ఇంకను పరచిచూచిన పండిత హీరేంద్రనాథ దత్తుడు, Culture సంస్కృతి పదముల వ్యుత్పత్త్యర్థముల గాంచింది వివరించెను. Cult + ure అని Nature, Picture, Literature మొదలగు పదములవలె నిదియు నేర్పడినట్లు కానబడును. Cult పదము Latin ల్యాటిన్ భాషలో Cultus పదమునుండి జనితమై, means an organised system of religious worship or ceremonial, 9 మతసంబంధమైన ఆరాధనా విధానముగ అర్థమగును. కాని యిచట ఆ యన్వయము అసందర్భము. ఆంగ్ల పదమైన culture, ఫ్రెంచి భాషకు చెందిన Cultura అను పదము ననుసరించి చూచినచో, cultivating అను తాత్పర్యమున పంటపొలముల పెంపుటకన్వయించును. అది అర్థాంతరము నొంది మనస్సును అభివృద్ధి గావించుట యను యర్థము నొందినది. సర్వప్రథమున Murray ముర్రే పండితుడు ప్రస్తుతార్థము నొసంగె, as the condition of being trained and developed 9 శిక్షణము నొంది పరిణమించుట యను నియమమున దాని రూపొందించెను.

ఆదేవిధముగ సంస్కృతి పదము, సంస్కృతి శబ్దము సంస్కారశబ్దజన్యముగ నైకాని, కృషి శబ్దము, Culture శబ్దమున కన్వయించునని హరేంద్ర పండితుని విశ్వాసము. కాని వ్యుత్పత్త్యర్థము

9. Dr Harendranath Datta : The Indian Culture, p. 2, 3

లెన్ని ఎటు లున్నను వ్యవహారమున Culture, సంస్కృతి పద ములు ఏకార్థకముగ వాడుకలోనుండుట వాని నట్లె గైకొనుచుంటిమి.

అందుచే నీ మీమాంస ననుసరించినచో, సంస్కృతి నాగరి కతకు బట్టుగొమ్మవలె స్పష్టము. సంస్కృతి చిత్త సంస్కార రూపమున వ్యష్టిమానవునుండి యుత్పన్నమై, అనుష్ఠానయోగ్యమై పరిణమించి, మించి, సంఘమున జొచ్చి, సాంఘికమై, నాగరికత యనబడుచున్నదనిన సమంజసము. సంస్కృతి వ్యక్తిగతము, నాగరికత సమష్టిగతము అని స్పష్టము. ఈ సంస్కృతీ నాగరికతలు పరస్పరాశ్రయములై, సంస్కృతి నాగరికతను గలిగించుచుండ, నాగరికతయు సంస్కృతీ పరుల నభివృద్ధిపరచి, నాగరికతను సుదృ ఢము గావించుకొనును. కావున, నాగరికతయొక్క శ్రేష్ఠత్వము, బాహ్య పరికరాభివృద్ధియు భౌతికసుఖప్రాప్తియుగాక, లలిత సద్గుణ సంపత్తితో నలంకృతులైన మహాత్ముల నెందరిని బొందియున్నది అను విషయమున గలదని గ్రాహ్యము. కేవలము మహాత్ములను మాత్రముగాక, సంఘజీవన సౌలభ్యముకొరకు, నిరంతర పారమార్థిక తత్త్వ సముపార్జనల సాధనముకొరకు అవసరమైన భౌతిక సంపదల కొంతకు, మూలకారణమైన ఉత్తమ పురుషుల నెందరి నా నాగరికత జనింపజేసినదియు గమనార్హము. మానవుని జీవితనౌక నిశ్చలముగ ప్రయాణింప, మహాత్ములగు ఋషిపుంగవులు పర్యవసానమున నెంత ప్రయోజనకారులో ఆటుల ప్రథమ స్థితుల యోధులు, ప్రభువులు, శాస్త్రవేత్తలు, పాలకులు, సిద్ధులు, జ్ఞానులు, అవతారపురుషులును జీవునికి పరమేశ్వరసాధన కుపయుక్తములు. అందుచే నాగరికత, సంఘవృక్షముయొక్క శ్రేష్ఠత్వములు, వై విధములగల మహాపురుషుల

నాదర్శప్రాయముగ నెందర జన్మింపజేసి, బరిణమింపజేసి, సంస్కృతిని పెంచి, నాగరికతను వికాసమొనరించుటయందాధారపడియున్నది : పౌరుల, భౌతిక జీవితమునుండి అభౌతికమునకు దోడ్కొనిపోవు నాగరికతయే నాగరికతగాని వేరొండుకాదని గమనార్హము. జీవుని దేవునిగ మార్పు గావించునదియే సంస్కృతిగాని అన్యము కాదు. అందుచేత మానవపరిణామ నిశ్రేణిపై అలెగ్జాండరు చక్రవర్తిని గంటె గౌతమబుద్ధుని ఉన్నతస్థానమున నుంచి, అదియే సర్వమానవా దర్శముగ సోదరి నివేదిత వచించియున్నది. అట్టి మహోత్కృష్టా దర్శమును ఆమూలాగ్రముగల భారతీయ సంస్కృతిని ఆమె సంస్తు తించుచు, దాని అజేయత్వమును నుగ్గడించుచు, ఆ సంస్కృతి యువకుల ప్రజ్ఞా యత్నములచేగాని, అన్యజాతి సంపర్కముచే గాని విరూపము నొందు సంస్కృతీ విప్లవ భయము దానికి కానంతయు లేదని వక్కాణించియున్నది. ఎందుచేత? For the effort of Eastern civilization has always been to the solitary end of moralizing the individual, and in this way it differs essentially from Western systems of Culture, which have striven rather for the most efficient use of materials 10 వ్యక్తియొక్క నైతిక వికాసమునకై సదా ప్రాన్నాగరికత కేంద్రీకరించుచుండును. అది యీ విధముగ భౌతిక వస్తువుల సమర్థముగ నుపయోగింప గృషి సల్పు పాశ్చాత్య సంస్కృతీ సిద్ధాంతములకు ముఖ్యముగ విభిన్నము అనియు, నా విదుషీమణి ప్రాక్ప్రతీచీ సంస్కృతివిధాన పరిశీలనా ప్రజ్ఞచే నొక్కివక్కా ణించినది.

---

10. Sister Nivedita : The Web of Indian Life, p. 114

# త్రివిధ సంస్కృతి

ఈ విషయమును సౌరభము చతుర్థ సంపుటమున భారతీయ సంస్కృతిని త్రివిధముగ విభజించి, లౌకిక ధార్మిక పారమార్థికము లుగ వివరించియున్నది. ఎందరు అలౌకికానంద పీయూషాస్వాదనా రతులగు మహాఋషీశ్వరుల ననాదికాలము నుండి భారతి సృజించి, పెంచి, ఆనందించి, పారమార్థిక సంస్కృతీ సంపదను విశ్వవ్యాప్తముగ మానవకోటికందించి యున్నదో, అటులే ఆ మహాతల్లి మానవ ప్రవృత్తుల నియమబద్ధము గావించు ధర్మోద్ధారకుల స్మృతికర్తలను గూడ నిర్మించి, సంఘమును శాసించి, నియమించి, కట్టుదిట్టము చేయగల్గి నది. అదేవిధముగా నా దేవదేవి యీ భూమండలమున భౌతిక సంపదను మానవుడు సంపూర్తిగ నుపయోగించుకొని, సుఖమును అందుండి పిండి, ఆస్వాదించి అనుభవించుటకు దగు భౌతిక శాస్త్ర ముల నెలకొల్పి, తజ్ఞుల గలుగజేసి, భరత ఖండమును OPHER ఆఫిర్ బంగారుభూమిగగూడ గావించియున్నది. ఈ విషయముల నా సంపుటియందు వివరముగ గాంచియున్నాము.

అదేవిధముగ సాంఘిక, రాజకీయ, వ్యావహారిక పాలక ధర్మ ముల, గాలామగుణ్యముగ ధర్మశాస్త్రవేత్తలగు మన్వాది స్మృతికర్తల చేత నియమింపజేసి, ప్రపంచమున సర్వదేశముల కాదర్శ ధర్మ దేవతనుగ భారతదేశమును ఆ సంస్కృతీమతల్లి కావించియున్నది.

ధర్మనిబద్ధులై జీవితమును బుద్బుదమాత్రమున, దుఃఖ నివృత్తి పరమానందప్రాప్తి సంఘటిల్లనేరదను సత్యము నెరసి, సర్వ మానవాభ్యుదయకారకమైన ఆధ్యాత్మిక శాస్త్రముల నుపనిషచ్ఛాస్త్ర రూపమున, అలౌకికానందతన్మయులగు మహర్షి పుంగవులచే స్మరింప

చేసి, ముముక్షువులకు నాలకింపజేసి, బోధించి, పారమార్థిక దృక్ప థమును పెంపొందించి, ఇహపర సుఖలాలసత్వమును దూరము గావించి, స్వస్వరూపానందధామప్రాప్తి సాధనము నుపదేశించి, అగణిత ముముక్షువులకు మార్గగామియైనదీ సంస్కృతి.

# ఇతిహాస, పురాణములు

ఈ త్రివిధ సంస్కృతీ స్వరూప నిర్ణయమునకై అవిస్పష్ట సూత్ర రచనముతో తృప్తిగాంచక, సవివరణ సోదాహరణ విపుల గ్రంథముల మహర్షి చంద్రులచే రచింపజేసి, పురాణేతిహాస రూప మున నీ సంస్కృతియే ప్రసాదించినది. వేదోపనిషత్తుల నవగాహ నము చేసికొనుట ఎల్లరకు సాధ్యము కాకుండుటచే, 'ఇతిహాస పురాణాభ్యాం వేదం సముపబృంహయేత్। బిభేత్యల్పశ్రుతాద్వేదో మామయం ప్రతరిష్యతి॥' (మహాభారత. ఆ. 1.273) ఇతిహాస పురాణ ముల గొని, వేదార్థములను విశదీకరించునది. ఏలయన, నన్నుఈతడు అపార్థముల గల్పించి వంచించునని అల్పజ్ఞులనుండి వేదము భయ మొందుచున్నది అను చందము, వేదార్థ నిర్ణయమునకు దద్వివరణ రూపములైన పురాణాదికము అత్యవసరము.

ఆ పురాణములును, సర్వప్రపంచమున సకలమానవ ప్రవృత్తు లకు ఆధారములై వాని నెత్తిచూపుచు, వాని యాదర్శముల సూచించుచు, దరుణోపాయమును సోదాహరణముగ దెల్పియున్నవి. అందుచే నీ పురాణాదులు శివ కేశవ శక్త్యాది వివిధారాధ్య దేవతా సంస్తుతులను గావించి, వివిధరీతుల ఆ యా దేవతా ప్రాశస్త్యముల నుగ్గడించి, వారి భక్తరక్షణా విధానములగూడ వివరించి యున్నవి. కాన

పురాణములు శైవ, వైష్ణవ, శాక్త, గాణాపత్య మొదలగు దేవతా పరములై, అఖిలవిధముల సర్వతోముఖములై, నిఖిల ప్రపంచ ముముక్షు కోటికుపయుక్తములై యొప్పారుచుండుట భారతీయ సంస్కృతీ విశాల తాత్పర్య నిదర్శనము. యథార్థముగ What philosophy by itself could never have done for the humble, what the laws of Manu have done only in some small measure for the few, that the Epics have done through unnumbered ages and are doing still for all classes alike [11] తత్వశాస్త్రము స్వంతముగ సామాన్యులకొరకు జేయజాలని కార్యము, మనుధర్మశాస్త్రము అల్పసంఖ్యాకులకు గొలదిగ జేయ గలిగినపని, అనేక యుగములనుండి, నిఖిల తరగతులవారికి నేటికిని ఇతిహాసాదులు గావించుచున్నవను సోదరి నివేదిత వాక్యములు సత్యములు. సామాన్య ప్రజానీకమునకు అవి కల్పవృక్షములుగదా? శాంతి సంధాతలుగదా! ఆదర్శప్రాయములుగదా!

## మహాభారతము

అందు 'పంచమ వేదమ'ని సుప్రఖ్యాతమై, భారతసంస్కృతికి విశ్వకోశమని ప్రశస్తి గల్గిన మహాభారతము శివకేశవాది విభేదమును గానక సాంఖ్య, యోగ, అద్వైతాది తాత్త్విక వ్యాఖ్యానముల విభిన్న దృష్టి గాంచక, సర్వసమన్వయ మూర్తియై సర్వ సంస్కృతీ పాదపమును నిలయమునై వెలుగొందుచున్నది. It is really the Mahabharata that is one of the outstanding books of the world. It is a colossal work an encyclopedia of tradition and legend [12] మహాభారతము అఖిల ప్రపంచ గ్రంథము

11. Sister Nivedita : The Web of Indian Life. p. 113
12. Pandit Jawaharlal Nehru : Discovery of India, p. 109

లలో నొక అద్భుత గ్రంథము. అది యొక బ్రహ్మాండ గ్రంథమై సంప్రదాయములకును, ప్రాచీన గాథలకును, ఒక విశ్వకోశము అని పండిత నెహ్రూ వాక్యములు. మహాభారతమున, అంతియగాక, అందు అంత్యమున వివరింపబడిన మహాయుద్ధము, కేవలము అన్నదమ్ముల పోరాటముకాక, The war of the Mahabharata itself represents the apparent exhaustion of Vedic inspiration at the end of the first period, and the restoration of prestine vigour by force of Krishna's personality 13 మహాభారతయుద్ధము, అతఃపూర్వ వైదిక ప్రాభవము సన్నగిలుటయు, శ్రీకృష్ణమూర్తి యొక్క శక్తిచే దాని బునరుద్ధరించి పరిశుద్ధస్థానమున నుంచుటను దెలుపుచున్నదని, సోదరి నివేదితయొక్క పలుకులు.

అందు, భారతీయ త్రివిధ సంస్కృతీ మహిమ విస్పష్టముగ నిరూపింపబడి, తదనుగుణ మహావ్యక్తుల జారిత్రాత్మకముగ జూపించి, అఖిల ప్రపంచమును జతుర్ముఖునివలె బరాశరుడు చిత్రించెను. అందుచేత నీ మహాత్ముని శాస్త్రములు 'అచతుర్వదనో బ్రహ్మా ద్విబాహురపరో హరిః। అఫాలలోచనశ్శంభుర్భగవాన్ బాదరాయణః॥' అనియు గీర్తించినవి. 'జ్ఞానశక్త్యవతార'మని వాచస్పతి మిశ్రుడును. 'జీవన్ముక్తో జితమనా వ్యాసః' అని యోగవాశిష్ట రామాయణమును, He is an intellectual power but nothing else 14 అతడొక ధీశక్తి స్వరూపముగాక అన్యముగాదని మాక్సుముల్లరు మహాశయుడు, 'ప్రజ్ఞానిధి' యనియు ననేకులు ననేకరీతుల గొనియాడియున్నారు. అతని సృష్టి అమోఘము, అద్భుతము, అపారము. కేవలము

---

13. Sister Nivedita : The Web of Indian Life, p. 156
14. Prof: F. Max Muller: The Six Systems of Indian Philosophy, p. 16

కురుపాండవ విరోధము నాధారముగగొని, అనాదికాలగత హైందవ సంప్రదాయముల, సందర్భ సందర్భానుసరణి జేర్చి, ఉపనిషత్పురాణేతిహాస స్మృతి శాస్త్రముల జోడించి, యీ మహాగ్రంథము నాడు నిర్మించుట అమానుషము. నాటినుండి నేటివరకు ఈ గ్రంథ ప్రభావము జనసామాన్యమున నిరంతరము ఆశ్చర్యకరము.

## భీష్ముడు

మరియు నీ మహాభారతమున, నితర పర్వముల బహుళముగ నెన్నియో ధార్మిక పారమార్థిక విషయములు గోచరించుచున్నవి. ఈ బృహద్గ్రంథమున మూలపురుషులును, ఆదర్శవంతులైన శ్రీకృష్ణ, భీష్మ పితామహుల ఉపదేశామృతము యుద్ధకాండమున బోధింపబడినది. యుద్ధప్రారంభమున శ్రీకృష్ణుడు సర్వ లౌకికములకతీతమైన తత్త్వశాస్త్రమును అర్జునునికి బోధింప, ఘోరయుద్ధమును నడిపి అజేయుడై యుండియు, కాల కర్మములకు లొంగి, గాయపడుపడి శరతల్పగతుడై, ఉత్తరాయణ పుణ్యకాలమునకై నిరీక్షించుచున్న భీష్ముడు యుద్ధానంతరమున శ్రీకృష్ణుని సమక్షమున నేతెంచి, యుద్ధించిన పాండవపుత్రులకు దివ్యోపదేశముల గావించుచు, ఆధ్యాత్మిక సత్యాంశముల దెల్పి, ప్రాపంచిక నశ్వరత్వముల స్పష్టపరచెను. గురుస్థానము వహింప శ్రీకృష్ణ భీష్ములు మహాభారతమున నేత్రద్వయము. రణమున నున్నను వారి దృష్టులు ప్రపంచోపశమ ప్రవృత్తములు. త్రివిధ సంస్కృతి సర్వము వీరిరువురిలో సర్వవిధములుగ సమన్వయము. In Bhishma, we have the creation of a people who have already learnt to regard detachment as a necessary element of moral grandeur 15 నైతిక ప్రతిభ తత్త్వమున

15. Sister Nivedita : The Web of Indian Life, p. 108

తవసరముగ విరాగమును ఔదార్యమే గుర్తించిన మానవసంఘ కల్పనము, భీష్మునిలో మనకు గలదని సోదరి నివేదిత వాక్యము. మహాభారతమున భీష్ముని పాత్రయు, రామాయణమున సీతామహాసాధ్వి పాత్రము అద్భుతమును, అపూర్వము, అసమానము అనియు నామె తెలిపియున్నది. ఆ మూర్తిలో ప్రథమమునుండి రణమున శరీరత్యాగమొనరించుపర్యంతమెంతటి మహాత్యాగమిమిడియున్నది! మరణశయ్యనుండియు, శారీరక బాధకతీతుడై ఎట్టి మహోపదేశముల పాండవులకా మహాత్ముడు బోధించెను!

## శ్రీకృష్ణుడు - మహాభారతము

అదేవిధముగ, మహాభారతమున శ్రీకృష్ణ పాత్రయు నమేయము. ఆతనికాతడే సాటి. సర్వవిధముల, అఖిల సందర్భముల, ఎల్లవేళల, సర్వత్ర, నాతడు మహాభారతమున గోచరించుచు దన ప్రాధాన్యము నెల్లెడల ప్రదర్శించుచు, అంతట దానై, అంతయు దానయై విరాజిల్లును. అయ్యును, ఆ యా ఘట్టముల సామాన్యులవలె మునింగి రాగద్వేషాది గ్రస్తుడుగాక, సర్వాతీతుడై పద్మపత్రోదకమువలె అంటీ అంటనివాడై వ్యవహరించును. అట్టి మహాద్భుత జీవనవిధాన రహస్యమున, యుద్ధప్రారంభమున అర్జునుడు, శోకసంవిగ్నమానసుడై చతికిలబడ శ్రీకృష్ణుడుపదేశించెను. అదియే గీతాశాస్త్రము నాబడుచున్నది. అది మహాభారతమునకుమాత్రము గాక, సర్వ భారతీయ శాస్త్రములకలంకారమై, విశ్వమునకు దలమానికమై ముముక్షుకోటి కాశ్రయమై విరాజిల్లుచున్నది. In a very real sense, to understand it is to understand India and the Indian people 16

16. Sister Nivedita : The Web of Indian Life, p. 213

యథార్థముగ దాని గ్రహించుట యన హిందూ దేశమును, భారతీయులను, అవగాహనము గావించుకొనుట యగును. భగవంతుడైన శ్రీకృష్ణపరమాత్మచే బోధింపబడినదిగాన భగవద్గీత యనియు, తరుణోపాయమగు భాగవత ధర్మమును బోధించుటచే భగవద్గీత యనియు దాని ప్రాశస్త్యము. దాయవిభాగమున గలతలేర్పడి, అందులకుగూడ సుయోధనాది కౌరవబృందముయొక్క అసూయ కారణముగ నేర్పడిన కలహమున, శ్రీ కృష్ణభగవానుడుచితరీతి నిరువురికి శ్రేయోభిలాషియై, ఒకవిధమైన సమన్వయమునకు తీవ్ర కృషి గావించియు బరాజితుడై, యుద్ధము తప్పనిసరి యగు కాలమునకు సైన్యములు గౌరవులకును, దా బాండవులకును జెంద దీర్మానించి, యుద్ధమున దా విల్లు ధరింపకుండ తటస్థముగ నుండి. అర్జున సారథ్యము వహించి, యుద్ధమున ముందునకు నేతెంచెను. రథికుడైన అర్జునుడు పాపభీతి హృదయము నావరింప జింతించి, రథమునుండి తిరోగమింప సంసిద్ధుడగుటచే శ్రీకృష్ణుడీ విషమ సమయము సూతగ గైకొని, అతనిని ధైర్యోత్సాహముల నుద్ధరింప బ్రారంభించి, క్రమముగ దీన, హృదయస్థితమగు పారమార్థిక విషయ ప్రపంచమునకు జారి, అర్జునునికి ఇహపరసార్థకమగు తత్త్వోపదేశము గావించెను. యుద్ధరంగమున వేదాంతబోధ యసందర్భమైనను, యీ గురుశిష్యులిరువురు యీ విషయముల నిష్ణాతులగుటచే, అధ్యాత్మిక విషయములగూడ జర్చించి, ప్రపంచమునకనుసంధించి, సమన్వయించి ఉభయతారక సమన్వయము గావించి యుండిరి. అదియే భగవద్గీతాశాస్త్రముగ బ్రఖ్యాతి.

అందు లౌకికధర్మ వివరణ, పాలనాది విషయములేగాక, కర్మ భక్తి జ్ఞాన మార్గములుగూడ వివిధరీతుల వివరింపబడి, అన్నింట సమన్వయింపబడి, పరమైన నిర్మోహస్థితి నొందుటకు సులభతరమార్గముపదేశింపబడినది. మరియు, బాలకృష్ణునివలె ముందు గోచరించు ఆ శ్రీకృష్ణుని యథార్థ స్వరూపము విశ్వరూపముగ బరిణమించి, అర్జునునికి, అతని ముఖమున లోకమునకు దిగ్భ్రాంతి గలుగజేసినది. శ్రీకృష్ణుడు సామాన్య దృష్టికి గోచరించు మానవ మాత్రుడుగాక, అసాధారణత్వమున శెగసి, సర్వప్రపంచాతీత విశ్వాధారక మహత్త్వముగ నందు ప్రదర్శింపబడెను. ఈ విధముగ భాగవత, మహాభారతాది గ్రంథముల నింతవరకు చిత్రింపబడిన శ్రీకృష్ణుని స్వరూప యాథార్థ్యము యిచట రూఢిపరుపబడినదై, ఎల్లర సంశయవిచ్ఛేదకముగ జూపింపబడెను. అందుచే గీతాశాస్త్రము, సర్వేతర గ్రంథములకంటె శ్రీకృష్ణపరమాత్ముని సత్యస్వరూపమును స్పష్టపరచి, అతని అమానుష బోధనావిధానమును, సర్వ వేదాంత శాస్త్ర వైదుష్యమును ప్రకటపరచి అతడు కేవలము అవతార పురుషుడగుటయేగాక, సర్వోత్కృష్ట గురుకులనాథుడనియు విదితము చేయుచున్నది. ప్రపంచ చరిత్రముల నెంత నన్వేషించినను, యాతని బోలు గురువరేణ్యుడరిది యని బోధపడును. శిశిర కుమార ఆచార్యుని నుడి ప్రకారము, Sri Krishna - a unique figure in the history of human evolution ... He represents an unparalleled harmonisation of the salient strands of all forms of past spiritual culture and exalted it not only to a very high plane of universal vision, but also to a mighty effectuation 17 శ్రీకృష్ణుడు, మానవ పరిణామమున

17. Prof. Sisir Kumar Mitra : The Vision of India, p. 15

నొక అద్భుతమూర్తి. పూర్వాపర్యాత్మిక సంస్కృతియందఖిలరూపముల, ప్రముఖ తాత్పర్యముల నతులసమన్వయమే అతడు. దాని నతడు సర్వోన్నత విశ్వతోముఖస్థాయికి నధిష్ఠింప జేయుటయేగాక, అద్భుత ప్రభావవంతముగ నొనరించెను. అద్వైతుల పరబ్రహ్మమే భక్తులకు శ్రీకృష్ణభగవానుడై యవతరించెననియు గాఢవిశ్వాసము. అదియు ప్రస్ఫుటము. అట్టి పరిపూర్ణావతారుని సంపూర్ణముగ గ్రహించుట మానవశక్తికతీతము. కావున 'అనేక జన్మసాహస్ర తపోధ్యాన సమాధిభిః। నరాణాం క్షీణపాపానాం కృష్ణే భక్తిః ప్రజాయతే॥' అనేక జన్మసహస్రముల తపోధ్యాన సమాధులచే క్షీణపాపులైన నరులకు శ్రీకృష్ణునందు భక్తి జనించును.

## శ్రీకృష్ణుడు - భాగవతము

ఈ విధముగ శ్రీకృష్ణుడు మహాభారతమును ఆవరించి దాని బునీతమొనర్చుటయేగాక, 'సర్వవేదాంతసారం యద్బ్రహ్మ భాగవత ముచ్యతే। తద్రసామృతతృప్తస్య నాన్యత్ర స్యా ద్రతిః క్వచిత్॥' (భాగవత. 12.13.15) శ్రీభాగవతము సర్వ వేదాంతసారము నాబడి నది. దాని మాధుర్యరసముల గ్రోలి, తృప్తినొందినవానికింక నెక్కడను సంతుష్టిగానుపింపదు అనియు, 'నిమ్నగానాం యథా గంగా దేవానామచ్యుతో యథా। వైష్ణవానాం యథా శంభుః పురాణానా మిదం తథా॥' (12.13.16) అనియు నుతింపబడిన శ్రీమద్భాగవత మహాపురాణముగూడ శ్రీకృష్ణ లీలావిభూతితో నిండి నిబిడీకృతమై, భక్తి జ్ఞాన తన్మయత్వమున ముంచివైచును. ఎందుచేత? 'నిగమ కల్పతరోర్గళితం ఫలం శుకముఖాదమృతద్రవసమ్మితం। భాగవతం రసమాలయం' (భాగవత. 1.1.3) 'వేదకల్పవృక్షవిగలితమై శుక,

మఃఖసుధాద్రవమున మొనసియున్న భాగవతపురాణ-' (ఆం. భాగ. 1.37)ము, 'పరగోవిందకథాసుధారసమహావర్షోరు ధారాపరం, పరంగాక బుధేంద్రచంద్ర యితరోపాయాను రక్తిం బ్రవి, స్తరదుర్దాంతి దురంత దుస్సహజ నుస్సంభావితానేక దు, స్తరగంభీర కఠోర కల్మషకనద్దావానలం బారునే' (ఆం. భాగ. 1.49) అను చందము, 'వాసుదేవకథాప్రశ్నః పురుషాం స్త్రీన్ పునాతి హి। వక్తారం పృచ్ఛకం శ్రోతౄం స్తత్పాదసలిలం యథా॥' (భాగవత. 10.1.16), 'విష్ణుకథారతుఁడగు నరు, విష్ణుకథల్ సెప్పు నరుని వినుచుండు నరున్, విష్ణుకథా సంప్రశ్నము, విష్ణుపదీజలముభంగి విమలుం జేయున్' (ఆం. భాగ. 10.13) అనురీతి భాగవత గ్రంథము శ్రీగోపాలకృష్ణ అమానుష అగోచర లీలావిభూతిని ప్రదర్శించి, తా బునీతమై వక్త శ్రోత పృచ్ఛకులగూడ బవిత్రుల నొనరించు చున్నది. అందును దశమ స్కంధమున వర్ణింపబడుబోవు శ్రీగోవింద స్వరూపగ్రహణసామర్థ్యప్రాప్తి ముముక్షువులకు గల్పించు నుద్దేశ్య మున బూర్వ స్కంధనవకమును ప్రహ్లాద, గజేంద్ర, మార్కండేయ, ధృవాది అసంఖ్యాక భక్తవరేణ్యుల కథావిశేషములచే నింపి, సాధక హృదయముల నున్ముఖమొనర్చి, శ్రీకృష్ణకథావర్ణనము జేయబడినది. అట్లుగానిచో శ్రీగోపాల చూడామణితత్త్వము అవాఙ్మానసగోచరమై యొప్పారియుండెడిదేమో! ఈ విధముగ గాలాంతర వైష్ణవమునకు అధినాథుడై, ఆరాధ్యుడై, సర్వహృదయముల నాకర్షించు శ్రీగోపాల కృష్ణపరమాత్మ యీ పురాణములమాత్రముగాక, విష్ణుపురాణ హరివంశాదులందును, ఉపనిషత్తులందును సంస్తుతింపబడి, అతని లీలాకథనము గావింపబడియున్నది. శ్రీనందకిశోరుడు మన భారతీయ

సంస్కృతికాక శిరోభూషణము. అతనిలో ఆ యసమాన సంస్కృతి పర్యవసాన మహాభాగ్యము నొందియున్నది.

## శ్రీరామచంద్రుడు - సీతాదర్శనము

అట్టేవిధమున శ్రీరామచంద్రమూర్తియు, కేవలము వైష్ణవులకే గాక సర్వ జన సంఘమునకు సర్వాదర్శమూర్తి, వైష్ణవులకు ముఖ్య ఆరాధ్యస్వరూపము. ఆ మహనీయమూర్తి ప్రజా సౌఖ్యమును మనమున నుంచి, ఎంత త్యాగము చేయలేదు! అందుకొరకై రాజ్యమును, స్వీయ సుఖముల మాత్రమే కాలదన్నుటగాక, పర్యవసానమున, అమాయిక సాధ్వీమతల్లి సీతనుగూడ త్యజించి, త్యాగ పర్యవసానము నందు కొనెను. బాహ్యమునకు త్యాగము, దుఃఖభూయిష్ఠముగ స్థూలదృష్టులకు గోచరించినను సత్యమారయుచో ఆ త్యాగ రతులకానందమే బాహ్యాభ్యంతరముల నాట్యము సల్పును. అట్టివారి ఆదర్శమే చిరస్థాయిగ లోకమున నిలచి, యుగముల పర్యంతము వారి పూజనీయులనుగ నొనరించును. ఆ విధానము నవలంబించి, ఆదర్శ రాజ్యపాలనక్రియాలాలసత్వమున స్థిరుడై శ్రీరామచంద్రుడుండుటచే నాతని రాజ్యము 'రామరాజ్య'మై, నాటికి నేటికి ఆదర్శప్రాయమై ప్రకాశించుచున్నది. అతని ఆదర్శము సర్వతోముఖము, సర్వోన్నతము, సర్వ శ్రేష్ఠము. ప్రభువుగ, భర్తగ, సోదరుడుగ, పుత్రుడుగ, యోధుడుగ, విరోధిగ మొదలు గాగల సర్వవిధ ప్రపంచ సంబంధముల నా రాజేంద్రుని బరిశీలించి నచో, నాతనికాతడె సాటియై, అద్వితీయుడై, సర్వాతీత గగన విహారము సతడు సల్పుచుండును. అతడు సర్వస్థితులనున్న సాధక

లోకమునకు మార్గదర్శకుడు. బ్రహ్మచర్యాది తురీయాశ్రమములవరకు నున్న మానవులకు, బాలత్వమునుండి వృద్ధులగు స్త్రీ పురుష జనములకు అతని చారిత్రము ఒక ముక్కాని.

ప్రాతఃసంధ్యారాగమున కన్యామణులు ఆతని దివ్య విగ్రహము ముందు దీపికను వెలిగించి, కరముల జోడించి, నమ్రత్వము మూర్తీభవింప నైహికాముష్మిక సుఖప్రాప్తికై ప్రార్థించెదరు. ఈ విషయమును దిలకించిన సోదరి నివేదిత వచించురీతి Absorbed in her worship cf the Feet of the Lord, the little girl sits for hcurs in her corner, praying, 'Make me a wife like Sita!' Give me a husband like Rama! 18 ప్రభుచరణారాధనతత్పరయై చిన్నకుమారి, గంటలకొలది తన గదిలో నాసీనయై, భక్తితో 'నన్ను సీత వంటి భార్యగ జేయుము! రాముని వంటి భర్తను నా కొసంగుము' అని ప్రార్థించును. వివేకానందుని వాక్యములలోగూడ Ran.a, the ancient idol of the He.oic ages, the embodiment of truth, of morality, the ideal son, the ideal husband, the ideal father, and above all, the ideal king,... 19 శౌర్యవంతకాలముల ప్రాచీన ఆదర్శ మూర్తియైన రాముడు సత్యధర్మస్వరూపుడు, ఆదర్శ పుత్రుడు, ఆదర్శ నాథుడు, ఆదర్శ జనకుడు, అన్నింటికంటె ఆదర్శ ప్రభువు. And what to speak of Sita? You may exhaust the literature of the world that is past, and I may assure you. that you will have to exhaust the literature of the world of the future, before finding another Sita 19

18. Sister Nivedita : The Web of Indian Life. p. 111
19. Swami Vivekananda : The Complete works, Vol. 3 p. 255

ఇక సీతనుగూర్చి ఏమి వచింపగలము? ప్రపంచ ప్రాచీన వాఙ్మయమును గాలింపుడు. మరియొక సీతను గాంచుటకు భావ్యము పిదప ప్రపంచముయొక్క భవిష్యచ్చారిత్రమును సైతము జూడవలసి వచ్చునని నేను నిర్ధారణముగ దెలుపుచున్నాను. Sita is unique; that character was dipicted once and for all 19 సీత అద్భుతము; ఆమె స్వరూపము ఒక్కసారియే నిర్మింపబడినది. అంతియగాక, There may have been several Ramas, perhaps, but never more than one Sita! She is the very type of the true Indian woman, for, all the Indian ideals of a perfected woman have grown out of that one life of Sita; and here she stands these thousands of years, commanding the worship of every man, woman, and child, through out the length and breadth of the Aryavarta 1) అనేక రాములుండవచ్చునుగాని ఒక్క సీతకంటె నెక్కువ యుండజాలదు. పరిపక్వ నారీరత్నము యొక్క భారతీయాదర్శములు సీతనుండి యుద్భవించియుండుటచే, నామె భారతీయ లలనామణులకు మహాదాదర్శము; సంపూర్ణ ఆర్యావర్తమునందలి స్త్రీ పురుషులనుండి, బాలబాలికల నుండి; పూజలగైకొనుచు యీ అసంఖ్యాక సహస్ర వత్సరములనుండి ఆమె భారతావని స్థిరముగ నిలచియున్నది. There she will always be, this glorious Sita, purer then purity itself, all patience, and all suffering.... She is the ever-chaste and ever-pure wife, she, the ideal of the people, the ideal of the gods, the great Sita' our national God, she must always remain 19 పవిత్రత కంటె పవిత్రమై,

---

19. Swami Vivekanahda : The Complete Works, Vol. 3, p. 255

క్షమాస్వరూపమై, కష్టనికరమై యుండు కీర్తివంత యగు సీత శాశ్వతముగ నుండును. ఆమె సదా పవిత్రయై సాధ్వీమణియైన సతియై, ప్రజలకాదర్శముగ, దేవతలకు ప్రమాణముగ సర్వోత్కృష్ట సీతాదేవి, మన జాతికధిదేవతగ నిరంతరము నిలచును. మరియు, All our mythology may vanish, even our Vedas may depart, and our Sanskrit language may vanish for ever, but so long as there will be five Hindus living here, even if only speaking the most vulgar patois, there will be the story of Sita present 19 మన పురాణములు అదృశ్యమగునుగాక, వేదములు దూరమగునుగాక, శాశ్వతముగ మన సంస్కృతి భాష అంతరించునుగాక, ఎంతకాలము అయిదుగురైన హిందువులిచ్చట నుందురో, వారెట్టి నీచ భాషను సంభాషించు కొనుచుండినను అచట సీతా చారిత్రముండును. నా మాటలాలకింపు దని వివేకానందస్వామి యథార్థ వచనములు.

ఆ విధముగ శ్రీసీతా రామచంద్రులు penetrate to every part of the country, every class of society, every grade of education 20 దేశమున నలుమూలలను, వివిధ సంఘ స్థానములను, సర్వవిద్యా సోపానముల నంతర్గతమై యున్నారు. అందుచేత, Great as the Ramayana is as an epic poem, and loved by the people 21 రామాయణము గొప్ప ఇతిహాసమై ప్రజానీకముచే ప్రేమింపబడుచున్నది.

---

19. Swami Vivekananda : The Complete works, Vol. 3 p. 255
20. Sister Nivedita : The Web of Indian Life. p 113
21. Pandit Jawaharlal Nehru : Discovery of India, p. 109

ఇదేవిధముగ శాస్త్రముల గాలించిన, శ్రీరామ, శ్రీకృష్ణ, సీతా, భీష్ములవంటి ఆదర్శ మహావ్యక్తులెందరో కానుపించెదరు కాని, శ్రీసీతా, రామ, కృష్ణుల ఆదర్శము, ఆకర్షణము, అద్భుతము, వ్యాప్తము, ఆరాధ్యము. అద్వయ స్థానమును వారలంకరించి, యావద్భారతీయ ప్రజాకోటి హృదయముల నావరించి, నియమించి, సర్వభారతీయ మహాసంస్కృతీ నిర్మాణమునకు అనిర్వాచ్య నిర్మా తలుగ నేర్పడుట భారతియొక్క అదృష్టము. వారి మహాదాదర్శము భారతికిమాత్రమే అన్వయింపక, సర్వ విశ్వమానవులకు సమన్వయ ముగ గాంచనగును. వారిలో బూర్వము నిర్వచింపబడిన త్రివిధ సంస్కృతిని మేళవించి, సర్వాదర్శకముగ ప్రకాశించుటయు గమనార్హము.

## అవతార తత్త్వము

ఇట్టి సర్వవిధ సంస్కృతీ యాదర్శమును ప్రదర్శించి, సంఘము నొక్కసారిగ అత్యుత్తమస్థాయికి బరిణమింపజేసిన మహా పురుషులే భగవదవతారమూర్తులని ప్రశస్తము. శ్రీగీతా శాస్త్రమున శ్రీకృష్ణపరమాత్మచే వచింపబడినట్లు 'యదా యదా హి ధర్మస్య గ్లానిర్భవతి భారత। అభ్యుత్థానమధర్మస్య తదాత్మానం సృజామ్యహం॥' (4.7) ఎప్పుడెప్పుడు ప్రపంచమున ధర్మహాని ఏర్పడి, అధర్మాభివృద్ధి జరుగునో, అప్పుడు నన్ను నేనే సృజించుకొని భూమి నవతరించెద నను రీతి బరమాత్మ మానవాకృతి ధరించును. అయిన నా యవతార మూర్తి ఎట్లు ధర్మము నుద్ధరించును? కేవలము ఋషీశ్వరులు, ప్రవక్తలు, మహాపురుషులు, ఆచార్యవర్యులు ప్రబోధించి, ఉపదేశించి, తమదగ్గర చేరినవారినిమాత్రమే యుద్ధరింపగలరు కాని, సంఘ

క్షేమమునకే యాటంకముగనుండి, అపాయకరముగ నున్న మహాశక్తుల రూపాంతరమొనరింపగాని, అవసరమైన హతమొనరింపగాని శక్తులు కావు. వినువారల, భక్తితో దమ్ము జేరి, శ్రద్ధాన్వితులై కృషిసల్పు వారలకుమాత్రము వారుపయోగపడగలుగుదురు. కాని, ఆ భక్తులను, యింకను తమను, విద్యుక్త ధర్మపాలన కార్యముల నడ్డగించి, హింసించి, బాధించు శక్తులు వీరికందరానివి.

అందుచే పరమాత్మ సాధువులకు బోధింపజాలుటయు, ఆదర్శ మగుటయుగాక వారి రక్షణార్థము, దుష్టశక్తుల రూపమడంపగలుగు శక్తిసామర్థ్యములతో నరాకృతి నొందుట యిందు విశేషము. ఆ కారణమున శ్రీకృష్ణపరమాత్మ, తరువాతి శ్లోకమున 'పరిత్రాణాయ సాధూనాం వినాశాయ చ దుష్కృతాం। ధర్మసంస్థాపనార్థాయ సంభవామి యుగే యుగే॥' (4.8) అని భగవదవతరణ తాత్పర్యమును స్పష్టపరచెను. సదర్థజ్ఞాన రహితులైన కొందరు పాశ్చాత్య పండితులు, 'వినాశాయ చ దుష్కృతాం' అను వాక్యమునుమాత్రమే ప్రధానముగ గైకొని, 'సామాన్య మానవులకేగాక, చక్రవర్తులకుగాని, వీరాగ్రేసరులకుగాని లొంగని మహాశక్తిసామర్థ్యములుగల అజేయ దుష్టశక్తుల నడంచుటకొరకై యవతారములుద్భవము. అందుచే అవతారపురుషులెట నుండిరో ఆ దేశము, అసాధారణ దుష్ట శక్తులచే నావృతము. ప్రపంచమున నేదేశమును గాంచినను, మహాపురుషులు, చక్రవర్తులు, మహాత్ములు కలరుకాని అవతారపురుషులు లేరు. అనగా నా యా దేశముల నవతారపురుషుల ఆవశ్యకతను గానము. కాని భారతదేశమున అవతారములెక్కువగ గానబడుచున్నవి.

అందుచే నీ పుణ్యభూమి నాబరగు భారతదేశము అత్యంత నికృష్టమై, దుష్టత్వమునకాకరమై, ధర్మవినాశహేతువునై యొప్పారుచున్నది అని తెలుపగలరు. అవును, దుష్టత్వమున్నచోటనేగదా Police force రక్షణశాఖా సైన్యముయొక్క అట్టహాసములు అని వారి వాదము.

కాని యీ వాదము యుక్తిదూరము. సత్యమునకు అపసవ్యము. అదియే యథార్థమైనచో, ప్రపంచమునకే ప్రకాశము నొసంగగల మహాతేజోరూపులై వెలుగొందు అసంఖ్యాక జ్ఞానధనులు, భారతికి సంతతిగా నుండజాలరు. అదియే సత్యమైనచో, సర్వసంస్కృతీ నిలయమై, సర్వతోముఖ భావసమన్వయమూర్తియై, అనాదికాల సముద్భవమై, సర్వగ్రంథములకాదిమ గ్రంథమై విరాజిల్లు వేద కల్పవృక్షము భారతియందావిర్భవించి యుండనేరదు. అదియే నిజమైనచో, హిమాలయముల నధిగమించు ఔన్నత్యమున, గంగను మించు పవిత్రతతోడ, అచలముల నతీతించు స్థిరత్వమున, కాలమును ధిఃకరించు సామర్థ్యమున, అవాఙ్మానసగోచర నిర్గుణ నిరాకార బ్రహ్మమును తమ హృదయకుహరముల బంధించి, ఆస్వాదించి, అనందించి, 'అహం బ్రహ్మాస్మి' యను పూర్ణప్రజ్ఞకు నెగయగల్గిన సర్వాతీత మహాజ్ఞానులకాకరము మహాభారతి కాజాలదు!

కాని భారతదేశము వానికెల్ల బుట్టినిల్లు, పెంచి పెద్దచేయు ప్రేమస్వరూపిణి, పరల నెల్లరకానందమాయియై తన ఆనంద రసజలధిలో లయింపజేసికొను అమృతమూర్తి!

అందుచే పై వికటార్థము సత్యము సుమ్మాటికి గానేరదు. ప్రపంచమున శాశ్వత సుఖమును గానక, దాను నిత్యుడై యుండు

టచే, నీ యనిత్య ప్రపంచములో నిత్యసంబంధమభావమగుటచే, శాశ్వతుడైన పరమాత్మ బాంధవ్యమే యుచితమని గాఢముగ విశ్వసించి, నిత్యనిరతి తపోనిమగ్నులై, బాహ్యాభ్యంతరముల మరచియుండు మునిసార్వభౌముల దన సన్నిధానమునకు జేర్చుకొని, పరిష్వంగ సుఖసౌభాగ్యమును వారి కొసంగుటకును; అనేకవిధముల ప్రపంచమున దృష్టి గాంచక గురువరేణ్యుల జేరి, తారణోపాయమును గ్రహించి, దీర్ఘ సాధనా యుక్తులై తీవ్ర కృషి గావించు ముముక్షులోకము నుద్ధరించు తాత్పర్యముననుముఖ్యోద్దేశ్యముగ భగవంతుడవతరించును. అందుచేత గీతాశాస్త్రమున పరిపూర్ణావతారమైన శ్రీకృష్ణుడే అవతార రహస్యమును దెల్పుచు, ప్రథమతః 'పరిత్రాణాయ సాధూనాం' అని వచించెను. కాని అందులకాటంకదాయక దుష్టశక్తులుండుట ప్రమాదహేతువు కావుటచే, నట్టి వినాశకర శక్తి సంహారము ద్వితీయ పక్షముగ వాకొనబడియున్నది. ఆ వినాశ కార్యము అవసరావసరముల ననుసరించి యుండును. కాని అవసరమున్నగాని భగవదవతారమేర్పడదు. ఇట్లున్నను, వ్యతిరేకాన్వయము గావించుకొందురేమో అని సంశయించెనేమో ! మరల శ్రీకృష్ణ భగవానుడు పర్యవసానముగ నా శ్లోకాంతమున, 'ధర్మసంస్థాపనార్థాయ' అని నొక్కి వక్కాణించి యున్నాడు.

ఈ విధముగ, బరమాత్మ అనేకపర్యాయములు, భారతిచే సప్రేమ పోషింపబడుచున్న త్రివిధ సంస్కృతీ విధానమునకు నపకారముకలుగు మహావిపత్తు ఏర్పడ, నవతారమూర్తియై భారత భూమి నవతరించి, ధర్మోద్ధరణము గావించుచుండును. అట్టి పరమావకాశము ఒక్క భారతికే, సర్వప్రపంచమున గల్గినది కాని

అన్యమునకు అభావము. పెన్నిధిగల స్థానముల, స్త్రీ జనులకాకర ప్రదేశముల, మహారాజాస్థానముల, ప్రత్యేకముగ రక్షకభటులున్నరీతి మహాత్ముల రక్షణార్థము పరమాత్మయే రక్షకస్థానము వహింప నవత రించి, మహాత్ముల ప్రేమపాత్రమై ఆచరణయోగ్యమైన ధర్మమును రక్షించి, స్థిరత నొసంగుచుండునని గ్రాహ్యము. ఆ కారణమున మాత్రమే మన భారతభూమి పుణ్యభూమి యని సుప్రఖ్యాతి అనాది కాలముననే ఆర్జించి, కాపాడి, పెంచుకొని వచ్చుచున్నది.

## మహాత్ములు

అట్టి రామ కృష్ణాద్యవతారములకే ఆకరమైన భారతదేశమున, ఆదర్శప్రాయులగు మహాత్ముల వివిధ రంగముల నసంఖ్యాకముగ నుండుటయందాశ్చర్యమేమి? పూర్వోక్త చందము భగవానుడే రక్షక స్థానమున నిల్చి, ధర్మనిరతుల రక్షించి, పోషింప సంసిద్ధుడై యొప్పార, నిశ్చింత ధర్మాచరణముల గావించుకొన నెల్లరకు ధైర్య స్థైర్యములుండునుగదా!

అందుచే దేశము నలుదల సాధకులేమి, భక్తులేమి, జ్ఞాను లేమి, మహాత్ములేమి జనించి, తమ తమ విధ్యుక్త ధర్మపాలనము జేసికొనుచు నానందమయులై యొప్పారుచుండిరి. అనాదికాలమునుండి అట్టి మహాపురుషులసంఖ్యాకములుగ భారతావని ప్రసరించియుండిరి. ఒక్కొక్క వేళ, అట్టి మహాపురుషులు నిరుపేదలై యున్నను, ప్రపంచ వ్యామోహదూరులై, ఆటవికులవలె జీర్ణచీనాంబరముల ధరింపక, గోచీన ధారులైయున్నను, వారి ధర్మనిరతిగల శ్రేష్ఠత్వ ముల గమనించి, చక్రవర్తులుగూడ వారి నాశ్రయించి, రాజధర్మ

ముల నెరింగి, రాజ్యపాలనా వ్యవహారముల నిగ్గుదేరి, ఆదర్శ రాజ్యముల బాలించి ధన్యులైరి. ప్రాచీన భారత దేశమున నెల్ల సార్వభౌములు, తమకు సచివోత్తములుగ నట్టి మహాత్ములనే యుంచి కొనెడివారు. అట్లైనను నింక సందేహములు అనిర్ధారణముగ నున్నచో నాటి ప్రభువరేణ్యులు, సభల నేర్పాటు గావించి, పండితుల నాహ్వానించి, వారి సత్కరించి, సందేహ నివారణ మొనరించు దిట్టను బహువిధ సన్మానములచే బూజించువారు. మాక్సు ముల్లరు వచించురీతి, అట్టి సభారంగములు పాలకుల అధ్వర్యమున నా ప్రాచీనాతిప్రాచీనకాలమున జరుగుట ఒక్క భారత దేశమునకే చెల్లుగాని అన్యదేశమునకు అసాధ్యము. ఆ సభావిధాన ఫలితముగ, స్వ పర సిద్ధాంత విభిన్నత్వములు సమసి, సమరస భావమున విభిన్న తాత్పర్యముల వారొక్కచో నివసించుటకు సులభ సాధ్యమై, సంఘము అన్యోన్య మైత్రి కలిగి, సహజీవనమున నుండ నవకాశమేర్పడియుండెను. అందుచే భారత చారిత్రమున. రాజకీయముల రణములేర్పడియుండెనుగాని, స్వ పర సిద్ధాంత ప్రచారమునకై యుద్ధములెందును గానరావు. అన్యమతములవారి దుదముట్టించు ఘట్టములు, అన్యమతముల నవలంబించు దేశములపై దండయాత్రలును భారతావని అభావము. అట్టి సభాస్థలులు ఆనంద దాయకములు, అత్యవసరములు.

## భూపాలకులు

ఆ విధముగ, రాజేంద్రులు మహాత్ముల ఆజ్ఞానువర్తులై రాజ్య పాలనము గావించుటయేగాక, వారికి అమూల్య ధన ధాన్యసంపదల నర్పించుటయేగాక, వారియందుండు అపార భక్తిగౌరవాధిక్యతలచే,

తత్సూచికముగ దమ పుత్రికలగూడ నర్పించుటయు ప్రాచీన భారతిలో సామాన్యము. ఈ విధముగ ధర్మనిరతులైన మహాపురుషులు, నాటి సంఘమున బహువిధ గౌరవముల గలిగినవారై, సర్వజనపూజ్యులై, అపర్మ వ్యక్తులై, నాటి సంఘమును త్రివిధ సంస్కృతిపథమున నడుపుచు, సంఘ శ్రేయోభిలాషులై యొప్పారిరి. విశ్వామిత్ర, వశిష్ఠ, పులస్త్య, గౌతమ, యాజ్ఞవల్క్య, ధౌమ్య, నారద, కపిలాది అసంఖ్యాక మహాత్ములు యీ విషయముల ప్రబలాదర్శములు. అట్లే, జనక, అశ్వపతి, జానశ్రుతి, దశరథ, యుధిష్ఠిరాది సార్వభౌములు గూడ అద్భుతాదర్శమూర్తులు.

నాడేగాక, నిటీవలికాలములగూడ బింబిసార, అశోక, భోజ, వర్ధమాన, కృష్ణదేవరాయాది ప్రభువులును, మహాత్ముల ననుసరించి పాలించి ధన్యులైరి. అన్యదేశము పై దండెత్తి, వారినోడించి యుద్ధ రంగమును గలయజూర చూచి, అంపలి దుఃఖమునకు హృదయము కరిగి, దుఃఖితులకై కడుంగడు దుఃఖించి, పరాజితులకు మరల రాజ్యము నొసంగి, నాటి నుండి తా సర్వయుద్ధముల విరమించుటయే గాక తన సామ్రాజ్యమున సర్వవిధ హింసనుగూడ బహిష్కరించిన అశోక రాజేంద్రుని హృదయము విశ్వవ్యాపకముగదా! అట్టి చక్రవర్తి భారతిలో జనింప సాధ్యముగాని పరదేశముల నసంభవము. అట్లగు టచే నా ప్రభువర్యునికి రాజ్యపాలనా సామర్థ్యములు లోపించెనా? రాజ్యము కత్తిచేగాక ధర్మపాలనఫలముగ యావద్భారతము నావ రించెనుగదా! ఆ భూపతి ప్రజాసౌకర్యమునకై ఎన్నెన్ని విధానముల ప్రవేశమొనరించెను! అందుచే నీ ప్రభువులుగూడ త్రివిధ సంస్కృతి విధానము నవలంబించి, పాలించి, ప్రజానీకమును బర్యవసాన

పారమార్థిక సంస్కృతీ పాలనమునకై ప్రేరేపించుచు, మార్గ దర్శకులై యుండిరి.

## వివిధ మహాపురుషులు

అదేవిధముగ పూర్వము ధన్వంతరీ చరకాది భిషగ్వరులు, నల నీల మయాది నిర్మాణశాస్త్ర విదులు, బ్రహ్మ వరాహమిహిరాది ఖగోళ శాస్త్రజ్ఞులు, సృష్టికి పునఃసృష్టి గావింపగల విశ్వామిత్రాది ధిషణాధిపతులు వివిధ శాస్త్రముల వివిధ కాలముల, భారతావని సంతతిని ఆదరించి, యుద్ధరించి, ప్రజాసౌఖ్యమునకై సహస్రధా కృషి గావించి, యుత్తీర్ణులై రాజిల్లిరి. ఈ విషయములు సౌరభ చతుర్థ సంపుటమున సవివరముగ చేటపరుపబడియున్నవి. వేద కాలముల నా సంఘము సర్వతోముఖాభివృద్ధి నొంది, ఎట్లు రాణించి నదియు నందు స్పష్టపరుపబడినది.

## గౌతమబుద్ధుడు

మున్నే సోదరి నివేదిత తెలిపిన విధాన, మానవ పరిణామ సోపానమున శ్రీ బుద్ధ భగవానుని స్థానము సర్వోన్నతముకదా! ఆ మహానుభావుని ఎన్ని కోణముల బరిశీలించి చూచినను నిర్మలత్వ మునకాతడొక అలంకారము. హామిల్టను వచనములరీతి 22 నాతని ముఖపద్మదర్శనమున సర్వదుఃఖములు పటాపంచలగును. సర్ ఫ్రాన్సిసు యంగ్‌హస్బెండు వచనముల రీతిని 23 అతని శాంతిమయమూర్తియే

22. Sir Hamilton : Dr. S. Radhakrishnan's Interview to Press.

23. Sir Francis Younghusband : Some Sayings of Buddha of F. L. Woodward, Intro.

శాంతికిరణ సంశోభితమై, ద్రష్టల శాంతి కాంతిమయమొనరించి తేజోవంతుల గావించును. అతని స్వరూపమే యొక పారమార్థిక మహాచైతన్య యంత్రాగారము. అందుండి ఆధ్యాత్మిక ప్రసారములు పుంఖానుపుంఖములుగా బహిర్గతమై, సర్వమును ఆవరించి ముంచి వైచును. అతని దివ్యమూర్తి అసమానము, అపూర్వము.

## శంకర భగవత్పాదుడు

భారతీయ చారిత్రక యుగమున, గౌతమ బుద్ధదేవుని పిమ్మట నాతనితో దులదూగగల అసాధారణ మహావ్యక్తి, శ్రీశంకరభగవత్పాదాచార్య జగద్గురువరేణ్యుడు. ఆ మహానుభావునిగూర్చి సౌరభము తన నాలుగవ, ఏడవ, యారవ సంపుటములలో సందర్భానుసారముగ నందందు విస్పష్టము జేసియున్నది. ఆ యువ, యతిసార్వభౌముని గూర్చి సోదరి నివేదిత రచించుచు, సంస్తుతించి, Western people can hardly imagine a personality such as that a Sankaracharya 24 శంకరాచార్యునివంటి మూర్తిని పాశ్చాత్య ప్రజలు ఊహింపుకొనజాలుట కడు దుర్లభము అని, నిష్కర్షగా వక్కాణించి యున్నది. ఆ విషయమును విపులీకరించుచు, This is greatness that we may appreciate, but cannot understand. We contemplate with wonder and delight the devotion of Fiancis of Assisi, the intellect of Abelard, the force and freedom of Martin Luther, and the political efficiency of Ignatius Loyala; but who could imagine all these united in one person? 24 మనము

24. Sister Nivedita: The Web of Indian Life. p 160

మెచ్చుకొనదగు శ్రేష్ఠత్వముండును. కాని దాని నవగాహనము చేయజాలము. అస్సిసిలోని ఫ్రాన్సిసుయొక్క భక్తికి, అబిలార్డుని మార్టిన్ లూథరుయొక్క శక్తి స్వాతంత్ర్యములకు, ఇగ్నాటియస్ లొయోలాయొక్క రాజనీతిజ్ఞతకు మనము ఆశ్చర్యచకితులమై ఆనందించెదము. కాని ఈ గుణములన్నియు నొకే వ్యక్తిలో సమ్మేళనమైనప్పుడు ఎవరూహింపగల్గుదురు? అని సోదరి నివేదిత ఆశ్చర్యమొందినది. 32 సంవత్సరముల అల్ప జీవితకాలమున, కొన్ని జన్మలనైన సాధింపరాని అసంఖ్యాక మహత్కార్యముల నా సన్న్యాస చక్రవర్తి సునాయాసముగ, ప్రచార సౌకర్యములు లేని యా కాలమున, యావద్భారతావనిలో నెట్లు సాధింపగలిగెనో! అది ఒక అద్భుతకార్యము. చిరుప్రాయంబున నిల్లు విడిచి, సద్గురు పాద సన్నిధి విద్యాసాధనముల దీక్షవత గావించి, గురువరేణ్యుని నానందపరచి, దేశముల దిగ్విజయ యాత్ర సలిపి, పరసిద్ధాంతుల జయించి, రాజరాజేంద్రులచే పాదపూజల స్వీకరించి, భారతి తన వైదిక ధర్మరాజ్యమును నిరూపణార్థము చతుర్దిశల పీఠ చతుష్టయమును నెలకొల్పి, ఆధ్యాత్మికవిద్యా సామ్రాజ్యమును, లౌకిక రాజకీయ సామ్రాజ్యములకుమించు స్థాయిలో సంస్థాపనము గావించి, మించిన శ్రీశంకరు మేధాసౌష్ఠవము నెవరు గ్రహింపగలరు! ఎవరు దర్శించి ఆనందింపగలరు! అదియు నదృష్టమేకదా!

## ఆచార్య పరంపర

అంత నా మూర్తి వెనువెంట నంటిజను అనుచర బృందమో యనురీతి శైవ, వైష్ణవ, శాక్త, గాణాపత్య, అద్వైతాది అసంఖ్యాక ధర్మమార్గముల నగణిత మహాపురుషగణములు, పరంపరారూపమున

భారతికి ననుంగుపుత్రులై జనించి, సర్వ ప్రపంచమునకు మహితా దర్శముల ప్రదర్శించిరి. దక్షిణమున అళ్వారులు, నాయనారులతో ప్రారంభమైన నీ వాహిని, రామానుజ మధ్వ విద్యారణ్య జ్ఞాన సంబంధాది మహాత్ములచే విజృంభించి, రమణారవిందులవరకు ప్రాకెను. అటులే ఉత్తరమున అసంఖ్యాక మౌనిపుంగవులతో ప్రారంభింపబడిన నీ ప్రవాహము, వల్లభ నింబార్క చైతన్య రామానంద కబీరు నిశ్చలదాస జ్ఞానదేవాదులచే వికసించి, దయా నంద, రామకృష్ణ, వివేకానంద రామతీర్థాది మహాపురుషుల ద్వార మున అఖిల ప్రపంచము నావరించి ప్రకాశించినది. ప్రాచీన కాలముల మన మహర్షిపుంగవుల అద్భుత కార్యముల ప్రత్యక్ష జ్ఞానము ఆధునికులకు లేకున్నను, అత్యాధునిక పారమార్థిక చక్రవర్తు లైన శ్రీరామకృష్ణ, వివేకానందాది మహాత్ముల చైదములు సర్వ జన ప్రస్ఫుటమేగదా! తన అగాధ ఆధ్యాత్మిక మహాశక్తిసంపదచే, విశ్వమత సిద్ధాంతముల నన్నింటిని గూలంకషముగ సాధించి, పర్యవసానతత్త్వముల నారసి, సర్వసమత్వమునేగాక సర్వైకత్వ ముల ననుభవించి, ప్రపంచమునకు ప్రకటించిన శ్రీ రామకృష్ణ దేవుని మహిమా విశేషముల నెవరు పొగడగిలరు! అటులే, తన అసాధారణ ప్రజ్ఞాశక్తిచే సర్వవిద్యాపారంగతుడై, విశ్వకోశమే తానయై, ప్రాక్ప్రతీచీదేశములన్నింట బర్యటించి, సర్వైకత్వరూప మైన వేదాంత సందేశముల జాటి, అసంఖ్యాక పాశ్చాత్య పండిత ప్రవరుల జ్ఞాననేత్రముల దెరిపించి, అఖిలప్రపంచ విజ్ఞాన భావ సంపుటి నున్నతస్థాయికి గొంపోయి, సార్థకజన్ముడైన వివేకానంద యతివరేణ్యుని మహత్కార్యవర్ణనము సామాన్య సాధ్యమా!





అందుచే నీ విధముగ, అనాదికాలమునుండి నేటిదనుక భరత వర్షము పూర్వోక్త లౌకిక, ధార్మిక, పారమార్థిక సంస్కృతీ త్రయాభివృద్ధికి సకలవిధ కృషి గావించి, సర్వదేశముల కాదర్శ వంతమై యలరారియున్నది. ఆమె కృషికనుగుణముగ నాటినుండి నేటివరకు అనేక మహాపురుషులు ఆ తల్లిగర్భవాసమున జనించి, ఆదర్శమూర్తులై, సర్వతోముఖ సందేశముల నఖిలప్రపంచ మానవ కోటికొసంగియున్నారు. కావున సంస్కృతీ నాగరికతలు కేవలము వచన రచనములమాత్రము ప్రదర్శితముకాక, సంఘమున జొచ్చి, విజృంభించి, తదనుగుణ మహాపురుషుల జనింపజేసి, సంస్కృతిని పెంచి, నాగరికతా పరిణామమునకు దోడ్పడుట ముఖ్యావసరము. వాని యథార్థ స్థితియు దత్ఫలితస్వరూపములపై నాధారపడియుండును. ఆ విధముగ నాగరికత యన, కేవలము భౌతిక విజ్ఞానము నభివృద్ధి గావించి, తన్మూలమున నిహసుఖసంపదల బెంపొందించి, ధార్మిక, పారమార్థికముల విస్మరించి, పశుపక్ష్యాదులవలె జీవించుటకాదని సువిదితము. సుఖజీవనమే నాగరికత యగుచో, సర్వ జీవరాసులును దానికై యత్నించి, కొంతవరకైనను అనుభవించుచున్నవి. ఇంద్రియ ప్రవృత్తులు మానవునికేగాక సర్వేతర జీవులకును సామాన్యము. కాని వాని సద్వినియోగము నొనరించి, తత్ఫలిత శాంత్యానందముల జూరగొనుట మానవ కర్తవ్యము. అయ్యదియే మానవత్వము నాబడును. ఇంద్రియ ప్రవృత్తులచే సుఖప్రాప్తియు, ఇంద్రియ నిరోధ పాలనముల శాంత్యానందసంప్రాప్తి యని ఆర్ష విధానము. ఆ విధ

ముగ నింద్రియప్రవృత్తుల బెంచి, తద్వారమున సుఖముల బెంచు కొనుట పశుప్రవృత్తి యగుచుండ, నింద్రియముల నియమించి, పారమార్థికాభివృద్ధినొంది, తద్వారమున బరమేశ్వరునితో సన్నిహిత సంబంధము నార్జించుటయే మానవత్వమని, ప్రాచీనాధునిక భారతవాణి సర్వదా సర్వథా కోటికంఠముల నెలుగెత్తి ప్రకటించుచున్నది. అద్దాని అమృతవాణిని సర్వ మానవులాకర్ణించి, ఆనందించెదరుగాక! అఖిల ప్రపంచమున సర్వవిధ శాంతి ఆవిర్భవించి, సర్వత్ర ఆవరించి, భూమండలిని అపర స్వర్గధామముగ రూపొందింపజేయుగాక! అందు లకు బరమేశ్వరుడు సర్వవిధముల దోడ్పడునుగాక అని సౌరభ గ్రంథముయొక్క నిరంతర ప్రార్థనము.



# శ్రీకృష్ణపరమాత్మ
## సర్వాకర్షణీయ స్వరూపము

శ్రీవల్లభేతి వరదేతి దయాపరేతి
భక్తప్రియేతి భవలుంఠనకోవిదేతి।
నాథేతి నాగశయనేతి భగవన్నివాసే
త్యాలాపనం ప్రతిపదం కురు మే ముకుంద॥

ముకుందమాల-1

ఓకృష్ణా! శ్రీవల్లభా! వరదా! దయాళూ! భక్తప్రియా! జన్మపరంపరనాశనా! నాథా! శేషపర్యంకశయనా! జగన్నివాసా! అని నిరంతరము ప్రార్థించునట్లు నన్ను అనుగ్రహింపుము, అని కులశేఖరులచేతను, 'శ్రీకృష్ణ! గోవింద! హరే! మురారే! హే నాథ! నారాయణ! మాధవేతి' అని లీలాశుకునిచేతను, 'శ్రీకృష్ణా యదుభూషణా నరసఖా శృంగారరత్నాకరా లోకద్రోహినరేంద్రవంశదహనా లోకేశ్వరా దేవతానీక బ్రాహ్మణగోగణార్తిహరణా నిర్వాణసంధాయకా, నీకున్ మ్రొక్కెద ద్రుంపవే భవలతల్ నిత్యానుకంపానిధీ' (ఆం. భాగ. 1.200) అని పోతనామాత్యునిచేతను, 'కృష్ణం కమలపత్రాక్షం పుణ్యశ్రవణకీర్తనం। వాసుదేవం జగద్యోనిం నౌమి నారాయణం హరిం॥' 'కృష్ణాయ యాదవేంద్రాయ జ్ఞానముద్రాయ యోగినే। నాథాయ రుక్మిణీశాయ నమో వేదాంత వేదినే॥' అనియు, 'కృష్ణం కలయ సఖి సుందరం బాల కృష్ణం' అని నారాయణతీర్థాది అసంఖ్యాక భక్తవర్యులచే గీర్తింపబడిన శ్రీకృష్ణభగవానుని యశశ్చంద్రికలు చిరకాలమునుండి నేటివరకు విశ్వవ్యాప్తి గడించి,

ఎల్లరకాకర్షవంతములై, ముక్తిదాయకములై వెలుగొందియుండుట, ఎల్లరకు అనుభూతియే. 'నిను జింతించుచు బాడుచున్ బొగడుచున్ నీ దివ్య చారిత్రముల్, వినుచున్ జూతురుగాక లోకులితరాన్వేషంబు లన్ జూతురే, ఘనదుర్జన్మపరంపరాహరణదక్షంబై మహాయోగివా, గ్వినుతంబైన భవత్పదాబ్జయుగమున్ విశ్వేశ విశ్వంభరా' (ఆం. భాగ. 1.197) అను కుంతీదేవి ప్రస్తుతివాక్యములెంత యథార్థములు! 'ఒక సూర్యుండు సమస్త జీవులకు దా నొక్కొక్కడై తోచు పో, లిక నేదేవుడు సర్వకాలము మహాలీలన్ నిజోత్పన్న జ, న్య కదంబంబుల హృత్సరోరుహములన్ నానావిధానూన రూ, పకుడై యొప్పుచు నుండు నట్టి హరి నే బ్రార్థింతు శుద్ధుండనై, (ఆం. భాగ. 1.226) అను భీష్మవచనసందోహము నాటి కృష్ణపరమాత్ముని సర్వశక్తిమత్వమును వెల్లడి చేయునుగదా! 'ఒక యింటం గజ వాజిరోహకుడునై యొక్కింట భుంజానుడై, సకలాత్ముండు పరుండు షోడశ సహస్రస్త్రీ నివాసంబులం, దొక బోటింటను దప్పకుండ నిజమాయోత్సాహుడై యుండ న, య్యకలంకున్ వరదున్ మహా పురుష బ్రహ్మణ్యున్ నతాబ్జాసనున్' (ఆం. భాగ. 10.627) అనురీతి, పదియారువేల పత్నుల గృహముల నేకకాలమున, వివిధాకార ప్రవృత్తుల నారదునకు గోచరించు శ్రీకృష్ణ మహిమావిశేషము లకును, సర్వవ్యాప్తిత్వమునకును నెవ్వరు ఆశ్చర్యచకితమానసులు గాజాలరు!

చిరకాలమునుండి నేటివరకు సర్వహృదయముల జొచ్చి, చలింపజేసి, నవనీతము భంగి యా హృదయముల ద్రవీకరింప జేసి, అప్రత్యక్షముగ అదృశ్యముగ నా హృదయముల దొంగిలించు

నీ నల్లగోపాలుడెవడు! 'నల్లనివాడు పద్మనయనంబులవాడు కృపారసంబు పై జల్లెడువాడు మౌళిపరిసర్పిత పింఛమువాడు నవ్వురా, జిల్లెడు మోము వాడొకడు చెల్వల మానధనంబు దెచ్చె నో, మల్లియలార మీ పొదలమాటున లేడుగదమ్మ చెప్పరే' (ఆం. భాగ. 10.1010) అను చందము యువతీమానసచోరుడై, 'చిక్కక యీశుడై యెదిరి జిక్కుల బెట్టెడి మాయలాడి' (ఆం. భాగ. 10.1005) యైన మాయలమారియై, వారి హృదయముల నపహరించి, తన దివ్య మహిమాన్వితమొనర్చియు, 'నీవు యశోదబిడ్డడివె నీరజనేత్ర సమస్త జంతు చేతో విదితాత్మవీశుడవు తొల్లి విరించి దలంచి లోక ర, క్షనిధి మాచరింపుమని సన్నుతి సేయగ సత్కులంబునన్, భూవలయంబు గావ నిట బుట్టితిగాదె మనోహరాకృతిన్' (ఆం. భాగ. 10.1039) అను గోపికావచనములరీతి, దన నైజస్వరూపమునుగూడ నా భక్త్యున్మత్తతనున్న గోపికాకన్యలకెరుక పరచి, తన లీలావిభూతితో నందియందక, నెల్లెడల దోచిదోచక నుండు నీ శ్రీకృష్ణుడెవరు!

చిరుగజ్జియల, నీ బుల్లివాని దిలకించునంతలో, పంచవర్షప్రాయ యగు బాలిక నాతని వెక్కిరించి కులుకులాడునుగదా! అతని వ్యత్యస్తపాదారవిందస్వరూప సందర్శనమున పాదముల మువ్వలు ఘలుఘల్లున మ్రోయ, యువతీమణులు నాట్యభంగిమముల నల్పుదురు! అతని రాసలీలావిభూతిని నవలోకించి, 'చందనచర్చిత నీలకళేబర పీతవసన వనమాలీ' (గీతగోవిందము. 4) అని అవ్యయానందకందళితమానసుడై జయదేవ కవి కులాగ్రమణి కీర్తించును! వేణువును మోమున ధరించి, మయూరపింఛాకిరీటియై, పీతవసన

ధారియై, యమునాతటి రాతిబండపై ఆసీనుడై యున్న నీలవర్ణుని సమ్మోహనమూర్తి యే చిత్రకారుని దృష్టి నాకర్షింపదు! గాఢారణ్యములమధ్య కటికచీకటి గుహాంతరాళమున గూరుచుండి, ధ్యాననిమగ్నతకై యత్నించు యోగిపుంగవునికైన నా మూర్తి, నిశ్చలచిత్త యోగమునకు సుగమ మార్గముగదా! 'కృష్ణనామామృతం నామ పరమానందకారకమ్' (కృష్ణాష్టోత్తరశతం. 22) అను శ్రీకృష్ణ నామస్మరణముచే నే గాయకుడానందజలధిని నీదులాడి, తన్మయుడై బాహ్యవిస్మృతి నొందనేరడు! అటుల బాలికలకు, యువతులకు, యోగులకు, కళాకారులకు, యోధులకు, సిద్ధులకుగూడ నేకాదర్శమూర్తి యయిన శ్రీకృష్ణభగవానుని వర్ణింప నేరికి సాధ్యమగును!

He is worshipped in various forms, the favourite ideal of men as well as of women, the ideal of children, as well as of grown up men [25] అతడు వివిధాకృతులలో పూజింపబడును. అతడు, పురుషులకు స్త్రీలకును ఆదర్శము. చిన్నవారికి పెద్దవారికిగూడ నాదర్శమూర్తి యని వివేకానందు వచనములు. అట్టి పరిపూర్ణమూర్తిని, సామాన్య అవతారముగ బరిగణింపనొల్లక భాగవత పురాణము, అతని పరిపూర్ణావతారముగ నిర్ణయించెను. అతని సర్వతోముఖ వ్యక్తిత్వమునకు మనమాశ్చర్యసంభ్రమముల నొందకుండ నుండజాలము అనియు నా స్వామివర్యుని వాక్యములు. He was the most wonderful Sannyasin, and the most wonderful house-holder in one [25] అతడు, అద్భుత సన్న్యాసియు, నద్భుత గృహస్థుడునై ఏకరూపమున జెల్వొందుచున్నాడు.

25. Swami Vivekananda : The Complete Works, Vol. 3, p. 256

ఆతడు తన సింహాసనమును త్రోసిపుచ్చి, ఎల్లర సార్వభౌముల గావించు నిష్కామకర్మ నిరతుడు, ఆనందమయుడు, చక్రవర్తుల నాజ్ఞాపించి నియమించు అసాధారణ నాయకుడు. అతి లలిత సమ్మోహన గుణగణములచే సర్వము నాకర్షించు అమానుష దివ్యమూర్తి. వివేకానందుడు వచించురీతి, Shiva is the Sublime aspect of God, Krishna the beautiful aspect of God 26 భగవంతుని దివ్యత్వవిషయము పరమశివుడై యొప్పార, సౌందర్య విషయము శ్రీకృష్ణుడు. ఎందుచేత? Love crystalizes into blueness. Blue colour is expressive of intense love 26 ప్రేమ నీలవర్ణమున పూర్ణత్వము నొందును. ఆ నీలత్వము, తీవ్ర ప్రేమతత్త్వమును వ్యక్తపరచుననియు వివేకానందుని వివరణము.

## సర్వ సౌందర్యము

సర్వసాధారణముగ, సౌందర్యము యింద్రియముల నాకర్షించును. కాని తజ్జనితానందము క్షణకాలభంగురము. కర్ణములు చక్కని శబ్దముల నాలకించి సమ్మోదమున మునుంగ, శీతల మృదుత్వాది స్పర్శచే జర్మము తన్మయమగును. సుందర దృశ్యముల రూపముల నవలోకించి చక్షువులానందాశ్రువుల జిలికి మైమరువ, ఇంపైన రుచికర వస్తువుల నారగించి జిహ్వాము సంతోషజలధి మునుంగును. సుందర సుఖకర పరిమళముల నాసికేంద్రియము ఆనందము నొంద, మధుర స్మృతుల మానసము బాహ్యాభ్యంతరముల మరచిపోవును. ఈ విధముగ నా యా ప్రవృత్తులకానందము గలి

26. Swami Vivekananda : The Complete Works, Vol. 6, p. 116

గించు సర్వ వస్తు సముదాయ మునుగూడ సౌందర్యములే యని, కోవిదుల తాత్పర్యము. శ్రీగోపాలకిశోరుని సుందర సమ్మోహనా కారమును వివరించుచు రామకృష్ణానందుడు నిజతత్త్వమును వక్కాణించెను. Beauty is the only thing which attracts a human mind here. By the word beauty we must not understand the beauty of form only. Beauty is sensed and percieved by each one of the six senses;... Any one of these beauties has full power in it to attract a percieving man 27 ఇచట మానవ చిత్తము నాకర్షించు తత్త్వము అందమొక్కటియే. కాని సౌందర్య పదమునకు ఆకార సౌందర్యమునే యర్థముగ గైకొనరాదు. సౌందర్యము షడింద్రియ ములచేతను జూడబడి, గ్రహింపబడుచుండును. ఈ షడింద్రియలబ్ధ సౌందర్యవిశేషములు ప్రతియొక్కటియు, ద్రష్టను ఆకర్షించుటయందు శక్తివంతములు. అందుచే శ్రీకృష్ణునిలో నీ షడింద్రియముల నాక ర్షించు సల్లక్షణములసంఖ్యాకములుగా నుండుటచే, నాతడు జగన్మో హనాకారుడని స్తుతింపబడియున్నాడు. చరిత్రల ననుసరించిచూచినచో మన్మధునకు మించిన అతి సౌందర్య లాలిత్య సౌకుమార్యాది లక్షణములు గల మూర్తి శ్రీకృష్ణుడు. వేణువాద మధుర విన్యాస పరంపరలచే నాతడొక అద్భుత గాయకచక్రవర్తి. భగవద్గీతా ప్రవచనము ననుసరించి చూచినచో నతడొక అసాధారణ వేత్త, జ్ఞాని, మేధావి, ఉపదేష్టయు నగును. రణరంగమున నతడొక భయంకర అజేయ విస్మయకారకస్వరూపము. అందుచే నీ మహనీయ మూర్తిపై సర్వకాల మానవ చిత్తములు కేంద్రీకరింపబడి

27. Editor: Vedanta Kesari, 1957, p. 184

యుండుటలో నాశ్చర్యమావంతయు గానమని రామకృష్ణానందుని రచనము. మరియు, నాతని జితేంద్రియత్వ యోగాధిక్యతలచే యోగి పుంగవులగూడ నాకర్షించి వారి చిత్తసీమల నధిష్ఠించెను. అంతియ గాక, తన జేగీయమాన అమానుష శక్తుల నవసర సమయముల ప్రకటించి, ఇంద్రాది దేవతలనే లొంచి, సర్వదేవాధిదేవుడై ప్రకాశించి, వారి సంస్తుతులకుగూడ నాకరమైన వ్యక్తి శాస్త్రముల పరుడెవ్వడును అభావము. 'న భూతో న భవిష్యతి' అననగును.

## శాంత, దాస్య, సఖ్యభావములు

పవిత్ర యమునాతీర విహారియై, గోపికాజన ప్రావృతుడై, శరద్రాత్రుల విహరించుచున్న నా గోపకిశోరుని కొనియాడనివారెవరు? రాధాకమల ముఖర్జీ వచించినట్లు అతడు, The Lord of the Autumn Moons 28 శరచ్చంద్ర ప్రభువరేణ్యుడు. పైష్ణవమున మున్ను గాంచిన పంచ విధ భావములకు, నా గోవిందుడే కేంద్ర స్థానము. అతడు ద్వారకాధిపతియై దుర్యోధన యుధిష్ఠిరాదుల నియమించుచు, హస్తినాపుర ఇంద్రప్రస్థములకేలికయై, అసంఖ్యాక సామంతుల గౌరవమర్యాదల స్వీకరించునపుడు అతడు, అసమాన రాజేంద్రుడై, భక్తులను శాంతభావమున జిత్తముల నాకర్షించును. ప్రేమప్రపూత ప్రభువుగా రూపొంది, కుబ్జాది భక్తులనుండి సేవల బొంది వారి దరింపజేయును. అటులే ఆప్తమిత్రుడై, ప్రమాదభరిత సమయముల నాదుకొనుచు సచివుడై, సహాయకుడై, అర్జున కుచేలాదుల నున్నతస్థానమునకు గొంపోయెను. చిన్ననాటి బృందావన

28. 'The Hindu', 13-11-1957

కేళికాలమున గోపగోపికా సమూహముల నాతని మిత్రత్వము లవర్ణనీయములుగదా! 'ఎన్నడున్నైన యోగివిభు నెవ్వని పాదపరాగ మింతయుం, గన్నుల గానరట్టి హరి గౌగిటజేర్చుచు జెట్టబట్టుచుం, దన్నుచు గ్రుద్దుచున్ నగును దద్దయు బైపడి కూడియాడుచున్, మన్నన సేయు వల్లవకుమారుల భాగ్యములింత యొప్పునే' (ఆం. భాగ. 10.481) అని, యా గోపకుమారుల అదృష్టమును పోతనామాత్యుడు స్తుతించెను. ఆ యపూర్వ దృశ్యము నభివర్ణించుటయం దసంతృప్తుడై పోతనామాత్యుడు సీ॥ మాటిమాటికి వ్రేలు మడిచి యూరించుచు నూరుగాయలు దినుచుండు నొక్క, డొకని కంచము లోని దొడసి చయ్యన మ్రింగి-చూడు లేదని నోరు చూపు నొక్క, డేగురార్గుర చల్ది లెలమి బన్నిద మాడి-కూర్కొని కూర్కొని కుడుచు నొక్క. డిన్నియుండగ బంచి యిడుట నెచ్చెలితన-మనుచు బంతెనగుండులాడు నొకడు, కృష్ణు జూడుమనుచు గికురించి పరు మ్రోల, మేలి భక్ష్యరాశి మెసగు నొకడు, నవ్వు నొకడు సఖుల నవ్వించు నొక్కడు, ముచ్చటాడు నొకడు మురియు నొకడు' (ఆం. భాగ. 10.4 6) అనుచందము గోపబాలకులు వివిధ క్రీడాలాల సత్వంబున జల్దులారగింప నొక్కచో జేర, శ్రీకృష్ణుడును అపార ప్రేమవాత్సల్యములు హృదయమును నింప, ఆనందపారవశ్యమున వారిలో నొక్కడై సీ॥ కడుపున దిండుగా గట్టిన వలువలో-లాలిత వంశనాళంబు జొనిపి, విమలశృంగంబును వేత్రదండమును-జాఱి రానీక డాచంక నిరికి, మీగడ పెరుగుతో మేళవించిన చల్ది ముద్ద డాపలిచేత మొనయ నునిచి, చెలరేగి కొసరి తెచ్చిన యూరుగాయలు-వ్రేళ్ళసందుల యందు వెలయ నిరికి, సంగడీల నడుమ జక్కగ గూర్చుండి, నర్మభాషణముల నగవు నెరపి, యాగభోక్త కృష్ణు

డమసులు వెరగంద, శైశవంబు మెరసి చల్ది గుడిచె' (అం. భాగ. 10.498) అని ఆ దివ్య దృశ్యమును దర్శించి, పోతనామాత్యుడు విరచించెను. అందుచే నీ సఖ్యభావమున దా నిజస్వరూపమును దన అసాధారణ మాయాప్రభావమున నిగూఢమొనర్చి, ఆ గోపబాలకుల సమ్మోహావనికచే గప్పి, అద్భుతలీల నీ గోపాలబాలచక్రవర్తి క్రీడాదుల గోకులమందు సల్పెను. అట్టి మహదవకాశము యితర దైవములెవ్వరును భక్తులకు ప్రసాదింపజాలరైరికదా!

# వాత్సల్యభావము

అటులే, వాత్సల్యభావమున శ్రీకృష్ణుదే సర్వభక్తులకు కేంద్ర స్థానము. నూట యిరువది యైదు వత్సరములు జీవించి, మహా ప్రపంచ యుద్ధమును నియమించి నడిపించి, పాండవులకు జయశ్రీని లభింపజేసియును శ్రీకృష్ణపరమాత్మ, బాలగోపాలునిరీతి పరిగణింపబడి యుండుట గడుంగడు విచిత్రాంశము. వయోవృద్ధుడై యున్నను, అతని అమాయక హృదయము మాయాబద్ధ జీవులకెల్లరకు బాలత్వ మునే ప్రతిబింబింపజేసి, సమ్మోహనమొనరించును. మహాభారత, భాగవత గ్రంథముల గాలించి చూచినను, మీసములుగల శ్రీకృష్ణ వర్ణనమే అభావము. పురుషత్వమునగల మొరటుదనము, అతనికి వృద్ధాప్యమునగూడ దగ్గర జేరలేదేమో! శరీరత్యాగపర్యంతమాతనికి సౌకుమార్యాది లలిత లక్షణములు అతని వీడిపో నిచ్చగింపక, నాతని ఆశ్రయించి తరించియుండెనేమో! అందుచే నెందరు ఎన్ని విధముల బరికించి పరిశీలించి చూచినను, ఎచ్చటను ఎన్నడును ముద్దుగోపాలుడుగ, బాలగోపాలుడుగ, కృష్ణకిశోరుడుగమాత్రమే ఊహింపగలుగుదురు కాని అన్యము గోచరము గాదు. కన్నుల

పెరచినను మూసినను, అతని దివ్యమంగళ జగన్మోహనస్వరూపమే ప్రత్యక్షము. అందుచే నాతని దివ్యమూర్తి సర్వాకర్షణీయమై, నిత్య బాలత్వమున నెట్టెదుట ప్రత్యక్షమగుటలో నాశ్చర్యమేమియు గానము. అవును, పూర్వోక్త త్రివిధ సంస్కృతీ విధానమున బరిపక్వ మొందిన వ్యక్తి సర్వావర్శకమౌటయేగాక సర్వాకర్షణీయుడై, ఎల్లర కానందసంధాతయై, వంద్యుడై యొప్పారుట సహజము: అట్టి వాని గన్న జననీజనకుల యదృష్టమేమనవలెను! అందుచేతగదా బ్రహ్మాది దేవతలు దేవకీగర్భస్థుడైన శ్రీకృష్ణు నుతించి, దేవకినిగూడ 'నింక నీ కడుపెప్పుడుం జల్లగావలె యాదవావళి సంతసంబును బొందగన్' (ఆం. భాగ. పూ. 10.103) గొనియాడుట గాననగును. అట్టి పర మాత్మయే తన గర్భమున జనించుటకుప్పొంగి దేవకీదేవియు, నా పరమేశ్వరు వేవిధముల సంస్తుతించి, ఆ॥ విలయకాలమందు విశ్వంబున పెద్ద కడుపులోన దాచు కడిమి మేటి, వటుడవీవు నేడు నాగర్భజుడవౌట, పరమపురుష వేడబంబు గాదె' (ఆం. భాగ. పూ. 10.129) అనియు గర్వాతిరేకమున శ్రీకృష్ణునికి దన యానంద మును వెలిబుచ్చినది.

అదేవిధముగ, శ్రీకృష్ణునికి బెంపుడు తల్లిదండ్రులును, అతని అల్లారు ముద్దుబిడ్డడని ప్రేమించి, లాలించి, పోషించు మహదవ కాశము పొందుటయు వారి పూర్వపుణ్య విశేషమే. కావున ఆ॥ 'జగదీశ్వరునకు జన్నిచ్చు తల్లిగా, నేమి నోము నోచె నీ యశోద, పుత్రుడనుచు నతని బోషించు తండ్రిగా, నందుదేమిసేసె నంది తాత్మ' (ఆం. భాగ. పూ. 10.350) అనియు బరీక్షిన్నృపతిముఖమున, వ్యాసభగవానుడు నందయశోదల మహాభాగ్యవిశేషమును గొనియాడి

యున్నాడు. ఆ యదృష్ట విశేషముచేతనేగదా సౌభాగ్యశీల యశోద, మన్ను దిను శ్రీకృష్ణు మందలింప, తన్నెపమున గోపాల చూడా మణి ముఖమున, 'జలధి పర్వత వన భూగోళ శిఖితరణి శశి దిక్పాలకాది కలండమైన బ్రహ్మాండ' మును (ఆం. భాగ. పూ. 10.340) దర్శించి, చకితయై, మ॥ 'కలయో వైష్ణవమాయయో యితర సంక ల్పార్థమో సత్యమో, తలపన్ నేరక యున్నదాననొ యశోదాదేవి గానో పర, స్థలమో బాలకుడెంత యీతని ముఖస్థంబై యజాం డంబు ప్ర, జ్వలమై యుండుటకేమి హేతువొ మహాశ్చర్యంబు చింతింపగన్' (ఆం. భాగ. పూ. 10.342) అని సంభ్రమాశ్చర్యముల మునుంగు అదృష్టదేవతగనై రాజిల్లెను. అట్టి తల్లిదండ్రుల నుతించుచు వ్యాసభట్టారకుడు, క॥ ప్రబ్బిన భక్తిని హరిపై, గబ్బంబులు సెప్పె కవులు కైవల్య శ్రీ, కబ్బుదురట హరిపోషణ, మబ్బిన తలిదండ్రులెచటికికబ్బుదురో తుదిన్' (ఆం భాగ. పూ. 10.351) అనియు యోచించి, యీ మాతాపితలకు భవిష్యజ్జన్మ ఎట్టిదియోగదా! అనియు, నాశ్చర్యమొందియున్నాడు. అందుచే వాత్సల్య భావమున బరమాత్మని జూచి, బాలిచ్చి, లాలించి, యాడించి, క్రీడించు నా తలిదండ్రుల భాగ్యమే మహాభాగ్యము!

అట్టి అవకాశ సౌభాగ్యము, నాడు దేవకీవసుదేవులకును, యశోదానందులకుమాత్రము శ్రీకృష్ణపరమాత్మ ప్రసాదించెనుగాని, సర్వకాలముల నెల్లరకా పుణ్యవిశేషమెట్లు బనగూడగలదు! కాని శ్రీకృష్ణుని మహిమావిభూతి యట్టిదికాదు. అతని లీలావిభూతి శ్రవణ మాత్రమున నెల్లరకు మాతృవాత్సల్యము అతనిగూర్చి జనించి, అతనిచే వెన్న దినిపింప నిచ్ఛ ఏర్పడును. మాయనెరుగని బాలికలు

గూడ నా బాలకృష్ణ ముఖసందర్శనమున నాతనితో ముద్దుపలుకుల వచించి, పసిపిల్లవానితో ముచ్చటించునట్లు మాటలాడెదరు. అది స్వాభావికమే. ఈ విషయమును గమనించిన సోదరి నివేదిత, She (Bhakta) is striving to worship God as the Child Saviour, struggling to think of herself as the Mother of God 29 భక్తురాలు భగవంతునికి జననిగ నూహించుకొన యత్నించుచు, నా పరమాత్ముని జిన్ని గోపాలునిగ నారాధింప యత్నించును అని వాకొనినది. అట్లు నాటినుండి నేటివరకీ కొంటె గోపాలబాలుడు ఎందరి స్త్రీహృదయముల నాకర్షించి, వారినుండి వాత్సల్యసుధాస్రవంతిని చూరగొనెనో అగణితము, అనిర్వాచ్యము. శ్రీకృష్ణానంతరమైదువేల వత్సరముల భారతీయ చరిత్రమున, నిట్టి మహాభక్తుల సంఖ్య అగణితముమాత్రముగాక, ఆశ్చర్యకరము, ఆనందదాయకము.

## మధురభావము

ఈ పంచవిధ భావముల మధురభావము పంచమము. శాంత భావమున సృష్టికర్తయు, భర్తయు, శాసకుడు, పాలకుడునై భక్తుల నల్లంతదూరమున నుంచి, వారి గౌరవవిశ్వాసముల గైకొనిన పరమాత్మ, దాస్యభావ విధానమున భక్తుని దగ్గర జేర్చి, స్థానాంగశుశ్రూషల స్వీకరించి, సన్నిహిత సౌభాగ్యమును భక్తునికి నొసగియుండెను. అంత సఖ్యభావ పద్ధతిలో, భక్తుని భుజములపై దా గరముల పైచుచు, నాడుచు, బాడుచు, సమస్థానము నా భక్తునకొసంగి అధికతర

29. Sister Nivedita : The Web of Indian Life, p. 25

సాహచర్యమును బరమేశ్వరుడు భక్తునికి బ్రసాదించెను. వాత్సల్య తత్త్వమున నా భగవంతుడే, శిశువుగనై బాలకుడై, భక్తుని భుజముల నెక్కి, ఏడిచి ఏడిపించి, అనేకవిధముల లీలాసంచయముచే నా జనకులబోలు భక్తుల నానందవార్నిధుల నీదులాడించి, అతి సన్నిహిత ప్రేమవార్నిధి ఆనందరసముల తన్మయుల గావించెను. అంత భగవంతుడు మధురప్రేమ విధానమున అత్యధికతర సన్నిహితుడై, హృదయాధినాథుడై, ప్రాణేశుడై ఎడబాటునోర్వని గాఢతర ప్రేమమున ముంచి, భక్తునికి బాహ్యాభ్యంతర విస్మృతిని గలుగజేయును.

మధురప్రేమకు నుదాహరణముగ బృందావన గోపికా కాంతలు ప్రముఖులు. ఆ॥ బాంధవముననైన బగనైన వగనైన, బ్రీతినైన ప్రాణభీతినైన, భక్తినైన హరికి బరతంత్రులై యుండు, జనులు మోక్షమునకు జనుదురధిప' (ఆం. భాగ. పూ. 10.972) అనుచందము నెట్టి సంబంధముననైన తీవ్రతరవిధాన శ్రీహరిపై జిత్తముల సంలగ్నమొనరించినచో, మోక్షప్రాప్తి కలుగునని శాస్త్రప్రతిజ్ఞ. అందుచేతనే విరోధియైన శ్రీకృష్ణుడు, ఎటనుండి ఎప్పుడు వచ్చునో యను భీతిచే నున్న కంసునకు, అటులే శ్రీమన్నారాయణ భీతిచే హిరణ్యకశిపుడు మొదలగు పగతురకే నెల్లెడల నా విష్ణుసందర్శనంబు గలిగి, భీతాహులై మ్రగ్గి, మోక్షము సంపాదింప; నిక తమ సర్వస్వమును శ్రీకృష్ణునకంకితమొనర్చి, అతనికొరకే రాత్రింబవలులు వెంటనంటి దిరుగాడు వృష్ణికాంతలకు మోక్షము కరతలామలకముగదా! అట్లు వెంటబడు గోపకన్యల సంబోధించి శ్రీకృష్ణుడు, 'మేలా మీకు భయంబు పుట్టదుగదా........యేలా వచ్చితిరే నిశాసమయమందిచ్చోట వర్తింతురే, చాలుం జాలు లతాంగులార' (ఆం. భాగ. పూ. 10.975)

అని మందలించి, మీ రాక గానని మాతాపితలు బంధుమిత్రాదులు దుఃఖించెదరు అని, చం॥ ఇలువడి నున్నసేసి హృదయేశుల సిగ్గులు పుచ్చి యత్తమా. మల నెదిరించి సోదరుల మానము నూరలు పుచ్చి తల్లిదం. డ్రుల రుచి మాన్చి బంధులకు రోత యొనర్చుచు జారవాంఛలం, వలనరి సత్కులాంగనలు వత్తురె లోకులు నూచి మెత్తురే' (ఆం. భాగ. పూ. 10.977) అని నూటి ప్రశ్నముల శ్రీకృష్ణుడడిగి, 'మానవతుల్ చనుడు మరలి మందిరము లకున్' (ఆం. భాగ. పూ. 10.982) అనియు నాతడు ఆనతిచ్చిన, నా వనితాలలాములు వగల నాక్రాంతలగుచు 'ఈశుడాఢ్యుడవు మోక్ష సక్తులం గాచు వో, లిక గావందగు గావవే విడువ మేలే కాంతలన్ భ్రాంతలన్' (ఆం. భాగ. పూ. 10.986) అని వచించి, మ॥ 'పతులన్ బిడ్డల బంధులన్ సతులకున్ బాటించుటే ధర్మప. ద్ధతి యా నంటివి దేహధారులకునే ధర్మజ్ఞ చింతింపుమా, పతిపుత్రాదిక నామమూర్తి వగుచున్ భాసిల్లు నీయందు ద, త్పతిపుత్రాదిక వాంఛలన్ సలిపి సంభావించుటన్యాయమే' (ఆం. భాగ. పూ. 10.987) అని గోపకాంతలు, తమ న్యాయబద్ధ ప్రేమమును ప్రకటించిరి. శ్రీకృష్ణుడు వారి దృష్టులకు కేవలము పతిగగాక పుత్రాదిక సంబంధమునగూడ దోచుట, నది హేయసంబంధముకాక పవిత్రమునై శోభిల్లుచున్నది.

అట్లు వెన్నుని వెన్నంటు కన్నియల ప్రేమోన్మాదమును దిలకించి, సంతసించి వారికానందమొనగూర్ప రాసక్రీడాదుల వారి దరియింపజేసి శ్రీకృష్ణుడు, వారికి క్రమముగ మోక్షపదవీ సామ్రాజ్య మును ప్రసాదించెను. అట్టి గోపికా పరమ ప్రేమవాహినుల యోచించి, ఉ॥ పాపపు బ్రహ్మ గోపికల పల్లెలలోన సృజింపరాదె ము, న్నిపురి

లోపలన్ మనల నేల సృజించె నతైన నిశ్చలుం, జేపడుగాదె యీ సుభగు జెందెడి భాగ్యము సంతతంబు నీ, గోపకుమారు బొందమును గోపకుమారికలేమి నోచిరో' (ఆం. భాగ. పూ. 10.1655) అని, నాటి అన్యపురకాంతలు దుఃఖించినట్లు నేడును అనేకులు స్త్రీపురుష భక్తులు, గోపికా భక్తిమాధుర్యములకు అత్యంతాశ్చర్యసంలగ్న మానసులై, తామా మార్గముల ద్రొక్కి, శ్రీకృష్ణ చరణారవింద దర్శనాపేక్షచిక్కి స్రుక్కుచుండుటయు విదితము. అసాధారణ భక్తి ప్రపన్నులై గృహాదుల ద్యజించి, సంతత శ్రీకృష్ణబాంధవ్య పీయూషాస్వాదనారతి లక్షించి, తన్మయులైయున్న గోపకాంతల, కంసారియైన కృష్ణుడు, మధురానగరిలో నుండియు స్మరించి, సృష్టి స్థితి లయాదిక గుణములతోసహా నున్న తన అనుగ్రహమును ప్రకటించి, క్షేమమారసి రా నుద్ధవు బంపుచు. శా॥ రమ్మా యుద్ధవ గోపకామినులు నా రాకన్ నిరీక్షించుచున్, సమ్మోహంబున నన్నియున్ మరచి యే చందంబునం గుందిరో' అని పలికి, క॥ లౌకికమొల్లక నన్నా, లోకించు ప్రపన్నులకును లోబడి కరుణా, లోకనముల బోషింతును, నా కాశ్రితరక్షణములు నైసర్గికముల్' (ఆం. భాగ. పూ. 10.1435) అనియు, నుద్ధవునితో గోపికా అలౌకిక భక్తిరహస్యమును, తన కృపాబుద్ధియు శ్రీకృష్ణపరమాత్మ నిస్సందేహముగ వ్యక్తపరచెను.

అందుచే, నీ వివిధరూప భక్తిప్రపత్తులకు గేంద్రస్థానమైన శ్రీ గోపాలబాలుడు, భక్తులైన మీరాబాయి, సక్కుబాయి మొదలగు స్త్రీమూర్తులనేగాక, వల్లభాచార్య, నింబార్కాచార్య, కృష్ణచైతన్య మొదలుగాగల అసంఖ్యాకులైన భక్తాగ్రేసరులమాత్రమేగాక, మధ్వాది

ఆచార్యులకుగూడ మూలతత్త్వమై వెలుగొందుటయందాశ్చర్యము గానము.

## శ్రీకృష్ణభక్తి

ఆ మూర్తిని ధ్యానమునకై చిత్తమున నిలిపినచో, అచిర కాలమున ధ్యాననిమగ్నత సులభసాధ్యమని ఎర్నెస్టు ఉడ్ వచించి యున్నాడు. 30 నారద పాంచరాత్రము ననుసరించి 'ఆ బ్రహ్మస్తంబ పర్యంతం సర్వం కృష్ణశ్చరాచరం' అని వచించుటయు సహజము గనే యున్నది. 'శ్రీకృష్ణనామమెంత మధురము! అది మధురాతి మధురము! అది సర్వశ్రేష్ఠము. భక్తి శ్రద్ధలతోడమాత్రమేగాక, సామాన్యముగా నా నామోచ్చారణము గావించినచో మానవుడు తప్పక ముక్తిని బొందును' అని స్కాందపురాణము శ్రీకృష్ణ నామమును నుతించును. అటులే అగ్నిపురాణముగూడ సంస్తుతించును. భాగవత పురాణము యుగధర్మముల క్రోడీకరించి, కలికల్మష సమూహమును బహుళముగ వివరించి, శుకునిముఖమున 'కలేర్దోషనిధే రాజన్నస్తి హ్యేకో మహాన్ గుణః। కీర్తనాదేవ కృష్ణస్య ముక్తబంధః పరం వ్రజేత్॥' కృతే యద్ధ్యాయతో విష్ణుం త్రేతాయాం యజతో మఖైః। ద్వాపరే పరిచర్యాయాం కలౌ తద్ధరికీర్తనాత్॥' (12.3.51,52) గీ॥ వేడుక హరికీర్తనంబు వెలయగ ధృతిచే, బాడుచు గృష్ణా యనుచున్, గ్రీడింతురు కలిని దలచి కృతమతులగుచున్' (ఆం. భాగ. 12.21) అనియు గీర్తించి, కలిదోషనివారణమునకై శ్రీకృష్ణనామ కీర్తనము గాక, అన్యమొండులేదని నొక్కి వక్కాణించియున్నది.

30. Earnest Wood: Concentration, p. 40

అయినను, శ్రీకృష్ణపాదారవింద భక్తిపారవశ్యము అంత సులభము కానేరదు. అందులకు బూర్వోక్తరీతి గోపికాకన్యల అచంచల ప్రేమరసము జలదులై, భక్తులనుండి యుప్పొంగుచో సాధ్యము. ఘనవిరాగము, ప్రచురమైన భక్తియు నొక్కచో గేంద్రీకరించినగాని అది సాధ్యముకాదు. అందుచేత 'జన్మాంతరసహస్రేషు తపోధ్యానసమాధిభిః। నరాణాం క్షీణపాపానాం కృష్ణే భక్తిః ప్రజాయతే॥' అనేక జన్మసహస్రముల తపోధ్యాన సమాధులచే నిర్జిత పాపము గలవారలకే కృష్ణ భక్తి పుట్టొందును అని ఆర్యోక్తి. అట్లు అయ్యును, అది ప్రాచీన కాలమునుండియు, భారతావనికి అసంఖ్యాకమగు భక్తగణములు గలరు. వివేకానందుని వాక్యములలో, నితర దైవములకంటె శ్రీకృష్ణభగవానునికే అధికతర భక్తకోటి గలదని విదితము. 31 ఆ దివ్యమోహనమూర్తిచే గాలాంతరమున మధ్వాది చైతన్యపర్యంతము మహా ఆచార్యవర్యులేమి, అధునాతన మహాభక్తులేమి, ఆ త్రిజగన్మోహన నీలమేఘకాంతిగల నా కృష్ణకిశోరుని జిత్తసీమల బ్రతిష్ఠించి, బంధించి, ప్రపంచమును మరచి, ఆనంద సింధువున నోలలాడుచుండుటచే శ్రీకృష్ణభక్తకోటి నానాటికి సంఖ్యాతీతమై, అనంతమునై యొప్పారుటయందాశ్చర్యము అవంతయు లేదు. అది ఆ మహిమోన్నతశీలుని దివ్యప్రభావము. అట్టి శ్రీకృష్ణ మధురామృతరసాస్వాదనమునుండి ఎవరు విరమింపగలరు? ఆతని కృపావీక్షణచంద్రికలనుండి ఎవరు తప్పించుకొనగలరు? ఎంత కాలము భారతియుండునో అంతకాలమాతని దివ్యమూర్తి ఆర్యహృదయముల బాయక స్థిరముగ నుండియే విరాజిల్లును.

---

31. Swami Vivekananda : The Complete Works, Vol. 4, p. 91

ఆ పరమపావన ప్రతిభ విశ్వము నంతటిని ఆవరించి, సర్వభక్త సమూహముల దరింపజేయుగాక! ప్రపంచమున నిరీక్షిత శాంతిసంధాన మేర్పడునుగాక!

## పూర్ణావతారము

గీతావాక్యము ననుసరించి 'పరిత్రాణాయ సాధూనాం వినాశాయ చ దుష్కృతాం' (4.8) అనురీతి, గొందర శిష్టుల గాపాడుటకొరకు, అందుకొరకై యాటంకదాయకమైన దుష్టుల శిక్షించుటకును, అవతారముయొక్క అవసరమని విదితము. అందులకై, మానవాకృతినైన బొందిని మత్స్య, కూర్మ, వరాహములుకూడ నవతారములలో జేర్ప బడినవి. అందు మానవాకృతియు లేదు. ఇక మానవత్వమైన నభావము. అంత, నరసింహుడైనను ఒక్క ప్రహ్లాదబాలు రక్షణార్థమై మాత్రమవతరించి, తద్వ్యతిరేక విరోధియైన హిరణ్యకశిపు సంహారణానంతరము ఆ మూర్తి అనవసరమగుటచే నదృశ్యము. ఆ మూర్తిలో నించుకేని మృదుత్వముగాని లాలిత్యముగాని గానరాదు. అతి భీకర స్వరూపము. పంచమావతారుడైన త్రివిక్రముడైనను, బలి నడంచుటకంటె అన్యము అతనిలో నగోచరము. శిష్టుల నొక్కనినైన ప్రత్యక్షముగ రక్షించినట్లు గానము. అంత బరశురాముడావేశావతారమనబడి, తాత్కాలికోద్రేకమున, నాటి దుష్టపాలనా కౌశలులైన క్షత్రియుల నసంఖ్యాకముగ బరిమార్చినట్లు ద్యోతకము. అందునుగూడ శిష్టరక్షణము చెప్పుకొనదగినంత గానరాదు. అటుల నీ యాఱుగురుగూడ నవతారములుగనే పరిగణింపబడిరి. శ్రీరామచంద్రుడన్ననో శిష్టపాలనమునకే జనించి, అందులకవసరమైన దుష్టశిక్షణము గావించినట్లు స్పష్టము. ఆ రాజేంద్రుడు ఏతత్కార్య

సాధనమునకై రాజ్యమును త్యజించి, సతినిబాసి, అరణ్యముల గష్టపడి, రాక్షసులజిక్కి, ఎంతయో శ్రమ గావించినగాని కార్య సాఫల్యము నొందలేదు. అందుచే నతనిలో నెక్కువ మానవత్వము గోచరించుచు, దైవ లక్షణములు అవిస్పష్టము. కాని నా ప్రభు కులాలంకారుడు సంఘమున సర్వవిధాదర్శమూర్తియై విరాజిల్లి, సర్వవిధ ప్రపంచ సంబంధముల దానె చుక్కానియై వెలుగొందినట్లు స్పష్టము. విరోధినైన క్షేమించు సమరసశాలి శ్రీ రఘురామ చంద్రుడు. అందుచే నీతనియందు సంపూర్తిగ నవతార లక్షణములు విదితము. అనేక మహర్షి పుంగవుల రక్షించెను, రాక్షసుల సంహరించెను. అంజనీసుతునకుపదేశించి యుక్తిజ్ఞుని గావించె నా సీతా వల్లభుడు. ఈ విధముగ అవతారతత్త్వము దశావతారములలో క్రమన్యాయమున బరిణమించి శ్రీరామచంద్రునితో సమగ్ర స్థానము నొందియున్నది.

కాని యీ సోపానముల శ్రీకృష్ణ స్థానమెద్ది? పూర్వోక్తము రీతి నీతని సర్వజనాకర్షణీయత్వము, స్త్రీపురుష సమాదరణము, పూర్వ అవతారముల గానరాదు. శ్రీకృష్ణునికివలె దా నవతారమని గాని, సంపూర్ణ పరమాత్మనే యను జ్ఞానముగాని వారికి లేదు. ఈతనిలో నడుగడుగునకు మానవత్వముకంటె దేవత్వమే ప్రదర్శితమగుచు, జూపరులకు ఆతడు సాక్షాద్భగవంతుడే యను గాఢ విశ్వాసము, భక్తిప్రపత్తులు చిత్తసీమనుండి ప్రవహించును. అవసర సమయముల సృష్టికి బునస్సృష్టి గావించు సామర్థ్యముగూడ నీతని నుండి సాక్షాత్కరించుచుండును. షడైశ్వర్యములతోబాటు భగవంతునికి అన్వయింపబడు కృష్ణతత్త్వముగూడ శ్రీకృష్ణపరమాత్మలో సంపూర్ణ

(9)

ముగ ప్రత్యక్షమై, అతడు సంపూర్తిగ పరమాత్మయే యను నమ్మకము భక్తులకు గలుగజేయును. అందుచే శాండిల్య సూత్రముల ననుసరించి 'ముఖ్యం తస్య హి కారుణ్యం' (49) అనురీతి నవతారములకు గారుణ్యమే జననహేతువుగాన, 'క్షీరాబ్ధివాసీ సరసీరుహాక్షః క్షీరం పునః కిం చకమే న గోష్ఠే' (1.4) క్షీరసాగర శయనుడైన శ్రీమహావిష్ణువు, గోకులమున నతి మధుర క్షీరపానమును గోరి యందు అవతరించెనని, విద్యారణ్య యతీంద్రుడు శ్రీశంకర విజయమున స్మరించెను.

దేవకీగర్భస్థుడై యున్న శ్రీకృష్ణుని నుతింప నేతెంచిన బ్రహ్మాది దేవతలుగూడ 'న తేఽభవస్యేశ భవస్య కారణం వినావినోదం బత తర్కయామహే। భవో నిరోధః స్థితిరప్యవిద్యయాకృతా యతస్త్వయ్యభయాశ్రయాత్మని॥' (భాగ. 10. 2. 41) 'మత్స్యాశ్వకచ్ఛప వరాహ నృసింహ హంస రాజన్య విప్ర విబుధేషు కృతావతారః। త్వం పాహి న స్త్రిభువనం చ తథాధునేశ భారం భువో హర యదూత్తమ మననం తే' (42) ఉ॥ పుట్టువులేని నీకభవ పుట్టుట క్రీడయకాక పుట్టుటే, యెట్టనుడున్ భవాది దిశలెల్లను జీవులయందవిద్య దా, బుట్టుచునుండుగాని నిను బుట్టినదినం బలె బొంతనుండియుం, జుట్టగ లేమి దత్క్రియల జొక్కని యెక్కటివాదువీశ్వరా' (ఆం. భాగ. పూ. 10.99) మ॥ 'గురు పాఠీనమవై జలగ్రహమవై కోలంబవై నృకే, సరివై భిక్షుకుడవై హయాననుడవై క్ష్మాదేవతాభర్తవై, ధరణీనాథుడవై దయాగుణగణోదారుండవై లోకముల్, పరిరక్షించిన నీకు మ్రొక్కెదమిలాభారంబు వారింపవే' (100) అని కీర్తించి, శ్రీకృష్ణుని యవతారములలో జేర్చి రామావతారానంతరము అష్టమావ

తారముగ వచించిరి. అవును, అవతారలక్షణములన్నియు నీతనిలో బర్యవసానము నొందియున్నవి.

కాని కొన్ని శాస్త్రములు, 'మత్స్యః కూర్మః వరాహశ్చ నారసింహశ్చ వామనః రామో రామశ్చ రామశ్చ బుద్ధః కల్కిరేవ చ॥' అని వచించుచు, రామత్రయము నాఁడు, పరశురామ, రఘురామ, బలరాముల అవతారముల జేర్చి, శ్రీకృష్ణస్థానమున బలరాముని జేర్చియున్నవి. కాని బలరామునియందెట్టి యవతార లక్షణములు గోచరము కావు. శ్రీకృష్ణాగ్రజుడను గౌరవముచే నా స్థానము నొసంగియుండవచ్చును. అతడు సాధించిన శిష్ట రక్షణముగాని, దుష్ట శిక్షణముగాని యెందును గానరాదు. శ్రీకృష్ణభగవానునియందుగల అపార భగవల్లక్షణముల దిలకించి, ఆతని దశావతారముల సామాన్యమైన అవతారముగ బరిగణించుట అసమంజసమని కొందరు విజ్ఞానులు భావించి, శ్రీకృష్ణుని అవతారమనక కేవలము బరమాత్మయే, అంశమునగాక సంపూర్ణముగ నావిర్భవించినట్లు విశ్వసించి, అతని సంపూర్ణ, పరిపూర్ణ అవతారముగ నన్వయించిరి. అటులైన దశావతారముల అష్టమావతార స్థానము అసంపూర్ణముగాన, శ్రీకృష్ణునికి జ్యేష్ఠ భ్రాతయైన బలరామునకా గౌరవమును సంప్రాప్తింపజేసిరి. అట్లు గావించుట అసముచితమేమో! శ్రీకృష్ణుడు పరిపూర్ణావతారము గావుటకఖిల లక్షణములు ఆతనియందు ద్యోతకముగాని, బలరామునిలో సామాన్యావతారమునకు వలసిన గుణగణములెందును అభావము. అందులకు, శ్రీరామచంద్రుని బిమ్మట రాగల అవతారము అత్యధిక సద్గుణ సంశోభితమై, అధిక శక్తిసామర్థ్యముల గలిగియుండుట సహజము. ఈ విధముగ శ్రీకృష్ణపరమాత్మ అవతారములలో గణింపబడి యున్నను,

అయ్యవతారస్థాన నిర్వహణమున నసాధారణ ప్రజ్ఞావిశేషమును జూపించుటచే నతడు సంపూర్ణావతారమనియు గ్రహింప నుచితము.

## శ్రీకృష్ణుడు చారిత్రక పురుషుడా ?

According to Barth and Hopkins, Krishna was not a human being at all, but a popular divinity whose identification with Vishnu gave rise to sectarian Vaishnavism [32] బార్తు, హాప్కిన్సుల అభిప్రాయము ప్రకారము శ్రీకృష్ణుడు మానవుడు కానేకాడు. అతడొక సర్వజన ప్రియమైన దైవమై యుండి, విష్ణువుతో నేకీభూతము కాపుటతోడ వైష్ణవశాఖాభివృద్ధికి గారణమయ్యెను. అనగా, వీరి మత ప్రకారము శ్రీకృష్ణుడు చారిత్రాత్మక పురుషుడుకాక, కేవలమూహాజనిత వ్యక్తియై కల్పింపబడి, కాలక్రమమున వైష్ణవ మతావలంబకులకిలవేల్పుగ రూపొందెనని తాత్పర్యము. Barth considers Krishna to be a solar deity. Like those of many solar deities, his first appearances were beset with perils, and obstructions of every kind—. In the Veda, the sun in the form of Martanda is the eigth son born of Aditi, and his mother cast him off just as Devaki [33] కృష్ణుని ఆదిత్య దైవముగ బార్తు పండితుడు తలంచును. అనేకాదిత్యపురుషులవలె శ్రీకృష్ణుని ప్రథమాగమనము కష్టభూయిష్ఠమై, వివిధాటంకదాయకమై యొప్పారియున్నది. వేదములో

---

32. Prof. D. C. Sarkar : History and Culture of the Indian people, Vol 2; p. 434

33. Prof. Hemachandra Roy Chaudhury : Materials for the Study of the Early History of the Vishnava Sect, p. 24

మార్తాండ రూపమున సూర్యుడు అదితికి ఎనిమిదవ సుతుడు, దేవకి వోలె నామెయు అతని బరిత్యజించెను అని, వేదసాక్ష్యమును ఆ పండితుడు గానబరచి, ఆ మార్తాండుదే కృష్ణుడై యుండనోపును. అందుచే కృష్ణుడు మానవుడై, చారిత్రాత్మక పురుషుడుకాడని భావించెను.

## శ్రీకృష్ణ - క్రీస్తులు

కొందరు ఇంకను ముందుకు నడచి, శ్రీకృష్ణ అవతరణము నైజమున లేదనియు, కాని, ఏసుక్రీస్తు యనంతరమున నా క్రీస్తు శబ్దము కృష్ణరూపమును బొంది, భారతమున వ్యవహారమును గడించి, దాని చుట్టు వివిధ కథావస్తువులు చిత్రింపబడినవనియు సాహసముగ భావించిరి. క్రీస్తు జనించిన స్థానము చావడియు, కృష్ణజన్మస్థానము చెరసాలయు నగుచుండ బోలికలెక్కడ? ఏసు సామాన్య కుటుంబ జన్ముడై యుండ, శ్రీకృష్ణుడు రాజవంశీయుడై యున్నాడు. వసుదేవుడు, బాలకృష్ణుని యమునను దాటించి, గోకులమునకు కంసునకు భీతిజెంది జేర్చుటయు, జోసఫ్ ఏసును హెరాద్ ప్రభువునకు వెరపుజెంది స్థలాంతరమైన ఈజిప్టునకు బెత్లెహామునుండి గొనిపోవుటయందు పోలికలెంతమాత్రము గలవు? ఏసు బాల్యజీవనము అదృశ్యమై యుండ, శ్రీకృష్ణుని బాల్య లీలావిభూతులు శిశువులనుండి బానుల వరకు బారమార్థిక పారవశ్యమును గలిగించునుగదా! తర్వాత వీరిరువురి జీవితముల నెందును నెట్టి సామ్యమును అగోచరము. అట్టియెడ, నిక జెరూసలేమునకు జెందిన ఏసుక్రీస్తు భారతావనిలో శ్రీకృష్ణ ధగుట ఎట్లు పొసగగలదు? అది అనూహ్యము, అసంగతము.

అంతియగాక, నీ పాశ్చాత్య పండితులకు ఎంత యోచించినను ఏసుకు పూర్వము ప్రపంచమే అగోచరము! అట్టియెడ, భారతమున నిట్టి అసాధారణ, సర్వ్యాకర్షణీయ మహాపురుషులుండుట వారి దృష్టికి అసంభవము. భారతీయ చారిత్రమంతయు వారి క్రీస్తుకు ముందు 6 శతాబ్దములనుమించి పోనలవికాదు. అందుచే భారతీయ చారిత్రక మహాత్ముల, ప్రభువుల, నా పరిధిలోనికిమిడ్చి, అన్వయింప వారి యత్నములు. అగుట నసంఖ్యాక అసందర్భ ప్రతిపాదనముల, యుక్తి బాహ్య తాత్పర్యముల, అపహాస్యకర సిద్ధాంతముల వాదు లేవనెత్తి, భారతీయ చరితాకథనమున పెక్కు సమస్యల గల్పించిరి. అందులో శ్రీకృష్ణ క్రీస్తు సమన్వయ కథనము ఒకటిగ నున్నది. ఇందు లేశమాత్రమైన యాథార్థ్యముగాని, యుక్తిగాని లేకుండుట విస్పష్టము.

అందుచే సర్కారు పండితుడు వాకొనురీతి The attempts to make him a solar myth are as unconvincing as the endeavours to prove that Buddha and Christ are imaginary figures 34 శ్రీకృష్ణుని ఆదిత్యసంబంధకల్పనముగ జేయు యత్నములు, బుద్ధ క్రీస్తులూహారూపులని నిరూపింప జరుగు ప్రయత్నములవలె అసమ్మతములని తెలియుచున్నది. అంతియగాక ముందు మనము గాంచబోవుచందము శ్రీకృష్ణ భక్తివిధానము ఏసు క్రీస్తుకు పూర్వమేకాక Is much older than that of Buddha 35 బుద్ధునికంటె నతి ప్రాచీనమనియు స్పష్టము. అందుచే ఏసుక్రీస్తుకు పూర్వమే ప్రబలి, వ్యాప్తమైయున్న శ్రీకృష్ణచారిత్రము, క్రీస్తు

34. D. C. Sarcar : History and Culture of the Indian People, Vol. 2, p. 435

35. Swami Vivekananda : The Complete Works, Vol. 4, p. 361

ననుకరించి కల్పింపబడినదను వాదనము అతి నిర్వీర్యము, మరియు నిస్సందేహము. అందుచేతనే అరవిందుడును, We know too that Krishna and Arjuna were the objects of religious worship in the pre-Christian centuries 36 కృష్ణార్జునులు మతవిషయక పూజార్హులగుట గ్రీస్తుకు పూర్వము, కొన్ని శతాబ్దము లకు పూర్వమే కలదని మనకు దెలియునని వచించెను. అందుచే The historical Krishna, no doubt existed 36 నిస్సందేహ ముగ చారిత్రాత్మక కృష్ణుడు ఉండెను అని అతని నిర్ణయము.

ఈ విషయమును వివరించుచు, పాణినీయ సంస్కృత వ్యాకరణ మున 'వాసుదేవక' శబ్ద నిర్మాణమును జర్చించుచు, వాసుదేవుని భక్తులుగ దీర్మానింపబడినది. ఆ పాణినీయ వ్యాకరణము పండితాభి ప్రాయమున, క్రీ. పూ. 5వ శతాబ్దము కావుటచే నంతకు మున్నెన్నడో శ్రీవాసుదేవ కృష్ణుడుండియుండ వలయునని నిశ్చయము. అంతియ గాక, క్రీ. పూ. నాల్గవ శతాబ్దమునకు జెందిన Magasthenes మెగస్థనీసు, అలెగ్జాండరు చక్రవర్తి పనుపున భారత దేశమున కేతెంచి, పాటలీపుత్రాది మహానగరముల దర్శించి, తన అభిప్రాయ ముల గ్రోడీకరించి రచించెను. అందు, మధురానగర ప్రాంతముల కృష్ణవాసుదేవ భక్తిసిద్ధాంతము ప్రచారము నొందియున్నదని అతని కథనము. అందుచే నీ కృష్ణమతము, క్రీ. పూ. 4వ శతాబ్దమునకు పూర్వమే భారతమున ప్రఖ్యాతమని విదితము. మరియు Besnagar బెస్‌నగర స్తంభశాసనము ననుసరించి చూచినచో, 2వ శతాబ్దము నకు జెందిన Heliodirus హెలియోడిరసు అను గ్రీసుదేశ రాయబారి,

---

36. Sri Arabinda Ghosh : Essays on Gita, p. 17

భారతమునసుండి, దేవాధిదేవుడైన నీ వాసుదేవుని మతావలంబకుడై యున్నట్లును దెలియుచున్నది. ఇట్లనేక ప్రమాణములబట్టి శ్రీకృష్ణ మతశాఖ ఏసుక్రీస్తు మతమునకనుకరణముగాక, అతఃపూర్వమే అత్యంత ప్రఖ్యాతమై, వ్యాప్తమై యున్నటుల నిస్సందేహము. 37

అటులైనచో నిక శ్రీకృష్ణుడు నా ప్రఖ్యాతుడై, A unique figure in the history of human evolution 38 మానవపరిణామ చారిత్రమున నీ అద్భుతమూర్తియొక్క పుట్టుపూర్వోత్తరములెవ్వి? ఈ విషయముల నొకింపుక గమనించెదముగాక!

## శ్రీకృష్ణుడు - వేదము

ఋగ్వేదమున, కృష్ణ నామము కొన్ని స్థానముల గోచరము. అచట కృష్ణుడు దేవాధిదేవుడుగాక, దేవతల ప్రభువైన ఇంద్రుని విరోధి. మరియు ప్రజానీకమునకు గంటకుడగుటచే వారు ఇంద్రుని ప్రార్థించి కృష్ణుని సంహరింపగోరిరి. అందుచే నింద్రుడు, పెద్దపెట్టున అంశుమతి నా ప్రఖ్యాతమైన యమునానదివద్ద దశసహస్రాధిక సైన్యములతోనున్న కృష్ణు నెదిరించి జయించినట్లు ఋగ్వేద కథనము (ఋ.96.13). 'అవద్రప్సో అంశుమతీ మతిష్ఠ దియానః కృష్ణో దశభిః సహస్రైః ఆవత్ తమింద్రః శచ్యాధమంతమప స్నేహితీ ర్నృమణా అధత్త (ఋ.96.13) శీఘ్రగమనశీలుడైన కృష్ణుడు, దశ సహస్ర దస్యులతో అంశుమతి దగ్గర గలడు. బుసగొట్టుచున్న

37. D. C. Sircar : History and Culture of the Indian People, Vol. 2, p. 432

38. Prof. Sisir Kumar Mitra : The Vision of India, p. 15

అతని, శక్తివంతుడైన యింద్రుడు పట్టుకొనెను. మానవ శ్రేయోభిలాషియై యింద్రుడు, అతని క్రూర సైనిక సమూహముల హత్యమార్చెను అని మంత్రార్థము. ఇచట కృష్ణ నామకుడు, నాడు దస్యులనబరగు అనార్యజాతికి జెందిన మహానాయకుడని స్పష్టము. మరియు నొక మంత్రమున 'ప్ర మందినే పితు మదర్చతా వచో యః కృష్ణగర్భా నిరహన్నృజిశ్వనా అవస్యవో వృషణం వజ్రదక్షిణం మరుద్వంతం సఖ్యాయ హవామహే' (1.101.1) మనకు హితము గావింప తలంచి, కృష్ణుని భార్యాగర్భముల, రిజస్వంతునితో, మనకు మిత్రుడగుటకై, విచ్ఛిన్నము గావించిన వజ్రాయుధధారి, వరప్రదాత, మరుద్గణసేవ్యుడగు దేవేంద్రునికి మన హవిస్సుల నర్పించెదముగాక అని, ఋగ్వేదమున నిశ్చయించినట్లుగూడ విదితము. ఆ నాటి కృష్ణసంతతిగూడ ప్రజాశ్రేయమునకు భంగకరమగుటచే నింద్రుడు కృష్ణు భార్యాగర్భముల ఖండించినట్లు దెలియుచున్నది. కృష్ణ-ఇంద్ర సంఘర్షణమునుగూర్చి మరియొకచోట వివరింపబడినది. 'అవ ద్రప్సో అంశుమతీ మతిష్ఠ దియానః కృష్ణో దశభిః సహస్రైః ఆవత్ తమింద్రః శచ్యాధమంత మప స్నేహితీర్నృమణా అధత్త' (ఋ. వే. 8. 96. 13) శీఘ్రగామియైన కృష్ణుడు, పదివేల దస్యుసైన్యములతో నంశుమతి దగ్గరనుండెను. ఇంద్రుడు తన పరాక్రమముచే జలమున బుసకొట్టుచున్న అతని బట్టి, మానవహితుడుకాన, అతని దుర్మార్గులైన సేనల గొట్టెను. ఈ పోరాటమును ప్రత్యక్షముగ గాంచిన నొకడు తర్వాత మూడు మంత్రముల దాని వర్ణించెను. ఆ శీఘ్రగామి అంశుమతీ తీరమున, నొక యందరాని స్థానమును బొంచియుండుటను నే గాంచితిని. మేఘమధ్యమునగల సూర్యునిరీతి ఆ కృష్ణుడు దాగియుండుట నే చూచితిని. అతని రణమున జయింప

(10)

మని నేను మిమ్ముల ప్రార్థించుచున్నాను. అంత నా శీఘ్రగామి ప్రకాశించుచు, నంశుమతి ప్రవేశించి ఆ స్వరూపమును దాల్చెను. ఇంద్రుడు, బృహస్పతి సహాయమున నా నిరీశ్వరవాద బృందమును దగ్గరకు వచ్చుటతో గొట్టివైచెను అని 14, 15, మంత్రముల, ఋగ్వేదము వివరించినది.

ఈ విధముగ ఋగ్వేదమున కృష్ణుడొకడు గోచరము. కాని యితడు పై కథనము ప్రకారము జనవిరోధి, నాస్తికుడుగ వర్ణింప బడియున్నాడు. అతని సంహారమునకై ప్రజానీకము ఇంద్రుని ప్రార్థించి నట్లును, అందులకు నింద్రుడు సహితసన్నాహమున నాతని ఎదిరించి, యోడించినట్లును వ్యక్తము. అతని రాక్షసుడనియు, వేదమంత్రములు తెలుపుచున్నవి. కాని యీ కృష్ణునికిని, బురాణముల నున్న శ్రీకృష్ణునికి ఎట్లు సంబంధము కలదు అను విషయము గమనీయాంశము. కాని యీ కృష్ణుడు, ఎట్లు యోచించినను, పురాణకృష్ణునికి ఆధారము కానేరడు. ఈతడు దస్యుజాతికి జెందిన మహానాయకుడై, మాయల మారియై, ప్రజాపీడనమున జీవించు అటవికుడై యుండును. ఇతని ప్రవర్తనములకు రోసి, అతని నామము నుచ్చరింపక, నాతని వర్ణమునే అనగా శారీరక వర్ణమునే అతనికన్వయించుచు, పై మంత్ర పాఠములు వ్యవహరించినట్లు తెలియుచున్నది. ఒక మంత్రము 'త్వచం కృష్ణా మరంధయత్' (1.130.8) నల్లని చర్మముగల నా రాక్షసుని జీల్చివైచెను అనియు వాకొనెను. అటులే ఆ జాతివారల 'కృష్ణయోనీః' (2.20.7) కృష్ణవర్ణజులనియు, 'కృష్ణామపత్వచం' (9.41.1) కృష్ణ వర్ణ చర్మముగల రాక్షసుడనియు, (9.73.5) నాతని ప్రస్తావనమున అతని శరీరవర్ణమునే ప్రధానముగ గైకొని, కృష్ణపదముపయోగింప

బడినది కాని, అతని నామము కృష్ణుడు కాదు. అందుచేతనే ఋగ్వేదము 'పంచాశత్ కృష్ణా ని వపః సహస్రా ఉత్కం' (4. 16. 13) పిమ్మట, నింద్రా! నీవు ఏబదివేల కృష్ణవర్ణుల జంపియున్నావు అను మంత్రమున, 'కృష్ణాని' అని బహువచన ప్రయోగము గావించినది. అందుచే నా జాతివారినందరిని ఋగ్వేదము కృష్ణులు అని వ్యవహరించి, అందు నాయకునిగూడ, అతని నామమును దెలుపక, వల్లని వానిగనే వచించియున్నదని విస్పష్టము. కావున, నీ సర్వనామధారియైన కృష్ణుడెట్లును, మన శ్రీకృష్ణ విషయమున బొందు సలుపజాలదని విదితము.

కాని కొన్ని మంత్రముల మరియొక కృష్ణుడుగ స్పష్టముగ గోచరము. అతడు యీ పూర్వోక్త కృష్ణునికి విరుద్ధ లక్షణములు కలవాడు. అతడు ఆంగిరస వంశమునకు జెందిన మహర్షియై, ఋగ్వేదమున 8.85.3, 8.87.–, 8. 85.–సూక్తములకు గర్త యని 'కృష్ణ అంగిరసః' యని వ్యవహరింపబడెను. అందుచే నతడు అంగిరస వంశజుడైనవాడని విస్పష్టము. 'శృణు తం జరితుర్హవం కృష్ణస్య స్తువతో నరా' (8.85.4) మంత్రకర్త యగు కృష్ణుని స్తుతి నాలకింపుడు అని అశ్వినీ దేవతల సంబోధించి కృష్ణుడీ సూక్తము జెప్పెను. ఇచట వారికొరకు కృష్ణుడు ప్రార్థించును (8.85.3). మరియు నీ కృష్ణుడికి నొక ప్రత్యేకతగూడ వేదమున గలదు. ఈ కృష్ణునికి విశ్వకుడను ఒక పుత్రుడు కలడు. అతనికి విష్ణపుడు అను కుమారుడును గలడు (1.116.23) కృష్ణుని పౌత్రుడైన విష్ణపుడు ఇంద్రాదుల స్తుతించి, వారి కృపావిశేషమున నధిక సంపదల నార్జించెను (8.87.3). కాని కారణాంతరములచే నాతడు సర్వము గోల్పోవుటచే,

నా పుత్రునికొరకు విశ్వకుడు ప్రార్థించుచున్నాడు. తప్పిపోయిన బశువును మందలోనికి ఆహ్వానించినట్లు విష్ణుని గైకొనుమని అతని ప్రార్థనము (1.116.23). కృష్ణప్రోక్తముగ నున్న 8.85 వ సూక్తమున కృష్ణుడీ విషయముల ప్రస్తావింపగ, సోమపానమునకు అశ్వినీ దేవతల నాహ్వానించును. కాని అతని కుమారుడైన విశ్వకునికన్వయింపబడు 8.86 వ సూక్తమున, తన పుత్రుని యోగక్షేమముల కాసించి, అతడు దేవతల బ్రార్థించును. అట్లు ప్రార్థించుచు 'మానో వియౌష్టం సఖ్యా ముమోచతం' మన మిత్రత్వమును త్రుంపక, బగ్గముల సారించి రమ్ము అని కోరుకొనును. అందుచే వీరి మిత్రత్వము చిరకాలగతముగ జూపట్టును. తన తండ్రి యగు గృష్ణుని ప్రార్థనములు దేవతలకెంత ప్రీతికరములో నట్లే తన స్తుతులుగూడ ప్రీతిపాత్రములని సగర్వముగ విశ్వకుడు చెప్పుకొనును (8 8‾.4). కావున మిత్రత్వభంగము గలుగనీయక, దన పుత్రుడైన విష్ణుని రక్షింప నితడు ప్రార్థించును. అందులకు మన్నించి, అభిమానించి, కృష్ణపుత్రుడైన విశ్వకుని బ్రార్థనముల కనుగ్రహించి, విష్ణుని గాపాడినట్లు (8.85.4) మంత్రము తెలుపుచున్నది.

అట్లుకాక, ఋగ్వేదమున నింద్రవిరోధిగ బేర్కొనబడిన నల్లని కృష్ణుడే, నాటి అటవిక జనసంఘమునకు వేలుపై యుండి పరాజితుడై, at the time of the Bhagavat Gita, he reccovered much lost ground and got reinforced by becoming identified with the Vasudeva of the Bhagavatas and the Vishnu of the Vaishnavas It is this miscellaneous origin and history that make him the author of the Bhagavat Gita, the personation of the Abselute, as well as the cowherd

playing the flute on the banks of the Jumna 39 భగవద్గీతా కాలమునకు దన స్థానమును గొంత నిలద్రొక్కి కాని, భాగవతుల వాసుదేవునితోడను, వైష్ణవుల విష్ణువుతోడను ఏకత్వము నార్జించి, శక్తిని గడించెను. ఈ నానావిధమైన జనన చారిత్రములు అతని గీతాకారునిగను, అవతారునిగను, యమునాతీరవిహారియై వేణు గాయకుడైన యాదవ బాలునిగ గావించెను అను కృష్ణపరిణామ వివరణము అసమంజసమనిపించును. వేదమున ప్రస్తావింపబడిన కృష్ణులిరువురును మానవమాత్రులేగాని దేవతలుమాత్రము కాదు. అందుచేతనే The pre epical literature of the Hindus knows a human Krishna, but is silent about a deity Krishna 40 పురాణపూర్వ హిందూ వాఙ్మయము, మానవమాత్రుడైన కృష్ణు నెఱుంగునుగాని దేవత యగు కృష్ణునిగూర్చి మౌనమున నున్నది అని, హేమచంద్ర పండితుడుగూడ వచించియున్నాడు. ఈ దృష్టిని బరిశీలించినచో The acceptance of the dark and probably aboriginal God Krishna into the Hindu pantheon on terms of equality with the white God Rudra or Siva, is one of the supremest acts of human genius 41 నల్లనివాడై, బహుశః ఆటవిక దేవుడైన కృష్ణుని, తెల్లని దేవుడైన రుద్రుని, శివునితో సమానత్వమున హిందూ దేవతాగణములలో గైకొనుట, మానవ ప్రజ్ఞాకౌశల్యమున నొక అద్భుత కార్యము అని

---

39. Dr. S. Radhakrishnan : Indian Philosophy, Vol. 1, p. 87

40. Prof. Hema Chandra Roy Chaudhury : Materials for the Study of the Early History of the Vaishnava Sect, p. 35

41. Prof. Humayun Kabir : Convocation Address, Aligarh University, 3-12-1958

నుతించు వాక్యముల, కృష్ణుని ఆటవిక దేవునిగ బరిగణించి, అతని హిందూ దేవతగ స్వీకరించుట యను డాక్టరు హుమయూన్ కబీరు వాక్యములు చరిత్రాకథన దూరములు. వేదమున కృష్ణుడు దేవతయే కాదు అని స్పష్టము. ఇక భాగవత, భారతముల నతడు ఆటవిక వంశజుడుగూడ కాడు. ఆ విషయముల ముందు గాంచెదముగాక!

ఈ ద్వితీయ కృష్ణుడు, ఛాందోగ్యమున సూచింపబడిన కృష్ణుని వోలె ఆంగిరసుడై యున్నాడు. కాని యితడు క్షత్రియుడై, రాజ వంశమునకు జెందక నొక మహాఋషియై సూక్త నిర్మాతయు నగుట గమనార్హము. మరియు నాతనికి విశ్వకుడను పుత్రుడు కలడు. పౌరాణిక కృష్ణునకు ప్రద్యుమ్నుడను కుమారుడు రుక్మిణీగర్భమున గలిగినట్లు కలదు. మరల విశ్వకునకు విష్ణపుడను బుత్రుడుండ, ప్రద్యుమ్నునకు అనిరుద్ధుడను సుతుడు గలడు. వీరిలో నన్వయమునకు ఎట్టి అవకాశములు గలవో గవేషణార్హము. విశ్వకుడే ప్రద్యుమ్నుడా, అటులే విష్ణపుడే అనిరుద్ధుడా అని, తీర్మానించుట గష్టసాధ్యము.

శ్రీకృష్ణభగవానుని వంశమైన యాదవ వంశమునకు ప్రథమ పురుషుడైన 'యదు' నామము ఋగ్వేదమున (1.36.18, 6.45.1, 8.10.5) గోచరము. కాని అతడు యితడగునో కాదో నిర్ణయించుట దుర్లభము. మరియు ఋషి యగు కృష్ణునికి ఆంగిరస వంశమని వచింపబడియున్నను, ఛాందోగ్యాద్యుపనిషత్తులయందువలె 'దేవకీ పుత్రః' అను వివరణము కృష్ణునకు వేదమున గానరాదు. యదు, సాత్వత, వాసుదేవ, నంద యశోదాది నామములును పురాణముల ప్రఖ్యాతములై, కృష్ణునకు సంబంధించినవై ప్రస్ఫుటముగ నుండ, వేదమున నవి అభావము. అందుచే నీ రెండవ కృష్ణుడైనను మన

గోపాలకృష్ణుడుగాక, వైదిక మహర్షి చంద్రుడై యుండునని దోచును. అట్లగుట, ఋగ్వేదీయ కృష్ణులిరువురును, భాగవత కృష్ణునితో నెట్టి సంబంధము లేనివారని నిశ్చయాభిప్రాయము.

## శ్రీకృష్ణుడు - ఉపనిషత్తులు

ఇక నుపనిషత్తుల బ్రస్తావింపబడిన కృష్ణునిగూర్చి విచారింప యత్నించెదముగాక : 'తద్ధైతద్ఘోర ఆంగిరసః కృష్ణాయ దేవకీపుత్రా యోక్త్వా ఉవాచ' (3.17.6) ఆంగిరస పుత్రుడైన ఘోరమహర్షి, దేవకీతనయుడైన కృష్ణునికొరకు దీనిని వివరించెను అను ఛాందోగ్య మంత్రము గలదు. అదే విధముగ 'బ్రహ్మణ్యో దేవకీ పుత్రో బ్రహ్మణ్యో మధుసూదనః' (4) అనియు నారాయణోపనిషత్తు వచించినది. ఈ మంత్రముల కృష్ణుడు దేవకీపుత్రుడనిమాత్రము వచింపబడెను. అతడు, ఆంగిరస వంశీయుడైన ఘోరుని వద్ద విద్యల నార్జించెను అనియు, ఛాందోగ్యమున మరియొక విశేషము గలదు. అందు బ్రస్తావింపబడిన ఘోర అంగిరస మహర్షి సూర్యోపాసకుడుగ కౌషీతకీ బ్రాహ్మణము వాకొనునని (30.6) పండిత హేమచంద్రుని తాత్పర్యము[42] ఈ విషయము నింకను దరచి, In the Upanishad and in the Gita we find the same doctrines associated with the name of one and the same person (Krishna the son of Devaki). There is no escape from the conclusion that their doctrines were actually learnt by Krishna from Ghora Angirasa, and were transmitted

42. Prof. Hemachandra Roy Chaudhury : Materials for the Study of the Early History of the Vaishnava Sect, p. 48

by him to his disciples - the Bhagavatas and formed the kernal of the poem - Bhagavat Gita. 43 ఒకే సిద్ధాంతము, ఛాందోగ్యోపనిషద్గీతలలో దేవకీపుత్రుడైన కృష్ణుడను ఒకే వ్యక్తికి సంబంధింపబడియున్నది. కృష్ణుడు ఆ సిద్ధాంతముల ఘోర అంగిరసుని వద్ద నేర్చుకొని, తన శిష్యులైన భాగవతులకు బోధించి యుండు ననియు, అదియే భగవద్గీతాసారముగ నయ్యెననియు దీర్మానింపక తప్పుచున్నది కాదని పండిత చౌధురి తాత్పర్యము. కాని దేవకీ పుత్రుడని వచించినంతమాత్రమున, నా ఛాందోగ్య కృష్ణుని బౌరాణిక కృష్ణునిగ నన్వయించుట, గష్టసాధ్యము. గురువర్యుడైన ఘోర మహర్షిని, అంగిరసపుత్రునిగ అతని జనకనామమును వచించి, కృష్ణుని విషయమున దల్లి యగు దేవకిని ఎందులకు ఉపనిషత్తు చెప్పెనో విచారణీయాంశము. పురాణాదులు, కృష్ణుని వాసుదేవుడని విస్పష్టముగ దండ్రినామము నన్వయించి వచించుటయు గమనార్హము. ఉపనిషత్తుల నాతని వాసుదేవుడని తెలిపియుండలేదు. ఈ దేవకీనందనుడు అన్యుడై యుండదగునేమో? ప్రముఖుడైన జనకుడుండ, జనని నామము ప్రధానముగ సంతానమునకు అన్వయింపబడుట అరిదిగదా? వంశనామములు గూడ పురుష వ్యక్తి ప్రాధాన్యమున నేర్పడుటయు సామాన్యము. అర్వాచీనమనబడు కృష్ణోపనిషత్తు 'నిగమో వసుదేవః' (8) వసుదేవుడే ఉపనిషత్తులు అని యన్వయించి, దేవకి ప్రస్తావనమునే తెలుపలేదు. మీద మిక్కిలి 'యో నందః పరమానందః యశోదా ముక్తిగేహినీ' (5) ఏది బ్రహ్మానందమో యది నందుడనియు, ముక్తికాంతయే యశోద యనియు, యథార్థ జనకులైన దేవకీ వసుదేవులగాక, పెంచిన

43. Prof. Hemachandra Roy Chaudhury : Materials for the Study of the Early History of the Vaishnava Sect, p. 50

యశోదానందుల స్తుతించినది. అటులే త్రిపుండ్రధారణ విధానమును బోధించు ఉపనిషత్తు, వాసుదేవోపనిషత్తు అనియు పేరొందినది. గోపాలపూర్వతాపిన్యుపనిషత్తు దేవకీ యశోదా నామముల సూచింపక, 'నందాది వసుదేవాది' (2) అని నందవసుదేవుల మాత్రము పేర్కొన్నది. గోపాలోత్తరతాపిన్యుపనిషత్తుమాత్రము 'శ్రీకృష్ణాయ దేవకీనందనాయ' యని వచించియున్నది. కాని అప్రధానముగ నెల్లరతోబాటు దేవకీ శబ్దము ప్రయోగింపబడినది. అచట దానికి ప్రత్యేకత గానుపింపదు.

అంతియగాక భాగవత కృష్ణుడు, చిన్నతనమున కుచేలుడైన సుదామునితో సాందీపుడను గురుముఖమున సకల విద్యల నార్జించినట్లు విదితము (ఆం. భాగ. ఉ. 10. 1003). ఆ గురువద్యుని, కుచేలునితో సంభాషణ సందర్భమున గృష్ణుడు సంస్తుతించుచు, 'తే॥ తివిరి యజ్ఞానతిమిర ప్రదీపమగుచు, నవ్వయండైన బ్రహ్మంబు ననుభవించు, ధరిత్రి నప్పండు సత్కర్మనిరతుడతుల, భూసురశ్రేష్ఠుడన ముందు బుధనుతుండు' (ఆం. భా. ఉ. 10.994) అని వాకొనెను. కాని ఛాందోగ్యాదికోపనిషత్తుల గృష్ణ గురువరేణ్యుడు ఘోరమహర్షి. సాందీప, ఘోరులొక్కరా యిరువురా యను మీమాంసయు, నిట ముఖ్యము. ఒక్కడైనచో నిశ్చయముగ నా యుపనిషత్ కృష్ణునికి, భాగవత కృష్ణునికి నేకత్వము రూఢి పరుపవచ్చును. అదికాకున్న వీరిరువుర అన్యులే యనియు దీర్మానింపకదప్పదని తోచును.

## శ్రీకృష్ణుడు - భారత, భాగవతములు

అదేవిధముగ, భారత భాగవతముల గల కృష్ణులకు వ్యత్యాసము కలదని కొందరి వాదము. కాని పరిసర వాతావరణముల విభేదముచే

గోకుల బృందావన కృష్ణునకు, ద్వారకాపతియైన కృష్ణునకు, బాహ్యమున నించుక తారతమ్యమున్నట్లున్నను, అది స్వాభావికముగ యథార్థము కాదు. భాగవత కృష్ణుడు బాలకుడు. గోపగోపీజన ప్రావృతుడు. కంసునుండి రక్షింపబడుటకై తలిదండ్రులచే గోకులమునందు గోప్యముగ దాచబడిన బాలకుడు. అందుచే బాలబాలికలతో నాటపాటల కాలము గడుపుచు, వారి నానందమున ముంచుచు, దా నానందించుచు, అందులకు ఆటంకములుగ ఎదురైన అనేక సంఘర్షణముల ఎదురొడ్డి, ధైర్యస్థైర్యముల జయశ్రీ నార్జించుచు నుండుటలో విచిత్రముగాని అసాధారణముగాని కానుపింపదు. మహాభారత కృష్ణుడు ప్రౌఢ కృష్ణుడు. కంసాది దుష్టసంహారమొనర్చి, బాధ్యతల వారి వారికర్పించి, తా దూరమునగల ద్వారకాపురినుండిన బాధ్యతాయుత వ్యక్తి యగుచున్నాడు. గోకులకృష్ణుని లీలలు అందే వ్యాప్తములై యుండ, ద్వారకాధిపతి కృష్ణుని మహాత్కార్యములు నాటి భారతవర్ష వ్యాప్తములై, ఎల్లరు నతని వచన రచన ఆచరణములమాత్రమే జూచుచు, నతని అనుసరించుచునో, వ్యతిరేకముగ వ్యవహరించుచునో యుండెడివారు. అనగా నాటి శ్రీకృష్ణుడెల్ల సంఘమునకు చుక్కానియై, సర్వకార్యముల దానయై, కొందరకు ప్రాణముగను, కొందరకు ప్రాణాంతకుడుగను యొప్పారుట గాంచనగును. అందుచే నీ భాగవత, భారత కృష్ణుల తారతమ్యమును గాంచి, వీరన్యులనుట యుక్తిబాహ్యము.

మహాభారతమునగూడ, పండిత రాధాకృష్ణ మహాశయుడనురీతి,
In the Mahabharata we have a combination of all traditions about Krishna that survived till then, a non-

Aryan hero, a spiritual teacher, and tribal God 44 మహాభారతమున అనార్య నాయకుడుగను, పారమార్థిక గురువుగను, ఆటవికుల దేవుడుగను, అతఃపూర్వముగల కృష్ణునిగూర్చిన సంప్రదాయములు అన్నియు మిశ్రితములై యున్నవి. కాని యీ మహాభారత కృష్ణుని విశేషములు, పూర్వవిషయములంతెంతమాత్రమన్వయములు అనియు విచారణీయము. ఆ విషయము నింకను విపులీకరించుచు, the Mahabharata contains several layers of thought super - imposed one upon another in the course of ages representing Krishna in all the grades, from a historical character to an avatar of Vishnu 44 చారిత్రక వ్యక్తిత్వమునుండి విష్ణ్వవతారమువరకు కృష్ణునిగూర్చి, కాలక్రమమున నీతనిపై పొరలుపొరలుగ వేయబడిన అనేక భావపరంపరలు మహాభారతమున గలవని అతడు వచించి, We connot accept the life of Krishna as described in the Puranas 44 పురాణముల వర్ణింపబడినరీతి కృష్ణుని జీవితమును మనము స్వీకరింపజాలము. ఎందుచేత? భాండార్కరు అభిప్రాయమున, పశుల కాపరులై స్థిరవాసములేక దేశముల దిరుగు అభీరులను జాతి, బాలదైవము నారాధించెదరు. వారు అనాగరికులైన అనార్యులు. ఆ తెగనుండి కృష్ణునకు స్త్రీలోలత్వము అన్వయమై యుండును. యాదవులు క్షత్రియులనియు, ఆర్యసంతతికి జెంది, భారతమునకు ద్వితీయ దండయాత్రలో నేతెంచి, యమునాతీరమున స్థిరవాసమేర్పరచుకొనిరనియు పండిత వైద్యుని అభిప్రాయము. పాండవులుగూడ అనార్యజాతివారని weber వెబర్, దత్తు పండితులు భావించిరి. అనార్యులైన పాండవులు

44. Dr. S. Radhakrishnan : Indian Philosophy, Vol. I, p. 494

భారతీయులని చెప్పి, ఆర్యసంఘమున గలుపుటకై మహాభారత కర్త యత్నించెనని పైవారి తాత్పర్యము.44 కాని యాదవ, కౌరవ వంశావళులు ఆర్యముగ నున్నవిగాని అనార్యసంబంధమున్నట్లు గోచరింపదు.

శ్రీకృష్ణ పూజ్యత్వమునుగూర్చియు నా కాలమున భిన్నాభిప్రాయములున్నట్లు రుక్మిణీకళ్యాణ, రాజసూయాది ఘట్టముల గోచరము. అందు రుక్మిణీ సోదరుడైన రుక్మియు, శిశుపాలుడును, శ్రీకృష్ణుని అనార్యజాతివానిగ నిందించెదరు. కాని యీ నింద కృష్ణునికి సంప్రాప్తించుట అనార్యత్వమునగాక, గ్రామసీమస్థమైన గోకుల బృందావనాది నివాసము అని వ్యక్తము. చక్రవర్తులమధ్య బెరుగక, పేదలమధ్య, పల్లెల పెరుగుటయు, దన చిన్ననాటి చేష్టలును, శ్రీకృష్ణ ప్రత్యర్థులకు నిందావకాశమును గల్పించినది. అవి నైజములుగాక అసూయాద్వేషజన్యములుగ భావింపనగును. శ్రీకృష్ణ విరోధులకేగాక భక్తులకు గూడ శ్రీకృష్ణలీలావిషయిక సందేహములుత్పన్నములైనట్లు 'సంస్థాపనాయ ధర్మస్య ప్రశమాయేతరస్య చ। అవతీర్ణో హి భగవానంశేన జగదీశ్వరః॥' (28) 'స కథం ధర్మసేతూనం వక్తా కర్తాభిరక్షితా। ప్రతీపమాచరద్బ్రహ్మన్ పరదారాభిమర్శనం॥' (29) 'ఆప్తకామో యదుపతిః కృతవాన్ వై జుగుప్సితం। కిమభిప్రాయ ఏతన్నః సంశయం ఛింది సువ్రత॥' (భాగ. 10. 33. 30) మత్తకోకిల॥ ధర్మకర్తయు ధర్మభర్తయు ధర్మమూర్తియునైన సత్కర్ముఁ డీశుడు ధర్మశిక్షయు ధర్మరక్షయు జేయగా, నర్మిలిన్ ధరమీద బుట్టి పరాంగనా జన సంగమే, ధర్మమంచు దలంచి చేసె సుదాత్తమానస చెప్పుమా'

44. Dr. S Radhakrishnan : Indian Philosophy, Vol. 1, p. 494

(ఆం. భాగ. పూ. 10.1102) అని పరీక్షిన్మహారాజు వాక్యములచే విదితము. దానికి, అజన్మ బ్రహ్మచారియు, అవధూతయునగు శుకబ్రహ్మ బాలచక్కని సమాధానము నొసంగెను. 'గోపీనాం తత్పతీనాం చ సర్వేషాం చాపి దేహినాం। యోఽంతశ్చరతి సోఽధ్యక్ష ఏష క్రీడన దేహభాక్॥' (భాగ. 10. 33. 37) అ॥ గోపజనములందు గోపికలందును, సకల జంతులందు సంచరించు, నా మహాత్మునకు బరాంగనలెవ్వరు, సర్వమయుడు లీల సలిపెగాక!' (ఆం. భాగ. పూ. 10.1103) అంతియగాక నీ సందేహము, సర్వ సామాన్యముగ నెల్లర విషయమునగూడ గలుగుచుండును. ఏ దృష్టితోనైనను స్త్రీపురుషులొక్కచో నున్న, అందు బవిత్రార్థముల గైకొనక, సామాన్య మానవులు నైచ్య దృష్టి గాంచుట లోకమున బరిపాటే. అన్నచెల్లెండ్రగూడ బవిత్ర దృష్టుల గాంచనేరదు ప్రపంచము. అట్టిచో, నిత్యము యువతుల గూడియుండిన గోపాలుని నిందించుటయందాశ్చర్యమేమి? బాలుడు ఏకాంతమున నేకకాంతతో నుండునో, షోడశ సహస్రాధిక యువతులతో నుండునో విచారణీయాంశము. మరియు కృష్ణుని బాల్యక్రీడలన్నియు బాల్యమున జరిగినవని మాత్రము విస్మరింపరాదు. కంసు సంహరింపబోయిన బలరామకృష్ణులు 'పసిబిడ్డలు' (ఆం. భాగ. పూ. 10.1327), 'చిన్ని కుమారులకు' (ఆం. భాగ. పూ. 10.1351), 'వల్లవ బాలకులని' (1367) మొదలగు స్థలముల సూచించిన ప్రకారము, శ్రీకృష్ణునకు చాల చిన్న వయస్సుండునని విదితము. అప్పటికి విద్యాభ్యాసమునగూడ వారు ప్రవేశింపలేదు. అందుచే వారికి పది పండ్రెండు వత్సరములకంటె నధికముండదని నిశ్చయము. కంసవధానంతరమున వారికి సాందీపునివద్ద విద్యాభ్యాసమునకు అవకాశమేర్పాటు అయినట్లును భాగవతము (పూ. 10.1408) తెలుపుచున్నది. కావున నంత చిన్న

వయస్కుడైన శ్రీకృష్ణుడు, వ్యభిచార ప్రవృత్తుడై యుండెననుట యుక్తిబాహ్యము.

మరియు శ్రీకృష్ణుడు జారుడై, గోపికాజనులు జారిణులై యున్నచో నీ గ్రంథము ముక్తిదాయకమని అలౌకికానందవిభూతి వెలుగు శుకయోగీంద్రుడు, మరణింప సంసిద్ధుడై, శ్రీమన్నారాయణ పుణ్యకథాశ్రవణ కౌతూహలుడై యున్న పరీక్షిన్నృపతికెట్లు బోధించును? అట్టి హరికథా వివరణ గ్రంథము నొండు రచించితివేని నీకు శాంతిగలుగునని నారదమహర్షి చంద్రుడు అష్టాదశ పురాణముల రచించియు దృప్తిగాంచని వ్యాసభగవానునకెట్లు ఉపదేశించును? నిత్య బ్రహ్మానుభూతి వెలుంగుచు దిగంబరుడై గ్రుమ్మరుచున్న శుకబ్రహ్మకు సమస్త శాస్త్రవేత్త యగు వ్యాసుడెట్లు దీని బోధించును? సత్రయాగ వ్యాజమున సమావేశమైన మౌనిపుంగవుల నుద్దేశించి, యీ శ్రీకృష్ణ కథామృతమును సూతమహర్షి ఎట్లు బోధించె? వారెట్లు ఆ పవిత్ర సమయమున దీని నాకర్ణించియుండిరి?

ఇదేవిధముగ నీ భాగవత శాస్త్రముయొక్క వక్తృ శ్రోతృ పరంపరగలవారందరును మహర్షిపుంగవులేయై యున్నారు. నిత్యబాలకులై, మాయాతీతులైయున్న సనక సనందాదులేమి, సాంఖ్యాయన పరాశరాదులేమి, బృహస్పతి మైత్రేయాదులేమి, ఎల్లరు మోక్షనక్తులై, విరక్తులై నిత్య సాధనమగ్నత నున్న తపోధనులుగదా! ఇక దీన నపవిత్రత ఎట్లుండగలదో! ఉన్నచో నది, చూపరుల దృష్టి దోష మని నిశ్చయము. అందుచేత భాగవత కృష్ణుని అనాద్యునిగను, దోష భూయిష్ఠునిగను జూచి, భారత కృష్ణునికిని యీతనికి వ్యత్యాసమేర్పరచి,

యువురస్త్రీలనుటగాని, ఒక్కరైనను, కృష్ణుడు జార చోరశిఖామణి యనిగాని తీర్మానింపనెంచుటయే దోషసంయుక్తము.

అట్లుగాక, The legends about Krishna's questionable acts appear to have their origin in the Rig-Veda, which represents Vishnu as a Kuchera (performer of bad deeds) 45 శ్రీకృష్ణునిగూర్చిన దుష్ట ప్రవర్తనము, వేదముల విష్ణువు కుచరుడని పరిగణింపబడియుండు విషయమునుండి పుట్టించియుండు నని హేమచంద్రపండితుని భావము. శ్రీకృష్ణుని లీలల బూర్వులెట్లు అన్యయార్థముల గల్పించి అతిశయోక్తిగ రచించియుండిరో అట్లే అధునికులుగూడ నా బాలగోపాలుని చర్యలయందనేకాన్యయముల గల్పించి, విస్పష్ట విషయముల సంక్లిష్టము గావించిరి. కాళీయమర్దన గాథను గైకొని, అభౌతికములను శాస్త్రకారులు కల్పింపగా, Lat r on, the Krishna Cult became superior to the lower f rm of worship of snakes and serpants and the Vedic worship of Indra 46 తర్వాత వేదమునగల ఇంద్రారాధనమునకును, అల్పములైన సర్పాదిక అర్చనమునకును కృష్ణమతము ఆధిక్యతను సంపాదించెను. Sister Nivedita writes: Krishna conquers the snake Kaliya—. Here is the same struggle that we can trace in the personality of Siva as Nageswara, between the new devotional faith and the old traditional worship of snakes and serpants 46 కృష్ణుడు కాళీయుని జయించెను.

45. D. C. Sarcar: History and Culture of the Indian People, Vol. 2, p. 440

46. Dr. S. Radhakrishnan: Indian Philosophy, Vol. 1, p. 88

సర్పారాధనల బూజించు సాంప్రదాయిక ప్రాచీన మతములకును, నూతన భక్తివిధానమునకు గల సంఘర్షణము వ్యక్తము. శివుడే నాగేశ్వరుడని విదితము. అనగా శైవమును, శ్రీకృష్ణుడు కాళీయ మర్దన ముఖమున నడంచెనని యని తాత్పర్యము. The cult of Krishna surercedes both animistic superstitions and Vedic retualism. The dance of Krishna on the head of Kaliya means the suppression of the worship of nagas or serpants by that of Krishna 47 కృష్ణమతము వైదికమైన మూఢాచారముల ద్రోసివైచెను. కాళీయుని దలపై కృష్ణుని నృత్యము, నాగారాధనమును, కృష్ణమతము ద్రొక్కివేయుటను సూచించుననియు రాధాకృష్ణ పండితుని తాత్పర్యము. కృష్ణుడు యింద్రుని జయించుటయు, వైదిక మతమును కృష్ణమతము అప్రధానమొనర్చుటయనియు నాతని సిద్ధాంతము. కాని అట్టి ప్రచారము భాగవతమున జరిగినట్లు గాని, కృష్ణుడు బోధించినట్లుగాని గానరాదు. గీతాశాస్త్రమునగూడ వైదికమైన యత్నముల గావింప శ్రీకృష్ణుని ఆదేశము. 'సహ యజ్ఞాః ప్రజాస్సృష్ట్వా పురోవాచ ప్రజాపతిః। అనేన ప్రసవిష్యధ్వమేషవో౽స్త్విష్టకామధుక్॥' (3.10) పూర్వము ప్రజాపతి యజ్ఞములతోడ ప్రజలను బుట్టించి, 'మీరు యజ్ఞమువలన ప్రజలను బుట్టింపుడు. మీకది కోరిన కోరికల నొసంగును' అని అతడు వారికి వచించెను. 'దేవాన్ భావయతానేన తే దేవా భావయంతు వః। పరస్పరం భావయంత శ్రేయః పరమవాప్స్యథ॥' (3.11) ఈ యజ్ఞముచేత నింద్రాది దేవతలను మీరు భావింపుడు. వారు మిమ్ము భావించెదరుగాక! ఇట్లొకరి నొకరు భావించుటవలన బరమ శ్రేయస్సు గలుగును అనిగదా గీతా

47. Dr. S. Radhakrishnan : Indian Philosophy, Vol. 1, p. 485

శ్లోకములు: ఇట నింద్ర ద్వేషమునైన శ్రీకృష్ణుడు వ్యక్తపరుపక, నింద్రాది దేవతల యజ్ఞపూర్వకముగ దృప్తిపరుప యాన నొసంగి యున్నాడు. ఇట బ్రహ్మప్రస్తావనముగూడ గలదు. భాగవతమున నోటమి నొందిన చతుర్ముఖుని ద్వేషింపక గొనియాడియున్నాడు కృష్ణుడు. అందుచే బాలకృష్ణుని లీలలలో నంతరార్థముల గల్పించుట లోపభూయిష్టమనకదప్పదు.

యథార్థమున భాగవత కృష్ణుడు, భారత కృష్ణునివలె మానవ మాత్రుడే యగును. బౌద్ధ, జైన, సంప్రదాయములగూడ శ్రీకృష్ణ వాసుదేవుడు, మానవమాత్రుడైన మహాయోధుడు.[48] శ్రీ త్యాగీశానందుని వివరణము ప్రకారము ఈ సర్వోత్తమతత్త్వవేత్త, ప్రేమ తత్త్వస్వరూపము. శ్రీకృష్ణుడు, Born in a prison, brought up by cow herds, subjected to all kinds of tyranny by the most despotic monorch of the day, and derided by the orthodox, Krishna still arose to be the greatest saint, philosopher, and reformer of his age[49] చెరసాలలో జన్మించి, గొల్లవారిచే పెంపబడి, నాటి నిరంకుశ పాలకునిచే వివిధ కష్టములకెరయై, ఆచారవంతులచే నిరసింపబడి యుండియు శ్రీకృష్ణుడు, ఆ కాలమున సర్వోత్తమ బ్రహ్మవిదుడుగను, తత్త్వజ్ఞుడుగను, సంస్కర్తగను అభివృద్ధి చెందగలిగెను. మరియు, All the greatest sages and most immaculate saints of his time pay him divine honours; they consider him the best and most

---

48. Prof. Hemachandra Roy Chaudhury : Materials for the Study of the Early History of the Vaishnava Sect, p. 35

49. Swami Tyagisananda : The Cultural Heritage of India, Vol. 3, p 299

perfect among the spiritual men of his age, and with one voice acclaim him as divinity manifest on earth, looking up to him for light and guidance 49 అతని కాలమున గల సకల ఉత్తమ ఋషీశ్వరులును, పవిత్ర మునిశ్రేష్ఠులును, అతనికి దైవిక గౌరవముల నర్పించిరి. అతని, ఆ కాలమున సర్వోత్కృష్టమును, అతి సంపూర్ణమును నైనవానిగ బరిగణించి, ఏకోన్ముఖముగ నతని భూతలమున నవతరించిన భగవంతునిగ బ్రకటించి, ఆతనినుండి జ్ఞానవికాసముల నర్థించుచుండిరి. In him we find the ideal house-holder and the ideal sannyasin, the hero of a thousand battles who knew no defeat, the terror of despots, sycophants, hypocrites sophists and pretenders, the master statesman, the uncrowned monorch, the king-maker, who had no ambition for himself 49 ఆదర్శ గృహస్థుడును, ఆదర్శ సన్న్యాసియు, అపజయము నెరుగని సహస్రాధిక రణరంగమహావీరుని, నిరంకుశులకు, వంచకులకు, కుతార్కికులకు, నటకులకు భయంకరుడుగను, కౌశల్యముగల రాజకీయ వేత్తను, కిరీటములేని చక్రవర్తిని, అభిలషింపని రాజనిర్మాతను, అతనిలో మనము గాంచగలుగుదుము. అతడు పేదలకు, దీనులకు, బాధితులకు మిత్రుడు. అతనిలో జ్ఞాన భక్తి కర్మ యోగములు చక్కని మేళనమును బొంది, head heart and hand బుద్ధి హృదయ హస్తములు ఏకస్వనములై యొప్పారినవి. The philosophy of such a man cannot but be an inspiration to all who study it, and the Bhagavata, which records and illustrates

49. Swami Tyagisananda : The Cultural Heritage of India, Vol. 3, p. 299

his teachings is, in the words of Sri Ramakrishna, sweet as cake fried in butter of wisdom and soaked in honey of love 49 ఈ మహాపురుషుని తత్త్వజ్ఞానము చదువరులకెల్లరకు, ఉత్తేజకరముకాకుండ నుండజాలదు. ఆతని యుపదేశముల గ్రోడీకరించి ప్రదర్శించిన భాగవత శాస్త్రము శ్రీరామకృష్ణుని వాక్యములలో, 'వివేకమనెడు వెన్నతో గాల్చబడి, ప్రేమ నాబడు తేనెలో నాన్పబడిన కొజ్జైవంటి' దగును. ఈ వాక్యముల త్యాగీశానందులు చాల చక్కాగ, శ్రీకృష్ణుని గొప్పదనమును క్రోడీకరించి వచించియున్నాడు.

ఈ భాగవతమునగాక, నతఃపూర్వము పూర్వోక్తచందమెందరో కృష్ణులు, వాసుదేవులున్నను, వారికి భాగవత, భారత కృష్ణునికి గలిగిన గౌరవము ఎచ్చటను గానరాదు. పండిత రాధాకృష్ణుడు వచించుకిరి It is clear that from the time of the Vedic hymns down to the Upanishad period there was a tradition about Krishna as a Vedic thinker 50 వేద సూక్తములనుండి ఉపనిషత్తుల కాలమువరకు వేదవేత్తగ కృష్ణునికి, ప్రఖ్యాతి కలుగుట విస్పష్టము. కాని విల్సన్ వచించుచందము కృష్ణుని దైవసమానునిగ అర్చించు విధానము Utterly unknown to the primitive texts of the religion of the Hindus 51 హిందూమత ప్రాచీన గ్రంథముల సంపూర్తిగ నభావము.

---

49. Swami Tyagisananda : The Cultural Heritage of India, Vol. 3, p. 299

50. Dr. S Radhakrishnan : Indian Philosophy, Vol. 1, p. 493

51. Dr. H. H. Wilson : Rig Veda, Vol 3, Intro. p. XX

అయినను, యీ అసాధారణ మహాపురుషుడు ఆవిర్భవించి, మానవకోటిని బునీతమొనర్పుటచే, The writer of the Bhagavata was not content to call an Incarnation but says, 'The other Incarnations were but parts of the Lord. He, Krishna was the Lord Himself' 52 భాగవత గ్రంథ కర్త అతని కేవలము అవతారుడని సంతృప్తి జెందక, సర్వేతరావతారములు అతని భాగములును, శ్రీకృష్ణుడు సాక్షాత్తు బరమాత్మయే యని వచించెను. ఎందుచేత? It is not strange that such adjectives are applied to him when we marvel at the many - sidedness of his charactar 52 అతని మూర్తిమత్వమున నట్టి సర్వవిధ వ్యక్తిత్వమునకు మనము ఆశ్చర్యచకితుల మగుచుండ, నతనికి అట్టి విశేషణముల నన్వయించుటయందాశ్చర్యము లేదని వివేకానందుని సముచిత వచనము. అంతియగాక Krishna is not the authority of the Vedas, but the Vadas are the authority of Krishna himself 53 వేదములకు కృష్ణుడు ప్రమాణముకాక కృష్ణునకు వేదములు ప్రమాణములుగ నుండును. అది అద్భుత పరిణామముగదా!

ఈ విధముగ శ్రీకృష్ణ స్వరూప నిర్మాణమున, భాగవతము గోకుల బృందావనములు సాధనరంగములై, యాతనికి అమానుష కీర్తిని సంపాదించి, ఆ స్వల్ప సంఘమునకేకైక మూర్తియై రాజిల్ల, కంస సంహరణానంతరము మధురా నివాసకాలమున, సద్గురు చరణ

52. Swami Vivekananda : The Complete Works, Vol. 3, p. 256

53. Swami Vivekananda : The Complete Works, Vol. 3, p. 246

సన్నిధి విద్యారంగమున సకల విద్యానిధిగ నొనర్చి, వేదవేదాంగ వేదాంతవిద్యా పారంగతునిగ నాతని గావించెను. అంత, మహాభారత మున నాతడు, ప్రపంచరంగమున దుమికి, సర్వత్ర తానయ్యై, సర్వ సమస్యల దీర్పు పెద్దయ్యై, పూర్వోక్తవిధానమున సర్వతోముఖ మహా వ్యక్తిగ నవసరముల ననుసరించి, కాలములకనుగుణముగ బరిణ మించెను. అవకాశములు కలుగువేళల, వాని, కౌశలమున స్వీకరించి, యుపయోగించుకొని, పరిణమించి, సంఘమునుగూడ బరిణమింప జేయగల్గుటయందేగదా గొప్పదనము ఇమిడియున్నది! కురు పాండవ స్పర్ధయే లేనిచో గృష్ణుడు యంతటివాడు గాకుండునేమో! గొల్లపల్లె నివాసమే లేకున్నచో నంత ఆకర్షవంతుడు కాగలుగువాడు కాదేమో! రాజాధిరాజులు తనకు తలలొగ్గకున్నచో దానె చక్రవర్తి కా, యాశ జనించి కిరీటములేని చక్రవర్తి కాజాలడేమో! అయినను, సామాన్యు లకు విషమ ఘట్టముల, నా మహామేధావి తనకుపయుక్తములుగ రూపొందించుకొని, వాని నధిగమించి, ప్రజ్ఞాధురీణుడై, మహాపురుషుడై, సంపూర్ణ అవతారమని ప్రఖ్యాతి నొందియుండెను శ్రీకృష్ణభగవానుడు. అదియే ఆ ప్రజ్ఞాశీలిలో నున్న మహాత్మ్యము.

## రచయితలు - చరిత్ర

కాని, మన భారతీయ విధానము ననుసరించి, యీ మహా పురుషుని చరితా కథనమున, రచయితలు కొన్ని అభూత కల్పన ముల గావించి, సమస్యల అధికతర క్లిష్టత్వమును, గలవరమును గలుగజేసిరనుట సత్యము. అతఃపూర్వ గాథల గొన్నింటిని శ్రీకృష్ణ చారిత్రమునకు అనుసంధించి, యనేక విచిత్ర కథావళుల రచయితలు

కల్పించిరి. అట్టివి ముఖ్యముగ భాగవత పురాణమున అత్యధికము. అందుచేతనే భారత కృష్ణుడు, ద్వారకాధిపతియై మానవత్వము సంపూర్ణత్వము నొందిన పురుషుడుగనుండ, భాగవత కృష్ణుడు పుట్టుకతోడ అవతారపురుషుడై, అమానుష కార్యనిర్వహణమున అజేయుడై యలరారును. అతనిలో మానవత్వముకంటె దేవత్వమెక్కువగ ప్రతిబింబించుచుండును. అందుచే నందు అతిశయోక్తులకవకాశము లేకపోలేదు. కాని, ఆ యతిశయోక్తులకాధారమైన కథావస్తువులనుగూడ నసందర్భముగ త్రోసిపుచ్చక, సత్యత్వమును పరిశీలించి గైకొనుట ముఖ్యము. అతడు రాక్షసుల పరిమార్చుటయందధికముగ నతిశయోక్తులు కాననగును. అటులే అతని నధికుని గావింప ఇంద్ర బ్రహ్మాదులనే అతని ప్రత్యర్థులుగ దింపి, వారి పరాభవించి భాగవత కర్త పంపివైచెను. ఇట్టి ఘట్టములలో సత్యమును స్వీకరించుట ఉచితము. ఈ విషయమునుగూర్చి వివేకానందుడు In ancient times, there was very little tendency in our country to find out truths by historical research [54] ప్రాచీన కాలమున చారిత్రక పరిశీలనముచే సత్యముల గ్రహించుట, మన దేశమున అభావవిషయము. మహాపురుషునికి గౌరవాధిక్యమును గలుగజేయ, ననేక అభూతకల్పనముల గావించుట సహజము. అటులే శ్రీకృష్ణుని విషయమునగూడ జరిగియుండునని, వివేకానంద యతివరేణ్యుడు తలంచెను.

అంతియగాక నా రచయిత గ్రంథమును రచించి, దానికి తన కర్తృత్వమును పొందుపరుపక, పూర్వకాలికమైన ఒక మహావ్యక్తి

---

54. Swami Vivekananda: The Complete Works, Vol. 4, p 99, 100

నామమును గర్తగ నుంచును. దానివలన రచన కాలనిర్ణయమున గవేషణాశీలునకు అత్యధిక సంక్షోభము గలుగుచున్నది. అంతటితో నూరకుండక, గొందరు కర్తలు చతురులై, తమ తమ అభిప్రాయముల ప్రత్యేకముగ గొన్ని శ్లోకముల నిర్మించి, గ్రంథమును మార్పు చెందనీయకయే అందందు జొన్పి, పూర్వగ్రంథముల గళంకితము గావించియుండిరి. అట్టి భాగములను ప్రక్షిప్తములందురు. ఆ విధముగ, మన ప్రాచీన గ్రంథముల నసంఖ్యాక ప్రక్షిప్త వచనములు గలవని విజ్ఞులనుడి. అట్టిచో నార్షగ్రంథ పరిశీలనము, తదాధారభూత గవేషణము చాల క్లిష్టమై, వివిధ విభిన్నాభిప్రాయములకు దారి దీయుచున్నది.

ఆ విధముగ శ్రీకృష్ణ చారిత్రమున ఆర్ష గ్రంథముల నిట్టి కల్పితములు, ప్రక్షిప్తములు బహుళముగ నుండుటచే సత్యా సత్యముల నిర్ణయింప గడుంగడు గష్టసాధ్యముగ రూపొంది యున్నది. పూర్వము కృష్ణ శబ్ద విచారణము గాంచియున్నాము. 'శ్రీకృష్ణ' నామము శ్రీకృష్ణునకు ముఖ్య నామమో, సర్వ నామమో, అన్వయ నామమో తీర్మానింప గష్టతరము. అయినను దానికి బండితులు అగణిత వ్యుత్పత్తులగూడ గల్పించిరి. 'సర్వం కరోతీతి కృష్ణః' (1.18) సర్వమును జేయువాడు కృష్ణుడనియు, 'కర్షతి చిత్తమితి కృష్ణః (1.158) చిత్తము నాకర్షించువాడు కృష్ణుడుగ గురుబాల ప్రబోధికా గ్రంథము తెలుప, 'కృషిర్భూవాచకః శబ్దో 'ణ' శ్చ నిర్వృతి వాచకః। తయోరైక్యం పరంబ్రహ్మ కృష్ణ ఇత్యభిధీయతే॥' (౧) 'కృష్' భూ అనగా శక్తికన్వయింప, 'ణ' నిర్వృత్తిరూప ఆనంద మునకన్వయించును. ఈ రెండింటి ఐక్యము పరంబ్రహ్మముగాన నదియే

కృష్ణ శబ్దమునకర్థముగ గోపాలపూర్వతాపిన్యుపనిషత్తు వచించుచున్నది. 'కృషామి మేదినీం పార్థ భూత్వా కార్ష్ణాయసో మహాన్। కృష్ణో వర్ణశ్చ మే యస్మాత్ తస్మాత్ కృష్ణోహమర్జున॥' (శాంతి. 342.79) 'గర్షణక్రియ భూమి గావింతు, జాయము కృష్ణంబు గావున గృష్ణ డనియు' (ఆం. మహాభారత శాంతి 6.432) అనియు మహాభారత వచనము. 'కృష్' శబ్దము సద్వాచకమై, 'ణ' శబ్దము ఆనంద వాచకమైనది. అందుచే గృష్ణ శబ్దము 'సదానంద' రూపమై, పర బ్రహ్మమునకన్వయముగ వల్లభాచార్యుని నిర్వచనము. అతడే ఉపనిషత్తుల బ్రహ్మముగను, స్మృతులలో బరమాత్మగను, భాగవతమున భగవానుడుగను వ్యవహరింపబడెను అనియు, నయ్యాచార్యవర్యుని నిశ్చయము. కృష్ణునికి కృష్ణ శబ్దము గోత్రనామమై, అధికముగ నుపయుక్తమగుచున్న వాసుదేవ నామమే, అతని ప్రధాన నామమై యుండెనని, భండార్కరు పండితుని తాత్పర్యము. 55 ఈ విధముగ గృష్ణ నామము పలువిధ నిర్వచనములకెరయై యొప్పారియున్నది.

## శ్రీకృష్ణ నామములు

అటులే, శ్రీకృష్ణునికన్వయించుచున్న వివిధ నామములుగూడ సంశయాస్పదములు. కొంతవరకు శ్రీకృష్ణ నామమే ప్రధాన నామమై యొప్పారునేమోగాని యితర నామములన్నియు, అన్వయార్థకములనిపో తోచెడివి. Krishna's names Govinda, Gopala, Gopindra etc., may really be connected with the epithet 'Gopa' applied in the Rig-Veda to Vishnu, the Brahmanic God, with whom Krishna came to be identified త్రిణి

55. Prof. Hemachandra Roy Chaudhury: Materials for the Study of the Early History of the Vaishnava Sect, p. 22

పదా వి చక్రమే విష్ణుర్గోపా అదాభ్యః' (ఋ. వే. 1. 22. 18) Gopa : protector of cows 56 శ్రీకృష్ణ నామములైన గోవింద, గోపాల, గోపేంద్ర మొదలైనవి, ఋగ్వేదమున బ్రాహ్మణ దైవమైన విష్ణువునకన్వయింపబడిన 'గోప' శబ్దమునకు సంబంధించియుండును. కాలాంతరమున విష్ణు కృష్ణులకేకత్వము జేయబడినది. గోప యనగా గోపాలకుడు, గోరక్షకుడుగ యర్థము అని పండిత హేమచంద్రుని వాక్యము. అదేవిధముగ We know that several Vedic epithets of Vishnu were in the epics and the Puranas applied to Krishna - Vasudeva. Sipivishta (Rig-Veda 8.100.5,6)., (మహాభారత. 12 43. 8, 342, 272,73) 56 విష్ణువునకు వేదమున గల అనేక విశేషణ పదములు, పురాణములలో కృష్ణ వాసుదేవునకు అన్వయించెను. వేదమునగల శిపివిష్ట విశేషణము, మహాభారతమున కృష్ణునికన్వయింపబడెను. శిపివిష్ట యన దుష్టచర్ముడు అనియు, బట్టతల గలవాడనియు అర్థము.

పూర్వ సౌరభ భాగమున, వైదికములైన విష్ణు నారాయణాది పదముల బుట్టుపూర్వోత్తరముల నొకించుక విమర్శించి గ్రహించికొనియున్నారము. విష్ణువు వైదిక దేవతయై, ఇంద్రునికి మిత్రుడై, ఆతనికి యుద్ధకాలముల యండయై నిలిచినట్లు వేదముల గోచరము. కాలాంతరమున నీతడే 'భగ' శబ్ద వాచ్యుడైన పరదైవముతో నేకీభూతుడై, భగవానుడై, భగవాన్ శ్రీమహావిష్ణువై, భాగవతమున ప్రధాన దైవమై, కాలాంతర వైష్ణవమునకారాధ్య అధినాథుడై విరాజిల్లియున్నాడు.

---

56. Prof. Hemachandra Roy Chaudhury : Materials for the Study of the Early History of the Vishnava Sect, p. 28 (13)

అదేవిధముగ 'నారాయణ' శబ్ద వాచ్యుడైన ఒక ప్రాచీన ఋషివర్యుడు తపోగరిమచే ప్రముఖుడై, సర్వగుడై, సర్వభూత స్వరూపుడై, had come to be worshipped as God Himself 57 భగవంతుడుగ నారాధింపబడజొచ్చెను. క్రమముగ విష్ణువు సర్వశక్తి సంపన్నుడై, అవతారముల దాల్చు తత్త్వమై, ఈ నారాయణునితో నైక్యత్వమొనరింపబడి నారాయణుడు విష్ణువుగా నయ్యెను. 57 Similarly, Vasudeva, who was till then just a hero, was accepted as God, descended on earth - Avatara 57 అటులే, అంతవరకు సామాన్య వీరునివలె నున్న వాసుదేవుడు భగవదవతారముగ స్వీకరింపబడెను. Later, Narayans, Vasudeva and Vishnu, all these became Hari, the Deity Eternal and Supreme Lord, the Supreme Spirit; 'Vasudeva comprehending all' 57 అంత నారాయణ, వాసుదేవ, విష్ణువులు మువ్వురు నిత్య పరమాత్మ తత్త్వమైన హరిగ నైరి. 'సర్వ ప్రజ్ఞత్వమే వాసుదేవత్వముగ' అన్వయము. మరల కాలక్రమమున Vasudeva-Krishna, the hero of the Mahabharata and the deity of the Yadava cult, was identified with the earlier Vasudeva, possibly, by the end of this period 57 మహాభారత యోధుడును, యాదవమత అధిదైవమును అయిన వాసుదేవ కృష్ణుడు, యీ పూర్వ వాసుదేవునితో, నా భారత కాలాంతరమున నైక్యపరుపబడియుండునని, మున్షీ మహాశయుని అభిప్రాయము.

వాసుదేవ నామము విష్ణువునకన్వయించుట, సంహిత బ్రాహ్మణ ఉపనిషత్తులలో నెందును గానరాదని హేమచంద్రుడు వచించుచు,

57. Sri K. M. Munshi: History and Culture of the Indian People, Vol. 2, p. xi.

గా వాసుదేవ పద వ్యుత్పత్త్యర్థముల దెలిపెను. 'వసనాత్ సర్వభూతానాం వసుత్వాద్దేవయోనితః। వాసుదేవ స్తతో వేద్యో బృహత్త్వాత్ విష్ణురుచ్యతే॥' (భారత. 5.70.3) మాయావనికచే సర్వజీవుల నావరించి యుండుటచేతను, కాక అతని అద్భుత ప్రభావముచేతను, కాక దేవతల కాధారమై యుండుటచేతను, యితడు వాసుదేవుడనబడెను అని మహాభారతము. మరల 'ఛాదయామి జగత్ విశ్వం భూత్వా సూర్య ఇవాంశుభిః। సర్వభూతాధివాసశ్చ వాసుదేవ స్తతో హ్యహం॥' (భారత. 12.341.41) సూర్యరూపము దాల్చి నేను విశ్వమును నా కిరణములచే గప్పివైచెదను. సర్వభూతాధివాసుడనౌటచేత, నేను వాసుదేవుడనని విదితము అనియు భారత వచనము. ఈ విధముగ సర్వభూతముల నావరించి, వాని యునికికి నాధారుడై యున్న తత్త్వమే వాసుదేవ శబ్ద అన్వయముగ మహాభారత తాత్పర్యము. అటులే 'స ఏష శాశ్వతో దేవః సర్వగుహ్యమయః శివః। వాసుదేవ ఇతి జ్ఞేయో యన్మాం పృచ్ఛసి భారత॥' (భారత. 6.66.38) ఎవడు శాశ్వతుడై, దేవుడై, అద్భుతుడై మంగళకరుడో, అతడే వాసుదేవుడనియు మహాభారత నిర్వచనము. విష్ణుపురాణాది గ్రంథములుగూడ వాసుదేవ పదమును కేవలము పరమాత్మ స్వరూపముగా వర్ణించియున్నవి (1.2.10). R. G. Bhandarkar భండార్కరు పండితుని తాత్పర్యమున, వాసుదేవ కృష్ణులు అన్యులై యుండిరి. వాసుదేవుడు, యాదవులు వృష్ణికులజులు నాబడు క్షత్రియ వంశమునకు జెందినవాడు. అదియే సాత్వతవంశమనియు ప్రఖ్యాతి. అతడు ఒక మతము స్థాపించి యుండెను. కాలక్రమమున అతడు మహర్షి యని ప్రశస్తిగాంచిన,

ప్రాచీన కృష్ణునితో నైక్యము గావింపబడినట్లుగ నీతని భావము. 58 కాని కృష్ణ నామమువలె వాసుదేవ నామముగూడ వేదమున ప్రసిద్ధము. తైత్తిరీయారణ్యక దశమ ప్రపాఠకమున, 'నారాయణాయ విద్మహే। వాసుదేవాయ ధీమహి। తన్నో విష్ణుః ప్రచోదయాత్॥' అను గాయత్రీ మంత్రము గోచరము. ఇట నారాయణ, వాసుదేవ, విష్ణు శబ్దముల కేకత్వము ప్రస్ఫుటముగ వచింపబడినది. కాని పూర్వ గ్రంథముల స్పష్టపరుపబడినట్లు యిట్టి యూహాగానములు అనావశ్యకము. భాగవత పురాణము ననుసరించి, దేవకీ వసుదేవుల సంజనితుడగుటచే దేవకీ పుత్రుడనియు, వాసుదేవుడనియు, శ్రీకృష్ణుడు వ్యవహరింపబడుటయం దాశ్చర్యము లేదు. నామసామాన్యత్వము నాధారముగ బై వ్యుత్పత్తులును, సంబంధములును అల్లబడియున్నవని విదితము. కాలక్రమమున నీ వాసుదేవ శబ్దము, భాగవతమున సాధకులకు ముఖ్యమైన, 'ఓం నమో భగవతే వాసుదేవాయ' అను మంత్రరాజమున స్థానము నార్జించి, పూజ్యత గాంచియున్నది. అదియు బార్హ్వక్తరీతి శ్రీకృష్ణుని కన్వయనామమై సర్వోపయుక్తముగా వెలుగొందినది.

## వృష్ణి, సాత్వతములు

వృష్ణివంశము సాత్వతవంశముగ బేర్కొనబడినదగుటచే, నందు ప్రఖ్యాత జన్ముడైన శ్రీకృష్ణుడు 'సాత్వత పతిం' (భాగ. 10. 69. 13) 'భగవాన్ సాత్వతాం పతిః' (భాగ. 1. 1. 12, 1. 2. 15) అనియు గీర్తిగాంచెను. అందుచే 'హంసః కూర్మశ్చ మత్స్యశ్చ వామనో రామ ఏవ చ। రామో దాశరథిశ్చైవ సాత్వతః కల్కిరేవ

58. Prof. Hemachandra Roy Chaudhury : Materials for the Study of the Early History of the Vaishnava Sect, p. 19

చ॥' అని, శాంతిపర్వమున (339. 103, 104,) మహాభారతము, శ్రీకృష్ణుని ఎనిమిదవ యవతార స్థానమున సాత్వతునిగ వివరించి యున్నది. సర్వ సాత్వత ముఖ్యులలో ద్వారకాధిపతియే ముఖ్యుడు అనియు (330. 101) యందు గీర్తించియున్నది. భాగవతముగూడ 'అత్ర సంకీర్త్యతే సాక్షాత్ అనాదినిధనో హరిః। నారాయణో హృషీకేశో భగవాన్ సాత్వతాం పతిః॥' (12.12 3) ఆ హరియే, నారాయణుడే, భగవానుడైన సాత్వతపతి యని స్తుతించి, 'కృష్ణస్తు భగవాన్ స్వయం' కృష్ణుడే స్వయముగా భగవంతుడు అని కొనియాడి నది. అట్లుద్భవించిన సాత్వత మతము 'ధర్మం చ మత్తో గృహ్ణీష్వ సాత్వతం నామ నామతః' (శాంతి. 348. 29) సాత్వతము నాబడు నామమున నుండు ధర్మమును, నా నుండి గ్రహింపుము అనియు, 'నిరాశీః కర్మసంయుక్తః సత్త్వతశ్చాప్యకల్మషః। సాత్వతజ్ఞాన దృష్టోఽహం సత్త్వతామితి సాత్వతం॥' (శాంతి. 342. 78) అనియు, బహుముఖాన్వయముల బొంది ప్రసిద్ధి గాంచినది. దీనినే పాంచరాత్ర ముగగూడ నన్వయము గాంచనగును.

శ్రీకృష్ణునకు సామాన్యముగ నన్వయించు భగవాన్ పదము గూడ, గడు ప్రాచీన చారిత్రము గలిగియున్నది. ఈ విషయము సౌరభము సప్తమ భాగమున గొంత తిలకించియున్నారము. వేదముల నుపదేవతగ నున్న 'భగు' డు క్రమముగ వరప్రదాతగ రూపొందెను. అందుచే నతడుత్తముడుగగూడ యశస్సు గాంచెను. అంత భగుడు అంతర్ధానుడై అతని శ్రేష్ఠత్వమే నిలచి, 'భగ' శబ్దము, శ్రేష్ఠత్వ మును సూచించు పదముగ బరిణమించెను. అందుచే 'భగ' నాబడు శ్రేష్ఠత్వము గలవాడు, భగవానుడుగ అర్థము పుట్టొందెను. ఐశ్వర్య

ధర్మ యశో సంపత్ జ్ఞాన వైరాగ్యములు 'భగ' పదమునకన్వయింప, వాని బొందినవాడు భగవానుడుగ విష్ణుపురాణాదులు నిర్వచించెను. అందుచే నీ షడ్గుణముల, ననగా షడైశ్వర్యములచే నలంకృతుడైన శ్రీకృష్ణుడును భగవానుడై యొప్పారెను. అట్టి భగవానుని అర్చించి, సాక్షాత్కారము నొంద నవకాశమిడు మతము భాగవతముగ నమర్యెను. అట్లుకాక, సాక్షాత్తు భగవానునిచే స్థాపింపబడుటచే భాగవత మతము నాబడినదనియు దలంపు.

## శ్రీకృష్ణ స్వరూపము

ఈ విధముగ శ్రీకృష్ణుడు, వివేకానందుని వచనములలో was great as a son, as a king, as a father, and all through his life he practised the marvellous teachings which he preached 59 పుత్రుడుగ, రాజుగ, తండ్రిగ, గొప్ప వ్యక్తియై, తానుపదేశించు అద్భుత బోధల దా జీవితమున ననుష్ఠించువాడును, He, who, in the midst of the greatest activity finds the sweetest peace, and in the midst of greatest calmness is most active 59 అత్యధికతమ కార్యరంగమున అతి మధుర ప్రశాంతిని, ప్రశాంతిమధ్యమున చురుకుదనమును గలిగినవాడును అయి A poet, a cow-herd, a great ruler, a warrior, and a sage had all perhaps been merged in one beautiful figure 60 కవియు, గోపాలుడును, అద్భుత పాలకుడును, యోధుడును, మరియు ఋషియు, నీ యఖిల లక్షణ

59. Swami Vivekananda : The Complete Works, Vol. 4, p. 92
60. Swami Vivekananda : The Life —— Vol. 3, p. 252

ములు నొక సుందరస్వరూపమున మిళితములై ఆతనిలో మూర్తీభవింప the most perfect of the Avataras 60 సంపూర్ణావతారమై ప్రకాశించెను. ఆతని కీర్తి దిగంతరముల నిట్లావరింప నిక భక్తులకు లెక్క ఏమి? ఏ యితర అవతారములకులేని అసంఖ్యాక భక్తాదుల నతడాకర్షించి, అగణిత కవితా మాధుర్యములకాకరమై, 'యతః కృష్ణ స్తతో ధర్మోయతో ధర్మ స్తతో జయః॥' (6.66.35) ఎచట కృష్ణుడు గలడో అచట ధర్మముండును, ఎచట ధర్మముండునో అట జయముండునను మహాభారతవాక్యము ననుసరించి ధర్మమూర్తియై, యావద్భారతావనిని ఆక్రమించి, ఎందు చూచిన నాతడెయై యొప్పారెను.

ఆతని యశశ్చంద్రికలు దేశమునుదాటి, ఖండఖండాంతరముల గూడ వ్యాప్తి చెందినట్లు గోచరము. రష్యాయొక్క ఉత్తరభాగమైన సైబీరియాలోను, ఫిన్లండు దేశమునందును, 'సమొ యేదులు' 'చేదెలు', అను తెగలవారు గలరట. శ్రీకృష్ణుని నామమైన 'శ్యామ' 'శామ' అంత, 'సమా' మరియు 'సమొ' అనియు రూపాంతరముల బొంది, 'యెదులు' 'యేదులు' గ మారి, 'సమొ యేదులు' శబ్దము ఏర్పడినట్లు విజ్ఞుల భావము. అటులే 'యదులు' 'జేదెలు' 'చేదెలు' గగూడ మారిరి. ఆ విధముగ శ్రీకృష్ణ వంశజులు 'చేదెలు' గను 'సమొ యేదులు' గను రూపొంది, మధ్య ఆసియాలో జిరకాలము రాజ్యము పాలించి, ఆ యా ఖండముల వ్యాపించినట్లు గోచరము. క్రీస్తుకు పూర్వము, 1200 సంవత్సరములకు పూర్వమే, కొందరు యదు వంశజులు భారతమును వీడి, ఉత్తర దేశముల పర్యటించుచు నొక పర్వతశ్రేణిదగ్గర నివసించిరి. అట దుర్గములగూడ నిర్మించియుండిరి.

60. Swami Vivekananda : The Life——Vol. 3, p. 252

అందుచే నా పర్వత భాగము 'యద్ క్రీడం' అని పేర్వడసెను. 'యదు దుర్గము' అని ఆ పదమునకర్థము. ఈ విషయముల కొ్రపోతు, రేమూసా అను పాశ్చాత్య పండితులు స్పష్టపరచియుండిరట: మొగలాయి చక్రవర్తి జెహరుగూడ నీ విషయముల ప్రస్తావించి యున్నాడట. 61

# శ్రీకృష్ణ జననకాలము

ఈ విధముగ శ్రీకృష్ణుడు అతి ప్రాచీనుడై, బుద్ధభగవానునికి పూర్వమే సుప్రఖ్యాత ఆరాధ్యస్థానము నలంకరించి, సాత్వత, భాగవత మత ప్రవర్తకుడై విరాజిల్లెనని, సర్వ విద్యానిపుణుల తాత్పర్యము. ఆర్ష గణితము ననుసరించి యీ మహాత్ముడు, కలియుగమునకు పూర్వము 126 వ సంవత్సరమున, అనగా క్రీ. పూ. 3228 వ సంవత్సరము శ్రీముఖ నామ సంవత్సర, శ్రావణ బహుళ అష్టమి, రాత్రి పండ్రెండు గంటలకు, రోహిణీ నక్షత్రమున జనించినట్లు విదితము. అనగా నేటికి 5190 సంవత్సరముల పూర్వమాతని జన్మము అని విదితము. అంత జేగీయమానముగ, నాడు తెలియబడిన ప్రపంచమున అత్యధిక యశస్సు నార్జించి, ఎందెందు చూచినను అతడై, అతని నామమే మారుమ్రోగుచుండ, నాటి ప్రపంచమున దుష్ట శిక్షణ, శిష్ట రక్షణ మూలమున శాంతి నెలకొల్పి, 125 సం॥ల, 7 మాసముల, 8 1/2 దినములు జీవించి, కలి 1 వ సంవత్సర ప్రమాది నామ సంవత్సర, చైత్ర శుద్ధ పాడ్యమి, శుక్రవారము, తన అద్భుత అవతారమును ముగుపరచెను. ఆ క్షణమునుండియే కలియుగ

---

61. ఆంధ్ర పత్రిక, 7-1-1958

ప్రారంభము సంప్రాప్తించి, ధర్మము తలక్రిందులై, సర్వారిష్టములు ప్రపంచము నావరించెను. అజ్ఞానాంధకారము లోకము నాచ్ఛాదించెను.

## శ్రీకృష్ణతత్త్వ మాధుర్యము

కాని ఆతని చైదములు, లోకమున అదృశ్యమగుట ఎట్లు? పాంచభౌతికమైన నిర్మాణకాయము అంతరించిన అగుగాని, ఆ దివ్య మూర్తియొక్క అద్భుత తేజోపుంజములు దిఙ్మండలవ్యాప్తి నొంది యుండి, అందందు చిరస్థాయిగ నిలచి యుండుటచే, వాని బింబ ప్రతిబింబములు మహర్షిపుంగవుల హృదయనాడుల జొచ్చి, ఉత్తేజ పరచి, అత్యుత్తమ కావ్యరచనా సౌష్ఠవము గలిగించి, అన్య దేశముల అభావమైన, అన్యమాస్తులకలభ్యమైన అసంఖ్యాక గ్రంథముల గల్పించివైచెను. కొన్ని రచనములు అద్భుతములై యుపనిషద్రూపములగూడ దాల్చి ప్రఖ్యాతములైనవి. అన్నింటికంటె అత్యద్భుతమై, సర్వ భక్తజనాకర్షణకేంద్రమై పురుషపుంగవులగూడ వనితాత్త్వ మావరింపజేసి, మోక్షద్వారమునకున్ముఖుల గావించు శ్రీమద్భాగవత మహాపురాణము సర్వోత్తమము. అందు ఋషి ఆగ్రహమునకెరయై, శాపగ్రస్తుడై, సప్త దినముల కాలవాహిని గ్రుంకనున్న పరీక్షిత్తునకు, అస్ఖలిత బ్రహ్మచారియు, దిగంబరుడును, అసమాన జ్ఞానియు నైన శుకయోగీంద్రుడు, తారణోపాయముగ శ్రీకృష్ణ కథామృత మాధుర్యమును జవి జూపి తరింపజేసెను. భాగవత కథాశ్రవణమున బులకితశరీరుడు కానివాడెవడు? నిమీలితాక్షుడై అశ్రుసంతతి కురిపింప జాలనివాడెవడు? రాసకేళీరంగముల స్మరించి, శ్రీకృష్ణుని సర్వమోహన స్వరూపమునకు, ఆనంద నృత్యమునకు బరవశముగానివాడెవడు?

ఆ విధముగ శ్రీ భాగవత పురాణము సర్వ భక్తకోటికి మూల గ్రంథమై, అనేక పండితప్రకాండులచేత, అనేక భాష్యములచే నలంకృతమై, సహృదయ హృదయసీమల నావరించి, తన్మయత్వమును నాటినుండి నేటివరకు గల్గించు అద్భుత రచనముగా ప్రశస్తము. భక్తివిధానము, భక్తిసాధనము, భక్తిఅనుభవము, సర్వము అత్యుత్తమ స్థాయి నిందు ప్రత్యక్షమై, భక్తిమార్గమును ఆమూలాగ్రము సూచించి, వర్ణించి, వివరించి, భక్తుని ముక్తునిగ జేయు సద్ధర్మమే యీ భాగవత గ్రంథమన్నను అతిశయోక్తి కానేరదు. భక్తిపిపాసాపిష్టులకెందరకా గ్రంథరత్నము ఆత్మశాంతిని ప్రసాదించినదో! ఎందరి భక్తుల పారవశ్యమున ముంచి, ఆనంద తన్మయతా మహాసాగరమున నీదులాడించినదో! అట్టి అద్భుత మహా మహిమా విభూతిగలది శ్రీమద్భాగవత మహాపురాణము.

శ్రీమద్భాగవతము, శ్రీకృష్ణలీలలు నాబడు చిన్నికాల చర్యల నుక్కడించి అందింప, మహాభారతము పురాణము ప్రౌఢ కృష్ణుని మహాత్కార్యముల నభివర్ణించును. అందు శ్రీకృష్ణుని రాజకీయ దురంధరత్వము, అమానుష శక్తి సామర్థ్యములు, అసాధారణ శౌర్య సంపదలు, అంకురిత ఆధ్యాత్మికానుభవవైభవము, అనుపమ బోధనా విధానము మొదలగు అనేక ప్రత్యేక విషయములు చూపెట్టబడినవి. అందు శ్రీకృష్ణుని సంపూర్ణశక్తియు అభివ్యక్తమై, విశ్వరూపమున గోచరుడై, గీతాచార్యుడై, లోకమున గోటిసూర్యభాతి ప్రకాశించుచు, శ్రీకృష్ణపరమాత్మ యగుటకు సార్థకచరితుడై విరాజిల్లెను. వీని నాధారముగ గైకొని, యింకెన్నియో గ్రంథములు జనించి యున్నను. జనించుచున్నను యీ గ్రంథద్వయమజేయము.

అట్టి సర్వ సమ్మోహనమూర్తి, సర్వజ్ఞుడు, సర్వశక్తుడు, సర్వజనారాధ్యస్వరూపము ఆవిర్భవింప నవకాశమొసంగియున్న భారతీయ సంస్కృతికెంత అదృష్టము! ఎంతటి మహాభాగ్యము! అట్టి అద్భుత భారతీయ సంస్కృతీ యౌన్నత్యమును గ్రహించి, అందిమిడియున్న శ్రీకృష్ణ రామాది లోకోత్తర మహావ్యక్తుల నవగాహన మొనరించి, మనవారు ప్రసాదించియున్న ఉన్నతాదర్శముల నవలంబించి, వాని గమ్యమును బొంది, ఆనందించి, ఎల్లరకాదర్శవంతులమై ప్రపంచశాంతి సంధాతలుగ నగుదుముగాక! అట్టి మహదవకాశము పరమేశ్వరుడు భారతీయులందరికి అనుగ్రహించుగాక!

సౌందర్యము స్థూల, సూక్ష్మ, అతిసూక్ష్మ రూపముల వ్యాప్తము. సర్వాకర్షణీయాకారము దేహమున గలిగి, జగన్మోహనత్వము భాసిల్లుట శారీరక సౌందర్యము. దానికి మించిన మానసిక సౌందర్యముచే మనోపారిశుద్ధ్యము గలిగి, మానసిక పరిణామమున నెల్లర రచన వచనములచే రంజింపజేయగల్గుట సూక్ష్మము. ఈ సూక్ష్మమునతీతించి, ఆధ్యాత్మికరూప ఆనందమయత్వము అనుభవలబ్ధముకాగ, అవ్యయ రసాస్వాదనాపరతుడై ఆశ్రితులకట్టి అనంతసౌభాగ్యము నందించుట అతి సూక్ష్మమగు పారమార్థిక సౌందర్యము నాబడును. ఈ విధముగ నీ త్రివిధ సౌందర్యములకాకరమై, యీ 5000 వత్సరములనుండి ఎందరో భక్తుల చిత్తముల నాకర్షించి, తన్మయత్వమున ముంచిన శ్రీకృష్ణభగవానుడు, పూర్వము వచించినరీతి వైదిక ఋషిపుంగవులకు గల జ్ఞానమును గలిగియుండుటయే గాక, మంత్రద్రష్టయై, మత ప్రవక్తయుగూడనై యుండినట్లు తజ్ఞుల మతము.

పూర్వోక్తముకేతి, వేదముల ప్రస్తావితమైన 'భగ' నామక దైవము, భగవానుడై, నారాయణ, వాసుదేవ, విష్ణువులకలంకారమై అన్వయించి, క్రమముగ శ్రీకృష్ణునిగూడ అందుకొనెను. అటులే, వేదముల సూచింపబడిన పాంచరాత్రమతము పురాణముల ప్రస్ఫుటమై, భాగవతమతమై, శ్రీకృష్ణ కాలమున నాతని వైదములతో మేళవించి, అతని వంశనామమై, సాత్త్వతముతో గలిసి, వాసుదేవ మతముగ గూడ వ్యవహారము నొందెను. ఈ విషయముల పూర్వ భాగముల జూచియున్నాము.

అయినను There is some reason to believe that Sri Krishna was probably the originator of the Bhagavata religion 62 భాగవత మతమునకు శ్రీకృష్ణుడే ప్రతిపాదకుడుగ విశ్వసించుటకు ఆధారములు గలవని రంగాచార్యులు తలంచును. కాని అతఃపూర్వముగల మతమును అతడు పునరుద్ధరించెనని స్పష్టము. శ్రీకృష్ణుడే ఈ విషయమును స్పష్టపరచుచు తన సుప్రసిద్ధ భగవద్గీతా శాస్త్రమున, 'ఇమం వివస్వతే యోగం ప్రోక్తవానహమవ్యయం। వివస్వాన్మనవే ప్రాహ మనురిక్ష్వాకవేఽబ్రవీత్॥' (4.1) ఈ అవ్యయమైన యోగమును నేను సూర్యునికి దెలిపితిని. అతడు దానిని మనువునకును, మనువిక్ష్వాకునకును బోధించెను అని పలికెను. ఈ శ్లోకమున శ్రీకృష్ణుడు, తన ప్రస్తుత స్థూలదేహమును మరచి, తన స్వతస్సిద్ధ పరమాత్మత్వమును స్మరించి, పూర్వము తా సూర్యునికి బోధించుటయు, నందుండి యీ మత పరంపరయు నెట్లు అరుదెంచెనో వక్కాణించియున్నాడు. 'ఏవం పరంపరాప్రాప్తమిమం రాజర్షయో

62. Prof. M. Rangacharya : The Three Great Acharyas, p. 144

విదుః' (4 2) ఈ విధముగ, గురుపరంపరగా నరుదెంచు నీ యోగ మును రాజర్షులెరుగుదురనియు, దాని పరంపరాగమన సత్యమును దెలిపియున్నాడు. ఈ యోగమే is some times refered to as Yoga of the Satvata style 63 సాత్వతవిధానయోగముగ, నాక్కొక్కచో భారతాది గ్రంథముల దెలుపబడినట్లు, సర్కారు పండితుని అభిప్రాయము. మహాభారతమున, శాంతిపర్వమున, సాత్వతమే భాగవతముగ వ్యవహరింపబడినట్లు విదితము. అదియు బాంచ రాత్రముగ దెలుపబడి, భగవద్గీత యని ప్రఖ్యాతి గాంచిన 'హరి గీత' లో నిది వివరింపబడినట్లును, శాంతిపర్వ పాఠముగ పూర్వము చూచియున్నాము.

## భాగవతమతము

ఈ విధముగ భాగవతమతమే, కాలాంతర వైష్ణవమునకు మూలమై, రామానుజ మధ్వాది ఆచార్యులకు ఆధారమై యుండినట్లు ప్రస్ఫుటము. శ్రీకృష్ణునికి బూర్వము యీ మతమెంతవరకు వ్యాప్తి నొందియుండెనో తెలియ శక్యముకాదు గాని, వాసుదేవ నామమున బహుళ వ్యాప్తి నొందిన శ్రీకృష్ణ స్వర్యుచే నిది మధురానగర ప్రాంతముల ప్రథమతః వికసించినను, సాత్వతులు నాబడు యాదవ జాతిలో బుష్పించి, విజృంభించి, దేశవ్యాప్తి గాంచెను. అది మెల్లగ దక్షిణావర్తమునకుగూడ బ్రసరించి, మూలాళ్వారుల మూలమున శఠ కోపాది చివరి ఆళ్వారుడైన తిరుమంగై యాళ్వారువరకు వ్యాపించి,

63. Prof. D. C. Sarcar: History and Culture of the Indian People, Vol. 2, p. 433

వారి భక్తిరసామృతసింధువులో ముంచెత్తి, వైష్ణవమతమునకు గట్టి పునాదుల వైచినది.

మరల నది శ్రీ రామానుజానంతరము శ్రీ మధ్వాది ఆచార్య పరంపరచే పోషింపబడి, బరిణమించి వ్యాప్తమై, వల్లభ నింబార్కాది ఆచార్యుల మూలమున ఉత్తరావర్తమును బునః వ్యాపించి, రామానంద, కబీరు, శ్రీకృష్ణచైతన్యాది భక్తి శక్తిమూర్తుల సృజించినది. శ్రీరామానుజీయ వైష్ణవము అధికముగ వేదాంత మీమాంసపై నాధారపడి, శ్రీమహావిష్ణువునే పరబ్రహ్మముగ నిరూపించుచు, దాత్త్వికమతమై విశిష్టాద్వైతమను నా బ్రఖ్యాతి గాంచెను. కావున అందు శ్రీరామ శ్రీకృష్ణాది అవతారముల విభూత్యంశమున గైకొనినను, బ్రధానములు కాకపోయినవి. శ్రీమహావిష్ణువే విశిష్టాద్వైతమునకు బట్టుగొమ్మ. శ్రీమహాలక్ష్మియే ఆధారము, శరణ్యము. కాని తర్వాత వైష్ణవమున, శ్రీరామచంద్రుడు కొంత భాగమును, శ్రీకృష్ణుడు కొంత భాగము నావరించి, తమ అమానుష ఆకర్షణీయ గుణగణవిభూతిచే ఆచార్యుల, భక్తాగ్రేసరుల, బండితుల, కవుల నాకర్షించి, వైష్ణవమును బహుళ వ్యాప్తి నొందించి, భారతదేశమున వైష్ణవమే ముఖ్యమతమా అనునట్లు గావించిరి. అందును, శ్రీరామచంద్రుని రామానంద, తులసీదాసు, కబీరుదాసాది అల్పసంఖ్యాక భక్తగురువులు ఆశ్రయింప, శ్రీకృష్ణుని అసంఖ్యాక భక్తగణములు, ఆచార్యవర్యులు ఆశ్రయించి, కీర్తించి అనుసరించిరి. అందుచే శ్రీకృష్ణునిపై నాధారమైన వైష్ణవము అన్నింటికంటె బహుళ వ్యాప్తము ఆకర్షవంతముగ, భారతావని స్థానము నార్జించినది. అందులకు కృష్ణకిశోరుని అద్భుత, అమానుష, లీలావిభూతులేకాక, అతనిచే యుద్ధరంగమున అర్జునున

కుపదేశింపబడి, సర్వ ప్రపంచమున భగవద్గీత యని కీర్తి గాంచిన వేదాంత గ్రంథముగూడ ముఖ్యకారణము. శ్రీకృష్ణలీలలు రుచింపని వాడుండవచ్చునుగాని గీతాశాస్త్రమును నుతింపనివాడు ఎందును ఉండడు. దాని మాధుర్యము, అట్టి అభౌతికానంద పీయూషము ను వారి తన్మయుల చేయును. దాని నిరాకరింప నేరికిని అశక్యము.

కావున బూర్వ వైష్ణవ భాగమున వైష్ణవమత ప్రాచీనతను వీక్షించి, దాని పరిణామము నవలోకించి, ఆళ్వారుల భక్తి ఉన్మత్తతల గాంచి, శ్రీరామానుజాచార్యుని హస్తముల నెట్లు విశిష్టాద్వైతము రూపొందియున్నదో గాంచి యున్నారము. అందు, వైష్ణవాచార్యులకు ప్రథమాచార్యుడేగాక ప్రముఖుడై, ఆధారుడైన శ్రీరామానుజుని జీవిత విశేషమును గవేషణాగృష్టి జిత్రించి, అతని రచనముల సమీక్షించి, విశిష్టాద్వైత స్వరూపము నొకించుక గాంచియున్నారము.

## వైష్ణవము

ఈ భాగమున, వైష్ణవ పరిణామమును జూచి, శ్రీరామ, శ్రీకృష్ణులపై నాధారమైయున్న వైష్ణవ సిద్ధాంతముల, వాని వాని ఆచార్యవర్య జీవితగాథల క్లుప్తసరి చూచి, ఆనందింపెదముగాక. ఆర్షమతోద్ధరణమున ప్రముఖపాత్ర ధరించిన మహాపురుషులలో, ముఖ్యులుగ ఆచార్యత్రయము ప్రస్ఫుటము. వారిలో నద్వైతఖండ మున, ప్రథముడైన శ్రీశంకర భగవత్పాదాచార్యవర్యునిగూర్చియూ, నాతని అద్వైత సిద్ధాంతమును గూర్చియు సాకల్యముగ వీక్షించి యున్నాము. మరల వైష్ణవ ఖండమున, ప్రథమ భాగమున, ద్వితీయు డైన శ్రీమద్రామనుజాచార్యవర్యునిగూర్చియు, నాతని సిద్ధాంతమును

గూర్చియు తెలిసికొనియున్నాము. ఇక ద్వితీయుడైన శ్రీమధ్వాచార్య వర్యుని, మనము గ్రహించుకొనవలయును. అందుచే నాతని జీవిత విశేషమును, అతనిచే స్థాపింపబడిన ద్వైత సిద్ధాంతమునుగూర్చియు దెలిసికొన యత్నించెదముగాక! అంతియగాక, నా ఆచార్యవర్యుని అనంతరము, వైష్ణవ గగనమున శోభిల్లిన ఉత్తరాచార్యులలో గొందరిగూర్చిమాత్రము వీక్షించి, వారి సిద్ధాంతముల నెరింగి సంతృప్తి జెందెదముగాక!

శ్రీ రామానుజానంతర వైష్ణవ ఆచార్యులలో శ్రీ మధ్వాచార్యుని తర్వాత, తత్త్వవిచారణము అల్పమై, సాధన భాగమునకు ప్రాధాన్యమీయబడినది. సర్వ సిద్ధాంత సౌరభము, ముఖ్యముగ సిద్ధాంత విషయ సమీక్షనే ప్రధానముగ నుంచుకొని యున్నదైనను, సంఘమున వైష్ణవాచార్యులు గావించిన అమోఘమైన ప్రచారము, వారు కావించిన అద్భుత ప్రబోధము, వారు గలుగజేసిన అద్వితీయ పరిణామములు, భారతీయ సంస్కృతీ చారిత్రమున నతి ప్రధానములు గాన, సిద్ధాంతమాధుర్యములందు యయినను, భక్తిసాధనామృతము గూడ ప్రధానమని ఎంచి, యీ ఎనిమిదవ భాగమున సమీక్షింప తలంచియున్నది. అదియు అవసరమే గదా!

అందుచే, నీ భాగమునుగూడ రసగ్రహణపారీణులు స్వీకరించి, అనుష్ఠించి, ఆనందించి శ్రీ భగవదనుగ్రహప్రాప్తి నొందెదరుగాక!



# ద్వైత సిద్ధాంతము

## ఉపోద్ఘాతము

శ్రీ మన్మధ్వమతే హరిః పరతమః సత్యం జగత్తత్త్వతో
భేదో జీవగణా హరేరనుచరా నీచోచ్చభావం గతాః।
ముక్తిర్నైజసుఖానుభూతిరమలాభక్తిశ్చ తత్సాధనం
అక్షాదిత్రితయం ప్రమాణమఖిలామ్నాయైకవేద్యో హరిః॥

శ్రీమధ్వ సిద్ధాంతమున హరియే మూలసత్యము. జగత్తుగూడ సత్యమే యగును. జీవగణములలో హరిభక్తి ననుసరించి, నీచోచ్చ భావరూపమున భేదములు గలవు. ముక్తి యన స్వకీయమైన, అమలమైన సుఖానుభూతి యగును. అద్దానికి భక్తియే సాధనము. ప్రత్యక్షానుమాన శబ్దములు మూడును ప్రమాణములు. అఖిల వేదము నకు హరి వేద్యుడు అని యీ శ్లోకము, ద్వైత సిద్ధాంతము నాబడి ప్రఖ్యాతి గాంచిన శ్రీ మధ్వ ప్రతిపాదిత వేదాంతమత ముఖ్య తాత్పర్యమును స్పష్టపరచి యున్నది.

ఇంతదనుక భారతీయ తత్త్వశాస్త్ర సమీక్షలో, వేదవేదాంత ముల ముఖ్య తాత్పర్యము నాబరగు అద్వైత సిద్ధాంతమును జూచి, అది శ్రీ శంకర హస్తస్పర్శచే బహుళ ప్రఖ్యాతమై, వ్యాప్తమై, ఎట్లు వెలుగొందియున్నది అవలోకించియున్నాము. కాని పూర్వోక్త ముగ, నీ అద్వైత సిద్ధాంతమున నిర్గుణ నిర్వికార నిరాకార పర బ్రహ్మము కేవలమూహాతీతమై అగోచరమై యుండి, జీవుల స్థూల దృష్టులకతిదూరుడై యుండుటయు, మానవులకు సహజములుగ దోచు

చున్న వివిధ ప్రవృత్తులకతడు అందనివాడై, మానవజీవిత ప్రాతిపదికయు బరమావధియునైన రాగము అనగా హృదయస్పందనరూప ప్రేమకు అధీనుడుగూడ గాకయుండుటచే, తత్త్వార్థరహస్యముల నను భూతికి దెచ్చుకొనజాలుటకావశ్యకమైన అనుష్ఠాన ప్రక్రియలలో, ఆ బ్రహ్మమును లక్ష్యమునందుంచుకొని, సాధనరంగమున దిగుటకు సామాన్య మానవులకు అసాధ్యమయ్యెను. పాంచభౌతిక శరీరధారుడై, స్థూలేంద్రియ ప్రవృత్తుల బద్ధుడై, సంఘమున నిమిడి, పరస్పరాపేక్షిత శక్తులమధ్య నున్న మానవునకు, దనకు స్థూలముగ, దన ప్రవృత్తులకు లక్ష్యముగా నుండదగు బ్రహ్మము వలయునని, అపేక్ష జనించుట సహజము. స్థూలభుగ్వైశ్వానరః' అనిగదా మాండూక్య వివరణము.

అందుచే, నీ లోపమును గ్రహించిన శ్రీరామానుజాచార్యుడు వేదముల బ్రతిపాదింపబడిన సగుణ బ్రహ్మమును స్వీకరించి, విష్ణువను ప్రధాన నామమును గ్రహించి, సాధకుని కేంద్రస్థానముగ నాతని నొనరించి, వైష్ణవమును శిథిలావస్థనుండి యుద్ధరించి, ముముక్షు జనములకెంతగనో సహాయము చేసియుండెను. అనుష్ఠానయోగ్యమైన యీ వైష్ణవమునకు సిద్ధాంత భాగముగ దత్త్వవిచారణమునకై 'విశిష్టాద్వైతమును' నెలకొల్పి, తద్వివరణార్థము అనేక గ్రంథముల నిర్మించెను. శ్రీరామానుజకాలమునకు బూర్వమే, అద్వైతవాదము ఆర్ద్రి ముముక్షుహృదయముల గొంతవరకు సంతృప్తి గలుగజేయ జాలకుండెను. అందులకై పరమేశ్వరునికి గల సచ్చిదానంద లక్షణ త్రయముతో ప్రేమతత్త్వమును జతుర్థమునుగా జేర్చి, శ్రీమహావిష్ణువును భక్త లోకమునకు జూపెట్టి, భక్త భగవంత బాంధవ్యమును శ్రీరామానుజుడు సన్నిహితమొనర్చెను.

కాని రామానుజుని సిద్ధాంతముగూడ నద్వైతభాగముగ నుండి, జీవజగత్తులు ఆ విష్ణువునకంశములుగా నెలకొల్పబడి, ఆతనికవి స్థూల సూక్ష్మ దేహములుగ బరిగణింపబడియున్నవి. కావున ముముక్షువులకు రామానుజుని అద్వైత సిద్ధాంత ఖండనము సంతృప్తి పరుపజాలనిదయ్యెను. Unity mongering is the bane of philosophy 64 ఏకత్వ వాంఛ తత్త్వశాస్త్రమున ప్రమాదకరము. Difference meets the eye every where and there is no difficulty in percieving and understanding it 64 నానాత్వము సర్వత్ర నేత్ర గోచరము. దాని గాంచి గ్రహించుట కష్టసాధ్యము కాదు. అట్టి ప్రత్యక్ష విభిన్నత్వమును గాదని త్రోసి పుచ్చుట ఎట్లు సాధ్యము? అట్టి అనైకత్వమున శాంతి నార్జింప యత్నించుట విజ్ఞ లక్షణము గాని, అనైక్యత కలదని త్రోసిపుచ్చుట హేతుకము కానేరదు. అది నానాత్వమున A merciful God who will lend a helping hand to aspirants 65 సాధకులకు జేయూత నొసంగు కరుణాళువుయైన భగవంతుడు ఒకడుండి, భక్తుని శాంతిధామమునకు జేర్చుటకవకాశముండవలెను. అట్టి భగవంతుని ప్రతిపాదన జేయవలసిన అవసరము అధికమగుటచే, నిద్దానికై శ్రీమధ్వాచార్యుడవతరించి కార్యసిద్ధి గాంచెను. is what Madhva maintains to have been unanimously proclaimed by the sacred texts 65 అట్టి భగవంతుని యునికినే, శాస్త్రములు ఏకోన్ముఖముగ ప్రకటించుచున్నవని మధ్వాచార్యుని వాదము. ఆతని సిద్ధాంతములో విభిన్నత్వములు

---

64. Dr. R. Nagaraja Sarma : Reign of Realism in Indian Philosophy, p. 581

65. Dr. R, Nagaraja Sarma : Reign of Realism in Indian Philosophy, p. 515

సహజము, సత్యము. Difference does not so easily permit itself to be written off or annihilated by a mere stroke of the pen of the Absolutist or by waving of the Absolutistic magic wand. Difference is foundational All the Pramanas deliver a unanimous verdict that difference and diversity are real, as real as the Absolute of the Absolutist and the Supreme Brahman of the Pluralistic Theist 66 భిన్నత్వము అద్వైతవాది కలముయొక్క ఒక గీతచే గాని, అతని మంత్రదండముచేగాని సునాయాసముగ దుడిచి వేయబడ దగినంత సులభము కాదు. అద్వైతవాదియొక్క అద్వితీయబ్రహ్మ మెంత సత్యమో, అటులే యీ నానాత్వ అనైకత్వములు సత్యము లని సర్వప్రమాణములు ఏకోన్ముఖముతో ప్రకటించుచున్నవని అతని సముచిత వాదము.

కావున 'జగత్ ప్రవాహః సత్యోయం పంచభేద సమన్వితః। జీవేశయోర్ భిదా చైవ జీవభేదః పరస్పరం। జడేశయోర్ జడానాం చ జడ జీవభేదా తథా। పంచభేద ఇమే నిత్యాః సర్వావస్థాసు నిత్యశః। ముక్తానాం చ న హీయంతే తారతమ్యం చ సర్వదా' (మహాభారత తాత్పర్య నిర్ణయము. 69_71) ఈ పంచభేద సహిత మైన జగత్ప్రవాహము సత్యము. జీవేశ్వరులకు భేదము, జీవజీవు లకు బరస్పర విభేదము, ఈశ్వరజగత్తులకు అన్యత్వము, జడ జడములకు భిన్నత్వము, అటులే జీవజగత్తులకు భేదములనెడి పంచ విభిన్నత్వములు, సర్వ వస్తువులలో నిత్యము సత్యముగా నుండునని

66. Dr. R. Nagaraja Sarma : Reign of Realism in Indian Philosophy, p. 581

మధ్వమునివర్యుని తీర్మానము. అనుక్షణము ప్రపంచమున నానాత్వమును సహజముగ వీక్షించువారలకు, యీ సిద్ధాంతము యథార్థముగ గొంత తృప్తి నొసంగగలదు. ఈ నానాత్వ ప్రతిపాదనము గావించిన Madhva is the unchallenged monarch of Pluralistic Theism and Radical Realism in Indian Philosophy [67] మధ్వాచార్యుడు, భారతీయ తత్త్వశాస్త్రమున, ద్వైతసిద్ధాంతమున అజేయమైన చక్రవర్తి యని నగరాజ శర్మ పండితుని తలంపు. ప్రపంచ మిథ్యాత్వమును ప్రతిపాదించు వాక్యములు ఉపనిషత్తులలో గొన్ని గానుపించినచో, జగత్సత్యత్వమును రూపించు అసంఖ్యాక వాక్యములును అందు గోచరము అని, మధ్వాచార్యుని వాదము.

ఈ విధముగ నగరాజశర్మ తాత్పర్యమున మధ్వాచార్యుని కాలమున, ద్వైతసిద్ధాంత పునః ప్రతిపాదనావసరమును ప్రబలము గావించు యంశములు కొన్ని గలవు. అందు (1) శ్రీ శంకర కాలమున ప్రముఖముగ జనించిన బౌద్ధ విరుద్ధ భావములు (2) శంకరాద్వైత సిద్ధాంతమునకు అసంతృప్తి (3) భగవంతునితో అతి సన్నిహిత సంబంధాపేక్షను ప్రతిపాదించు ఆకర్షణీయ భక్తి సిద్ధాంతావసరము (4) రామానుజుని విశిష్టాద్వైతమునందతృప్తి (5) తర్క వివాదముల యందధికతర అభివృద్ధియు [68] మధ్వాచార్యునకు స్వకీయ సిద్ధాంత ప్రచారమునకు మిగుల తోడ్పడినవి. అంతియగాక, ఆ కాలమున వేదాంత సూత్రములకు నిరువదియొక్క వివిధ సిద్ధాంత ప్రతిపాద

---

67. Dr. R. Nagaraja Sarma : Reign of Realism in Indian Philosophy, p. 678

68. Dr. R. Nagaraja Sarma : Reign of Realism in Indian Philosophy, p. 12

నార్థము భాష్యములుండి, యథార్థమును మరుగుపరచి, ఉపనిషదర్థముల భంగపరచి, సంఘమున వ్యాప్తమై యుండుటయు మధ్వాచార్యునికి బాధ గలిగించెను. తన బ్రహ్మసూత్ర భాష్యమున మధ్వాచార్యుడు, యీ సిద్ధాంతముల నన్నింటిని జూపి ఖండించెను. కాని కృష్ణస్వామి అయ్యరు వాక్యములలో, నా యిరువదియొక్క సిద్ధాంత ఖండనము ఒక ఎత్తు, శ్రీ శంకరాద్వైత సిద్ధాంత ఖండనము ఒక ఎత్తుగ మధ్వాచార్యునికి దోచెను. 69 అందులకై సర్వవిధ సాధనోపాయము లను మధ్వాచార్యవర్యుడుపయోగించినట్లు చారిత్రము. రామానుజీయ భక్తిసిద్ధాంత ప్రచారమున ఆవిర్భవించిన అద్వైత సిద్ధాంత విముఖ త్వము, సంఘమున మధ్వాచార్యునకు ఉపయుక్తమగుటచే, నా భక్తి తత్త్వమును అతడు నొక్కి వక్కాణించెను. అంతవరకు వ్యాప్తమై యున్న భక్తివాదము, భక్తిప్రపత్తులతో బ్రథమమున మూఢముగ నుండుట గాంచి, it was converted by Madhava into a rational living, spiritual motive force which on account of its characteristic element of entering into an intimate personal relationship with the deity appeared undoubtedly more promising and attractive than the tendency to reaction associated with the empty Absolute of the Advaita 70 సహేతుక జీవనము, పారమార్థికోన్ముఖ శక్తిగ మధ్వా చార్యునిచే రూపాంతరము గావింపబడి, భగవంతునితో అత్యంత సన్నిహిత బాంధవ్యమును గలిగిన స్వభావలక్షణములు గలది యగుటచే,

69. Prof. C. N. Krishnaswami Aiyar : The Three Great Acharyas: p. 197

70. Dr. R. Nagaraja Sarma : Reign of Realism in Indian Philosophy, p. 10

అద్వైతుల శూన్యమైన పరబ్రహ్మ సంబంధముకంటె నధికతర ఆకర్షవంతముగను, ఉత్తేజకరముగను శక్తితత్త్వము రూపొందెను.

ఆచార్య నాగరాజరావు వాక్యములలో, నీ మధ్వాచార్య ద్వైత సిద్ధాంతమునకు A robust independence, sound logic, cogent array of quotations, refreshing originality of treatment, and unfailing loyalty to the Sruti and the spirit of the scriptures, are a few remarkable feautures of Dvaita Vedanta 71 ప్రబల స్వాతంత్ర్యము, సహేతుక న్యాయము, ఉచిత ప్రమాణవాక్య ప్రవాహము, మధురసహజ విధానము, మరియు శ్రుతి స్మృతి తాత్పర్యములయందు అకుంఠిత విశ్వాసములు, కొన్ని అద్భుత లక్షణములై విరాజిల్లి యున్నవి. అందుచే నిది కేవలము సంఘ సంస్కరణోద్యమముగాక, It has a type of revolutionary idealism that estranges the revolutionary by its idealism, and the conservative by a drastic evolution of his earthly goods 71 ఈ ద్వైతవాదము, విప్లవకారుని తన భావ ధారచే విభ్రమపరచుచు, పూర్వవాదిని తన ఐహిక సంపదనుండియు ప్రబల విప్లవముచే దూరము గావించు నొకవిధమైన విప్లవ భావ విధానము అని ఆచార్య నాగరాజరావు వాక్యములు. ఆతని యుద్దేశ్యమున Madhva's Vedanta is a pluralistic realistic and theistic system 71 మధ్వాచార్య వేదాంతము ద్వైతమై, సత్యమై ఆస్తికమైన సిద్ధాంతము. అందుచేత నది an open and a powerful reaction against the absolutistic monism of Sankara 71

---

71. Prof P. Nagaraja Rao : Vedanta Kesari, 1937 p. 232, 230

శంకర అద్వైతవాదమునకు ప్రస్ఫుటమై, ప్రబలమైన ప్రతిక్రియై, నలుముఖముల నద్దాని నెదుర్కొని పోరాటము సలుపగలిగి యున్నది. రామానుజ సిద్ధాంతముతో ననేక విషయముల సామ్యత్వము గలిగి యున్నను, ఆచార్య రాధాకృష్ణ వచనములలో, నీ మధ్వమతమే A leading form of reaction against Sankara's Advaitism 72 శంకరాద్వైతమునకు, ప్రముఖమైన ప్రత్యర్థి యగుచున్నది. అంతియ గాక, In the evolution of Indian philosophic thought, Madhva appeared as an uncompromising critic of the Advaita of Sankara 73 భారతీయ తత్త్వశాస్త్ర పరిణామ చారిత్రములోగూడ మధ్వాచార్యుడు, శంకరాద్వైతమునకు ఎదురులేని విమర్శకుడై ప్రకాశించెను.

అట్లు, తా, శాస్త్రవిదూరమని గాఢముగ విశ్వసించిన అద్వైత వాద నిరాసమునకై మధ్వాచార్యుడు, వచన రచన విధానముల నన్నిటినివలెనె నుపయోగించుకొనెను. అందులకై శంకరాద్వైతమున జీవబ్రహ్మముల ఐక్యతను బ్రతిపాదించు మహావాక్యములను, మరియు నితర ఉపనిషద్వాక్య సంతతిని అతడు గ్రహించి, వాని అద్వైతార్థముల నిరసించి, ద్వైత భావార్థముల రూపించి ప్రకటించెను. ముఖ్యముగ ఛాందోగ్యశ్రుతిగతమైన 'తత్త్వమసి' వాక్యమునకు మధ్వాచార్యుని అన్వయము magnificient metaphysical master stroke 74

---

72. Dr. S. Radhakrishnan : Indian Philosophy, Vol. 2, p. 737

73. Sri Kowlagi Seshacharya : Prabuddha Bharata, 1960. p. 148

74. Dr. R. Nagaraja Sarma : Reign of Realism in Indian Philosophy, p. 324

అప్పృశ్ తా త్త్వికవివరణా చాతుర్యమని పండిత నగరాజశర్మ విశ్వాసము. ఆ వాక్యమునకు పూర్వాచార్యులైన శంకర, రామానుజులు యథాతథార్థమును గ్రహింప, మధ్వాచార్యుడుమాత్రము దాని ద్రోసి రాజని, జీవబ్రహ్మముల విభిన్నత్వము నన్వయించుచు సమర్థించెను. భగవంతుడు మానవుడును అత్యధిక వ్యత్యాసము గలవారుకారు. వీరిరువురికి వైరుధ్యమే ప్రబలముగ నున్నచో, భక్తి శ్రద్ధా అర్చనాదులు మానవునకును, కృపా పాలనత్వాది లక్షణములు భగవంతునికి నెట్లు గలిగియుండును అని ప్రశ్న. అంతరాత్మగనున్న బ్రహ్మము, జీవునకంతరమున నుండుటచే నేకత్వము తెలుపబడినది. ఇరువురు వ్యక్తులు అతి సన్నిహితులై యున్నచో, అలంకారికముగ వారిరువు రొక్కటియే అనుట సహజముగదా! అటులే అఖండము నాబడు బ్రహ్మము, జీవునిలో అంతర్యామి రూపమునను, ప్రభువుగను, సహరస బాంధవ్యమున నుండుటచే జీవునితో తెలుపబడియున్నది. 'తత్త్వమసి' అనగ, జీవుని దివ్యత్వమునుమాత్రము సూచించునుగాని బ్రహ్మైకత్వమునేమాత్రము వచింపదు. మానవుని దివ్యత్వ స్మరణార్థము ఆ వాక్యమేర్పడినది. మానవుని పారమార్థిక గమ్యము మరుగుపడి యుండుటచే, దాని నుద్ధరింప నీ ప్రబోధ వాక్యము పుట్టించెను. ఈ విధముగ నీ వాక్యము స్తుతి వచనముమాత్రమగును. అందుచే నపాయము ఏమాత్రములేక, దానివలన ప్రయోజనము గలుగునని తాత్పర్యము. శిష్యుల నుద్ధరించుటకై, ఆచార్యవర్యులు ఉపయోగించు విధానములలో నీ స్తుతి యొకటి. జీవబ్రహ్మముల కసంఖ్యాక విరుద్ధ లక్షణములు గోచరము కావున, ఈ వాక్యార్థము

ఏకత్వముగా గ్రహింపరాదు అని మధ్వాచార్య వివరణము. 75 మరియు నా వాక్యమునకు త్వం=నీవు, తత్=ఆ పరమాత్మయొక్క-అధీనుడవై, అసి=ఉన్నావు అనియు అన్వయము సాధ్యమని ద్వైత సిద్ధాంతము 76 అంతియగాక మధ్వాచార్య తాత్పర్యమున 'ఆత్మా-అతత్' అను రెండు పదములకు 'అక స్సవర్ణే దీర్ఘః' అను పాణిని సూత్రము ననుసరించి సవర్ణదీర్ఘ సంధి ఏర్పడి, 'ఆత్మాతత్' అని యైనది. అందుచే 'అతత్' అని పదవిభాగము సాధ్యము. అందుచే 'స ఆత్మా తత్త్వమసి' అనువాక్యము త్వం=నీవు, అతత్=పరమాత్మ కంటె భిన్నుడవై, అసి=ఉన్నావు అని అర్థముగలిగి, జీవ పరమాత్మల భిన్నత్వమును వక్కాణించుచున్నది. 77 నీవు అది కాదు అని ఆ వాక్యము బోధించును. This may be interpreted also as, "just as the Supreme Self is Sat, real, thou the individual Self art also Sat or real." 77 ఎట్లు పరమాత్మ సత్యమో అటులే జీవుడవైన నీవుకూడ సత్యమే యనియు నీ వాక్యమును అన్వయింప నగునని మధ్వ భావము. ఆ వాక్య సందర్భము ననుసరించి అన్వయించినను, జీవపరమాత్మల విభిన్నత్వమునే ఆ వాక్యము సూచించును. విద్యాధికుడై అహంకారమున నేతెంచిన శ్వేతకేతువను పుత్రుని తండ్రి ఉద్దాలకుడు గమనించి, 'యేనాశ్రుతం శ్రుతం భవతి' (6.1.3) అశ్రుతముల నేది శ్రుతమొనరించునో అద్దాని విషయము గ్రహించి

75. Dr. R. Nagaraja Sarma: Reign of Realism in Indian Philosophy, p. 601

76. శ్రీమదానందతీర్థస్వామి : సివిల్ కేసు, 3వ ఇష్యూ పు. 46

77. Prof. V. Sethu Rao: Vedanta Kesari, 1930, p. 98

యుంటివా అని ప్రశ్నించెను. దాని దెలియని సుతుడు వివరణమునకై పిత నర్థింప 'యథా సౌమ్యైకేన మృత్పిండేన సర్వం మృణ్మయం విజ్ఞాతం స్యాత్ వాచారంభణం వికారో నామధేయం మృత్తికేత్యేవ సత్యం' (6.1.4.) మృత్పిండ జ్ఞానము మృద్వికారముల జ్ఞానము నెట్లు తెలియజేయునో, మృత్తికయే సత్యమై నామధేయములు ఎట్లు వాచారంభణములో అని, వివిధోపమానములచే వివరించి, 'సదేవ సోమ్యేదమగ్ర ఆసీదేకమేవాద్వితీయం' (6.2.1) వత్సా, ఇది తొలుత సద్రూపమై, అద్వితీయమై యుండెననియు, అందుండి నిఖిలము జనించెననియు వచించెను. ఆ సృష్టియు నా సత్ వస్తుసంకల్పముచే నానాత్వముగ నెట్లుద్భవించెనోగూడ వివరింపబడెను. అంత మధువులో నంతరములైన సర్వపుష్పరసములు తమ వ్యష్టిత్వమును మరచు చందమున, నదులు సంద్రమును జేరి తమ రూపముల నంతరించు విధాన మొదలగు నుపమానముల వివరించి, 'స య ఏషోణి మైతదాత్మ్యమిదం సర్వం తత్సత్యం స ఆత్మా తత్త్వమసి శ్వేతకేతో॥' (6.15,3) సర్వమునకు అంతరమైన యీ యణురూపాత్మ సత్య పదార్థము. అది ఆత్మ. ఆ యాత్మవే నీవు అని చెప్పబడుటచే, వ్యష్టిరూపాత్మ సూచింపబడి అది సర్వాత్మతో తత్త్వతః ఏకత్వ యోగ్యముగ బోధింపబడినది అనియు ద్వైతవాదము. పై విషయముల సాకల్యముగ పండిత నగరాజశర్మ చర్చించి, If the illustrative instances mean anything at all, then differences between the finite and the Infinite is the only doctrine which they are capable of illustrating and elucidating in their own natural and unstrained significance 78 ఉదాహరింపబడిన

78. Dr. R. Nagaraja Sarma : Reign of Realism in Indian Philosophy, p. 599

విషయముల ఏదైన అర్థనిర్ణయము గావించినచో, వాని స్వాభావిక అకృత్రిమ తాత్పర్యమున నవి వాని నుదాహరించుచు వివరింప గలుగుచో, జీవపరమాత్మల విభిన్నత్వ సిద్ధాంతమునే అవి స్పష్ట పరచుచనని వాకొనెను. మరియు Not one of the nine instances can be claimed to support identity between the finite and the infinite 78 ఈ తొమ్మిది యుదాహరణములలో నొక్కటి యైనను, జీవబ్రహ్మైక్యతను బలపరచుచున్నట్లు వచింపజాలమనియు నాతని దృఢభావము. ఈ విధముగా అద్వైత శ్రుతులు నా ప్రఖ్యాత మైన వాక్యముల నన్నింటిని, మధ్వాచార్యుడు ఏరి, ద్వైతపరము లనుగ నన్వయించి, భాష్యముల రచించెను. అంతటను జీవేశ్వర విభేదముమాత్రమే ద్యోతకముగాని, అభేదము కాదని అతని స్పష్టి సిద్ధాంతము.

మరియు, జగత్తుయొక్క మిథ్యాత్వ ఖండనమునుగూడ ప్రబల ముగా మధ్వాచార్యుడు గావించియున్నాడు. 'విశ్వం సత్యం తదేత త్సత్యం, (ముం. 1. 2. 3) వాక్యములు విశ్వ సత్యత్వమును స్పష్ట పరచుచున్నవి. అందుచే మిథ్యాత్వవాదము నిరసింపబడినది. అధ్యాస ఖండనము గావించుచు, (1) అధిష్ఠానము (2) భ్రాంతుడగు పురుషుడు (3) అధిష్ఠాన సామాన్య ధర్మము (4) అధిష్ఠాన విశేషధర్మము (5) ఆరోపిత సాదృశ్యము (6) సామాన్య ధర్మజ్ఞానము (7) విశేష ధర్మముయొక్క అజ్ఞానము (8) సాదృశ్యజ్ఞానము (9) అజ్ఞాన కారణములైన దేహేంద్రియాదులు మొదలకు అంశములు అధ్యాస

78. Dr. R. Nagaraja Sarma: Reign of Realism in Indian Philosophy, p. 599

హేతువులుగ నుండవలెను. కాని, యీ యంశములు అఖండైక బ్రహ్మమునందెట్లు పొసగగలవో అనూహ్యము. అందుచే అధ్యాస మేర్పడుటకెట్టి అవకాశము అగోచరమని ద్వైతమతము.

అతని కాలమునకు బూర్వము దేశమున మిగుల వ్యాప్తినొంది, సర్వావలంబనీయమై వెలుగొందుచున్న శంకరాద్వైత సిద్ధాంతమునకు అనేకవిధముల మధ్వాచార్యుడు అఘాతముల నొసంగి, ప్రజల నిరాధారముగ నుంప సమ్మతింపక, ద్వైతము సంస్థాపించి, అందు బూర్వోక్తమురీతి నిర్గుణ అగోచర బ్రహ్మ ప్రతిపాదనముగాక, సగుణ రూప భగవంతుని హరిని ముముక్షులోకమునకు ముందుంచి, బ్రహ్మ శబ్దశ్చ విష్ణౌ వేద' (1.1.1) బ్రహ్మశబ్దమునకు విష్ణువనియే తాత్పర్యమని సూత్రభాష్యమున స్పష్టపరచి, 'తస్మాదనంతమహాత్మ్యః గుణపూర్ణో జనార్దనః' అందుచే నారాయణుడే అనంత అద్భుత కల్యాణగుణపూర్ణుడని బోధించి, అతడే సర్వ సృష్టికర్తగ వివరించి, 'కురు భుంక్ష్వ చ కర్మ నిజం నియతం। హరిపాదవినమ్రధియా సతతం। హరిరేవ పరో హరిరేవ గురుః హరిరేవ జగత్పితృమాతృ గతిః' హరిపాదములకు వినమ్ర చిత్తమున ప్రపన్నుడవై, నీ విధి కృత్యముల నొనరించి, ఫలితముల ననుభవింపుము. హరియే పర బ్రహ్మము, హరియే గురువు, హరియే తండ్రి, హరియే తల్లియు, నా హరియే సర్వమునకు శరణ్యము అనియు; బ్రహ్మము, స్వతంత్రము. స్వతంత్రమనగా స్వాపేక్షికము, అదియే గుణపూర్ణత్వమును దెలుపును. అనగా నా గుణములు అనంతత్వము గలిగినవి అను యర్థముగ శ్రీహరికి కల్యాణగుణ సముచ్చయమును బూర్ణముగ నన్వయించి,

భక్త్యాసక్తచిత్తుడై ప్రబోధ, మధ్వాచార్యుడు గావించి, ముముక్షువులకు మార్గదర్శకుడును ఉపదేశకుడునై రాజిల్లెను.

ఈ విధానమంతయు స్వకపోల కల్పితమనిగాక, మధ్వాచార్యుడు తన పూర్వ సంప్రదాయముల గవేషించి, పరిశీలించి, తనకవసర సిద్ధాంతమును స్వీకరించినట్లు తెలియుచున్నది. రామానుజుడు తన మతమును, బోధాయనవృత్తి నాబడు బ్రహ్మసూత్రములకు గల వ్యాఖ్యానముపై నాధారపడి నిర్మింప, the later (Madhva) institutes a comparitive study of the common and oldest authorities and interprets them in the light of sound logic 79 తర్వాతివాడైన మధ్వాచార్యుడు, సామాన్యమును ప్రాచీనమునైన ప్రమాణ గ్రంథముల సమగ్ర విచారణము గావించి, చక్కని తర్కమున వాని వాఖ్యానించును అని, ఆచార్య సుబ్బారావు వాక్యములు, 'అతః కలౌ భవిష్యంతి చత్వారస్సంప్రదాయినః॥ శ్రీ బ్రహ్మ రుద్ర సనకా వైష్ణవాః కలియుగమున నాల్గు సంప్రదాయములుండును. ఇవి శ్రీ బ్రహ్మ రుద్ర సనక సంప్రదాయములనబడు వైష్ణవములు. ఈ విషయము భవిష్యత్పురాణముగూడ 'శ్రీ బ్రహ్మ రుద్ర సనకాది వైష్ణవాః క్షితిపావనాః। చత్వారస్తే కలౌ భావ్యా సంప్రదాయ ప్రవర్తకాః॥' అని తెలుపుచు, 'శ్రీవిష్ణుస్వామి నింబార్క మధ్వ రామానుజాఖ్యయా। భవిష్యంతి ప్రసిద్ధా' అనియు, చతుస్సంప్రదాయముల విష్ణుస్వామి, నింబార్క, మధ్వ, రామానుజులు ఆచార్యులనియు తెలిపియున్నది. అందు 'రామానుజః శ్రీః స్వచక్రే మధ్వాచార్యం చతుర్ముఖం। శ్రీవిష్ణుస్వామినం రుద్రో నింబాదిత్యం చతుస్సనకః॥' అనియు

79. Prof. S. Subba Rao : The Three Great Acharyas, p. 238

గూడ వివరించినదీ పురాణము. శ్రీసంప్రదాయమును జేపట్టిన రామానుజుడు విశిష్టాద్వైతమును నిర్మింప, బ్రహ్మసంప్రదాయమును గైకొనిన మధ్వాచార్యుడు ద్వైతమును నెలకొల్పెను. సనకసంప్రదాయమును ఆధారముగ గొనిన నింబార్కుడు ద్వైతాద్వైతవాదమును వచింప, రుద్ర సంప్రదాయమును గ్రహించి విష్ణుస్వామి శుద్ధాద్వైతమును ప్రబోధించెను. ఈ శుద్ధాద్వైతమునే వల్లభాచార్యుడు స్వీకరించెను.

మరియు నీ మధ్వాచార్య నిర్మిత ద్వైతముకూడ వైష్ణవమున భాగమై యొప్పుటచే, రామానుజీయమునుండి దాని బ్రత్యేకించుటకై యిది 'సద్వైష్ణవ' మనియు బ్రఖ్యాతము. రామానుజీయము శ్రీవైష్ణవము నాబరగును. మధ్వాచార్యుని ద్వైతము ఉత్తరమున వ్యాప్తమై, ముఖ్యముగా శ్రీకృష్ణచైతన్య దేవునికాధార సిద్ధాంతముగా రూపొందినట్లు గోచరము. ఈ విషయమును ముందు గాంచెదముగాక: మరియు నీ సిద్ధాంత ప్రాభవము మహారాష్ట్రి యతీశ్వరులలో ముఖ్యులైన సమర్థరామదాసుపైగూడ గోచరించును. ఈతడే శివాజీ ఛత్రపతి యొక్క గురువరేణ్యుడు.

మధ్వాచార్యుని ద్వైతమునకు నింతగ బూర్వ చారిత్రము గలిగియుండ, బరమాత్మ తర్వాత మిగుల ప్రాధాన్యత వాయుదేవునకీ సిద్ధాంతమున నీయబడుట గాంచి, అది క్రైస్తవమున Holy ghost అను దైవదూతకు నొసంగబడిన ప్రాముఖ్యము వలె దోచుటచే, క్రైస్తవమున యహోవా, దేవదూత, దేవుని పుత్రుడగు ఏసువలెనే యీ మతమునగూడ హరి, వాయువు, మధ్వాచార్యుడను తత్త్వత్రయము

గోచరమగుటచే కొందరు, మధ్వాచార్యుడు తన సిద్ధాంత విషయముల క్రైస్తవమునుండి స్వీకరించినటుల అపోహ గలిగి వాకొనిరి. కాని యీ ద్వైతము మధ్వాచార్యునికి బూర్వమే సంఘమున నుండి, మధ్వాచార్యునిచే నుద్ధరింపబడినట్లు వారు గ్రహింపనేరరు. శంకరునకు బూర్వము, వేదకాలములనుండి ప్రవహించుచున్న అద్వైత భావ వాహినిని శంకరుడు స్వీకరించి, బహుళమొనరించి, దేశవ్యాప్త ప్రవాహముగ నొనరించినట్లు, రామానుజుడు వేదకాలములనున్న పాంచ రాత్ర, వైఖానస, భాగవత, నారాయణీయాది సిద్ధాంత భావముల గైకొని, సమన్వయము గావించి, వైష్ణవముగ నాకారము నిడుచుందసు, మధ్వాచార్యుడనబడు ఆనందతీర్థుడుగూడ నుపనిషత్తుల ప్రస్ఫుటముగ దోచు ద్వైత తత్త్వమును జే గ్రహించి, సమర్థించి, వివరించెననుట విస్మరింపరాదు. అందుచేతనే పండిత రాధాకృష్ణ మహాశయుడుగూడ The doctrines of exclusive mediatorship through Vayu, the son of Vishnu, eternal hell as well as the missionary fervour of Madhva's faith suggest the influence of Christianity, thought there is little evidence in support of it 80 విష్ణుతనయుడగు వాయుదేవుని ప్రత్యేక మధ్యవర్తిత్వము, శాశ్వత నరకము గలదను సిద్ధాంతములును, మధ్వాచార్యుని మత ప్రచారమునకు మిగుల ఉత్సాహములు జేరి, మధ్వునిలో క్రైస్తవ సిద్ధాంత ప్రభావము గోచరమని దోచును. కాని అందులకెట్టి ప్రమాణా ధారములు గానరావు. ఎందుచేనన In view of the fact that Madhva's commentary on the Kena Upanishad is taken from Brahmasara, it is reasonalble to think that there

80. Dr. S. Radhakrishnan : Indian Philosophy, Vol. 2, p. 738

was the tradition of dualism even prior to Madhva. As we shall see, Madhva makes a clever use of Sankhya and the Nyaya - Vaiseshika theories 80 మధ్వాచార్యుడు కేనోపనిషద్భాష్య విషయముల బ్రహ్మసార గ్రంథమునుండి గ్రహించెను. అందుచే మధ్వాచార్యునికి బూర్వమే ద్వైతసిద్ధాంత సంప్రదాయము గలదని స్పష్టము. అంతియగాక మధ్వాచార్యుడు, సాంఖ్య న్యాయ వైశేషికముల మిగుల ధీకుశలతతో నుపయోగించుకొనియున్నాడు. ఆ సిద్ధాంతములు కేవల ద్వైత ప్రతిపాదకములుగదా ! మీదుమిక్కిలి, అతి ప్రాచీనములైన లక్ష్మి, బ్రహ్మ, రుద్ర, సనకములు నాబడు నాలుగు వైష్ణవ విధానముల, రామానుజ మధ్వ విష్ణుస్వామి నింబార్కులుద్ధరించినట్లును స్మృతివాక్యములుగదా ! అట్టిచో క్రైస్తవమునుండి విషయముల స్వీకరించి వివరించుకొను నవసరము భారతీయ ఆచార్యులకు ముఖ్యముగ, నాచార్యత్రయము నాబడు శంకర, రామానుజ, మధ్వులకు లేదని గ్రహింపనగును. వారికి, అజేయమును విస్పష్టమును అతి ప్రాచీనమును శ్రుతిసిద్ధమును అయిన సత్సంప్రదాయము అతి ప్రాచీనకాలమునుండి పరంపరాగతముగ నరుదెంచి, వారిని జేరియుండుట చారిత్రక సత్యము. దాని నెవ్వరును కాదనజాలరుగదా ! ఈ విషయమును ప్రస్తావించి నగరాజశర్మ పండితుడు Students of Christianity and those of Madhva's workes will readily see that the development of doctrines in the latter is strictly on the traditional lines of Indian Philosophy, and above all it should never be forgotten that Christianity is pre eminently a religion, but Madhva's

80. Dr. S. Radhakrishnan : Indian Philosophy, Vol. 2, p. 738

Dvaita is pre-eminently a system of metaphysics 81 క్రైస్తవ, మధ్వ గ్రంథముల పరిచయము గలవారు, మధ్వాచార్యుని సిద్ధాంత పరిణామాభివృద్ధులు శుద్ధ భారతీయ తత్త్వ సాంప్రదాయికముగ నున్నవనియు, క్రైస్తవము ముఖ్యముగ మతరూపమై యుండ, మాధ్వము తాత్త్విక స్వరూపము గలదనియు గాంచుదురు అని నొక్కి వక్కాణించెను. క్రైస్తవమున తాత్త్విక ప్రాతిపదిక అభావమగుచు, కేవలము ఆస్తికమతముగ నుండ, మాధ్వము ప్రముఖముగ తాత్త్విక సిద్ధాంత ప్రతిపాదనారూపమున వెలుగొందుచు, నా తాత్త్విక గమ్యమైన శ్రీహరి సాన్నిధ్యమును జేర, భక్తివిధానముల బోధించు ఆస్తిక మతముగకూడ నలరారుచున్నదనుట నెవరును విస్మరింపరాదు. అందుచే నీ మాధ్వము క్రైస్తవ ప్రబోధితము కాదని విదితము.

పై విషయముల బరిశీలించినచో మధ్వాచార్య సిద్ధాంతము, కేవలము ఆస్తికమతముమాత్రముగాక దాత్త్విక ప్రాతిపదిక గలిగి, భారతీయ తాత్త్విక చారిత్రమున నొక ప్రముఖ స్థానము నలంకరించియున్నదని విజ్ఞులనుడి. ఈ సిద్ధాంతము ద్వైత సత్యత్వమును బోధించును. కాల, దేశ, ప్రాణ, ప్రకృతి, బ్రహ్మములనెడు నిత్య పదార్థముల బ్రతిపాదించి, మధ్వాచార్యుడు, తన మతమును ద్వైతముగా రూపొందించెను. The highest importance attached to the eternal diffirence between Jiva, Brahman and Prakriti, as well as to the relationship which exists between subject and object of knowledge is the basis for also

81. Dr. N. Nagaraja Sarma: Reign of Realism in Indian Philosophy, p. 663

naming his system as dualism 82 జీవ బ్రహ్మ జగత్తులకును, జ్ఞానవిషయమున కర్త కర్మలకును గల సంబంధములతో, నిత్య విభిన్నత్వమునకు నొసంగబడిన అధిక ప్రాముఖ్యతయే దీని ద్వైతము నా కారణములు. మరియు His workes clearly show that he worked at his system with such a persuation and he has written more on points of philosophy than on those of religion 83 మధ్వాచార్యుడు మతవిషయములకంటె తాత్త్వికముల నెక్కువగ రచించి తన సిద్ధాంతమును మిగుల నమ్మతముగ నిర్మించినట్లు అతని రచనలు విదితమొనరించుచున్నవని సుబ్బారాయ మహాశయుని భావము. అందుచేత Madhva's system cannot be lightly and thoughtlessly dismissed as belonging to the religious history of Indian thought. It is on a par with those of Ramanuja, Sankara, Srikanta and others. It represents an important and significant epock in the history of the Indian Philosophy 84 మధ్వ సిద్ధాంతమును, భారతీయాస్తిక చారిత్రమునకు మాత్రమే చెందినదని సులభముగ, యోచనారహితముగ త్రోసిపుచ్చరాదు. అది రామానుజ, శంకర, శ్రీకంఠాదుల సిద్ధాంతములతో సమముగ నున్నది. భారతీయ తత్వశాస్త్రచరిత్రలో నది యొక ముఖ్య ఘట్టమును దెలుపుచున్నదని, పండిత నగరాజశర్మ విశ్వాసము. మరియు In the light of the criterion of spiritual satisfyingness, Madhva's doctrines

---

82. Prof. V. Sethu Rao : Vedanta Kesari, 1930, p. 99

83. Prof. S. Subba Rao : The Three Great Acharyas, p. 242

84. Dr. R. Nagaraja Sarma : Reign of Realism in Indian Philosophy, p. 677

of Radical Realism and Pluralistic Theism are bound to make a very powerful appeal to thinking minds 85 పారమార్థిక సంతృప్తికి దగు ముఖ్యసూత్ర ప్రదర్శనముతో మధ్వాచార్యుని స్వాభావిక సత్యత్వము, ద్వైత తత్త్వములు, యోచనాశీల చిత్తములకు ఐకీయముగ నాటక తప్పదనియు నా పండితవర్యుని గాఢతరమగు నమ్మకము.

రాఘవేంద్రాచారి మహాశయుని అభిప్రాయమున, భారతీయ సంస్కృతికేగాక యథార్థమున సర్వప్రాపంచిక సంస్కృతికి మధ్వాచార్యుడు అసమానమైన పెన్నిధిని నొసంగెను. తత్త్వశాస్త్రమే సరియైన సాధనమనియు, శాస్త్రము కేవలము శబ్ద ప్రమాణమాత్రముగాక పరిశుద్ధ తత్త్వశాస్త్రమనియు, నందు బ్రహ్మమీమాంస సర్వోత్తమ యోచనా సహిత తత్త్వశాస్త్రమనియు, మధ్వాచార్యుని పరిగణనము. మరియు నతని దృష్టికి, జీవునకు కర్తృత్వభావమే యథార్థమైన బంధము నాబడుననియు, తన సంపూర్ణ పారతంత్ర్యమును గ్రహించి జీవుడు ప్రవర్తించుట యుచిత కర్తృత్వమగుననియు మధ్వాచార్యుని బోధ. అంతియగాక జగత్తుయొక్క సత్యత్వ గ్రహణమే పరమార్థ సత్య గ్రహణమునకు మార్గమనుట నా ఆచార్యవర్యుని విశ్వాసము. ఆ పరమార్థము నిర్దోషమై గుణపూర్ణమై యుండును. అదియే జ్ఞేయము గమ్యము. అదియే నారాయణుడు. ఈ పరమార్థమును గ్రహించినచో ముముక్షువునకు శాంతి లభించును. బ్రహ్మమీమాంసాధ్యయనముచే

85. Dr. R. Nagaraja Sarma: Reign of Realism in Indian Philosophy, p. 670

ఇది లక్ష్యము. ఈ విచారణమే ఆనందదాయకమని మధ్వాచార్యుని ఉపదేశము. ఈ విధముగ Madhvahas thus in his exposition of Brahma-Mimamsa brought the monism expounded by the Vedas and Upanishads to its culmination. His position is essentially Brahmavada 86 మధ్వాచార్యుడు, వేదోపనిషత్ ప్రోక్త ఏకేశ్వరోపాసనమును దాని పర్యవసాన పరిపక్వత్వమునకు గొనిపోయెను. అతనిది ముఖ్యముగ బ్రహ్మవాదము.

ఈ విధముగ నతిప్రధానమగు తత్త్వశాస్త్ర విధానమును, అనుష్ఠానపద్ధతిని, భారతీయ పారమార్థిక శాస్త్రమునకు ప్రసాదించిన మధ్వాచార్య నామక ఆనందతీర్థుల జీవిత విశేషములగూడ నొకించుక గ్రహించి, ఆనందింప యత్నించెదముగాక!



86. Sri H. N. Raghavendrachariar : The Cultural Heritage India, Vol. 3, p. 331

# శ్రీ మధ్వాచార్య జీవిత సంగ్రహము

## ప్రశస్తి

శ్లో॥ నిర్యదీం బుధ్నాన్మహిషస్య వర్పస
ఈశానాసః శవసా క్రంత సూరయః।
యదీమను ప్రదివో మధ్వ ఆధవే
గుహా సంతం మాతరిశ్వా మథాయతి॥ (i.141.3)

ఈ ఋగ్వేదీయ బళిత్థాసూక్తమున, మధ్వ మాతరిశ్వ శబ్దము లుభయములును గానబడును. అందుచే నీ యుభయ శబ్దములు వాయు దేవునకును మధ్వాచార్యునకును అన్వయించి, వాయుదేవుని మూడవ యవతారముగ మధ్వాచార్య ఆగమనమును ఋగ్వేదము ముందుగ సూచించియున్నదని ద్వైతవాదము. వాయుదేవుని ప్రథమ ద్వితీయ అవతారములు, ఆ సూక్తమున ప్రథమ ద్వితీయ మంత్రములలో అన్వయమనియు వారి భావము. 'వళిత్థా తద్ వపుషే ధాయి దర్శతం, దేవస్య భర్గః సహసో యతో జని। యదీముపహ్వరతే సాధతే మతిర్ ఋతస్య ధేనా అనయంత సస్రుతః' (1.141.1) 'పృక్షోవపుః పితుమాన్ నిత్య ఆ శయే, ద్వితీయమా సప్త శివాసు మాతృషు। తృతీయమస్య వృషభస్య దోహసే, దశప్రమతిం జనయంత యోషణకాః' (1.141.2) అను రెండు మంత్రముల, ఆంజనేయ భీమసేనులు సూచితములని ద్వైతమతము. 'అగ్ని దేవుని ప్రస్ఫుటప్రకాశము దేహధారమునకై నవలోకింపబడినది. అందుకొరకు అది దేహబలమున బుట్టింపబడెను. ఆ చిత్తము దాని గ్రహించి, ఉపయోగించుకొనుటకు ఆహుతులగూడిన ప్రార్థనముల వాహ గావించియుండిరి' (1.141.1). 'నిత్యుడై, అన్న

గ్రాహకుడై, స్వరూపకుడై, పృథ్వీమీద నతడు జీర్ణశక్తిగ నుండుట ప్రథమము. సారభూతమగు శుభ మాతృసత్రకమున నతడు వసించుట ద్వితీయము. వర్ష కారణుడైన నితని నుపయోగించుకొనుటకు, దశ దిక్కుల నానందము నొంది దిశలు అతని గలుగజేసెను' (1.141 2). 'శక్తివంతులైన పండితుల ప్రార్థనా శక్తిచే దన స్థానమునుండి అగ్నిని నుద్ధరించినట్లు, తన గుప్తస్థానమునుండి హవిస్సుల నర్పింప వాయువతని మేల్కొలిపినట్లు' (1.141.3) అని పై మంత్రముల తాత్పర్యము గలదు. ఈ మంత్రార్థములనుండి ద్వైతవాదులు హనుమద్, భీమ, మధ్వాచార్యుల నన్వయించి, వీరు మువ్వురును వాయుదేవుని అవతారములని వాకొని, అందుచే మధ్వాచార్యుని వాయుదేవుని తృతీయావతారముగ వక్కాణించియున్నారు.

ఈ విషయమును ప్రస్తావించి The role of Vayu in Dwaita Vedanta can favourably be compared with the role of Jesus, the son of God, in Christianity, and the role of Lakshmi in Visishtadvaita. Tradition and scripture with a sustained and cogent array of quotations maintain that Sri Madhva is the third incarnation of Vayu. An explicit statement of this fact is found in the Balikta Sukta of Rig-Veda 87 ద్వైతవాదమున వాయు స్థానము, క్రైస్తవమున దేవకుమారునివలెను, విశిష్టాద్వైతమున లక్ష్మివలెను గలదు. సంప్రదాయము, శాస్త్రము, అనేక ఉచిత ప్రమాణ వాక్యములతో, శ్రీ మధ్వాచార్యుడు వాయుదేవుని మూడవ యవతార

87. Prof P. Nagaraja Rao : Vedanta Kesari, 1937, p. 231

మని తెలుపుచున్నవి. ఋగ్వేదీయ బళిత్థ సూత్రమున నీ విషయ సత్యత్వము ప్రస్ఫుట వాక్యమున నున్నదని, ఆచార్య నాగరాజరావు వాకొనెను. మధ్వాచార్యుడుగూడ వాయుదేవుడు, శ్రీమహావిష్ణువును బొందింపజేయును అనియు (సు. భా. 1.2.16), వాయుమూర్తి జీవుని దేహమున ఆత్మరూపముననుు, జీవస్వరూపమున నంతరాత్మగనున్న శ్రీమహావిష్ణువును సేవించుటకై జీవ శరీరములోనికి ప్రవేశించు చుండును, (సూ. భా. 1.2.11) అనుచు, అనేక స్థానముల దన రచనములలో వాయుదేవుని గీర్తించుచు, నా దేవుని జీవేశ్వరులకు మధ్య మధ్యవర్తిత్వమున నెలకొల్పెను. అంతియగాక Throughout his works Madhva speaks after the manner of a Messiah with a mission 87 a మధ్వాచార్యుడు, తన గ్రంథముల నెల్లెడల ప్రత్యేక కార్యముగల ప్రవక్తచందము వాకొనును అనియు, ఆచార్య నాగరాజరావు వాక్యము. మరియు శంకరాద్వైత ఖండనము గావించుచు He openly declares in many of his works that he is the chosen prophet of Lord Vishnu, commissioned to interpret correctly the sacred texts and refute the misinter-pretations foisted thereon by the other commentators 87 a మధ్వాచార్యుడు తన యనేక రచనములలో, దా శ్రీవిష్ణువుచే నెన్నుకొనబడిన ప్రవక్త యనియు, ఇతర వ్యాఖ్యాతలు శాస్త్రముల అపార్థముల గల్పింప, వాని సక్రమవిధాన వ్యాఖ్యానించుటకై యుదయించినట్లు తెలుపుకొనియున్నాడు. ఈ కారణములచేత మధ్వాచార్యుడు కేవలము శ్రీమహావిష్ణువునకు అతిసన్నిహితుడై, భక్తుల వైకుంఠమునకు జేర్చు వాయుదేవుని అవతారమనియు ద్వైత

---

87, Prof. P. Nagaraja Rao : The Schools of Philosophy, p. 82

మతావలంబకుల ప్రగాఢ విశ్వాసము. 'మధ్వాచార్యో హరేః ప్రియః' (3. 118. 72) 'మధ్వాచార్యో కృష్ణపరో జ్ఞాతా యజ్ఞాంశమూర్తిమం' (3. 118. 52) మధ్వాచార్యుడు హరిప్రియుడనియు, మధ్వాచార్యుడు కృష్ణపరుడును, జ్ఞానము గలవాడును, యజ్ఞాంశమూర్తి యనియు భవిష్యత్పురాణము మధ్వాచార్యుని స్తుతించియున్నది.

## జననము

దక్షిణ భారతమున, సౌందర్యవంతమైన పశ్చిమ పర్వతశ్రేణి గలిగియున్న ఉత్తర కెనరా మండలములు కలవు. పూర్వము ఎనిమిదవ శతాబ్దమున, నా తులవ దేశమును మయూరవర్మ యను రాజు పాలించుచుండెను. ఆతడు బ్రాహ్మణుల నితర ప్రాంతములనుండి తన రాజ్యమునకు గొందరి నాహ్వానింప, కుమారిలభట్టుయొక్క కర్మమార్గము ననుసరించు కొందరు బ్రాహ్మణులు, దూరదేశములనుండి వచ్చి అట చేరిరి. వారు భట్టులనబడెడువారు. కాలక్రమమున శ్రీ శంకరాచార్యు డుద్భవించి, అద్వైతవాదమును యీ ప్రాంతముల ప్రచారము గావించి, యీ దేశమునకు జేరువనగల తుంగభద్రానదీ తీరమున, శ్రీ శృంగగిరిలో నొక మఠమునుగూడ స్థాపింప, నీ వంశజులందరు శంకరానుచరులుగ మారిపోయిరి.

But Sankara's system, like every other system that the world has seen, had undoubtedly had weak points about it, which, though hid from men's gaze, in the morning splender, had silently grown with its growth and had begun to discover many ugly features, the worst

of which bore indirectly or otherwise on character 88 లోకమున సర్వేతరమతములవలె శంకరవాదమునుగూడ, నిస్సందేహముగ గొన్ని లోపములు గలిగియుండెను. ప్రారంభ దశలయందు అవి దాగియుండి కనుపింపకపోయినను, సిద్ధాంతాభివృద్ధితో నవిగూడ పెరిగి, ప్రత్యక్షాప్రత్యక్షముగ ప్రవర్తనముపైగూడ ప్రభావమును జూపించిన యనేక అసహ్యాకర లక్షణములుగగూడ గోచరించెను. అందుచే Several pious people had begun to feel dissatisfied with the prevalent philosophy and its influence on character 88 వ్యాప్తమైన యీ సిద్ధాంతము, ప్రవర్తనముపై దాని ప్రభావము ఆస్తిక ప్రజాలోకమున ననేకులకు నసంతృప్తిని గలుగ జేయజొచ్చెను.

మరియు నా కాలమున శంకరాద్వైతమునకు తోడుగ, నింక నిరువది సిద్ధాంతములు దేశము నావరించి, ప్రజాసంఘమును పెడ త్రోవలకు నడుపుచుండెను. అట్టి సమయమున, నా కర్ణాటక దేశమున, వేదవతి మధ్యగేహాలను బ్రాహ్మణ పుణ్యదంపతులొండుగలరు. 'మధ్యగేహ' యను నామము వ్యక్తి పేరు గాదనియు, నది ఆ కుటుంబముయొక్క గృహ నామమనియు, ఆంధ్రదేశమున గల 'నడిమింటి' అను యింటిపేరు సంస్కృతమున 'మధ్యగేహ' అని మార్పు చెందియున్నదనియు గొందరి భావము. 89 Literally, middle-house, an evident rendering into Sanskrit of the

88. Sri C. N. Krishnaswami Aiyar : The Three Great Acharyas, p. 196

89. శ్రీ కోట వేంకటాచలము : కలిజ్ఞానము, 3 భాగము, పు. 67

Varnacular clan name or distinctive family name 90 శబ్దార్థము ప్రకారము, మధ్యగేహ- అన వంశముకాక కుటుంబము యొక్క- దేశ భాషా పదమునకు సంస్కృతరూపముగ నున్నదనియు కృష్ణస్వామి అయ్యరు నమ్మకము. అందుచే నీ వంశీయులు, మయూర వర్మ కాలమున ఆంధ్రదేశమునుండి వలసవెళ్ళిన బ్రాహ్మణులై యుండనగునని తజ్ఞుల తాత్పర్యము. ఆ దేశమున, ప్రశస్తమైన ఉడిపి పట్టణమునకు నాగ్నేయ దిక్కున, ఆరుమైళ్ళలో గల 'బెల్లి' అను గ్రామము వీరి నివాసము. మధ్యగేహుడు వేదవేదాంగవిద్యా పారంగతుడై యుండుటచే, నితనికి భట్టు అనియు గీర్తియుండెను. అతడు కాలక్రమమున వేదవతి యను కన్యను వివాహమాడి, యిరువురు పుత్రులను ఒక పుత్రికను గాంచెను. కాల కర్మవశమున నా పుత్రద్వయము మరణింప విచారమున మునిగి, వంశపరంపరను నిలుప నెవ్వరు లేకుండుటకు గుంది, అనేక వ్రతోపవాసయాత్రాదుల నలుపుచు, ఉడిపిలో వేంచేసియున్న శ్రీ అనంతేశ్వరస్వామినిగూర్చియు పంద్రెండు సంవత్సరములు జపతపంబుల వారర్చించిరి. అంత ఆ దేవదేవుని కృపావిశేషమున కలియుగాది 4300 సంవత్సరము అనగా, క్రీ. శ. 1199 వ సంవత్సరము ఆశ్వయుజ శుద్ధ నవమి తిథిన, నొక పుత్రుడు వేదవతికి గలిగెను. అదియే మహర్నవమి అని దేశమంతట పర్వదినమై యుండ, నదియే మధ్వనవమి అనియు ద్వైతమతావలంబులకు ముఖ్య పర్వదినముగ నున్నది.

పుత్రోద్భవము ఆ దంపతులకధికానందదాయకమై యొప్పారెననుటకాశ్చర్యములేదు. రూపవంతుడైన ఆ బాలకునకు వాసుదేవుడని

90. Sri C. N. Krishnaswami Aiyar: The Three Great Acharyas, p. 198

నామకరణముగూడ గావించిరి. బాలుడు సౌష్ఠవశరీరుడై, ఆరోగ్య వంతుడై, సుందరుడై, అల్లారుముద్దుగ నెల్లరకానందముగ పెరుగు చుండ, దండ్రియు బిడ్డనికి అయిదవ సంవత్సరమున అక్షరాభ్యా సాదుల సక్రమవిధాన గావించి, సంస్కృతవిద్యా ప్రవేశము జేయించెను. దేవాంశసంభవుడు కావుటచే, నీ అసాధారణ బాలకుడు చిన్ననాటనుండియె అసంఖ్యాక మహత్కార్యముల గావించుచుండెను. భక్తిభావమున, దరిద్రులకు జెప్పకయే ఉడిపికేతెంచి, అనంతేశ్వరుని ఆరాధించి, స్వగ్రామమునకు అరుగుచుండెడివాడాబాలకుడు. అష్ట వర్ష ప్రాయ మున ఉపనయనముగూడ గావింపబడి, వాసుదేవుడు వేదవిద్యాసౌధ మున ప్రవేశించెను.

## విద్యాభ్యాసము

కాని వాసుదేవుడు, శారీరక వ్యాయామము ఆటపాటల యందు జూపించు ఉత్సాహము, శ్రద్ధ, విద్యలయందు వ్యక్తపరుపకపోవుటచే మాతాపితలకు జింతగ నుండెడిది. ఆ బాలుని బల శౌర్యములు నాటి సంఘమున హనుమద్, భీముల స్మరింపజేయు చుండెడివి. విద్యా లయమునకుమాత్రము సరిగా వెళ్లెడివాడు కాడు. అందుచే నుపాధ్యా యుడుగూడ విసివి, అతని పాఠశాలనుండి పంపివైచెననియు గాథ కలదు. అట్లుగాక నితడు చిన్ననాటినుండి ప్రజ్ఞావంతుడనియు గొందరి భావము. ఒక దినమున, విద్యయందాసక్తి చూపని వాసుదేవుని యుపాధ్యాయుడు దండింప, నలిగి అబ్బాలకుడు పూర్వ పాఠముల నన్నింటిని వరుసగా జెప్పి, యుపాధ్యాయునికాశ్చర్యము గలుగజేసె ననియు చారిత్రము. కాని పాఠశాల విద్య అతనికి ఎక్కువకాలము సాగలేదు.

# సన్న్యాసము

ఇట్లు, వాసుదేవుడు విద్యా వ్యాసంగముల నభివృద్ధి గాంచుచు, అగోచర కారణమున నతనియం దిమిడియున్న అజ్ఞాత వివేక వైరాగ్యములు ప్రజ్వలింప, జీవితముపై రోసి, సన్న్యసించుటకు అతడు సంకల్పించెను. కాని ఏకపుత్రకులైన ఆ దంపతులకు సమ్మతము కాజాలదయ్యెను. అటులైన, తన జననీ జనకులకు పుత్రు డొకడుద్భవించుననియు, నా యనంతరమె సన్న్యసించెదననియు భవిష్యత్తును వాసుదేవుడు దెలిపియుండెననియు కథనము. అతని వాక్కు ననుసరించి తనకు సోదరుడొకడు గలుగుటయు, నంత దన పితరుల సమ్మతింపజేసి వాసుదేవుడు ఉడిపి నగరమున ప్రఖ్యాతుడైన శ్రీ ప్రకాశ ప్రేక్షులు, ప్రకాశాచార్యులు అనియు, పురుషోత్తమ తీర్థులు అను యతీశ్వరు నర్థించి సన్న్యసించెను.

ప్రథమతః విద్యాభ్యాసమున శ్రద్ధచూపకున్నను, వాసుదేవుడు యీ మధ్యకాలమున శ్రద్ధాసక్తులతో దర్క వ్యాకరణ వేదవేదాంతాది విద్యలయందు తీర్ణుడై యుండి, గురువును చేరి సన్న్యసించుటచే, నా ఆచార్యుడును ఆనందము నొంది, వాసుదేవునకు పూర్ణప్రజ్ఞుడని నామకరణము చేసినట్లును అందురు. పురుషోత్తమతీర్థుడు శిష్యునకు సన్న్యాస మొసంగి, సన్న్యాస సంప్రదాయము ననుసరించి, ఆనంద తీర్థులని నామకరణమొసంగెననియు కొందరివాదము. ఇది సముచిత నామమై యుండును. మధు + వ = మధ్వ అను పదమునకుగూడ మోక్షప్రద శాస్త్రములకు గర్త యను అన్వయమున ఆనందతీర్థునకు మధ్వాచార్యుడనియు ప్రఖ్యాతనామమేర్పడెను. అటులే, అనుమానతీర్థులని గూడ పర్యాయనామమొకడు యీతనికి గలదు. ఆ నామముల

యన్నింటిలో మధ్వాచార్య పదమే బహుళ ప్రఖ్యాతము, వ్యాప్తము. వాసుదేవుని సన్న్యాస దీక్షాకాలము, అతని తొమ్మిదవ వత్సర ప్రాయము అని ద్వైతమతావలంబకుల విశ్వాసము. తా సన్న్యసింప దీర్మా నించుకొనిన పిమ్మట, నేకైకపుత్రుడు తమ్ము వీడుట కిచ్చపడని జననీజనకులకు పుత్రోద్భవమగు నంతదనుక నతడు నిరీక్షించుచు నుండుటచే, సుమారు ఇరువదియయిదవ వత్సర ప్రాయమున వాసుదేవు డానందతీర్థుడయి యుండునని అధికసంఖ్యాక పండితుల భావము.

అంత గురు సన్నిధానమున, నధికతర శ్రద్ధావిశేషముల నానంద తీర్థుడు విద్యాభ్యాసము గావింపజొచ్చెను. కాని క్రమముగా పురు షోత్తమతీర్థుని శాస్త్రవివరణవిధానము, ఆనందతీర్థునకు నచ్చదయ్యెను. పురుషోత్తమాచార్యుడు అద్వైతవాది యగుటచే, శంకరభాష్యానుసార ముగ నఖిల వేదాంతముల వాఖ్యానించుచుండుట సహజము. అట్టి అద్వైతవాది దగ్గర శిష్యుడుగ జేరి, తురీయాశ్రమ స్వీకారము గావించియున్నను మధ్వాచార్యునకు అద్వైత భావములు మనోక్షోభ మును గలిగింప జొచ్చెను. మొదట నీ భావవైరుధ్యము ప్రస్ఫుటము కాకపోయినను, గాలక్రమమున నది వ్యక్తమై, అధికమై, గురువాక్య నిరసనముగ ఖండనముగ బరిణమించి, గురుశిష్యులకేకభావలోప మేర్పడుచుండెను. ఈ సంఘటనములు గురు మనస్తాపమునకు హేతువు లగుచున్నను, మధ్వాచార్యుని మేధాశక్తి నలుగడల బ్రసరించి, అతనికి ఖ్యాతి జేగూర్చుచు, నతని ప్రభావము సంఘమున నెూక్కు చుండెను. ఆ కాలమునకుబూర్వమే, బురుషోత్తమ తీర్థుడు శిష్యుని పాండితీగరిమకు నెంతయో ఆనందించి, తన యనంతేశ్వర మఠము నకు అధిపతిగగూడ గావించెను. కాని మధ్వాచార్యునకు అద్వైత

సిద్ధాంతము దోషయుక్తముగ దోచి, నానాటికి దద్విరుద్ధమైన ద్వైత వాదముపై అభినివేశము గాఢమై పోయెను.

ఆ కాలమున, నా ప్రాంతములకేగుదెంచు పండితవర్యులతో సిద్ధాంతచర్చల గావించుచు, పరవాదుల నోడించుచు, స్వకీయ, ద్వైత మతమును స్థిరపరచుచు నాతడుండెను. తమను త్యజించి సన్న్యసించిన పుత్రుపై కోపగించుకొనిన మధ్యగేహుడు కుమారుని కీర్తి చంద్రికల వీక్షించి, ఆనందించి, కోపతాపముల నప్పటికిగాని వీడలేదని చారిత్రము. అట్టి, ఘట్టములు మహాపురుష జీవితముల సామాన్యమేగదా! తండ్రి కుమారులకు లక్ష్యవ్యత్యాసమేర్పడి, పుత్రుని విశ్వాసము దృఢమై, జనకుని ధిక్కరించి, యాతనికి మనఃసంతాపము గలిగించుట సహజమే. అట్లు కాకున్న, నే తండ్రి తన పుత్రు సన్న్యాసమునకియ్యకొనును? అట్లుకాక, దండ్రిపై ప్రేమచే పుత్రుడు తన స్థిరభావముల సమన్వయము గావించకొనినంత నిక నాతడు సామాన్యవ్యక్తిగనే యుండి చరితాత్ముడు కాజాలడుగదా!

# దిగ్విజయ యాత్ర

అంత మధ్వాచార్యుడు, ఉడిపియందే యున్నచో తన సిద్ధాంతము సంఘమున బహుళ వ్యాప్తము కానేరదని గ్రహించి, దేశముల దిరిగి, అందందుగల అన్యమత పండితాగ్రేసరుల నెదుర్కొని, స్వమత ప్రతిష్ఠాపనము అన్యమతనిరాసము గావింప సంకల్పించి. దిగ్విజయ యాత్రకు బయల్వెడలెను. ప్రథమతః దక్షిణభారతయాత్రకుద్యుక్తుడై, మంగుళూరునకు దగ్గరగల విజయమంగళమను గ్రామమున మధ్వాచార్యుడు విడిది చేసెను. ఇచట దా నధికాహారమును గొనుటయే

గాక తన యోగశక్తిచే నాహారమును గల్పించి, ఆశ్రితులకెల్లరకు బ్రసాదించినట్లు మధ్వవిజయ చరిత్ర. ఇచట నా భీమసేనుని అవతారమని మధ్వాచార్యుడు నిరూపించెనని తన్మతావలంబకుల నమ్మకము. మహాభారతము ననుసరించి, భీమసేనుడు బకాసురునికై నియోగింపబడిన ఆహారమునంతయు భుజించెనుగదా :

## మధ్వ - శంకర సంఘర్షణము

అనంతశయనము నాబడు తిరువనంతపురమునకు మధ్వాచార్యుడు తరువాత వెడలెను. ఈ పట్టణమున నొక అపూర్వ సంఘటనము గలిగి, మధ్వాచార్య చారిత్రమునమాత్రమేగాక, ద్వైతమతమునగూడ నొక విచిత్ర పరిణామమును గలిగించినది. దేశపర్యటనమునమున్న నాటి శృంగగిరి పీఠాధిపతులైన శంకరాచార్యుడుగూడ నందే యుండెను. అందుచే, నీ విరుద్ధ సిద్ధాంతవాదులకా నగరప్రభువు ఆస్థానమున వాదోపవాదములు జరిగెను. మధ్వాచార్యుడు పూర్వమెందరపండితులనో ఓడించియుండెనుగాని, యీ శంకరాచార్యుని దన కర్కశతర్కమున గాని శాస్త్రయుక్తులచేగాని యోడింపజాలకపోయెను. ఇరువురును కొంతకాలము శాస్త్రముల జర్చించి, స్వమతమండన, పరమతఖండనముల గావించి, విద్వజ్జన సంతోషముగ సర్వశాస్త్ర మీమాంసల నొనరించియు, నొక సమ్మత సిద్ధాంతమునకు రాజాలక, గోష్ఠోద్దీపితులై, పరస్పర వైషమ్యమున అసూయాద్వేషముల జీలిపోయిరి. 'మధ్వవిజయ' 'మణి మంజరీ' గ్రంథముల గర్తయగు నారాయణ పండితుడు, అది శంకరుడే మధ్వాచార్య నోడింప వరుదెంచినట్లు రచించి పరాభూతుడైనట్లు వాకొనెను. కాని నాడు శృంగేరి పీఠాధిపత్యమును వహించియున్న విద్యాశంకరుడు, క్రీ. శ. 1228 వ సంవత్సరమున

పీఠాధిపతియై, దేశ పర్యటనమునకు ప్రారంభించెను. అందుచే నాది శంకరుని ప్రస్తావనము పూర్తిగ నసందర్భము. విద్యాశంకరుడు తన యసామాన్య విద్యాప్రభావముచే బూర్ణప్రజ్ఞుని వాదములకు లొంగక నెదురొడ్డినుటచే, మధ్వాచార్యుని మనస్తాపమునకు గారణమయ్యెను. దీనికిదోడుగ దర్వాతకాలమున నీ గురుద్వంద్వమునకు నేర్పడిన వాదోపవాదములును, తజ్జనిత వైషమ్యములును మూలకారణములై, సిద్ధాంతచర్చల దాటి, వ్యక్తిదూషణములకాకరమై, పరిణమించెను. తత్ఫలితముగ 'మధ్వవిజయ' 'మణి మంజరి' గ్రంథకర్త యగు నారాయణపండితుడు, శంకర శబ్దమును సంకర శబ్దముగ వికారము గావించుటతో సంతృప్తి గాంచక, శ్రీమహావిష్ణువునకు ప్రత్యర్థులై, విష్ణుభక్తుల బాధించు రాక్షస శ్రేణికి జెందినవాడీ సంకరుడనియు, శ్రీమహావిష్ణువు అవతారముల దాల్చి, యీ రాక్షస సంఘమును దును మాడువేళల దాగూడ భూలోకమున నవతరించి, తన తండ్రియైన విష్ణువునకు తోడ్పడు వాయుదేవుడే మధ్వాచార్యుడనియు, బూర్వము శ్రీరామ శ్రీకృష్ణావతార సమయముల హనుమంత భీమసేన రూప ములదాల్చి నేడు మధ్వాచార్యుని ఆకారము నా వాయుదేవుడే పొందె ననియు, మహాభారతకాలమున భీమునిచే హతము గాంచక పారిపోయిన మణిమానుడను రాక్షసుడే యీ సంకరాచార్యుడనియు రచించెను. 91 ఈ గ్రంథకర్త పండిత త్రివిక్రమాచార్యుని పుత్రుడు. త్రివిక్రముడు అద్వైత సంప్రదాయమున జనించి, బహుముఖ పాండిత్యము నార్జించి, అసంఖ్యాకమైన అనుచరకోటిని పొందినవాడు. కాని క్రమముగ నద్వైతము అతనికి సంతృప్తి నొసంగజాలకుండుటచే మార్గాంతరము

91. Sri C. N. Krishnaswami Aiyar : The Three Great Acharyas, p. 209

నన్వేషించుచు నుండ, మధ్వాచార్యుడటకేతెంచి, కొన్నిదినములు త్రివిక్రమపండితునితో వాదించి, జయింప, నా త్రివిక్రమాచార్యుడు ద్వైతమతావలంబకుడైనట్లు పుత్రుడు నారాయణ పండిత కథనము. నారాయణ పండితుడు సాక్షాత్తు మధ్వకాలమునకు జెందకపోయినను తన కాలమున వ్యాప్త విషయముల సేకరించి రచించెను. ఈ రచయిత, తన గురు ప్రాశస్త్య ప్రకటనమునకై ప్రత్యర్థుల వ్యక్తిదూషణము నకు బూనుకొని, గ్రంథమును రచించుట అనుచితమని పండితాభి ప్రాయము. మధ్వాచార్య జీవితమును దెలుపుటకై పూర్వోక్త నారాయణ రచన గ్రంథద్వయమునకు మించి మరొక ఆధారము గానరాదు. అది చింతనీయము.

తిరువనంతపురమున, ఆచార్య ద్వయము పరస్పరాంగీకార సిద్ధాంతమునకు రాజాలక, ద్వేషభూయిష్ఠ వాతావరణమును నెలకొల్పి, పరస్పర పరాజయము నపేక్షించియు, జయింపజాలక, విడిపోయిన పిమ్మట దలవని తలంపుగ నిరువురు రామేశ్వర మహాక్షేత్రమున చాతుర్మాస్య దీక్షార్థము చేరిరి. అచ్చట ముఖాముఖి వీరిరువురును గలిసి తర్కింపకపోయినను, ఎడముఖము పెడముఖములుగా పరస్పర ద్వేష ములతో నిందాదూషణములతో నుండి, ద్వేషమును బెంచుకొనిరి. అంత, మధ్వాచార్యుడు, శ్రీరంగమునకేతెంచి రామానుజాచార్య శిష్యులతో సంప్రతించెను. ఈ విశిష్టాద్వైత, ద్వైతవాదములకు అద్వైతము ఒక్కటి సామాన్య ప్రతిద్వంద్విగ నిలుచుటయు, అద్వైతసిద్ధాంత మాయా వాద ఖండమున విశిష్టాద్వైతులు తనకు బూర్వమే గావించిన అసమాన కృషికి మధ్వాచార్యుడానందమునొంది, అంతవరకు జరిగిన కార్య మసంపూర్ణమును అసంతృప్తికరమని తా భావించుటచే, భవిష్యత్కార్య విధానమును అందే నిర్ణయించుకొనెను. కాని విశిష్టాద్వైత సిద్ధాంతమున

భగవంతుడు సృష్టికి ఉపాదానకారణమను భావము మధ్వాచార్యునికి సమ్మతము కాజాలదయ్యెను. అటులే ముక్తిదశలో జీవుడు ఈశ్వర సమానభోగముల ననుభవించునను సిద్ధాంతమాతనికి దోషముగా గోచరించెను. అంతటితో దక్షిణదేశపర్యటనమును ఆచార్యుడు ముగించి, ఉడిపి నగరమునకు జేరెను.

## భాష్యగ్రంథ రచనము

ఈ దక్షిణదేశయాత్ర, తన అప్రతిహత విద్యా సౌష్ఠవమును మధ్వాచార్యునకు ముందుంచెను. కాని బలీయమైన ప్రత్యర్థులైన అద్వైతవాదముయొక్క అజేయత్వముగూడ బ్రస్ఫుటమయ్యెను. అందుచే యీ పర్యటనా పర్యవసానము మధ్వాచార్య శృంగేరీ శంకరాచార్యులకు మధ్య వైగమ్యము నధికము గావించినదని చెప్పనొప్పును. పండితులతో వాదించునప్పుడు తా రచించిన గ్రంథములుండవలసిన ఆవశ్యకతను గుర్తించి, మధ్వాచార్యుడు, ఉడిపి జేరినవెంటనే తన భావముల గ్రంథస్థము గావించు నభీష్టమున బ్రథమూతః భగవద్గీతా భాష్య రచనమునకు గడంగి పూర్తిగావించెను. ఇది అతని భావి గ్రంథరచనమునకును, సిద్ధాంతప్రచారమునకును బ్రాతిపదిక యని విజ్ఞుల తలంపు. అటులే కొంతకాలమునకు సూత్రభాష్యమునుగూడ నిట రచించి, కాలాంతరమున వారణాసినగర పండితబృందముతో వాదోపవాదముల సల్పి, తదనుగుణముగ గొన్ని సవరణముల గావించి, వేదాంతసూత్ర భాష్యమును మధ్వాచార్యుడు తన ఉత్తరదేశ పర్యటనమున ముగించెనని కృష్ణస్వామి అయ్యరు భావించును. 92

92. Sri C. N. Krishnaswami Aiyar: The Three Great Acharyas, p. 212

# ఉత్తరయాత్ర

అంత మతప్రచార కాంక్ష బలీయమగుటచే, మధ్వాచార్యుడు ఉత్తరదేశ పర్యటనమునకై గడంగెను. మార్గమధ్యమున ఉగ్రారణ్యముల ననంఖ్యాక విచిత్ర అద్భుత సంఘటనముల నెదుర్కొనుచు, అందందుగల మహమ్మదీయ ప్రభువుల బాధల ననుభవించుచు, గొన్ని ప్రదేశముల, నా ప్రభువులతో, వారి పారసీక, ఉరుదు భాషలలో సహితము భాషించి, వారి సంతృప్తచిత్తుల గావించుచు, నెట్టకేలకు హరిద్వార క్షేత్రము నాతడు చేరెను.

అచట గొంతకాలము మౌనదీక్షతో దపమున మునిగి, అట నుండి వ్యాసస్థానమైన బదరికాశ్రమారణ్యముల నెందెందో ప్రజా సమూహమునకు దూరముగ నెవరికి దెలియరాక నుండి, తీవ్ర తపో విహారము నా యతీశ్వరుడు నెరపెను. తత్తపోదీక్షాఫలితముగ విరక్తి భావము విజృంభింప, ప్రచారమునకు దక్షిణదేశమున బునఃప్రవేశము నకు విముఖత్వము గలిగిన మధ్వాచార్యునకు నిస్పృహ ప్రబలిపోయెను.

కాని తీవ్ర యోచనావేదనానంతరము ఆచార్యవర్యుడు మతో ద్ధరణకార్యమునకే సంకల్పించి, తిరిగి హరిద్వారమునకరుగుదెంచెను. పూర్తియయిన తన వేదాంతసూత్రభాష్యమును ప్రచారము గావించుచు, జోళరాజ్యనగరమైన కల్యాణపట్టణమున కేతెంచి, అట, సుప్రసిద్ధ అద్వైతపండితుడైన శోభనభట్టు అను నాతని పరాభూతుని నొనరించెను. ఇదియే మధ్వాచార్యుని ప్రథమ జయము. ఈ శోభనభట్టు మధ్వా చార్యుని శిష్యుడై, ద్వైతమతావలంబకుడై, పద్మనాభ తీర్థులను నామాంతరమును స్వీకరించెను. ఇతడు మధ్వానంతరము ఆ పీఠాధి

పతియై, అనేక ఉపమఠస్థాపనాచార్యుడై, ప్రఖ్యాతుడై ద్వైతమత ప్రచారమున అసంఖ్యాక అనుచరుల నాకర్షణమున సుప్రఖ్యాతి నార్జించెను.

## మఠస్థాపనము

మరియు నందే గల సామిశాస్త్రి యను అద్వైతపండితుడును గూడ మధ్వాచార్యునిచే నోడి, ద్వైతమతావలంబకుడై నరహరి తీర్థుడను పట్టము నొందెను. అతడు ఉత్తరాదిమఠమునకును వ్యాసరాయ మఠమునకు మూలాచార్యుడుగ స్వీకరింపబడెను. ఆంధ్రదేశమున లభించిన యీ జయశ్రీని అలంకరించుకొని, ఆచార్యుడు ఉడిపికి జేరి, తన గురువైన అచ్యుతప్రేక్షులకు తన సూత్రభాష్యమును జూపి, అతనితో వాదించి, అద్వైతవాదము లోపభూయిష్టముగ సమ్మతింప జేసి అతనిగూడ మతాంతరునిగ నొనరించెను.

ఈ విధముగ ననుచరులధికమగుట జూచి, యనేక నియమముల చక్రాంకనాది విధానముల నెలకొల్పి, సంఘీయులందరికి గమ్యముగ నుండుటకై యుడిపియందే సర్వాకర్షణమూర్తియైన శ్రీకృష్ణనికాలయము నిర్మించి, మధ్వమతావలంబకులకు మహాక్షేత్రముగ నుడిపి నొనరించెను. ఆ శ్రీకృష్ణభగవానుడే ద్వైతమతస్థులకు సదా యిల వేల్పువలె భాసించెను.

అయినను మధ్వాచార్యుని ప్రశస్తియు, ప్రముఖ అద్వైత పండితుల మతాంతర స్వీకారము మొదలగు అనేక విషయములు శృంగేరి అద్వైతాచార్యులకును మధ్వాచార్యునకును విద్వేషమును

బెంచెను. ఉడిపి, శృంగేరి స్థానములు దూరములు కాకుండుటయు, ఇరువురాచార్యుల అనుచరకోటియు సన్నిహితులై యుండుటయు నీ విరోధమును దీవ్రమొనరించెను. అందుచే సహజముగ బరస్పర నిందాదూషణములేగాక, పరస్పర హింసాదులుగూడ బ్రబలిపోయెను. ఈ కాలముననే మధ్వాచార్యుడు వ్యాసాజ్ఞచే 'మహాభారత తాత్పర్య నిర్ణయము'ను రచించినట్లు గాథ. వ్యాసభావములపార్థమువకెరయయిన వని దోచి, మధ్వాచార్యుడు మహాభారతమునకు సవరింపులు గావించి వ్యాఖ్యానమును రచించెను. అందు భీమసేన, హనుమంతుని వృత్తాంత మునుగూడ సాకల్యముగ నా యాచార్యుడు వర్ణించెను. తన విధానము నతడు అనేకరీతుల సమర్థించుకొనెను.

మరల మధ్వాచార్యుడు, ఉత్తర దేశాటనము గావించి, అంగ వంగాది రాష్ట్రముల బహుళప్రచారమొనరించి, ఉడిపి నగరమునకు దగ్గరనున్న విష్ణుమంగళ గ్రామమును కేంద్రముగ నొనరించుకొని ప్రచారము జేయుచుండెను. వంగరాష్ట్రమున నీ ఆచార్యుని మత ప్రచారము కాలాంతరమ శ్రీకృష్ణ చైతన్య సంప్రదాయమునకు మార్గ గామి అయినది. స్వస్థానమును జేరిన ఆచార్యుడు, తన ప్రచార విధానమును అధికతరము గావించెను.

కాని పూర్వమేర్పడిన వైషమ్యములు శృంగేరీ మధ్వాచార్యు లకు అధికతరమై ప్రబలము కాజొచ్చెను. శృంగేరీపీఠమును బూర్వము అధిష్ఠించియున్న ఆచార్యుడు విద్యాతీర్థుడు గతించి, అతని శిష్యుడైన విద్యాప్రభావోపేతుడైన పద్మతీర్థుడు ఆ పీఠమునకధిపతి యయ్యెను. మధ్వాచార్యుని ద్వైతప్రచారముచే నద్వైతమునకు గలుగుచున్న

ప్రమాదమును పద్మతీర్థుడు గ్రహించెను. మధ్వాచార్యుని భాష్య ప్రాశస్త్యము, శోభనభట్టాది. మతాంతరములు సంఘమున కడు ప్రభావమును జూపెట్టుచుండెను. అందుచే మధ్వాచార్యకృత భాష్య గ్రంథముల నశింపజేసినగాని యీ ప్రచారము నశింపదని విశ్వసించి, కొందరద్వైతవాదులు ఎట్టులో మధ్వస్థానమును జొచ్చి ముఖ్య గ్రంథ ముల దొంగిలించిరి. ముద్రణాలయములు అభావములైన ఆ దినము లలో వ్రాతప్రతులకెట్టి ప్రాధాన్యత యుండునో మనకగ్రాహ్యము గదా! పూర్వమెట్టి యుద్గ్రంథములు అసంఖ్యాకముగ గాలగర్భమున లయించిపోయినవో! అందుచేతనే లక్షలాదిగనున్న సంస్కృత విద్యా రత్నములు నేడు సహస్రములుగమాత్రము గోచరము గదా!

దీని గాంచిన మధ్వాచార్యుడు సంతాపించి, చాళుక్య వంశము నకు జెంది, విష్ణుమంగళమునే రాజ్యకేంద్రముగ నుంచి, అంచే వసించుచున్న జయసింహ ప్రభువునకు దెలుపుకొనగ, నా రాజ చంద్రుడు ఆ గ్రంథముల నాసాంతము దెప్పించి, మధ్వాచార్యునకు ఒసంగెను. ఈ రాజకుమారుడు మధ్వసిద్ధాంతస్వీకరణము గావింప లేదని చరిత్ర. కాని న్యాయపాలనాదక్షుడగుటచే, మధ్వాచార్యునకు జరిగిన అన్యాయమునకు వెతజెంది గ్రంథముల నిప్పించెను.

అటు పిమ్మట త్రివిక్రమ పండితుడు విష్ణుమంగళమున మధ్వా చార్యు నెదుర్కొని, తొమ్మిది దినములు అద్వితీయముగ వాదించి, అద్వైతము యుక్తిదూరమనియు ద్వైతమే పరమార్థమనియు సమ్మ తించి మతాంతరుడయ్యెను.

ఈ కాలమున మధ్వాచార్యుని జననీజనకులు కాలగతి నొంద, చింతించి, నాటికే వ్యాపారమున నష్టము గల్గియున్న మధ్వాచార్య సోదరుడు విరక్తుడై, ఆచార్యుని జేరి, తురీయాశ్రమ స్వీకారమున విష్ణుతీర్థ నామమును ధరించెను. ఈ కాలమున మధ్వాచార్య నాశ్రయించి, యెనిమిదిమంది శిష్యులు ఆశ్రమస్వీకారము గావించిరి. వీరే మధ్వానంతరమున మధ్వమఠములకు అష్టాచార్యులై విరాజిల్లిరి.

ఈ విధముగ మధ్వాచార్యుడు, తీవ్రమైన జీవితమును సాగించి, తన అవసానకాలమును గ్రంథరచనమున గడిపెను. న్యాయ వివరణము, కృష్ణామృత మహార్ణవము, కర్మనిర్ణయములీ కాలనిర్మితములు. ఉపనిషద్వేదాంతసూత్ర గీతాశాస్త్రముల భాష్యములమాత్రమేగాక, అనేక ప్రకరణ గ్రంథములను, తంత్ర స్తోత్ర గ్రంథములను అతడు రచించెను. అణు భాష్య, అణు వ్యాఖ్యాన, భారతతాత్పర్య నిర్ణయ, భాగవత తాత్పర్యనిర్ణయ, మాయావాద ఖండనాది గ్రంథములు మొత్తమునకు ముప్పది ఏడు రచనములు మధ్వాచార్య నిర్మితములు. ఇవి సర్వమూల గ్రంథములని మధ్వమతస్థుల భావము. బ్రహ్మసూత్రముల యథార్థ ప్రతిపాదనార్థము తానవతరించినట్లు మధ్వుని విశ్వాసము.

## మహాసమాధి

ఇవ్విధముగ అశేష ప్రచారము ద్వైతసిద్ధాంత ప్రసరణమునకై మధ్వాచార్యుడు గావించి, డెబ్బదితొమ్మిదవ ప్రాయమున 1198 వ వత్సరమున పరమపదించినట్లు చరిత్ర. కాని పూర్ణప్రజ్ఞులు మరణించుటను నిర్ధారింప శక్యముకాదు. అతడు ఒక దినమున అంతర్ధాన

మైనట్లును, వ్యాసభగవానుని జేరినట్లును కథనము. అందుచే నా ఆచార్యుని అవసానకాలము, దేహసంస్కారాదులు తెలుపబడలేదు. అదృశ్య మగుటకు బూర్వమా ఆనందతీర్థుడు, పద్మనాభతీర్థునకు సర్వపీఠాధి పత్యమును ఒప్పగించి, శ్రీకృష్ణ మందిరమును ధర్మకర్తల స్వాధీన మొనరించినట్లును స్పష్టము. మధ్వాచార్యుడింకను వ్యాసభగవానుని సన్నిధి నున్నట్లు తన్మతస్థుల విశ్వాసము.

కాలాంతరమున నీ మధ్వమతమున అభిప్రాయభేదములేర్పడి, త్రివిధముగ విచ్ఛిన్నమాయెను. వానికి బరస్పర సంబంధముకూడ నున్నట్లు కానరాదు. అవియే వ్యాసరాయమతము, ఉత్తరాదిమతము, సుమతీంద్రమతము నా ప్రఖ్యాతము. మరియు వీరిలో సిద్ధాంతభాగ మున గొన్ని అవాంతర భేదములుగూడ గోచరము. అంతియగాక రాఘవేంద్ర యోగి యను ద్వైతమతావలంబకుడు అమోఘ తపో గరిమచే ననేక సిద్ధుల గడించి, తుంగభద్రానదీతీరమున మంచిరాల ప్రదేశమున స్థావరమేర్పరచుకొని, అత్యంత ప్రఖ్యాతిని సహస్రాధిక శిష్యవర్యుల నేర్పరచుకొని, దిగవంతుడయ్యెను. ఆ మఠముగూడ మధ్వమతస్థులకు చాల ప్రేమాస్పదము.

ఈ రీతిగ మధ్వాచార్యుడు, తన యసమాన శేముషీ ప్రాభ వముచే నాటి అసంఖ్యాక మతముల నెదుర్కొని, ప్రభువుల యాదర ణమునొల్లక, కేవలము తన విద్యాబలముపై నాధారపడుచు, దేశము నెల్లెడల పర్యటించి, విద్యాధికుల నెదుర్కొని, స్వీయ సిద్ధాంత

స్థాపన ప్రాపనములు గావించుచు నజేయుడై, ద్వైతమతసంస్థాపనాచార్యుడై, సర్వభారతీయ తత్త్వశాస్త్రమున నొక మహదలంకారమై, శంకర రామానుజులతోబాటు ప్రముఖస్థానము నధిష్ఠించి, ఆచార్యత్రయమున శోభిల్లెను. ప్రత్యక్షముగ గోచరించు ప్రపంచముయొక్క సత్యత్వమును స్థిరపరచి, అసంఖ్యాకుల సందేహనివారణము గావించి, ఆ సత్యప్రపంచమునకాధారభూతుడైన శ్రీహరిని సేవించి, ఆతని కృపార్జనమున ముక్తిగాంచుటయే తరుణోపాయమని ముముక్షుకోటికి ఆదర్శ ఆచార్యుడై ప్రకాశించెను. అట్టి ముక్తి నధిష్ఠింప హనుమంతుని దాస్యభావమే ముఖ్యమని, చిత్తశుద్ధికాకరమై ముక్తిప్రదాతయగు భక్తిసిద్ధాంతమును మానవ సమ్ముఖమున నుంచి చరితార్థుడై యొప్పెను. ఆ మూర్తియొక్క శారీరక సౌష్ఠవముతో బుద్ధిబలము విద్యాశక్తులు ఏకమై, పారమార్థిక గగనవిహారమున నాతని విహరింప జేసి, ముముక్షులోకమునకు దారిజూప వీరికి మహదవకాశము నొసంగెను. అట్టి ఆచార్యశ్రేష్ఠునకు సర్వభక్తకోటియు కృతజ్ఞతాభివందనసహస్రముల నర్పించెదరుగాక!



# ద్వైత సిద్ధాంత తాత్పర్యము

శ్రీ మధ్వః ప్రాహ విష్ణుం పరతమమఖిలామ్నాయ వేద్యం చ విశ్వం
సత్యం భేదం చ హరిచరణతారతమ్యం చ తేషాం।
మోక్షం విష్ణ్వంఘ్రిలాభం తదనుభజనం తస్య హేతుం ప్రమాణం
ప్రత్యక్షాది త్రయం చేత్యుపదిశతి హరిః కృష్ణచైతన్యచంద్రః॥

విష్ణువే పరతమ తత్త్వము; విష్ణువు సకల వేదములచే దెలియ దగినవాడు; భేదరూపమైన జగదాదికము సత్యము; జీవులు హరిచరణానుచరులు; జీవులయందు బరస్పర తారతమ్యము గలదు; విష్ణుపాద లబ్ధియే మోక్షము; అద్దానికై నిర్మల భక్తియే సాధకము; ప్రత్యక్షానుమాన శబ్దములు మూడును ప్రమాణములు అని మధ్వాచార్యుడు వచించెను. అదేవిధముగ హరి యగు కృష్ణచైతన్యచంద్రుడుగూడ వక్కాణించును. ఈ కృష్ణచైతన్యచంద్రుని శ్లోకరాజము మధ్వమత ముఖ్యవిషయముల జక్కఁగ గ్రోడీకరించుచున్నది. ఉపోద్ఘాతమున బూర్వము మనము గాంచియున్నరీతి, మధ్వాచార్య సిద్ధాంతమున 'బ్రహ్మ' పదము విష్ణువునకన్వయింపబడి, చాలవరకు పూర్వశబ్దము లోపించి, ఉత్తర శబ్దము ప్రాధాన్యమై యొప్పారినదని యననగును. తన ద్వైత సిద్ధాంత నిర్ణయమునకు బ్రమాణములుగ 'ఋగ్యజుస్సామాథర్వాణశ్చ భారతం పంచరాత్రకం। మూలరామాయణ' (సూ. భా. 1. 1. 3) ములున్నవని ఆచార్యుడు వచించుకొనియున్నాడు. ప్రజానీకమునకు అందుబాటున నున్న భారత, రామాయణములను విశిష్టాద్వైత ప్రచారముచే సంఘమున వ్యాప్తమై యున్న పాంచరాత్రాగమమును.

నీ ఆచార్యుడు ప్రమాణములుగ గైకొని ప్రజాదరణమును జూరగొన యత్నించినట్లు ద్యోతకము. ఈ విధముగ నితడు, ప్రస్థానత్రయము మీదకంటె బురాణములపై నాధారపడినట్లు సువిదితమనియు పండిత రాధాకృష్ణుని వచనము. 93 పై నుదాహరింపబడిన శ్లోకవిషయముల నెట్లు ఆనందతీర్థుడు ప్రతిపాదించెనో సుమంత చూచెదముగాక:

## బ్రహ్మము - విష్ణువు

'బ్రహ్మ శబ్దశ్చ విష్ణ్వాదేవ' (సూ. భా. 1. 1. 1) బ్రహ్మ శబ్దము విష్ణువే యగును అని బ్రహ్మ శబ్దమును అన్వయించి, 'విష్ణురేవ హి తత్రోచ్యతే' (1.1.1) అట విష్ణువే తెలుపబడినది యని వచించి, విష్ణువే 'వేదే రామాయణే చైవ పురాణే భారతే తథా। ఆదావంత్యే చ మధ్యే చ విష్ణుస్సర్వత్ర గీయతే॥' వేదము లందు రామాయణమునందు బురాణములందు అటులే భారతమునందు, ఆదిమధ్యాంతముల విష్ణువే సర్వత్ర గీర్తింపబడుచున్నాడను హరివంశ వాక్యమును సూచించి, బ్రహ్మ శబ్దమునకు విష్ణుపదమే అన్వయ మని మధ్వాచార్యుడు నిరూపించెను.

'జన్మాద్యస్య యతః' (1. 1. 2) అను వేదాంతసూత్రార్థము ఈ విధముగ విష్ణువునకే సమన్వయింపబడి 'సృష్టి స్థితి సంహార నియమన జ్ఞానాజ్ఞాన బంధమోక్షా యతః' (1. 1. 2) ఎవనివలన సృష్టి స్థితి లయములు జ్ఞానాజ్ఞానములు బంధమోక్షములు జరుగు చున్నవో అతడే హరి యనియు వచింపబడెను. 'బ్రహ్మేతి పర

93. Dr. S. Radhakrishnan : Indian Philosophy, Vol. 2, p. 739

మాత్మేతి భగవానితి శబ్ద్యతే వాసుదేవాత్మకం బ్రహ్మ' (1. 1. 13) బ్రహ్మమనగా పరమాత్మ యనియు భగవంతుడనియు అర్థము. వాసుదేవుడే బ్రహ్మము అని బ్రహ్మశబ్దము విష్ణువునకేగాక శ్రీకృష్ణునికి గూడ నన్వయింపబడెను. ఈ విధముగ బ్రహ్మము సర్వ సగుణ స్వరూపముగ జెప్పబడినది. సృష్టికార్యము విష్ణువునకగుగాని సంహార కార్యము రుద్రునిదిగదా అని సంశయించి, సర్వ జగతికి సంహారకుడు విష్ణువనియు, రుద్రుడు నిమిత్తమాత్రుడనియు రూఢిపరుపబడెను (1.2.9) శాస్త్రముల రుద్రుడు గోచరించినచో నతడు విష్ణువునకధీనుడనగూడ వచింపబడును.

అట్టి సర్వాధికార సర్వశక్తుడైన శ్రీ మహావిష్ణువు, తన స్వరూపాత్మకమైన మాయాశక్తిచే సర్వకార్య నిర్వహణము గావించుటచే, 'మాయామయం విష్ణుం' (3 2.27) విష్ణువు మాయామయుడగునని యు, కాన దానే జగత్కర్త యనియు, మాయ యన 'మాయా వయునం జ్ఞానం' అని నిఘంటు తాత్పర్యమనియు, నందుచే ఈ జ్ఞానశక్తిగలవాడు విష్ణువగుననియు మధ్వ భాష్యము. జీవునిలో ప్రాణాదులు ప్రవేశించి, సర్వకార్యముల నెట్లు చేయించునో అట్లు 'ప్రకృతిం పురుషం చైతత్ప్రవిశ్య పురుషోత్తమః' (21.20) ప్రకృతి యందు పురుషోత్తముడు ప్రవేశించి సృష్టికార్యమును జరుపును. శ్రీహరివలన అవ్యక్తము, అవ్యక్తమునుండి మహత్తత్వము, దానినుండి విజ్ఞానము, విజ్ఞానతత్త్వమునుండి మనస్సు, దానినుండి ఆకాశము మొదలగు సృష్టియంతయు జనించెను (2.3.16). అట్లు శ్రీవిష్ణువు సృష్టి కర్త అయినను, పరబ్రహ్మము జగత్తునకు నిమిత్తకారణమగును గాని ఉపాదానకారణముమాత్రము కాదు (1.4 23). హరి

యీ విధముగ నీ అపార సృష్టిని గావించుచున్నను, యిందతనికెట్టి సంబంధములేక, యథా లోకే మత్తస్య సుఖోద్రేకాదేవ నృత్తగానాది లీలా న తు ప్రయోజనాపేక్షయా। ఏవమేవేశ్వరస్య నారాయణ సంహితాయాం చ సృష్ట్యాదికం హరిర్నైవ ప్రయోజనమపేక్ష్యతు' (2. 1. 33) ఉన్మత్తుడు లోకమున జేయు నృత్యగీతాది క్రియలు కేవలము లీలలుగామాత్రముండి స్వప్రయోజనమెట్లుండదో అటులే పరమేశ్వరుడు కేవలము ప్రయోజనాపేక్షలేకయే సృష్టిని గావించు చున్నాడు, నారాయణ భాసా వా సర్వం విభాతి' (1. 3. 22) నారాయణుడు ప్రకాశింప సర్వము ప్రకాశించును. అనగా సూర్య చంద్రాదులు అతని ప్రకాశమువలనమాత్రమే ప్రకాశింపగలుగు చున్నారు. అతడనంతుడై, పాదత్రయమున ద్యులోక వైకుంఠాదిక మును గలిగి, నతని విరాడ్దేహమున స్వల్పభాగమున నీ బ్రహ్మాండ ముండును (1.1.23).

మరల నీ హరి సర్వకాల సర్వదేశములందు అవ్యక్తరూపుడై యున్నను, స్వేచ్ఛానుసారముగ స్థూలరూపముల దాల్చుచుండును (3.2.25). అయినను అతనికెట్టి జననాది వికారములు గలుగనేరవు (1.3.13). అట్టివి అవతారములు నాబడును. శ్రీరామ కృష్ణాద్యవ తారములందుండి వచ్చినవే యని భావము. అవి లయకాలమున మరల మూలమైన శ్రీమహావిష్ణువునందే లయించును (1. 1. 9). అయినను నీ అవతారముల కార్యములతో నాతనికెట్టి సంబంధము నుండనేరదు. అటులే నతడు నిరవయవుడై యుండియు, జీవునిలో నంతర్యామిగ నుండి, అతనిచే కార్యముల జేయించును. అది పర మేశ్వరుని విచిత్ర శక్తిమూలమున జరుగును (2. 1. 27).

# జీవులు

జీవులణుపరిమాణము గలవారై, ఈశ్వరునకు నిత్యముగా భిన్నులై యున్నారు. జీవేశ్వర విభేదము పారమార్థికముగ నున్నది (1.3.5). అతడు పరమాత్మయొక్క ప్రతిబింబమగుటచే జీవునకు నాశనములేదు. కావున నతడుగూడ నిత్యుడే అగుచున్నాడు. పరమాత్మ వలన జనించిన జీవుడు నిత్యుడే అగును (2.3.18). అందుచే జీవేశ్వర భేదము భ్రాంతి కానేరదు (1.1.19).

జీవులవలెనే అవతారపురుషులునుగూడ ఈశ్వర ప్రతిబింబము లైనను వ్యత్యాసము గలదు. ఈ జీవులలో నిరంశజీవులనియు, సాంశ జీవులనియు ద్వివిధము. అందు నిరంశజీవులు మనుష్యాది జీవరాసు లగుచుండ, దేవగంధర్వాదులు సాంశజీవు లగుదురు. మత్స్యావతా రాదులు ప్రతిబింబములుగాక సాంశములే యగుచున్నవి. జీవులకు సమ్యక్‌శక్తి అభావము కాని అవతారములకట్టి శక్తి గలదు. జీవులు భిన్నాంశులైయుండ, అవతారములు స్వాంశములగును. కాని శ్రీకృష్ణుడు మాత్రము అంశముగాక సాక్షాత్తు భగవంతుడే యని మధ్వమత సిద్ధాంతము (2.3.45).

అందుచే జీవులు ప్రళయాగ్నికిని మిణుగురు పుర్వునకు గల వ్యత్యాసమును బోలిన తారతమ్యమును ఈశ్వరునితో గలిగి (2.3.45), 'సర్వజ్ఞో ల్పజ్ఞతాభేదాత్సర్వశక్త్యల్ప శక్తితః। స్వాతంత్ర్యపార తంత్రాభ్యాం సుభోగే నేశజీవయోః॥' (1.2.8) సర్వజ్ఞత్వ అల్ప జ్ఞత్వములును, సర్వశక్తిత్వ అల్ప శక్తిత్వములును గలిగి, ఈశ్వర జీవులు స్వాతంత్ర్య పారతంత్ర్యములతో నుందురు. అందుచే జీవుడు అస్వతంత్రుడై పరమేశ్వర ప్రేరణమున ప్రవర్తించుచుండును

(2.3.40). మనుష్యుని చేతగల కర్ర విగ్రహమువలె, జీవుడు పరమేశ్వరాధీనుడు (2.1.23). అటుల జీవునకు భగవదధీన కర్తృత్వము మాత్రము గలిగి (2.3.39), ప్రపంచమున వ్యవహరించును. ఆ భగవదధీన కర్తృత్వముగూడ నతని పూర్వకర్మానుసారమేర్పడుచుండును. అందుచే బరమాత్మయొక్క సమత్వదృష్టికి లోపము వాటిల్ల నేరదు (2.3.41). అటుల జీవుడు ప్రతిబింబమగుటచే స్వాభావికముగ ఆనంద విజ్ఞానముల బలతేజముల గలిగియున్నను, పరమాత్మ అనుగ్రహముచేతమాత్రమే అవి వికసించును (2.3.30). అవియు ఉత్తమ మధ్యమాధమ తారతమ్యము ననుసరించి, జీవులలో బరస్పర విభేదమునకు గారణములగును (3.2.34). ఈ విధముగ జీవేశ్వరులు సర్వవిధముల భిన్నులై రాజిల్లుచున్నారు. ఇటుల వీరిరువురు అత్యంత భిన్నులై యుండుటచే వీరికి బారమార్థిక విభిన్నత్వము గలదని ద్వైత సిద్ధాంతము. మరియు నీ జీవులుగూడ బంధదశలోవలె ముక్తదశలో గూడ, అన్యత్వము గలిగి సదా భిన్నులుగ నుందురనియు యీ మత విశ్వాసము.

## సాధన

అట్లయ్యును జీవుడు సాధనాతత్పరబుద్ధి, తపోగరిమ సాధించినచో నతడు ముక్తిని బొందు నవకాశముండును. మధ్వసిద్ధాంతము ననుసరించి అపరోక్షజ్ఞాన, భక్తులు రెండును సాధనకు మూలాంగములు. కాని, అవిసిద్ధించుటకు, జ్ఞాన ప్రతిబంధములగు సంశయ విపరీత జ్ఞానములు తొలంగుటకు, శ్రవణ మననములుపయుక్తములు. అయినను ధ్యానమే భగవద్దర్శనమునకు ముఖ్య సాధనముగ గ్రాహ్యము (3.3.42). శమదమాది సాధనసంపత్తియు, శ్రీవిష్ణువునుగూర్చి శ్రవణ

మననాదులును, భక్తిసాధనమునకు బరమోపయోగములు. అవి విష్ణు కృపాప్రసాదమునకవసరము. కాని, ముక్తికి కర్మ పరంపరాసాధన మగుచుండ, జ్ఞానము ముఖ్యసాధనమే యగును. కర్మ ననుసరించుటచే జ్ఞానోపలబ్ధి జనించును (1.1.1). ఆవిధముగ గర్మ, జ్ఞానమునకు సహకారిసాధనము నగుచున్నది (3.4.33). కర్మ, జ్ఞానముల ప్రతిపాదించిన జైమిని, వ్యాసులు శిష్య గురు సంబంధముననున్న వారి సిద్ధాంతముల పరస్పర వైరుధ్యము ఎట్లుండును (3.4.9)? ఇచట జ్ఞానము అనగా శ్రీహరితత్త్వజ్ఞానమని గ్రాహ్యము. అనగా ద్వైత సిద్ధాంతముయొక్క పంచవిభేద జ్ఞానమనియు విదితము. అందులకు శాస్త్రాధ్యయనము, తద్ జ్ఞానములును అత్యవసరములు. అందుచేతనే వేదాధ్యయనపరునకే అపరోక్షానుభూతికధికారముగ మధ్వాచార్య నిర్ణయము (3.4.12). ఆ విధముగ నుపనిషత్సూత్ర గీత నాబడు ప్రస్థాన త్రయముల కూలంకషజ్ఞానము, బ్రహ్మతత్త్వనిర్ణయము గావించి బ్రహ్మధ్యానమునకు ప్రయోజనకారియై, పరమాత్ముని గుణపూర్ణధ్యానమును గలుగజేయును. అట్టి ధ్యాననిమగ్నత పరమేశ్వరానుగ్రహ హేతువగును. ఆ యీశ్వరకృపయే ముక్తికారణము. కావున ఆత్మను, బరమాత్మభావముతో ధ్యానింపవలెనని స్పష్టము. ఆత్మజ్ఞానము గాంచని వాడు ఆ భగవంతుని తన యజమాని అను దృష్టితో భావించి ధ్యానింపవలెను (3.3.15).

మరల నీ ఉపాసనావిధానము ద్వివిధము. శాస్త్రాభ్యాస స్వరూపిణి అనియు ధ్యానరూపమనియు గ్రాహ్యము. పూర్వోక్తచందము శాస్త్రాభ్యాసము ధ్యానమునకు బూర్వమై యుపకరించును. ధ్యానమున ధారణాదికము అంతర్గతము. ఈ భక్తి, సాధారణి, పరమా, స్వరూప

పద్ధతుల మరల త్రివిధము. శాస్త్రాధ్యయనమునకు బూర్వము సాధారణ భక్తి యనబడును. జ్ఞానానంతరము పరమ భక్తి నాబడును. స్వరూపభక్తి మూడవదియై, అధికానందము ననుభవింపజేయును. దానినే సాధ్యభక్తి యనియు నైజసుఖానుభూతి యనియు నందురు.

మధ్వాచార్యుడు, తన మహాభారత తాత్పర్యనిర్ణయమున భక్తిని గూర్చి యీ విధముగ వివరించియున్నాడు. 'మహాత్మ్యజ్ఞానపూర్వస్తు సుదృఢః సర్వతోధికః। స్నేహో భక్తిరితి ప్రోక్తస్తయా ముక్తిర్న చాన్యథా॥' (1.86) పరమాత్మను సర్వేతరములకంటె నత్యధికతరముగ, గ్రహించి, ప్రేమించుట భక్తి యని నిర్వచనము. అట్టి భక్తిమూలముననమాత్రమే ముక్తిగాని యితరములచే గాదు. 'భక్తిర్మోక్షయ కేవలా। ముక్తానామపి భక్తిర్హి నిత్యానంద స్వరూపిణీ' (1.106) భక్తియే మోక్షము. ముక్తులకుగూడ భక్తియే నిత్యానందస్వరూపము అనియు ఆచార్యుని వివరణము.

శ్రీహరి ధ్యానసమయమున అతని దుష్టశిక్షణాది లక్షణముల ధ్యానింపక, శిష్టరక్షణాది గుణముల ధ్యానింపవలయును. సర్వవిద్యలు ఆ పరమాత్ముని నామములు కావున నతని సమస్త కల్యాణగుణ పరిపూర్ణునిగ ధ్యానింపవలెను (3.3.8). హృదయమునందును, ప్రతిమాదులయందును, అధిష్ఠానమైన శ్రీహరియందును ధ్యానముంచవలెను. వీనినే అంతర్గత భగవద్రూపోపాసనము, బహిర్గత భగవద్రూపోపాసనము, అంతర్బహిస్సర్వగత భగవద్రూపోపాసనము అనియు నందురు (1.1.31).

ఈ విధముగ పరమాత్ముని నియమబద్ధముగ ధ్యానించుటవలనను, ఆ తత్త్వస్వరూపమును యోచించుటవలనను, సాధన పూర్తియగుటతోడ సాధకునకు పరమాత్మ దర్శనమొనంగును (3.2.26). అందులకొ పరమేశ్వరుని నిర్హేతుక జాయమానకటాక్షముగాక అన్య సాధనము గానరాదు (3.2.23). మరియు నిందులకై సద్గురూపదేశమవసరము. ఒక గురువువద్ద సాధనోపదేశమైన పిమ్మట, అధికతర సామర్థ్య సంపన్నుడైన గురువు లభించినచో నతని నాశ్రయింపవచ్చును (3.3.45). అట్లయ్యును, దేవతలలో శ్రేష్ఠుడును (4.2.3), సర్వ వ్యాపియునైన వాయుదేవుని అనుగ్రహము లేనిది, ఎద్దియు సాధ్యము కానేరదు. అందుచే నీ మధ్వసిద్ధాంతమున వాయుదేవునకును, అతని పుత్రుడైన ఆంజనేయునకును, గురువుకంటె ఉన్నతస్థానమీయబడి, వారి కృపాసిద్ధికై సాధనములు గోచరము.

## జ్ఞానులు

పైవిధముగ భక్తియందు నిష్ణాతులై భగవద్దర్శన మహాభాగ్యము నొందినవారే జ్ఞానులు. వారే సిద్ధులు. వీరికి ఫలోన్ముఖమైన ప్రారబ్ధకర్మగాక నన్య కర్మలన్నియు నశించును (4. 1. 15). వారు కర్మల చేయుటయందుగాని మానుట యందుగాని స్వతంత్రులు (3.3.28). మానుటచే వారికెట్టి ప్రత్యవాయము లేదు (3.3.29). కొందరు బ్రహ్మజ్ఞానులు గృహస్థాశ్రమమునుగూడ ద్యజించి, తురీయాశ్రమమును స్వీకరించిరిగదా! అందుచే వారికి కర్మనియమము గానము (3.4.15). కర్మ నాతడు ఆచరించినను అది లీలామాత్రమై యుండును. స్వాధ్యాయానంతరము సామగాన విధిలేకున్నను గావింపబడుచుండునట్లు జ్ఞానులుగూడ నుపాసనము జేయుచునే యుందురు

(3.3.25). శ్రీహరిని తన స్వామిగ నుపాసించుటుచితముగాని, తానే శ్రీహరి యని ధ్యానము చేయరాదు (4.1.3).

## ముక్తి

పరమాత్మయందు ధ్యాననిష్ఠచే జీవునియందంతర్గతమై స్వాభావికమైయున్న శాశ్వదానందమును జీవుడు పొందును. ఇంతదనుక నా యానందము అజ్ఞానావరణముచే నావృతమై అనుభూతము కాకుండెను. అంత నాతడు పరమాత్ముని ముఖాముఖి దర్శనమున నుండజాలును. ఆ పరమాత్మునియొక్క అనుగ్రహము ఆ ముక్తునికి లభించును. సంసారోత్పత్తికి అనగా జన్మకారణమైన అజ్ఞానబీజములంతటితో సర్వనాశము నొందును.

అచటగూడ జీవులు పరమాత్మతో నైక్యము నొందక అన్యముగ, ప్రత్యేకముగ నుందురు. జీవేశ్వరవిభేదము పారమార్థికముగదా. అంతియగాక ముక్తులలోగూడ వారి ఆనందానుభూతిలో వ్యత్యాసముండును. ఉత్తమ భక్తులకు నానందమధికతరముగ నుండును. చతుర్ముఖబ్రహ్మయొక్క అనుభవము సర్వాధికముగాన నతడు శతానందుడని అనబడెను (3.2.21). మనుష్యులకంటె గంధర్వులకు, వారికంటె ఋషులకు, వారికంటె దేవతలకు, దేవతలకంటె రుద్రునకు, ఆ రుద్రునికంటె బ్రహ్మకు ఆనందానుభూతి అధికము (3.2 31). అయినను వారిలో అసూయాద్వేషములభావము. వారందరును బరస్పరోపయుక్త వ్యవహారముల నుందురు (3.3 33). సాధనచే భగవద్దర్శన ప్రాప్తి నొందినవారందరును ముక్తి నొందెదరు (4.1.42). ముక్తులుగూడ వారికుచిత ఉపాసనము గావించుచు నుందురు. వారికి ఉపాసనావిధానము స్వాభావికమగును (4.1.12).

భగవద్దర్శనము నొందిన ఉపాసకులు ముక్తి బొంది, ప్రథమతః సత్యలోకమునకరుగుదురు. అంత, బ్రహ్మప్రళయ కాలమున అతనితో శ్రీహరి సాన్నిధ్యమునకు జేరి (3.3.21), శ్రీహరితో నైక్యముగాక, అన్యముగ నుండి (2.1.13), విభాగములేని భోగముల ననుభవించెదరు (4.4.4). వారికి స్థూల శరీరములుగాక ప్రత్యేక శరీరప్రాప్తి కలుగును (4.4.3). వారు ప్రత్యేకమైన, స్వతంత్రమైన కోర్కెలులేక అవిభాగ సంకల్పులై, భగవదధీనులై, భోగముల ననుభవించుచుందురని మధ్వాచార్యవర్యుని సిద్ధాంతము. వీరికి సర్వజ్ఞత్వ, సర్వ శక్తిత్వ, సర్వవ్యాపకత్వాది ఈశ్వర లక్షణములు ఎవ్వియు ప్రాప్తింపవు. వారు సృష్ట్యాది కార్యముల నిర్వహింప శక్తులు కారు.

ఈ విధముగ, మధ్వాచార్యవర్యుడు జీవేశ్వర, జగదీశ్వర, ప్రకృతిప్రకృతి జీవజీవ, జీవజగత్తులకు నిత్యవిభిన్నత్వమును ప్రకటించి, స్థూల దృష్టికి గోచరించు యీ విభేదములు నిత్యములైనవని చాటి, వానికి పారమార్థిక స్థానమునుగూడ నొసంగి, బద్ధదశలోమాత్రమేగాక మోక్షదశలోగూడ నీ భిన్నత్వమును గొంపోయెను. అందుచే ముముక్షువులకు దాత్త్వికవిషయ సంశయములు దూరమై, నిర్గుణబ్రహ్మస్థానమున గుణపూర్ణుడైన శ్రీహరి సర్వాకర్షణమూర్తియై వెలుగొందుటచే భక్త్యుపాసనముల గమ్యము సుస్థిరమై, ప్రత్యక్షమై యున్నది. అందుచే, ముముక్షువులకు అధికతరముగ సర్వోపయుక్త సాధనావిధానమును బోధించెననుట విదితము. తాత్త్విక కాఠిన్యమును నీ ఆచార్యుడు మృదువుగ జేసి, సాధకులకు అసాధారణముగ మేలు నొనరించెననిన యుత్తమము. అటులు, సాధకబాధకముల గమనించి, వారి ఆధ్యాత్మికాభివృద్ధికై తపించి, సుగమ విధానమును వారికి ప్రసాదించిన ఆనందతీర్థ నామక మధ్వాచార్యవర్యునకు సర్వదా కృతజ్ఞులము.

# భేదాభేద సిద్ధాంతము

## శ్రీ నింబార్కాచార్యుడు

రామానుజం శ్రీ స్వీచక్రే మధ్వాచార్యం చతుర్ముఖః ।
శ్రీవిష్ణుస్వామినం రుద్రో నింబాదిత్యం చతుస్సనః ॥

ప్రమేయరత్నావళి

రామానుజాచార్యుడు శ్రీదేవి సంప్రదాయమును స్వీకరించెను. మధ్వాచార్యుడు బ్రహ్మ, విష్ణుస్వామి రుద్ర, నింబాదిత్యుడు సనక సనందాదుల సంప్రదాయముల స్వీకరించిరి. ఈ సనక సంప్రదాయము భేదాభేదమనియు, ద్వైతాద్వైతమనియు, స్వాభావిక భేదాభేదవాద మనియు వర్ణితము. The theory of Bhedabheda is based on the integrity of normal experience, satisfies the tests of reasoning and Sruti 94 భేదాభేదవాదము సామాన్య అనుభవ సత్యత్వముపై నాధారపడి యున్నది. అది యుక్తి, శ్రుతుల పరీక్షల సంతృప్తి పరుపగలదు. మరియు Does full justice to the philosophical demands of monism and pluralism without in any degree sharing in their defects 94 అద్వైత, ద్వైత వాదముల తాత్త్విక విషయములకు సంపూర్తి న్యాయమును గలిగించుచు, వాని లోపముల నేమాత్రము భాగస్వామిగాక యున్నదని ఆచార్య శ్రీనివాసాచారి దృఢాభిప్రాయము. పండితాచార్య కోకిలేశ్వరశాస్త్రి అభిప్రాయమునగూడ, This doctrine of Nimbarka has a

94. Prof. P. N. Srinivasachariar: The Philosophy of Bhedabheda, p. 15

fascination of its own, especially for those who donot care to dive deep into the labyrinth of subtle logical and metaphisical arguments, and yet desire to know what the celebrated system of Vedanta has to teach 95 నింబార్క సిద్ధాంతము ముఖ్యముగా సూక్ష్మ తార్కిక, అభౌతికవాద వ్యూహమున లోతునకు గ్రుంక నిచ్ఛగింప, ప్రముఖ వేదాంత సిద్ధాంతోపదేశముల దెలియగోరువారికి ప్రత్యేకాకర్షణము గలిగియున్నది. ఉపనిషచ్ఛాస్త్రములు బ్రహ్మైకత్వమును దెలుపుచున్నను, ఒక్కొక్క చోట జీవ బ్రహ్మ విభిన్నత్వమును బ్రహ్మ జగత్తుల అన్యత్వములను ప్రతిపాదించుచున్నవి. ఈ యుపనిషద్వాక్య పరస్పర వైరుధ్యము, కొందరు శాస్త్ర అపౌరుషేయవాదులకు కేవలము అప్రాధాన్యముగ దోచవచ్చునని వాదించి, Nevertheless the discrepancy has somehow to be explained, and the easiest way to do it is to assign equal validity to the two teachings. That will yeild the Bhedabheda view; and the ultimate Reality, as taught in the Upanishads, will be neither a bare unity, nor a mere plurality, but a vital synthesis of both 96 అయినను యీ వైరుధ్యమును నెట్టులైన సమన్వయింపవలెను. దానికై ద్వివిధ బోధలకు సమప్రామాణికత్వము నొసంగుటయే సులభోపాయము. అట్టి సమన్వయము భేదాభేదవాదమొసంగును. సత్పదార్థము, ఉపనిషత్తుల బోధింపబడిన చందము కేవలము ఏకమును గాక, కేవలము నానాత్వమునుగాక, ఏకత్వ నానాత్వముల ఏకస్వన

95. Prof. Kokileswar Sastri : The Vedanta Philosophy of Sridhar Muzumdar, p. 4

96. Prof. M. Hirayanna : The Philosophy of Bhedabheda of Srinivasachariar, p xiii

రూపము అని ఆచార్య హిరయన్నని స్పష్టీకరణము. కావున Acharya Nimbarka reconciles all the different views, regarding the Lord, taken by Acharyas Sankara, Ramanuja, Madhva and others, and proves that their views are all true in respect of the particular aspect of Brahman dealt with by them 97 ఆచార్య నింబార్కుడు, శంకర రామానుజ, మధ్వాది ఆచార్యులు, భగవంతునిగూర్చి గలిగియున్న వివిధాభిప్రాయ ముల సమన్వయించి, ఆ యాచార్యులు బ్రహ్మముయొక్క ఒక్కొక్క ప్రత్యేకస్థితినిగూర్చి అభివర్ణించుటచే, నన్నియు సత్యములే యని నిరూపించెను అని పండిత శ్రీధర ముజుందారుని విశ్వాసము. ఎట్లన, బ్రహ్మముయొక్క సర్వాతీతస్థితిని శంకరుడు స్వీకరింప, రామానుజుడు ముఖ్యముగ అంతర్యామిత్వస్థితిని గైకొనెను. వీనిని సమన్వయించు టయే నింబార్కాచార్యుడు గావించిన మహాకార్యము.

ఈ విధముగ ఆచార్య రోమా చౌధురి తాత్పర్యమున It is here that Nimbarka does the greatest service to mankind by pointing to a path which satisfies both intellect and feeling, head and heart, without overemphasizing the one at the expence of the other 98 ఇచ్చటనే ధీ యుద్వేగముల, బుద్ధి హృదయముల సంతృప్తి పరచుచు, నొకదానిచే రెండవదానికి బాధ కలుగునట్లు అతిగ సమర్థించుటచేత, నొక మార్గ మును సూచించుచు, మానవకోటికి మహోత్కృష్ట సేవ నింబార్కుడు

---

97. Sri Sridhar Muzumdar: The Vedanta Philosophy, Pre. p. 3

98. Prof. Roma Chaudhuri: The Cultural Heritage of India, Vol. 3, p. 348

గావించెను. అందుచే నీతడు తత్త్వశాస్త్ర చరితాకథనమున నొక ప్రముఖ స్థానము నలంకరించి, పంచతత్త్వములనబడు రామానుజ, మధ్వ, వల్లభ, నింబార్క, చైతన్యులనబడు పంచ వైష్ణవాచార్యులలోగూడ ముఖ్యస్థానము నధిష్ఠించి ముముక్షులోకమునకసాధారణమగు మేలు గావించియున్నాడు. పూర్వాచార్యుల మార్గము ననుసరించి, కాని తాత్త్విక విషయముల వ్యక్తిత్వమును ప్రదర్శించి, ఏకత్వ నానాత్వములకు, జగదీశ్వరులకు గల అగాధ సంబంధమును అగాధ సమస్యను తెలిపి నివారింపగలిగె నీ నింబార్కుడు తన అసాధారణ ప్రజ్ఞాయుధమున.

'అతః కలౌ భవిష్యంతి చత్వారస్సంప్రదాయినః। శ్రీ బ్రహ్మ రుద్రసనకా వైష్ణవాః క్షితి పావనాః॥' కలియుగమున లోకపావనమైన వైష్ణవులు, లక్ష్మి, బ్రహ్మ, రుద్ర, సనక సంప్రదాయములని నాలుగు విధములుగ నుందురు. అందు పూర్వ శ్లోకార్థము ననుసరించి సనకసంప్రదాయము నింబార్కాచార్య సంబంధము. అనగ నీ సంప్రదాయసిద్ధాంతము నింబార్కునితో ప్రారంభముకాక, అంతకు మున్ను ప్రఖ్యాతులైన సనక సనంద సనత్కుమారాదులుగ గలిగి అనాది పరంపరాసిద్ధమై యొప్పారుచున్నది. నారదమహర్షియు నీ సంప్రదాయమునకు మూలాచార్యుడుగ జెప్పబడును. కాని యీ యాచార్యవర్యుల తత్సంబంధరచనలు లుప్తము. అంత నీ సంప్రదాయ బీజములు వేదాంతసూత్రముల 1.4.21; 3.4.45; 4.4.6; సూత్రముల సూచితమైన ఔడులోమ్యాచార్యునిలో ప్రస్ఫుట గోచరము. అయినను అతఃపూర్వుడైన సనకునిపేర సంప్రదాయము ప్రఖ్యాతమగుట నా మునివరేణ్యుడు దీని నా కాలమున బహుళప్రచారమొనర్చుట యిందుకని తోచును.

ఈ నింబార్కాచార్యుడు ఆంధ్రదేశమున బళ్లారిమండలగల ముంజీ పట్టణవాసి అనియు, అదియే నింబ గ్రామమనియు కొందరి అభిప్రాయము. 99 అంత బృందావనమునకేగి అతడు నివసించెనని వారి తాత్పర్యము. అట్లుగాక అతడు బృందావనమున యమునాతీర మున జనించెననియు, గొందరి యుద్దేశ్యము. అదియునుగాక ఆంధ్ర దేశమున కడపమండలమున జమ్మలమడక తాలూకా మంగపట్టణమున నీతడు జనించినట్లు వాసుదాసస్వామి రచనము. 100 సరస్వతీ జగ న్నాథులు అతని మాతాపితలు. వైష్ణవ వంశమునగల బ్రాహ్మణ కుటుంబమున నింబార్కాచార్యుని అవతరణము. అతడు ఆజన్మ నైష్ఠిక బ్రహ్మచర్యవ్రతస్థుడు. పదమూడవ శతాబ్దమునకాతడు జెందియుండు నని రాధాకృష్ణ పండితుని భావము. అట్లుగాక క్రీ. శ. 1162 వ సంవత్సరము నింబార్కాచార్యుని మరణకాలముగ భండార్కరు పండి తుని నిర్ణయమనియు నిదియే సమ్మతమనియు ఘుర్యే పండితుని అభిప్రాయము 101 ఈతడు నింబార్క, నింబాదిత్య, నిత్యానంద, హరిప్రియ నామములచేతను, నియమానంద నామమునను ప్రఖ్యాతము.

'వేదాంతపారిజాత సౌరభము' నాబడు తన సూత్రభాష్యమున 'పరమాచార్యైః శ్రీకుమారైః అస్మద్గురవే శ్రీమన్నారదాయ ఉపదిష్టః' (1.3.8) పరమాచార్యుడైన సనత్కుమారుడు శ్రీ నారదునకు నుపదే శించినది అనుటయు నందుచే సనత్కుమారుడీ భూమవిద్యను నారదున కుపదేశించె ననుటయేగాక నిట, 'అస్మద్గురు' శబ్దముండుటచే నింబార్క

99. Dr. S. Radhakrishnan : The Brahma Sutras, p. 78
100. శ్రీ వావిలికొలను సుబ్బారావు, : భక్తసంజీవని, 1935, పు. 343
101. Prof. G. S. Ghurye : Indian Sadhus, p. 173

నకు నారదుడు గురువు అయినట్లు విదితము. అటులైన యీ నారదు డెవరు? ఉపనిషత్పురాణేతిహాసములలో ప్రసిద్ధుడైన నారదుడా? అను సందేహముదయించుట సామాన్యము. కాని ఆ నారదుడే యితడైనచో నింబార్కునకు సమకాలీనుడు గాకపోయినను అతనిపై దనకు గల అపార భక్తి విశ్వాసములచే నింబాదిత్యుడు అతని స్వీయ గురు దేవునిగ స్తుతించినట్లు ద్యోతకము. అంతియగాని సాక్షాత్ గురువు కానేరడు. ఛాందోగ్య శ్రుతిలో గల నారద సనత్కుమార సంవాద గాథ యిట ప్రస్తావితముగాన అర్వాచీన నారదుడెవ్వడును యిట అప్రస్తుతము. కావున నింబాదిత్యుని సాక్షాత్తు గురువవ్వడెవడో అగ్రాహ్యము గాని, నారదమునీంద్రుని వ్యక్తియు, బోధనలును యితని నెక్కువగ నాకర్షించియున్నట్లు స్పష్టము. ఈతని సంప్ర దాయము సనకాది లేక సనాతన సంప్రదాయమని స్పష్టము. మరియు నింబార్కుడు శ్రీవిష్ణువుయొక్క సుదర్శనచక్రావతారమని సంప్ర దాయజ్ఞుల విశ్వాసము. కావున నిది సుదర్శన సంప్రదాయమనియు ప్రతీతి.

పూర్వముండిన రామానుజీయ మాధ్వ వైష్ణవములకంటె, నే విశిష్టత్వము నింబార్క వైష్ణవముననుండి, ఉత్తరదేశమున బహుళ వ్యాప్తి నొంది, అసంఖ్యాకమైన అనుచరకోటిని సంపాదించియున్నది? ఇది చాల విచారణీయాంశమే. పూర్వము వచింపబడినచందము మానవ హృదయము, తన యింద్రియములకానందకర వస్తుసముదాయమునకై అన్వేషించి, తత్ప్రాప్తిచే తన్మయత నొందు ప్రవృత్తిని గలిగియున్న చందము, మానవహృదయవీణయు దత్తదానందదాయకవిషయములకై ఆకాంక్షించి, తత్ప్రాప్తిచే ఆనందతన్మయత్వము నొందును. తన ప్రవృత్తులలో మానవునకు ప్రేమ అతి సున్నితమై, సర్వ సుఖ

దాయకమై విరాజిల్లుటయు, నది ఐహికము అగుచోట నా రాగముతో సహా, వెలుగువెంట నీడవలె ద్వేషముండుటయు, నందుచే నా రాగ మాధుర్యము సంకుచితమగుటయు మానవ అనుభవవేద్యము. అట్లుకాక ఆ యా ప్రేమవాహిని యెప్పుడు పరమై ప్రసరించి, Love for Love's sake ప్రేమ ప్రేమకొరకు అను సూక్తి ననుసరించి, ఆ పరమేశ్వర పాదారవింద దర్శన, స్పర్శన, సేవనా భాగ్యమునకై ఆరాటపడుచు, అందే గమ్యము నుంచి మైమరచు స్థితినుండునో అది భక్తి నాబడును. అట్టి భక్తిమాధుర్య రుచులు భక్తాగ్రేసరులైన మహాత్ములకే ఎరుక!

కాని, అట్టి అసమానమైన భక్తికి, మానవ ప్రవృత్తులలో నతిసూక్ష్మమై పవిత్రమైన యీ మానవహృదయ స్పందనశక్తికి గమ్యముగా తత్తుల్యమైన విషయము ముందుండవలెను. కేవలము, అవాఙ్మానసగోచరమైన పరతత్త్వముగాక, సచ్చిదానందలక్షణ సంశోభితమై, 'సత్యం శివం సుందరం' అను సల్లక్షణోపేతమై, 'రసో వై సః' అనురీతి రసస్వరూపమై, 'ఆనందో వై బ్రహ్మేతి' అనుమాడ్కి ఆనందరూపమై యున్న అద్భుత తత్త్వము ఎట్టెదుటనున్నగాని మానవ హృదయసూచిక అయస్కాంతముచే నాకర్షింపబడ నేరదు.

అందుచేత శంకరుని సర్వాతీత పరబ్రహ్మము, రామానుజునికి శ్రీమహావిష్ణువై, లక్ష్మీసమేతుడై, అనంతకళ్యాణ గుణగణాలంకారుడై, మానవహృదయముల గొంత నాకర్షించెను. కాని ఆ మహావిష్ణువు ఒక మహాప్రభువు. భక్తుని హృదయమును అతి సన్నిహిత స్థానమునకు జేర్చుకొనగలవిధానమందు లోపించినదననగును. అటులే మధ్వాచార్యుని శ్రీహరియు రామానుజుని విష్ణువువలె భక్తునికి అప్తుడు

కాదేమో అని దోచును. అదియునుగాక, పై యిరువురు వైష్ణవాచార్యులు తమ రచనముల నెప్పుడు తాత్త్వికమొనర్చి, భక్తుని యాకర్షించు నా భగవత్తత్త్వ అభివర్ణనముల గావింపలేదేమో: మధ్వాచార్యుడందులకు సర్వాకర్షణమూర్తిగ భక్తునికై శ్రీకృష్ణుని గైకొని, శ్రీకృష్ణుడే శ్రీహరి యని అన్వయించి యున్నను, వాయుదేవుని, అతని సుతుడైన ఆంజనేయునిగూడ భక్తుని ముందుంచి, శ్రీహరి సేవాధర్మమును గానుపింపజేసినను, అవి అప్రధానమైనవని చెప్పనొప్పును. అయినను యిట శ్రీకృష్ణుడు సంపూర్ణస్వరూపుడు కాలేక, భక్తుల నెక్కువగ నాకర్షించజాలదయ్యెను.

ఈ విషయముల సమగ్రముగ నాలోచించి, నింబాదిత్యాచార్యుడు శ్రీకృష్ణత్వమును సంపూర్ణము గావింప శ్రీ రాధికను ప్రవేశపెట్టి, ఆ మూర్తిద్వయముతో భక్తుడుగూడ నాటల పాటల కేళీవినోదముల యమునాతీర సైకతతలముల విహరించి ఆనందించి తన్మయతనొందు నవకాశమొసర్చి ముముక్షులోకమునకెంతయో ఉపకారము చేసెను. 'నాన్యా గతిః కృష్ణపదారవిందాత్ సందృశ్యతే బ్రహ్మ శివాది వందితాత్। భక్తేచ్ఛయోపాత్త సుచింత్యవిగ్రహాదచింత్య శక్తేరవిచింత్యశాసనాత్॥' శ్రీకృష్ణ పాదారవిందములకంటె నన్య శరణ్యము లేదు. బ్రహ్మ శివాదులచే నవి అర్చింపబడుటయే నిదర్శనము. శ్రీకృష్ణుని విగ్రహ శక్తి శాసనములెల్ల నచింత్యములై యున్నను భక్తుల కోర్కె ననుసరించి సుగమ ధ్యానమునకై ఆ పరమాత్మ శరీరధారణము గావించెను అని నింబాచార్యుని గాఢ విశ్వాసము. ఘుర్యే మహాశయు వచనములలో Another aspect of Vaishnava crystalization substituted Krishna and Radha in place of Vishnu and Lakshmi representing Radha as the wife of Krishna.

In the philosophical aspect the leaven worked to produce the comprehensive philosophical doctrine of duality - non-duality. This work was achieved by Nimbarka 102 వైష్ణవమత సంస్థాపనకార్యమున రాధను శ్రీకృష్ణుని సతిగ రూపించి, లక్ష్మీ విష్ణువుల స్థానమున రాధాకృష్ణుల నెలకొల్పుట మరియొక విశేషము. తాత్త్వికవిధానమున నీ ప్రభావము పని జేసి, ద్వైతాద్వైతసిద్ధాంతమున నొక సమగ్ర స్వరూపమును గలిగించెను. ఈ మహాత్కార్యము నింబార్కాచార్యునిచే సిద్ధించెను. 'సర్వభిన్నాభిన్నో భగవాన్ వాసుదేవో విశ్వాత్మైత' (సూ. భా. 1.1.4) భగవాన్ వాసుదేవుడు సర్వద్వైత అద్వైత మూర్తియై విశ్వాత్ముడే యగును అని నింబార్క వచనము. జయదేవునిపై నింబార్క ప్రభావమెంత జూపెనో గాని, it was Nimbarka who brought Radha with Krishna to the forefront as the tutelary deity 103 రాధాసహిత శ్రీకృష్ణుని అధిష్ఠాన దైవముగ ముందుకు దెచ్చినది నింబార్కుడే అని విజ్ఞుల అభిప్రాయము. ఈ సాంప్రదాయిక సాధుపుంగవులు పరస్పరాభివందనమాచరించు సమయముల 'రాధేశ్యామ్' అనియు నుచ్చరించుటయు గమనార్హము. వారు ఎల్లవేళల 'రాధేశ్యాం' అనియు, నామసంకీర్తనమును వ్యష్టిగను సమష్టిగను చేయుచుందురు. అటుల వీరికి రాధాకృష్ణమూర్తులే హృదయాధివాసులు, అధిష్ఠాన దైవములు. మానవ హృదయ కుహరము జొచ్చి, అందుండు లలిత ప్రవృత్తుల బరికించి, వాని కేంద్రస్థానము నరసి, వాని గమ్యమునకై సముచిత మూర్తిని శ్రీకృష్ణభగవానుని నెలకొల్పుటయేగాక, బ్రహ్మైక్యమునకై

102. Prof. G. S. Ghurye : Indian Sadhus. p. 61
103. Prof. G S. Ghurye : Indian Sadhus, p. 174

వేదన ననుభవించు జీవునిస్థానమున, రాధికాదేవినిగూడ నిలిపి రాధా కృష్ణస్వరూపముగ నేకమూర్తిగ రూపొందించి, భక్తకోటికొసంగిన నింబార్కాచార్యవర్యుడెంత మాన్యుడు ! To emphasize this sweet personal relation between man and God, Nimbarka describes God as Gopala Krishna, accompanied by Radha and Gopies, and engaged in play with them 104 మానవ భగవంతులకు మధ్యగల యీ మధురవ్యక్తిగల సంబంధమును సమర్థింప, నింబార్కుడు, రాధికా గోపికలతో క్రీడామగ్నుత మన్న గోపాలకృష్ణునిగ భగవంతుని వర్ణించెను. Thus Nimbarka is a prominent propounder of Radha-Krishna cult, one of the most popular and influential cults that ever flourished in India, which even today claims millions of adherents all over the country 104 భారతావనిలో విరాజిల్లు సంప్రదాయము లలో నత్యధిక ప్రభావమును జనాదరణమును బొంది, నేటికిని దేశ వ్యాప్త అనుచరకోటిని బొందిన యీ రాధాకృష్ణ సంప్రదాయ విధానము నకు, నింబార్కాచార్యుడీ విధముగ నొక ప్రముఖ ప్రవర్తక అనియు పండిత రోమా చౌధురి అభివర్ణనము.

ఈ విధముగ నింబాదిత్యునిచే బునరుద్ధరింపబడిన నీ రాధాకృష్ణ భక్తిసంప్రదాయము, వల్లభ, గౌరాంగ, మీరాది భక్తాగ్రేసరుల హృదయముల జొచ్చి, విశాలమై, వ్యాప్తమై, పెను పెల్లువమై దేశముల బ్రసరించి, అసంఖ్యాక భక్తహృదయ క్షేత్రముల బ్రవహించి, సస్యశ్యామలమొనరించి, ఫలప్రదము గావించి యున్నది. అట్టి అద్భుత కార్యమును నిర్వహించిన మహావ్యక్తి మన నింబార్కాచార్యవరేణ్యుడు.

104. Prof. Roma Chaudhuri : The Cultural Heritage of India, Vol. 3, p. 344

ఈతని జీవిత విశేషములు కాలగర్భమున నంతరములు. తత్పూర్వకరమునకు ప్రమాణములుగూడ నభావము. ఈతడు వేదభాష్యము నొండు నిర్మించినట్లు సంప్రదాయజ్ఞుల నుడి. కాని అది యెందును గానరాదు. ఈతడు అధిక గ్రంథకర్తయుగాక, 'వేదాంతపారిజాత సౌరభము' నా చిన్న సూత్రభాష్యము నొండు లిఖించెను. విచిత్రముగ నతడు తన సూత్రభాష్యమున నే యితర భాష్యకర్తలగాని సిద్ధాంతములగాని ప్రస్తావింపక, నెందును వాని ఖండింపక, the most unbiased of the commentators 105 బ్రహ్మసూత్ర వ్యాఖ్యాతలందరిలో అత్యధిక నిష్పాక్షిక భాష్యకారుడనియు గీర్తిగాంచి, the bhedabheda of Nimbarka mediating between pluralism and monism the only system that best fits in with the Sutras 106 నింబార్కుని భేదాభేదవాదము ద్వైతాద్వైతముల మధ్య సమాధానపరచుచు, సూత్రములకు మిగుల ఉచితస్థితినొందిన ఒక సిద్ధాంతమనియు యశస్సు నార్జించినది.

దశశ్లోకి యను నొక ప్రకరణమును నిర్మించి, అందు, తన సనత్సంప్రదాయ సిద్ధాంతముల నింబార్కుడు వ్యక్తపరచెను. ఇందు పూర్వభాష్యకర్తయైన రామానుజుని అధికముగ సూత్రభాష్యమున ననుసరించుచు, రామానుజ శంకరులకు, మధ్యకాలగతుడైన భట్టభాస్కరునియొక్క భేదాభేదవాదమును అనువదించుచు, మరియు, నా భాస్కరునికాధారమైన వ్యాససూత్రముల సూచింపబడిన ఔడులోమి ఆశ్మరథ్యని భావముల ననుసరించుచు, నింబాదిత్యుడు తన సరస

105. Sri Sridhar Muzumdar : The Vedanta Philosophy, p. 3
106. Prof. P. N. Srinivasachariar : The Philosophy of Bhedabheda, p. 183

సిద్ధాంత నిర్మాణమును గావించెను. సిద్ధాంత విషయముల బోడులోమి భాస్కరులు, నింబార్కునకందిడ, భక్తివిషయముల రామానుజు డొసంగెను అనుటయు నుచితము.

ఈతని సంప్రదాయము, ఉత్తరదేశమున బహుళ వ్యాప్తి నొంది బైరాగులు నిమివతులు బావాజీలు అనియు ననబడుచు వ్యాప్తము. వైష్ణవమున చతుస్సంప్రదాయ బైరాగులలో నింబార్కానుచరులు ఒకరు. ఈ సంప్రదాయస్థులు రాజస్థానము, ఉత్తరప్రదేశము, నేపాళము, వంగరాష్ట్రములలో బహుళముగ గలరు. వీరి ముఖ్య కేంద్రము రాజస్థానములోని పరశురామపురిలో నున్నది. మరియొకటి కలకత్తా నగరమునకు నలువదిమైళ్ళ దూరమునగల వర్ధమానపురమున గలదు. అటులే బృందావనక్షేత్రమున ధృవక్షేత్రముగూడ వీరి కేంద్రస్థానముగ వెలుగొందుచున్నది. ఈ సంప్రదాయము మరల దొమ్మిది ద్వారము లుగ విభజనము నొందినది. ద్వారమనగ శాఖ యని యర్థము. కాలాంతరమున నవి రెండుగ జీలి, పదియారవ శతాబ్దమున కేశవ భట్టుచే విరక్తశాఖయు, హరివ్యాసునిచే గృహస్థశాఖయు నెలకొల్ప బడెను. హరిదాసి, హరివ్యాసి అనియు రెండు ఉపశాఖలుకూడ గలవట. హరివ్యాసుడు, అతని ఆకర్షణీయ మూర్తిమత్వముచేతను, రచనముల చేతను, నిర్మాణ శక్తిసామర్థ్యములచేతను, నింబార్క సిద్ధాంతముల ప్రచారమొసంగుటచే, నీతని నామము ప్రఖ్యాతమయ్యెను. అటులే పదునెనిమిదవ శతాబ్దమునకు జెందిన కేశవకాశ్మీరి యను కేశవభట్టు గూడ ప్రఖ్యాతుడు. శ్రీనివాస, దేవాచార్య, మాధవ, ముకుంద, అనంతరామ, పురుషోత్తమాచార్యాదిక గ్రంథకర్తలు, యీ సిద్ధాంత ప్రాపకమున నెక్కువ తోడ్పడిరి. ఈ సంప్రదాయములవారు దాస,

శరణ అను పట్టమును నామాంతమున గలిగి, ముఖమున శ్వేత ఊర్ధ్వరేఖాద్వయమును వానిమధ్య నొక నల్లనిచుక్కయుగలిగి యుందురు. కంఠమున తులసీమాలయు వీరికవసరము. అవి రాధాకృష్ణ సంజ్ఞారూపమని వీరి విశ్వాసము.

## భేదాభేదవాద తాత్పర్యము

'ఉత్క్రమిష్యత ఏవం భావాదిత్యౌడలోమిః' (బ్ర.సూ. 1.4.21) ఈ సూత్రమున వ్యాసభగవానుడు తన పూర్వాచార్యుడై తత్త్వాచార్యుడై వెలుగొందిన ఔడులోమిని సూచించి, ఆ మహర్షివర్యుని సిద్ధాంతమునుగూడ దెలుపును. వాక్యాన్వయాధికరణమున 'ఆత్మా వాఽరే ద్రష్టవ్యః' (బృహ. ఉ. 2.4.5) అను శ్రుతివాక్యమున, ఆత్మశబ్దము నన్వయించు సందర్భమున, వ్యాసభగవానుడు, తన పూర్వాచార్యుల సిద్ధాంతముల సూచించెను. దీని ముందు సూత్రమున ఆశ్మరథ్యుని భేదాభేదవాదమును దెలిపి, యిందు ఔడులోమియొక్క భేదాభేదవాదమును వచించెను. ఆశ్మరథ్యుని వాదమున జీవబ్రహ్మములు కార్యాకారణ సంబంధము గలిగి, విస్ఫులింగాగ్నులవలె భిన్నములుకాక, మరియు నభిన్నములుగూడగాక భిన్నాభిన్నసంబంధమున నున్నట్లు వివరణము. అనగా జీవుడు బ్రహ్మమునకు గార్యరూపమున భిన్నుడై, కారణరూపమున నభిన్నమున నుండునని తాత్పర్యము. దాని వివరణమునకై సముద్ర తరంగములు, సూర్య ఆతపములు, సూచితములు. సముద్రమునందుత్పన్నతరంగములు సముద్రమున భిన్నాభిన్నసంబంధమున నేకకాలమున నున్న తెరంగున, జీవుడు బ్రహ్మముతో కార్యరూపుడై ప్రత్యేకముగ నున్నట్లు గోచరించినను దత్త్వతః నేకమై అభిన్నత్వమున నుండునని తాత్పర్యము. కాని 1.4.21 వ

సూత్రమున, ప్రస్తాపితమైన ఔడులోమి సిద్ధాంతముగూడ భేదాభేదమే అయి యున్నది. కాని కొంచెము వ్యత్యాసము గలదు. బద్ధజీవుడు బ్రహ్మ భిన్నముగనుండి, ముక్తి నొందినవెంట బ్రహ్మమై యొప్పారి, అభిన్నముగ నుండునని అతని సిద్ధాంతము. అనగా అవస్థాభేదముచే భిన్నత్వము గోచరమై, బద్ధావస్థ తొలగుటతోడ బ్రహ్మాభిన్నత్వమున జీవుడుండుననియు, నందుచే ప్రథమ దశలో భిన్నత్వము, చరమ దశలో అభిన్నత్వము జీవునకు బ్రహ్మముతో నుండునని ఆ యాచార్యుని తాత్పర్యము. ఈ ఆచార్యుడు వ్యాసపూర్వకాలీనుడై, సుప్రసిద్ధ వేదాంతతత్త్వవిదుడుగ నుండును గాని యాతని గ్రంథమొక్కటియైన నలభ్యము.

## భాస్కరాచార్యుడు

అంత, శంకర రామానుజ మధ్యకాలమున క్రీ. శ. తొమ్మిదవ శతాబ్దమునకు చెందిన భట్టభాస్కరాచార్యుడు యీ సిద్ధాంతమును స్వీకరించి, భేదాభేదమును వివరించుచు, వేదాంతసూత్రములకు భాష్యమును నిర్మించెను. ఈతని సిద్ధాంతము శంకర రామానుజ మధ్వల మధ్యమార్గమై కనుపించును. ఇచట బ్రహ్మము సగుణ నిర్గుణత్వముల గలిగి యుండును. 'కార్యరూపేణ నానాత్వం అభేదః కారణాత్మనా' సూ. భా. 1.1.4) అను వచనరీతి, కార్యరూపమున నానాత్వము నొంది, కారణతః బ్రహ్మము అభేదమున నుండును. అందుచే ఏకత్వ నానాత్వములు అనగా జీవజగత్తుల రూపమున గోచరించు నానాత్వముగూడ సత్యమే. భ్రాంతి యనునది అభావము. 'బ్రహ్మశబ్దేన ఈశ్వరో గ్రాహ్యతే' (సూ. భా. 1.1.1) అను విధానమున బ్రహ్మ శబ్దమునకు ఈశ్వరుడు స్వీకరింపబడి, అతనికి భోక్తృ భోగ్య శక్తులుండుననియు,

నవియే పరిణమించి భోక్తృశక్తి చేతనుడునై భోక్త యగు జీవ రూపమునను, భోగ్యశక్తి అచేతనమైన ప్రపంచరూపమునను బరిణమించునని భాస్కరీయము. ఈ శక్తి బ్రహ్మమునకు నైసర్గికమై, సర్వదా నతనిలో నుండును. అందుచే నితడు, తన సూత్రభాష్యమున, శంకరాచార్యుని మాయావాదఖండనమును బహుళముగ గావించెను. అతని విధానమున బ్రహ్మము, జీవ జగత్తులకు భిన్నాభిన్నము. జీవబ్రహ్మములకు ఉపాధితః తత్త్వతః భిన్నాభిన్నము. అనగా ఆగంతుకము భిన్నత్వము, తత్త్వతః అభిన్నము. అది స్వాభావికము. భిన్నాభిన్నత్వము, బ్రహ్మ సగుణత్వము, ప్రపంచరూపమున బ్రహ్మ పరిణామత్వము, జ్ఞాన కర్మ సముచ్చయము, జీవన్ముక్తి కాక, విదేహ ముక్తి యను నీ అయిదు సూత్రములు భాస్కరీయమునందు ముఖ్య సూత్రములు. బ్రహ్మము జీవ జగత్తులుగ బరిణమించి, అందంతర్యామియై యొప్పారును. జీవుడన, అవిద్యా కామకర్మలతోగూడిన బ్రహ్మమే యగును. ముక్తితో నీ సంసారమండలమును భేదించి, బ్రహ్మముతో నేకీభావమును జీవుడు పొందును. భాస్కరవాదమున భేదాభేదవాదము పై విధానమున వ్యక్తము.

## భర్తృప్రపంచాచార్యుడు

అటులే నింబార్కునకు బూర్వము కొందరు భేదాభేదవాదులు గలరు. అందు శంకరాచార్య పూర్వుడైన భర్తృప్రపంచాచార్యుడును ఒకడు. అతడు సముచ్చయవాదము నాబడు భేదాభేదవాదమును బోధించెను. అద్వైతులు, ద్వైత శ్రుతుల ననువాదములనియు, ద్వైతులు అద్వైతవచనముల ననువాదములనియు నన్వయింప, భర్తృప్రపంచాచార్యుడు రెంటిని సమన్వయించి, ద్వైతాద్వైతమును స్థాపించెను.

సర్పము దాని వలయాకారము, భానుడు అతని తేజములవలె కారణము కార్యమున నంతర్గతము. తరంగరహిత సాగరము తరంగసహితమై నను తన వ్యక్తిత్వమును గోల్పోవదు. అటులే బ్రహ్మము జీవ జగద్రూపముగ బరిణమించియు దన అద్వితీయానంతత్వముల బాయక నేకముగమాత్రమే యుండుననియు, నీ విధముగ ద్వైతాద్వైతము లుభయములు సమన్వయములై ద్వైతాద్వైతసిద్ధాంతమునకు మార్గ గాములనియు నతని సిద్ధాంతము. బ్రహ్మము పరాపరరూపము. అందుచే నానాత్వము భిన్నముగ గోచరించినను బ్రహ్మభిన్నమే యగును. శంకరుడు వివర్తవాదమును బోధింప, భర్తృప్రపంచాది ఆచార్యులు పరిణామవాదమును వచించెదరు.

## యాదవప్రకాశాచార్యుడు

యాదవప్రకాశుడను మరియొక ఆచార్యుడును యీ భేదాభేద వాదమును అనుసరించెను. రామానుజునకు గొంత కాలము ఆచార్యు డైన యాదవుడు అద్వైతవాది యని యట గాననగును. కాని యీ యాదవుడు ద్వైతాద్వైతవాది. ఈతడు అన్మరధ్యుని అనుసరించినట్లు రామానుజభాష్య వ్యాఖ్యాత అయిన సుదర్శనభట్టు తాత్పర్యము. యాదవ ప్రకాశాచార్యుడు భాస్కరునివలె నిర్గుణ బ్రహ్మభావమును ఖండించును. మాయావాదమును ద్రోసిపుచ్చును. అందుచే బ్రహ్మపరిణామవాదమును ఈతడుగూడ సమర్థించెను. ఈతడుగూడ సముద్రతరంగ దృష్టాంతము నుదాహరించెను. అందుచే నీతడుగూడ నింబార్కుని పూర్వకాలిక భేదాభేదవాది యగు చున్నాడు.

# నింబార్కాచార్య వాదము

ఇక నింబార్కాచార్యుని భేదాభేదవాదమును గుప్తముగ గాంచెదముగాక। యాదవ, రామానుజ సిద్ధాంతముల మధ్యసిద్ధాంతముగ నింబార్కుని భేదాభేదవాదము గలదు. నింబార్కుని వాదప్రకారము బ్రహ్మము, జగదంతర బాహ్యముల భిన్నాభిన్నములుగ గలదు. భిన్నత్వమున అభిన్నత్వము అంతరమై, భిన్నత్వమున కాధారమగుచున్నది. 'బ్రహ్మఽభిన్నోపి క్షేత్రజ్ఞః స్వస్వరూపతో భిన్న ఏవ' (2 1.22) క్షేత్రజ్ఞుడు బ్రహ్మముతో నభిన్నముగ నున్నను, స్వరూపముతో భిన్నుడు అని తన సూత్రభాష్యమున నింబార్కుడు రచించెను. యథార్థ భిన్నత్వముగాని, అభిన్నత్వముగాని సత్యము గాదని అతని మతము. జగదతీతుడయ్యును బ్రహ్మము అంతరమునగూడ నుండును. అగ్ని విస్ఫులింగములచందము, జల తరంగములరీతి బ్రహ్మము నానాత్వమున నేకము. అందుచే నేకత్వ నానాత్వములు పరస్పర విరుద్ధములుగాక సహవర్తనములు. The Advaitic theory of pan-illusoriness explains away the manyness of reality. Bhaskara's theory of upadhis predicates imperfections to the absolute and the Dvaita theory posits eternal distinctions and pre-supposes their externality 107 అద్వైతవాదముయొక్క మాయాసిద్ధాంతము, నానాత్వముయొక్క సత్యత్వమును ద్రోసిపుచ్చును. భాస్కరవాదములోని ఉపాధులు బ్రహ్మములో గళంకమును సూచించును, ద్వైతవాదము నిత్యవిభిన్నత్వమును సమర్థించి బాహ్యత్వమును గలిగియున్నది. The philosophy

107. Prof. P. N. Srinivasachariar : The Philosophy of Bhedabheda, p. 105

of Nimbarka is a kind of mono-dualism which avoids the perils of radical monism and pluralism and preserves the integral experience of bhedabheda 107 నింబార్క సిద్ధాంతము ఒకవిధమైన ద్వైతాద్వైతమై, ద్వైతాద్వైతములగల దోషముల దూరమొనరించి భేదాభేదములయొక్క సమగ్రమైన అనుభవమును నిలిపియున్నది. The universal or the whole is immanent in the particular and yet remains beyond, without losing its wholeness 107 సమష్టి వ్యష్టిలో నంతరమైయుండియు, దన సమష్టిత్వమును గోల్పోవక నతీతముగ నుండును అని నింబార్కాచార్యుని వాదము.

## బ్రహ్మము

నింబార్కునకు సగుణ నిర్గుణ భేదము బ్రహ్మములో గానరాదు. అతని దృష్టికి నుభయమును పరమాత్మయే అందుచేత 'సర్వభిన్నాభిన్నో భగవాన్ వాసుదేవో విశ్వాత్మైవ' (1.1.4) సర్వభిన్నాభిన్నుడైన భగవాన్ వాసుదేవుడే విశ్వాత్మ అని అతడు వాకొనెను. బ్రహ్మము హరి అనియు, శ్రీకృష్ణుడనియు నాతని విశ్వాసము. అతడు సగుణమేగదా! బ్రహ్మము జడాజడములు రెండును అగును అనియు నాతని సమన్వయము. జగత్సంబంధమున అది చైతన్యవంతము, జగదతీతముగ బ్రశాంతము. సాలెపురుగు తన గూడును తననుండి సృజించినట్లు ఈశ్వరుడు జగమును సృజించియు దానికతీతుడు. భోక్తయగు జీవునితోడను, భోగ్యమైన ప్రపంచముతోడను, నియంతయైన

107. Prof. P. N. Srinivasachariar: The Philosophy of Bhedabheda, p. 105

ఈశ్వరునితోడనుగూడ నిది పరమార్థము. అభేదస్థితిలో స్వతంత్ర సద్భావముననుు. భేదస్థితిలో పారతంత్ర సద్భావముననుు అది యుండును అందుచే బ్రహ్మము జీవ జగత్తులకు నిమిత్త ఉపాదానకారణములు రెండునై విరాజిల్లును. బ్రహ్మశక్తియే జీవజగత్తులుగ బరిణమించును. కాన అవి మాయాజన్యములై మిథ్యారూపములు కావు. బ్రహ్మాంతర్గత శక్తి సృష్టికార్యనిర్వహణము నొనర్చి ప్రళయకాలమున సృష్టిని నంతరమున ధరించియుండును. సృష్టి లయములు సర్వముయొక్క సంకోచవికాసములవంటివని వివరణము. అందుచే నీ శక్తిమానుడైన బ్రహ్మము, సగుణ బ్రహ్మముగ నింబార్క సిద్ధాంతమున వ్యక్తము.

## జీవుడు

అటులే జీవుడు తత్త్వతః బ్రహ్మముతో నేకమై వ్యక్తిగతముగ భిన్నమై యుండును. అతడు చేతనుడు అణు పరిమాణుడు. జీవుడొక్కడుగాక నానాత్వమై అసంఖ్యాకములు అని నిశ్చయము. పూర్వోక్తమురీతి నతడు భోక్తయయి యుండ, జగత్తు అనగా సర్వ సృష్టియు నతనికి భోగ్యము. కాని యాతని భోక్తృత్వము ఈశ్వరు నియామకముపై అపేక్షించి యుండును. జీవుడు జ్ఞాతృత్వ కర్తృత్వ భోక్తృత్వ లక్షణముల గలిగియుండును. జీవుడు బ్రహ్మముతో అంశాంశిభావమున నుండును. బ్రహ్మాంతర్గత అంశమే అనగా శక్తియే చిదచిద్రూప సృష్టిగ బరిణమించును. అయినను జీవునికి ప్రత్యేక స్థానము సృష్టిలో గోచరము. అఖండము యీ ఖండములో నుండుచు నీ ఖండముయొక్క సుఖదుఃఖములకు నతీతమై యుండును. జీవుని సాంసారిక సాధకబాధకములకు బ్రహ్మము అతీతుడు. తత్త్వమస్యాది మహావాక్యములు యీ అర్థమునే బోధించును. ఈ మహావాక్యములోని

'తద్' పదము నిత్యవ్యాప్త బ్రహ్మమును సూచింప, 'త్వం' పదము బ్రహ్మాధీనుడైన జీవుని నన్వయించును. 'అసి' పదము యీ యిరువురికి గల అభిన్నత్వమునకు భంగమురాని భిన్నత్వసంబంధమును దెలుపును అని నింబార్కుని వ్యాఖ్యానము. అట్టి సంబంధమే సూర్య తేజము లకును, అగ్ని విస్ఫులింగములకును గలదని యుదాహరణము. జీవ విశ్వములు భగవంతునకు స్పష్టముగ నన్యమై యున్నను, జల తరంగములు జలములకనన్యస్థితియున్న చందము బ్రహ్మముతో ననన్య సంబంధమున నొప్పారును. అందుచే నవి బ్రహ్మముతో నేక అనేక సంబంధమున వెలుగొందును. భిన్నాభిన్నత్వములు పరస్పర విరుద్ధ ములుగాక, నా ద్వయము సత్యములై ఏకస్థానమున నుండగలవు. కాని విశ్వజీవులు పారతంత్ర్యములై ఈశ్వరాధీనములు. మహాప్రళయ సమయమున నివి ఈశ్వరలయము నొందియుండును.

జీవజగదీశ్వర త్రయము బ్రహ్మశరీరముగా నింబార్కుడు నమ్మతింపడు. అతని శరీరమే జగత్తుగ స్థూలరూపముగ బరిణమించు నని అతని తాత్పర్యము కాదు. కాని బ్రహ్మముయొక్క అంతర్గత శక్తియే జగదుపాదానకారణముగ నతని సిద్ధాంతము. అందుచే బ్రహ్మముయొక్క నిర్వికారత్వమునకు భంగమురాదని అతని విశ్వా సము. బ్రహ్మము సర్వశక్తుడు కావుటచే నతనికి సృష్టికవసర పదార్థము నకై యన్వేషణ మనవసరము.

## సాధన - ముక్తి

జీవుని శుద్ధతత్త్వము అవిద్యాకార్యమైన కర్మచే నావృతమై యున్నది. అనాదిసిద్ధమైన యీ యవిద్య భగవదనుగ్రహముచే నంత

రించి, జీవుడు ముక్తి బొందును. భగవత్కృపా సముపార్జనమునకు ప్రపత్తియే మార్గము. భగవంతుడు తన భేదాభేదస్థితిని జీవునకెరుక పరచి అతని సంసారబంధముల ద్రెంచును.

ముక్తి యనగ అంశము అంశత్వమును విస్మరించుట అగును. బ్రహ్మముతో జీవుడా స్థితిలో అవిభాగమున నుండును. అది లయ మనిగాని సంయోగమనిగాని చెప్పతగదు. అది స్వరూపైక్యము కాదు, విశిష్టైక్యము కాదు, ఏకీభావము గూడ కాదు. కాని భిన్నాభిన్నముగ బ్రహ్మముతో జీవుడుండును.

బద్ధముక్తులు నిత్యముక్తులు నా జీవులు త్రివిధముగ రామానుజ మధ్వాదులతో నింబార్కుడుగూడ నంగీకరించును. బద్ధజీవుడు ముక్తు డగుటకు కర్మ, జ్ఞాన, ఉపాసన, ప్రపత్తి, గురూపపత్తి అను పంచవిధ సాధనలవసరము. నిత్య కర్మానుష్ఠానము, భగవంతుని భేదాభేదస్థితి జ్ఞానము, భగవదుపాసనము, భగవత్ప్రపత్తి, గురుకుల వాస, గురు సేవాదులు ముక్తిహేతువులు. నిత్యకర్మ జ్ఞానమును అజేయముగ జేయును (సూ. భా. 3.4.35). కాని యీ నిత్యకర్మాను ష్ఠానము సామాన్యునికే బోధింపబడినది (3.4.13). అందుచే వర్ణా శ్రమకర్మలు గృహస్థులకు విధి యగుచుండ, సన్న్యాసులకుమాత్రము జ్ఞానోత్పత్తి సాధనములుగమాత్రముండును (3. 4. 34). ప్రపత్తి ముక్తికి మార్గము. ప్రపన్నులను భగవంతుడనుగ్రహించి, బ్రహ్మ సాక్షాత్కారకారణమైన భక్తిని వారియందుంచును. సూర్య దర్శనము నకు దర్పణమవసరమైనట్లు పరమేశ్వర సాక్షాత్కారమునకు భక్తి అవసరము (3.2.24) రామానుజునిది ఐశ్వర్య ప్రధానభక్తియై ఆశ్చర్య

గౌరవములచే భగవంతుని దూరమునందుంప, నింబార్కుని మాధుర్య ప్రధానభక్తి ప్రేమ స్నేహములచే భగవంతుని సన్నిహితుని గావించు నని రోమా చౌధురి పండితుని అభిప్రాయము. 108 In this sense, Nimbarka has given us the last word, the inner core, the real essence of religion 108 ఈ తాత్పర్యమున మతజీవనముయొక్క ముఖ్య సారము, అంతర్హృదయమును అయిన చరమ వాక్యమును నింబార్కుడు మనకు ప్రసాదించెననియు నా పండితాగ్రేసరుని గాఢవిశ్వాసము.

ఈ విధముగ నింబార్కాచార్యుడు, మనో హృదయములకు, జ్ఞాన కర్మలకు, ద్వైతాద్వైతములకు, సర్వ సమరస సమన్వయము గావించి, పూర్వ వ్యాఖ్యాతల నెందును నొక్క పరుషవాక్యమునైన బలుకక, నెల్లర ముఖ్య తాత్పర్యముల గ్రహించి, ఇతరములతో సమన్వయించి, ముముక్షుహృదయములగల సంక్లిష్ట సంశయముల బారద్రోలి, మహోపకారము గావించినట్లు దీన స్పష్టము. అతని విశాలహృదయము బరమాత్ముని శ్రీకృష్ణునిగ గావించి, సద్వ్యాకర్షణీయ పద్ధతిని వివరించి, మార్గదర్శిగ రాధికను స్వీకరించి, మార్గ గమ్య ముల భక్తులకు సులభగ్రాహ్యము గావించెను. ఆ యాచార్యవర్యుని కృషికి సాధకలోకము బద్ధాంజలులై, సద్వినియోగము గావించు కొందురుగాక!



108. Prof. Roma Chaudhuri : The Cultural Heritage of India, Vol. 3, p. 345

# శుద్ధాద్వైతవాదము

## శ్రీ వల్లభాచార్యుడు

సర్వదా సర్వభావేన భజనీయో వ్రజాధిపః।
స్వస్యాయమేవ ధర్మో హి నాన్యః క్వాపి కదాచన॥

భగవంతుని సర్వవేళల, సర్వభావముల, ప్రేమించి కీర్తించు టయే సర్వోత్తమ మార్గము. దీని నధిగమించు ధర్మమన్యమెప్పుడును గానము. 'మార్గోయం సర్వ మార్గాణాముత్తమః పరికీర్తితః। యస్మిన్ పాతభయం నాస్తి మోచకః సర్వథా యతః॥' ఇదియే సర్వశ్రేష్ఠవిధానము. దానినుండి పతనభయము అభావము. భగవంతుడు సర్వదా భక్తుల రక్షించును, అని భక్తులకు నండయై నిలచి, అభయ హస్తము నొసంగు నీ ఆచార్యశ్రేష్ఠుడెవడు? 'అనుగ్రహరూపో భగవద్ధర్మః పుష్టిః' భగవంతుని అనుగ్రహరూప ధర్మమే పుష్టి యనియు, 'పోషణం తదనుగ్రహః' అనియు నిర్వచించి, భగవదనుగ్రహమే జీవునియొక్క వాస్తవికమైన పోషణమను రహస్యమును, భాగవత గ్రంథస్థమైన 'పుష్టి' (2.16.30) అను శబ్దము మార్గగామియై, 'పుష్టిస్తు రసపరిణామతః స్థౌల్యం॥' పుష్టి యనునది రసపరిణామముచే స్థూలత్వము అనియు గ్రహించి, జీవుని యారోగ్యమునకది యెట్లు అత్యవసరమో, పుష్టి ఆధ్యాత్మికానందమునకుగూడ అవసరమనియు, అందులకు జీవకృషికంటె భగవానుని అనుగ్రహమే ముఖ్యమనియు, 'స ఏవేదం జగద్ధాతా భగవాన్ ధర్మరూప ధృక్। పుష్ణాతి స్థాపయన్ విశ్వం తిర్యఙ్నరసురాదిభిః॥' (2.10.42) జగద్ధాతయు, భగవంతుడును, ధర్మరూపధరుడును అయిన అతడు, తిర్యఙ్మానవ దేవతాగణములతో

గూడిన యీ విశ్వమును స్థాపించి, పోషించును, అనగా 'ధర్మరూపేణ పుష్ణాతి' ధర్మరూపమున బోషించును అను భాగవత సూక్తిని గమనించి, సర్వపాలనకర్త ఆ భగవంతుడే గాన, నతని అనుగ్రహమే అతని ధర్మమై, భక్తులకు పుష్టి తుష్టుల నొసంగి రక్షించుననను రహస్యమును భాగవతశాస్త్రమునుండి మథించి, తీసి, శుద్ధాద్వైత సిద్ధాంత రూపముగ లోకమునకు నిడిన యీ ఆచార్యవరేణ్యుదెవడు? అతడే వల్లభాచార్య నామక ప్రముఖ ఆచార్యవర్యుడు. అతని అసాధారణ రాధాకృష్ణభక్తి ప్రభావముచేతను, అకుంఠిత విద్యావైభవముచేతను, అసమాన ఆకర్షణీయ వ్యక్తిత్వముచేతను, నాటి ముముక్షుకోటి నాకర్షించి, ఏక త్రాటి నడిపించి. అసంఖ్యాకుల నుద్ధరించి, అనేకులకు మార్గదర్శి యగుటచే, వైష్ణవ పంచాచార్యతత్త్వముల స్థానము గడించెను. రామానుజ, మధ్వ, నింబార్క, వల్లభ, చైతన్యులే యీ పంచ తత్త్వములు.

కాని పద్మపురాణ వాక్యము 'రామానుజం శ్రీః స్వీచక్రే మధ్వాచార్యం చ చతుర్ముఖః। శ్రీవిష్ణుస్వామినం రుద్రో నింబాదిత్యం చతుస్సనః॥' అని వచించుచు, రామానుజ, మధ్వ, నింబార్క, విష్ణుస్వామి నా గురుచతుష్టయమును ప్రస్తావించి, 'అతః కలౌ భవిష్యంతి చత్వారస్సంప్రదాయినః। శ్రీ బ్రహ్మ రుద్ర సనకా వైష్ణవాః క్షితిపావనాః। చత్వారః....॥' శ్రీలక్ష్మి బ్రహ్మ రుద్ర సనక సంప్రదాయములనబడు నాలుగు వైష్ణవ సంప్రదాయములు లోకపావనములై కలియుగమున నుండును అనియు వచించెను. పూర్వోక్తముగ నొక్కొక్కరికి ఒక్కొక సంప్రదాయము తెలుపబడియున్నది. కాని యిందు ప్రఖ్యాతమైన వల్లభుని ప్రస్తావనము గోచరముకాదు. కాని

వల్లభుడు ఆ యాచార్య చతుష్టయమున, రుద్రసంప్రదాయమును స్వీకరించి, చాలవరకు విష్ణుస్వామిని అనుసరించి యుండుటచే అత్యధిక ప్రతిభ నతడు ఆర్జించియున్నను - ప్రథమాచార్యుని యా శాస్త్రము పేర్కొనియున్నది. అట్లయినను, విష్ణుస్వామికంటె వల్లభాచార్యుడే అత్యంత ప్రతీతి సంపాదించి, ప్రథమాచార్యుని మించిన యశస్సు గాంచెననుటయందాశ్చర్యము గానము. సంప్రదాయమొకటేయై యున్నను, వల్లభాచార్యుడు విష్ణుస్వామి సిద్ధాంతములనుండి గొన్నింట విభిన్నత్వ మునుగూడ జూపెను.

రుద్ర సంప్రదాయ ప్రథమాచార్యుడైన విష్ణుస్వామి, భవిష్య త్పురాణమున కొన్ని స్థానముల బేర్కొనబడెను (3.97.61., 3.118.45) Vishnuswami was the promulgator of the 4 th Vaishnava sect, which has Radha-Krishna as its tutelary deity and was a senior contemporary of Jnaneswara 109 రాధాకృష్ణుల నధిష్ఠానదైవములుగ నుంచిన నాలుగవ వైష్ణవ శాఖకు విష్ణుస్వామి సంస్థాపకుడై, జ్ఞానదేవునకు జ్యేష్ఠ సమకాలికుడుగా నుండెను అని ఘుర్యే పండితుని వచనము. ఇతడు సన్యాసియై, సన్యాసులకై యీ రుద్ర సంప్రదాయమును నెలకొల్పినట్లును అతని భావము. కాని వల్లభుని స్పర్శచే నా సంప్రదాయము గృహస్థుల కాకరమై శుద్ధాద్వైతము, పుష్టిమార్గము నా ప్రఖ్యాతమై రూపాంతరము నొందినది. విష్ణుస్వామి దక్షిణాపథమున పాండ్యదేశ ప్రభువుయొక్క యాస్థానపండితుడైన దేవేశ్వరుని కుమారుడనియు తెలియుచున్నది. 110 అతడు పదమూడవ శతాబ్దమునకు జెందినవాడని R. G. Bhandarker

109. Prof. G. S. Ghurye : Indian Sadhus, p. 65
110. Prof. G. S. Ghurye : Indian Sadhus, p. 17

భండార్కరు పండితుని తాత్పర్యము. 110 మహారాష్ట్రమున నధిక ప్రఖ్యాతులైన జ్ఞానదేవ నామదేవులు విష్ణుస్వామికి శిష్యులనియు, వల్లభుని దండ్రి, విష్ణుస్వామి వంశమునకు చెందినవాడనియు గొందరి భావము. 110 వల్లభుని జనకుడు లక్ష్మణభట్టు ఉత్తరదేశమునకరుగు దెంచి యందే స్థిరవాసమేర్పరచుకొనెను.

తన సిద్ధాంత ప్రచారార్థము విష్ణుస్వామి ఒక భాష్యమును 'సర్వజ్ఞసూక్తము' నా నామమున నిర్మించెనట. కాని కాలాంతరమున వల్లభాచార్యునిచే రచితమైన అణు భాష్యమే ప్రఖ్యాతము. విష్ణుస్వామినిగురించి జీవిత విశేషములుగాని, యితర ఆధారములుగాని ఎవ్వియు గానరావు. ఈ రుద్రసంప్రదాయము అతి ప్రాచీనమని స్పష్టము. విష్ణుస్వామి నిర్మితము కాదని విజ్ఞుల తాత్పర్యము. ఇతడును అతి ప్రాచీనుడని యందురు. అట్లుకాక క్రీ. శ. ఐదవ శతాబ్దము వాడని కొందరు వచింప నీ విషయమును సమగ్రపరిశీలనము గావించిన భండార్కరు పండితుని తాత్పర్యమున విష్ణుస్వామి ఆచార్యుడు క్రీ. శ. పదమూడవ శతాబ్దమునకు జెందెను. ఈ సంప్రదాయమున వల్లభాచార్యునికి బూర్వము ఏడువందల ఆచార్య పరంపరలున్నట్లు గొందరు భావించిరి. అది చారిత్రాత్మకము కాదేమో! విష్ణుస్వామి అతి ప్రతిభావంతుడు, విద్వాంసుడు. కఠిన తపోగరిష్ఠతచే ఆత్మానుభూతి నొందిన మహాత్ముడు. అద్వితీయ బ్రహ్మము సాకారమని యాతని విశ్వాసము. ఉపాసనా విధానమునకు శ్రీకృష్ణుడే ప్రధానము అని యీతని తాత్పర్యము. ఇతడు సన్న్యసించి వైష్ణవమును సన్న్యాస ప్రధానముగ జేసినట్లు తలంపు. కాని దీనిని అనుసరించుచు వల్లభాచార్యుడు

110. Prof. G S. Ghurye: Indian Sadhus, p. 17

గృహస్థ వైష్ణవముగ బరిణమింపజేసెనని తజ్ఞులు భావించెదరు. కాని వల్లభుని వేదాంత సిద్ధాంతము ప్రథమాచార్యుడైన విష్ణుస్వామినే అనుసరించియున్నదని పండితాభిప్రాయము. అందుచే బుష్టిమార్గము నాబడు వల్లభాచార్యుని శుద్ధాద్వైతమున విష్ణుస్వామి భావజాలములు వ్యాప్తమై యున్నవని స్పష్టము. అందుచే వల్లభాచార్యునకు ముఖ్య మార్గదర్శకుడు విష్ణుస్వామి అనియే యెంచనగును.

అయినను బూర్వము వచించినరీతి నతడు కేవలము అనువాద కుడుగాక స్వతంత్ర భావజాలములు గలిగి, స్వకీయ వ్యక్తిత్వమున నచట నచట సంస్కరించి, ఒక ప్రత్యేక వైష్ణవశాఖా నిర్మాతగ వెలుగొందెను. గోవిందలాల్ హరగోవిందపండితాభిప్రాయమున, The abstract philosophical speculations of Sankara could not naturally make much appeal to the masses, who found sufficient spritual food in the bhakti schools of Ramanuja and others 111 శంకరుని నిగూఢ దార్శనిక విచార ణములు సామాన్య ప్రజాసంఘమును నాకర్షింపజాలవయ్యెను. ప్రజా సామాన్యము, రామానుజాది ఆచార్యుల భక్తిమార్గములలో దగు పారమార్థిక ఆహారమును బొందెను. అందుచే వల్లభుడే తన అణు భాష్యమున (2.2.23), 'సుబోధిని' అను భాగవత దశమాదిస్కంధ టీకయందును (1.1.1) వ్రాసికొనినచందము, శ్రీకృష్ణ భగవానుని ఆజ్ఞ ననుసరించి, శంకరునిచే విరుద్ధ వ్యాఖ్యానముల నొందిన, ఉపనిషద్గీతా సూత్రాది శాస్త్రములకు సక్రమార్థ వివరణమునకై తా బూనుకొనెను. శాస్త్రములు పరిశుద్ధాద్వైత సిద్ధాంతము నుపదేశించుచున్నవి

111. Prof. Govindalal Hargovind Bhatt : The Cultural Heritage of India, Vol. 3, p. 347

కాని, శంకర ప్రతిపాదితమైన మాయ అందులేదని అతని గాఢ విశ్వాసము. అందు నౌపనిషదమైన అద్వైతము మాయాసిద్ధాంత రహితమై, శుద్ధమై యుండుటచే నతడు, శుద్ధాద్వైతమును బోధించెను. అందుచె నతని సిద్ధాంతము 'శుద్ధాద్వైతవాదము' నాబడినది. మరల జగద్రూపమున బ్రహ్మము బరిణమించినను, బ్రహ్మము అవికృతము గాన, అవికృత పరిణామవాద' మనియు దీనికి నామాంతరము. అదే విధముగ, భక్తుడు ముక్తి నొందుటకు భగవద్ధర్మమగు పుష్టి నాబడు అనుగ్రహమత్యంతావసరము గావున, దీనికి బుష్టిమార్గమనియు పేరు.

వల్లభాచార్యుడు అసాధారణ ప్రజ్ఞాస్వరూపుడై, చిన్ననాటనే విద్యాధికుడై, తార్కికుడై, ఎనిమిది పర్యాయములు దేశవ్యాప్త పర్యటనము గావించి, అసంఖ్యాక రచనముల, వాదోపవాదముల నిర్వహించి, సర్వత్ర అన్య సిద్ధాంతుల నోడించుచు, స్వసిద్ధాంత స్థాపకము గావించియుండెను. అందుకనుగుణ్యముగ నాతని అనుచర కోటియు, నసామాన్య శక్తిప్రతిభలతో ననేక గ్రంథ రచనముల గావించి, భక్తిశ్రద్ధాయుక్తులై నాత్మ సిద్ధాంతమును దేశవ్యాప్తము నొనర్చిరి. ఆతని పుత్రద్వయము, పౌత్రసప్తకముగూడ అప్రతిహతోత్సాహమున దీని బ్రచారము గావించిరి. వల్లభకాలమునకే జెందిన ఘూర్జరదేశీయుడైన నరసింహమెహతా భక్తమణియు, (1416-1481) రాజపుత్రస్థానమునకు జెందిన రాజ్ఞి, కృష్ణభక్తి తన్మయత్వమున నాట్యము సల్పిన భక్త మీరాబాయియు (1504-1550), ఆగ్రా ప్రాంతమునకు జెందిన సూరదాస భక్తవరేణ్యుడును వల్లభాచార్యుని ప్రభావ కిరణములు సోకి, కృష్ణ నామామృత మధురాస్వాదనతత్పరులై చరితార్థులైరి.

అందుచే Among the several sects that arose in Mediaval India, none has spread more widely or attracted more popular attention in India and outside than the one connected with the name and teachings of Vallabhacharya 112 భారతావనిలో మధ్యయుగమున దలెత్తిన అనేక మతశాఖలలో, దేశమునందును ఇతర దేశములలోను వల్లభాచార్యుని బోధనలతో సంబంధించిన దీనికంటె నెద్దియు నధికతర ఆకర్షణము, ఆదరణమును, వ్యాప్తిని నొందలేదని నిశ్చయము. సంస్కృతభాషయందుమాత్రముగాక, హిందీ, వ్రజ, గుజరాతీ మొద లగు అనేక దేశభాషలలోగూడ రచనముల గావించి, ఉత్తర పశ్చిమ భారతముల ముఖ్యముగ లక్షల భక్తులకు మార్గదర్శిగ నీ శాఖ రూపొందినది. అందుచే వల్లభాచార్యవర్యుని కీర్తి అమోఘము అద్భుతము. నింబార్కునివలె నీతడును శ్రీరాధాకృష్ణుల భక్తులకున్ముఖము జేసి, సర్వోత్తమస్థితి ముక్తిగాక, దివ్య బృందావన క్షేత్రమున శ్రీకృష్ణ సేవాభాగ్యమున మనుచు, నాతని లీలాక్రీడాదుల నానందించు టయే యని, శ్రీకృష్ణుని జగన్మోహన దివ్యస్వరూపముచే నెల్లర నానందవార్నిధి ముంచిన వల్లభాచార్యుడు వందనీయుడు. ఆతని అద్భుత జీవిత విశేషముల నొకించుక గాంచెదముగాక:



112. Ramananda to Rama Tirtha, p. 81

# శ్రీ వల్లభాచార్య జీవిత సంగ్రహము

యది శ్రీగోకులాధీశో ధృతః సర్వాత్మనా హృది।
తతః కిమపరం బ్రూహి లౌకికై ర్వైదికైరపి॥
అతః సర్వాత్మనా శశ్వద్ గోకులేశ్వరపాదయోః।
స్మరణం భజనం చాపి న త్యాజ్యమితి మే మతిః॥

శ్రీ గోకులాధీశుడైన కృష్ణుడు, సర్వాత్మగా సర్వ హృదయములలో నున్నచో, లౌకిక వైదిక ధర్మములచే నింకేమి సాధింపవలయునో తెలుపుడు? అందుచే, సర్వాత్మతః ఆ గోకులేశ్వర పాదారవిందముల సంస్మరణము భజనముల నెప్పుడును విస్మరింపజనదు. ఇది నా అభిప్రాయము - అని తన హృదయస్థ శ్రీకృష్ణ చరణసరోజజన్య మధురసేవాలబ్ధిచే ధన్యుడైన వల్లభాచార్యుని నిశ్చితాభిప్రాయము. ఈ అద్భుత జీవి, తన యానందరసముల నెల్లరకనుభవవేద్యము గావింప, మధుపమువగిది పర్యటనము గావించి, ఉన్మత్తుని వోలె దేశముల దిరిగి, తన్మయతా మాధుర్యమును సర్వ ప్రాప్తము గావించెను.

అట్లు 'స తరతి స తరతి లోకాన్ తారయతి' అను నారద సూక్తిని యథాతథముగ ననుసరించిన యీ వల్లభాచార్యుడు, ఆంధ్ర దేశస్థుడైన లక్ష్మణభట్టు పుత్రుడని స్పష్టము. గోదావరీతీరమున కాంకరవాడ అను గ్రామము ఈతని స్వస్థలము. లక్ష్మణభట్టు ఇల్లమ్మ యను సాధ్వీమణిని భార్యగా వడసి, ప్రథమ సూనునిగ రామకృష్ణుని, ద్వితీయునిగ వల్లభుని, తృతీయునిగ గేశవుని బుత్రులనుగ బడసెను, కొందరి అభిప్రాయమున నీ లక్ష్మణభట్టు విష్ణుస్వామి వంశమువాడని

గలదు గాని, విష్ణుస్వామి పాండ్యదేశమునకు జెందినవాడని పూర్వము చూచియున్నారము. అందుచే విష్ణుస్వామికి ఆంధ్రత్వము లోపించుటచే వల్లభాచార్యుని వంశీయుడనజెల్లదు.

లక్ష్మణభట్టు వెలనాటి శాఖీయ బ్రాహ్మణుడు. అతడు గొప్ప విద్వాంసుడునై, ధర్మనిష్ఠాగరిష్ఠుడై, ఆచారవంతుడై యుండెను. నేటికిని యీ సంప్రదాయ పీఠాధిపతులు ఉత్తర భారతమున స్థిరవాస మేర్పరచుకొనియున్నను, పుత్ర వివాహములకు గన్యలకై ఆంధ్ర దేశమునకేతెంచి, వెలనాటి కుటుంబములనుండి, ఎంచి, గైకొనిపోవు చుందురు. కాని చిరకాలమా దేశముల నివసించుటచే వారిలో ఆంధ్రత్వ మావంతయు గోచరింపదు. భాషయేగాక, ఆచార వ్యవహారములు, సర్వము వారిలో నేడు ఔత్తరాదికములుగనే గోచరించును.

కొంతకాలమునకు, లక్ష్మణభట్టునకు తీర్థయాత్రాకాంక్ష వొడమి, కాశి, గయ, ప్రయాగాది క్షేత్రదర్శనార్థమై సతీసమేతముగా వెడలి, సర్వక్షేత్రముల సందర్శించి, పునీతుడై, మహాక్షేత్రమైన వారణాసి యందే నివసించి తరించు నుద్దేశ్యమున తీర్థయాత్రానంతరము కాశి యందు స్థిరవాసమేర్పరచుకొని సుఖజీవితము గడుపుకొనుచుండెను.

కాని కొంతకాలమునకు అతనికేగాక, వారణాసీపౌరుల ప్రశాంత జీవితమునకు అంతరాయమేర్పడెను. హైందవ సన్న్యాసులకును, మహమ్మదీయులకును మనస్పర్థలేర్పడి, పోరాటములు జరుగుటయు, ఔదుమిక్కిలి ఢిల్లీ పాదుషాయైన 'బహలోలు లోడి' కాశీనగరముపై దండయాత్రకు బూనుకొనుటయు నేర్పడెను. అందులకు ప్రజాసమూహము వెరచి, నలు దిక్కులకు బలాయనము జేయుచుండిరి. అందరితో గలిసి కుటుంబసమేతుడై లక్ష్మణభట్టుగూడ దక్షిణ దేశము

నట్టై బయలుదేరి మధ్యప్రదేశమునగల రాయపురమండల చంపారణ్య ప్రాంతములకేగుదెంచెను.

ఆ సమయమునకు అతని సతీమణి ఇల్లమ్మ పూర్ణ గర్భిణి. ఎనిమిది మాసములు నిండి యుండి, విశ్రాంతి గానని ప్రయాణ ప్రయాసచే నామెకు ప్రసవవేదన జూపెట్టెను. తోటి పాంథులతో సహా సాయంకాలమునకు ముందున్న చౌడా నగరమును జేర దలంపు గలిగినను, అవకాశమభావమగుటచే నా రాత్రి యా యుగ్రారణ్యమధ్య మున నీ కుటుంబముమాత్రముండవలసివచ్చెను. అయినను ఏట్టి కష్ట మునులేక పరమేశ్వరానుగ్రహవిశేషమున ఇల్లమ్మ సుఖ ప్రసూతి గాంచెను. కాని జన్మించిన మగశిశువు అచేతనునివలె జలనములేక పుట్టుటచే భార్యాభర్తలు వగచి, ఆ శిశువు మరణించినది అని భావించి, ఒకచో వృక్షచ్ఛాయను ఎండుటాకులలో నుంచి, మరునటిదినము ప్రయాణమును సాగించి చౌడా నగరమును జేరిరి.

కాని యా మరునటిదినమే కాశీనుండి వార్తలు రాసాగెను. అచట ఏర్పడిన అలజడి తగ్గిపోయి, ప్రజాసమూహము సామాన్య జీవితము గడుపుచున్నదని తెలిసెను. అందులకు సంతోషించి, కొందరు తిరిగి కాశీనగరము జేర ప్రయాణమైరి. అందు లక్ష్మణభట్టు కుటుం బముకూడ ఒకటి. అందుచే మరల తిరుగు ప్రయాణము పూర్వ మార్గమున సాగించుచు, గతరాత్రి చంపారణ్యముల తమచే గుప్తముగా నుంపబడిన శిశువు ఏమయ్యెనో గ్రహింప వీరు అట కేగ నా బిడ్డడు ఏడ్చుచుండుట గాంచి ఎల్లరానందాశ్చర్యమగ్నులైరి. వెంటనే ఆ శిశువును గరముల నెత్తి, హృదయమున జేర్చి ముద్దిడుకొని,

ఆ దంపతులెంతయో ఆనందించి, పరమేశ్వరునకు గృతజ్ఞతా వందనముల నర్పించి, ఆతనికి వల్లభుడని నామకరణమొనరించిరి.

వల్లభ జననకాలమునుగూర్చి పండితలోకమున అభిప్రాయ భేదములు గలవు. పండిత రాధాకృష్ణ మహాశయుడు, క్రీ. శ. 1401 అని వ్రాయగ, విక్రమ శక 1535 వ సంవత్సరమున వైశాఖ బహుళ ఏకాదశి ఆదివారమున వల్లభు జననముగ, అనగ క్రీ. శ. 1459 వ సంవత్సరముగ కొందరు భావించిరి. అట్లుగాక, క్రీ. శ. 1479 వ సంవత్సరమనియు గొందరు తెలుప, క్రీ శ. 1481 వ సంవత్సరమనియు కొందరు తలంచిరి. మరియు, గొందరు, వల్లభుని జననకాలము క్రీ. శ. 1535 వ సంవత్సరము వైశాఖశుద్ధ ఏకాదశి ఆదివారమనియు వచించిరి.

పునః కాశికాపురి వాసమేర్పరచుకొనిన లక్ష్మణభట్టు తనయుని విద్యాబుద్ధుల అభివృద్ధికై ఆరవయేటనే అక్షరాభ్యాసము గావించి, నారాయణభట్టు నా విద్వాంసునవద్దకు బంపెను. అమానుష మేధాశక్తి యుక్తుడుగాన వల్లభుడు, ఆచార్యునివద్ద చతుర్వేదములను, షట్శాస్త్రములను, అష్టాదశ పురాణములను, వేదాంగములను అచిరకాలమున నధ్యయనము గావించి, నాటి సర్వశాస్త్రముల బఠించి, సర్వవిద్యా విభూషిత ప్రజ్ఞావైభవ ప్రకాశములతో విరాజిల్లెను. వల్లభుడు పదియవవత్సర ప్రాయముననే అపార విద్యావైభవమును నార్జించుట అసాధారణము, అమానుషము. అందుచేతనేమై యుండనోపు కాలాంతరమున నితని అనుచరులు ఇతని నగ్నిదేవుని అవతారముగ విశ్వసించి అర్చింపసాగిరి. కేవలము ప్రథమాచార్యుడైన నారాయణ పండితునిమాత్రమే ఆశ్రయించి యుండక ఏ యే ఆచార్యులదగ్గర

నే యే విద్యలు గలవో వానినెల్ల నాశ్రయించి, గడించి, మధుపము రీతి విద్యామధువును సేకరించి, తా నానందించి, యెల్లరకు పంచి యిచ్చెను. మధ్వ సాంప్రదాయిక గ్రంథముల బూర్ణముగ పఠించెను.

చిరుప్రాయమునందు కాశికాపురీ విద్వన్మండలి సభలలో బాల్గొనుచు, ననేకుల దన అద్భుత మేధాసంపత్తిచే నిరుత్తరులనుగ వల్లభుడు గావించుచుండెను. అందుచే చిన్న యయినను అతడు సభాగౌరవముల పెద్దలతోపాటు బొందుచు, ననేకులకు ఆనందోత్సాహముల గలిగించెడివాడు.

ఇంతలో వల్లభుడు తన పదునొకండవయేట పితృవియోగమును బొందెను. అంత, దల్లిని దక్షిణదేశమున స్వస్థానమునకు బంపి, వల్లభుడు తన సిద్ధాంత ప్రచారము గావించు నిచ్ఛతో దేశపర్యటనమునకు గడంగెను. అఖిల సిద్ధాంతముల గూలంకషముగ బఠించినను, మధ్వయతీంద్ర శాస్త్రముల బ్రత్యేకముగ విచారించి, పూర్వాచార్యుడైన విష్ణుస్వామి భావములగూడ అధికతర శ్రద్ధతో నవగాహన మొనరించి, స్వసిద్ధాంతమునకనుకూలవిషయముల బహుళముగ నందుండి స్వీకరించి, ప్రత్యేకముగ శుద్ధాద్వైతవాదము నాపేర స్వసిద్ధాంతము నొండు రూపొందించి, దేశముల నా అద్భుత సృష్టిని వల్లభుడు వెదజల్లెను.

పితృతర్పణాది నిర్వహణమునకై అతడు పితృమరణ వత్సరమున జగదీశపుర యాత్ర గావించి, ఆ సమయమున నందు జేరి, సభల విద్యావ్యాసంగముల జరుపుచున్న అద్వైత విశిష్టాద్వైత పండితులతో జర్చించి, విశిష్టాద్వైత వాదముల సమర్థించుచు, అద్వైత మాయావాదమును ఖండించుచు నుపన్యసించి, పండితలోకముచే గౌరవమును బొందెను. ఇట్టి గౌరవాదరణములు ఎల్లెడల నాతనికి జరుగు

చుండుటచే, నాతని ప్రోత్సాహము సహస్రాధికమై, దేశము నల్గడల బర్యటించి, తన 'పుష్టిమార్గము' ను బ్రసరింపజేయ వల్లభుడు సంకల్పించెను.

అందులకై ప్రథమతః నాతడు, తన పండ్రెండవ వత్సర ప్రాయమున నుజ్జయినీనగరమున కరిగెను. అచట ననేకుల శుద్ధాద్వైత మున జేర్చి, దక్షిణదేశమునకై బయలుదేరి, మార్గమధ్యమున నొక శ్రీమంతుని పుత్రుడు దామోదరుడనువాని వల్లభుడు మతాంతరుని గావించి శిష్యునిగ నొనరించెను. పర్యటన కాలములగూడ నీ యాచా ర్యుడు అతి శ్రద్ధాళుడై, ఆందందు గల వివిధ సిద్ధాంతముల గ్రహించు చుండెను. ఈ విధముగ దిరుగుచు, వల్లభుడు తన మాతామహా లుండు విద్యానగరమునకు జేరుకొనెను.

విద్యానగరము సార్థక నామధేయమై వివిధ మత పండిత వర్యులచే నలంకృతమైన పండితప్రభువు కృష్ణదేవరాయల పాలన పోషణముల నలరారుచుండెను. వల్లభుని రాక నెరింగి, ఆ రాజ చంద్రుడు సభనేర్పాటు గావింప, నందు వివిధ సిద్ధాంతుల, వాదోప వాదములతో వేదవేదాంగప్రమాణ సంచయ ధ్వనులతో మారుమ్రోగెను. వల్లభుడు తన అసాధారణ ప్రజ్ఞచే వివిధ సిద్ధాంతముల ఖండనము గావించి, ముఖ్యముగ శంకర మాయావాద నిరాసము నమోఘముగ నొనరించుట గాంచి, సభాధ్యక్షుడైన కృష్ణదేవరాయ విద్వన్మణి, సంతృప్త చిత్తుడై, వల్లభుని, అనేక విధముల సన్మానములచే బహూకరణములచే విభూషితుని గావించి, గౌరవించెను. నాటికి వల్లభా చార్యుని వయస్సు పదునాలుగు వత్సరములుమాత్రమే యగుట ఆశ్చర్యకరముగదా!

ఇట్లు, సర్వసమర్థుడై, వివిధ గౌరవముల నందుకొనిన వల్లభుని గాంచి, పెన్నిధి దొరికినట్లు విశ్వసించి, విద్యానగర వైష్ణవ సంఘము వైష్ణవ పీఠమునకు ఆచార్యునిగ నెన్నుకొని, 'ఆచార్య' అనియు, 'ఆచార్య చక్రచూడామణి జగద్గురు శ్రీమదాచార్య మహా ప్రభువు' అనియు, బిరుదముచే సత్కరించిరి. నాటినుండి వల్లభుడు వల్లభాచార్యుడై ప్రశస్తి గాంచెను. నాటినుండి ఆతని ప్రతీతి దిగంతముల ప్రసరించెను. రాజగౌరవమును పొందుటయు, పీఠాధిపతి యగుటయు వల్లభునికలంకారములుగ వెలుగొందెను.

అంత వల్లభాచార్యుడు ఉత్తరదేశమునకై వెడలి, గోకుల వ్రజప్రాంతముల పర్యటించి, గోకులమందు భాగవత సప్తాహమును నిర్వహించి, శిష్యులకు మంత్రోపదేశము నాటినుండి ప్రసాదింప ప్రారంభించెను. అంత మధుర, చూనార్ మొదలగు ప్రదేశముల ప్రచారము సాగించి, మహారాష్ట్ర రాజస్థానముల శుద్ధాద్వైతవాదము నెలకొల్పి, కాశీనగరమును చేరెను. ఈ ప్రథమ యాత్ర యంతయు సుమారు పది సంవత్సరములు సాగెనని యందురు.

వారణాసి నగరమున కొంతకాలము బోధన సాధనలలో మునిగి యుండియు తృప్తిగాంచక, మరల దిగ్విజయ యాత్రకై వల్లభుడు బయలుదేరెను. హిమనగప్రాంతముల గ్రుమ్మరుచు, హరిద్వార, హృషీకేశములమాత్రముగాక కేదార బదరికాశ్రమములగూడ దర్శించి, సుమారు తొమ్మిది వత్సరములకు బృందావన క్షేత్రమును జేరి, అందు వల్లభాచార్యుడు వాసముండెను. ఈ ద్వితీయ యాత్రా సందర్భమున వల్లభాచార్యుడు, పండరి విఠలనాథుని దర్శించు సమయమున వివాహ వాంఛ గలిగెను. అందుచే తన ఇరువదిమూడవ ఏట కాశీపురమున

గల సజాతీయ బ్రాహ్మణకుటుంబమునకు జెందిన మహాలక్ష్మి యను కన్యకను బరిణయము జేసికొని వల్లభాచార్యుడు అందు నివసించు చుండెను. ఆమెకు క్రీ. శ 1511 వ సంవత్సరమున గోపీనాథుడును, క్రీ. శ. 1516 వ వత్సరమున విఠలనాథుడును జనించిరి.

తృతీయ పర్యాయము వల్లభుడు యాత్రకై బయలుదేరి గోవర్ధనగిరికరుగుదేర నచట భూగర్భమున శ్రీనాథస్వామిమూర్తి గలదని గ్రహించి, త్రవ్వించి, ఉద్ధరించి, అంబాలా పురవాసి 'పూర్ణమలఖత్రి' ధనసహాయమున నొక మందిరమును నిర్మించి, అందు వల్లభాచార్యుడు ఆ శ్రీనాథ విగ్రహప్రతిష్ఠ గావించెను. ఈ ప్రతిష్ఠమూలమున వల్లభాచార్యుని ప్రతీతి, శక్తులు దేశముల వ్యాపించి, అనుచరకోటి అధిక మయ్యెను.

అంతట వల్లభాచార్యుడు తన కాలమును గాశి, బృందావనము బలో గడుపుచు, నందుగల మాయావాదుల నోడించి, తన భావ జాలముల గ్రంథస్థమొనరింప బూనుకొనెను. ప్రయాగ క్షేత్రమున, యమునానదీ తటమున, అడైలు గ్రామమున వల్లభాచార్యుడు స్థిర వాసరమేర్పరచుకొనెను. అయినను మత ప్రచారమునకై అందందు నరుగుచు, బరసిద్ధాంతుల నోడించుచు, అత్యధిక ప్రఖ్యాతిని వల్లభాచార్యుడు ఆర్జించెను. బ్రాహ్మణాది వర్ణములు స్త్రీలు, అధికముగ నితని శిష్యులై, ముఖ్య శిష్యులు ఎనుబది నలుగురుండ, సామాన్యానుచరులు ఒక లక్ష ఎనుబదినాలుగు సహస్రములుగ నుండెనని తెలిసెడిని.

వల్లభాచార్య సంప్రదాయమునకు జెందిన పీఠములు ఎనుబది నాలుగు గలవు. అందు ఇరువదిరెండు వ్రజప్రాంతముల గలవు.

వల్లభాచార్యుని మరణానంతరము పీఠాధిపత్యమునకై పుత్రులిద్దరు కయ్యములాడి, నాటి ప్రభువునకు విషయము నివేదింప, జ్యేష్ఠుడగు గోపీనాథునకు పీఠాధిపత్యము స్థిరపడెను. కాని ఆతడు అకాలమరణము నకు బాల్పడుటచే, ద్వితీయుడైన విఠలనాథుడే పీఠము నలంకరించెను. సుతులిద్దరుగూడ మహాప్రజ్ఞావిశేషములుగల విద్వాంసులు. కాన విఠలనాథుడు పీఠాధిపతియయిన పిమ్మట, అతని అఖండ ప్రచారముచే 'పుష్టిమార్గము' అధికతర వ్యాప్తిని, ప్రఖ్యాతిని బొంది, లక్షాధిక అవలంబకుల బొందెను. ఇతడు 1586 వ సంవత్సరమున గాలగతు డయ్యెను. అతని ఏడుగురు పుత్రులలో చతుర్థ కుమారుడు గోకుల నాథుడు సుప్రశస్తుడై, బహు గ్రంథ రచయితయై 'మహారాజు' అను బిరుదమును గడించిన కీర్తిమంతుడై, గోస్వామి అనియు నాబడుచు, దేశవ్యాప్త యశస్సును గాంచెను.

అనుచరుల విషయము అట్లుండ, వల్లభాచార్యుడు బహు విస్తార విద్యాపారంగతుడుమాత్రమునాక, అకుంఠితవాద చాతుర్యశీలు డనియు విదితము. అంతియునాక, ఇతడు బహుళ గ్రంథకర్త, మహా కవియు అని స్పష్టము. ఈ గ్రంథముల నాతడు దేశపర్యటనా కాలముల, బృందావన వారణాసీ నివాస సమయముల నిర్మించెను. ఈ విధముగ వల్లభాచార్యునిచే రచింపబడిన గ్రంథములు ఎనుబది నాలుగు అని తెలియుచున్నది. ముప్పదియయిదుమాత్రమని కొంద రందురు. అందు ముప్పదిమాత్రము సుప్రఖ్యాతములు. అవి (1) అణు భాష్యము (2) సుబోధిని (3) పూర్వమీమాంసా భాష్యము (4) తత్త్వ దీప నిబంధము (5) పురుషోత్తమ సహస్రనామము (6) దశమస్కంధ క్రమణిక (7) యమునాష్టకము (8) సిద్ధాంత రహస్యము (9) నవరత్న ములు (10) పుష్టిప్రవాహ మర్యాద (11) అంతఃకరణ ప్రబోధము

(12) భక్తి వర్ధిని (13) విరోధ లక్షణము (14) సన్న్యాస నిర్ణయము (15) కృష్ణాశ్రయము (16) సేవా ఫలము (17) చతుః శ్లోకి (18) సిద్ధాంత ముక్తావళి (19) బాల బోధ (20) వివేకధైర్యాశ్రయములు (21) జలభేదము (22) పంచ పద్యము (23) పత్రావలంబనము (24) త్రివిధ నామావళి (25) ప్రేమామృతము (26) శిక్షా శ్లోకము (27) న్యాయాదేశము (28) సేవాఫల వివరణము (29) మధురాష్టకము (30) పరివృఢాష్టకము మొదలైనవి. ఇందు అణుభాష్యము వేదాంత సూత్రములకు భాష్యము, సుబోధిని భాగవత శాస్త్రమునకు ప్రథమ నాలుగు స్కంధములకు, దశమైకాదశ స్కంధములకు వ్యాఖ్యానము. ఇవి వాని ప్రధానములు.

సంస్కృత భాషాపాండిత్యము గలవాడైనను, వల్లభాచార్యుడు, దేశభాషలగూడ నుపయోగించుచు, ముఖ్యముగ, వ్రజదేశమున వ్రజ భాషనే వాడుచు, ప్రజాబాహుళ్య హృదయముల జొచ్చెను. శ్రీకృష్ణుడు తన లీలావిభూతిని ప్రదర్శించిన దేశమునకు జెందినదగుటచే దీని పురుషోత్తమ భాష యనియు నందురు. వల్లభుని శిష్యులుగూడ నీ భాషనే తమ వచన, రచనములకు ఉపయోగించిరి. ఆ విధముగ నీ సంప్రదాయము ప్రజాప్రీతికాకరమై వ్యాప్తిగాంచెను.

వల్లభాచార్యుడు తన చరమ జీవితమును వారణాసీ నగరము నందు గడుప బూనుకొనెను. అచటకరుదెంచి, గృహస్థాశ్రమమును విసర్జించి, తురీయాశ్రమ స్వీకారమునుగూడ వల్లభుడు గావించి పూర్ణానంద స్వామియై, అంత నలుపది దినములు తపోనిష్ఠలో నుండి, తన ఏబది రెండవయేట క్రీ. శ. 1531 వ సంవత్సరమున, గంగాజలముల కాలధర్మము నొందెను. స్నానార్థము గంగకరిగి,

గంగాజలముల మునింగి, పవిత్ర గంగాస్రవంతినుండి యుత్తీర్ణుడు కాకపోయెను. ఈ మరణము అతి ఆశ్చర్యకరము. శరీరత్యాగము తా గావింపబోవుచున్నటులనైన ఎవరికిగూడ దెలియజేయక వల్లభాచార్యుడు, సంకుచిత శరీరత్యాగము జేసి, శాశ్వత బృందావన కృష్ణ సాన్నిధ్యవాస యాకాంక్షచే నందరిగిపోయెను. కాశీనగరమున గల హనుమాన ఘట్టము, ఆచార్య దేహమును గంగ లయము గావించి, ఖ్యాతి నార్జించి, అందు ఆ యాచార్యవర్యుని ఆలయము నొండు నిర్మించుకొని చిరస్మరణీయమయ్యెను.

కాని తన కాలమాసన్నమైనదని యాచార్యునకు దెలిసియే యుండును. అందుచేత నా దినము గంగాతీరమున నిలువబడి, వల్లభాచార్య మహాప్రభువు తన సుతులకు, దేశవ్యాప్త శిష్యకోటికి, ఒక మహోత్కృష్ట సందేశము నొసంగెను. ఈ సందేశమును సువర్ణాక్షరముల హృదయముల లిఖించి, భక్తులుంచుకొనవలెనని రోమా చౌధురి విశ్వాసము. ఈ సందేశమెయ్యది?

భక్తులారా! ప్రియతములారా! శక్తిసామర్థ్యములతో సర్వదా శ్రీకృష్ణ మహాప్రభు సేవ గావింపుడు. శ్రీకృష్ణుని మానవగురు సామాన్యుడని యెంచకుడు, మీరు ఆతనివారైన వెంట, ఆతడు మీ సర్వభారముల వహించును. కాని, ఎవ్విధముగనైన మీరు ఆ ప్రభువును మరచి, ప్రాపంచిక విషయముల మునిగెదరా, మీరు పతితులగుదురు.'



# శుద్ధాద్వైతవాదము

ఆసన్సిద్ధాంతకర్తారశ్చత్వారో వైష్ణవా ద్విజాః।
యైరయం పృథివీ మధ్యే భక్తిమార్గో దృఢీకృతః॥
విష్ణుస్వామీ ప్రథమతో నింబాదిత్యో ద్వితీయకః।
మధ్వాచార్యస్తృతీయస్తు తుర్యో రామానుజః స్మృతః॥

భూతలమున భక్తిమార్గమును దృఢీకరణము గావించిన సిద్ధాంత కర్తలు నల్వురు వైష్ణవ బ్రాహ్మణులు గలరు. అందు విష్ణుస్వామి ప్రథముడు, ద్వితీయుడు నింబార్కుడు, మధ్వాచార్యుడు తృతీయుడై యుండ నాల్గవవాడు రామానుజుడు అని పద్మ భవిష్యత్పురాణ వచనములు.

అందు విష్ణుస్వామియొక్క రుద్ర సంప్రదాయమును వల్లభా చార్యుడు స్వీకరించెను. ఈ సిద్ధాంతము, శ్రీ మహావిష్ణువునకు పరమ భక్తుడైన పరమశివుడే ఉపదేశించి యుండుటచే రుద్రసంప్రదాయమని ప్రతీతి. శ్రీ రుద్రునినుండి వాలఖిల్యాది ఋషిపుంగవులు స్వీకరింప, పరంపరా న్యాయముగ విష్ణుస్వామికది సంప్రాప్తించెను. అద్దాని గ్రహించి, తన వ్యక్తిత్వము నందు జొన్పి, ప్రజాసమూహమున కందుబాటుగ విష్ణుస్వామి గావించుటచే నీ యాచార్యుడు పూర్వా చార్యులకంటె ప్రధానుడై, అతని నామమున నీ సంప్రదాయము ప్రసిద్ధమయ్యెను. ఇతడు బ్రహ్మసూత్ర, గీతా, భాగవతములకు భాష్యముల రచించెనటగాని ఆ గ్రంథములు నేడు అలభ్యములు.

కూతని సిద్ధాంతము చాలవరకు వల్లభుని శుద్ధాద్వైతమే అని భండార్కరు పండితుని తాత్పర్యము. Vallabha's Vedantic theory is the same as that of an earlier author of the name of Vishnuswami [113] వల్లభుని వేదాంత సిద్ధాంతము పూర్వ రచయితయైన విష్ణుస్వామి సిద్ధాంతసమము అని అతడు వ్రాసెను.

## సగుణబ్రహ్మము

వల్లభాచార్యుడు, సాకారబ్రహ్మ సిద్ధాంతము నొండు చిత్రించి, శంకర రామానుజులనుండి ప్రత్యేకత జూపించును. శుద్ధాద్వైతమనగ పరిశుద్ధమైన అద్వైతమని అతని భావము. శంకరుని కేవలాద్వైత సిద్ధాంతమున బ్రహ్మము సర్వ అనుకూల లక్షణములులేక, సర్వ దూరుడై యొప్పును. కాని వల్లభాద్వైత బ్రహ్మము సగుణుడై వెలయును. శంకరునిచే బ్రతిపాదింపబడిన మాయా ప్రాబల్యమున నీ సృష్టికార్యము జరుగుచున్నది. అదియే సర్వకారణము, కాని దానికి బ్రహ్మభిన్న సత్తా అభావమగుటచే బ్రహ్మమే నిమిత్తోపాదానకారణము అని అద్వైతశాస్త్ర ప్రవచనము. కావి వల్లభుని దృష్టికి యీ మాయా స్థానము బ్రహ్మమునకు గిశంకహేతువై అతని నశుద్ధ పరచునని విశ్వాసము. అందుచే నీ మాయాశక్తిని అతడు సర్వవిధ తర్కములచే నిరాసమొనరించి, మాయారహిత బ్రహ్మమును బ్రతిపాదించి, శుద్ధాద్వైతమును నెలకొల్పెను. మాయాసహకారము నపేక్షింపకయే బ్రహ్మము సృష్టికార్యమును నిర్వహించునని అతని మతము. కావున శుద్ధాద్వైతవాదమున బ్రహ్మముతో జగత్తుకూడ సద్రూపమగుచున్నది. జీవ జగత్తులు బ్రహ్మస్వరూపమే అగుచున్నవి. మిథ్యా

113. Bhandarkar.

జగత్తు అనియు, జీవుడు మిథ్య యనియు ననుట సిద్ధాంత భంగముగ నతడు భావించును. మాయ బ్రహ్మము యొక్క అవినాభావ రూప శక్తియై, అగ్ని తేజములవలె, అనన్యత్వమున నుండును. అందుచే నది బ్రహ్మము నెప్పుడుగూడ నావరించి, మిథ్యాసృష్టికి గారణము కానేరదు.

బ్రహ్మము, ప్రకృతి గుణరహితుడు గాన నిర్గుణుడగు గాని సర్వగుణశూన్యుడని తాత్పర్యము కాదు. అతడు సచ్చిదానంద లక్షణో పేతుడు. అందుచే సగుణుడనియే నిశ్చయము. ఆ విధముగ సగుణ నిర్గుణముల సమరస సమన్వయ స్వరూపమే బ్రహ్మము. సగుణ మును త్యజించి, నిర్గుణమును గ్రహింపరాదు. అటులే నిర్గుణమును వర్జించి, సగుణమునుమాత్రము స్వీకరింపజనదు. బ్రహ్మమద్వితీయుడే యగును.

## జీవుడు

ఈ బ్రహ్మమునుండి ద్వివిధరూప సృష్టి ఉద్భవము. చేత నాత్మకము జడాత్మకము నాబడును. అనగ జీవ జగత్తుల సృష్టి యగును. అక్షరమైన బ్రహ్మము, భౌతికముగ విశ్వరూపము దాల్చి యుండ, చిదంశము జీవరూపమును బొందును. సచ్చిదానందరూపుడైన అక్షరుడే యీ ద్వివిధ సృష్టి యయ్యెను. అగ్నిజ్వాలనుండి మిణు గురులుద్భవించినట్లు, సముద్రమున దరంగములు పుట్టుచుండునట్లు అక్షరమునుండియే జీవులు జనితములు. అగ్ని విస్ఫులింగములకు తత్త్వతః అభేదమున్నట్లు బ్రహ్మ జీవులకు అభేదము గలదు. అందుచేత బ్రహ్మమువలె జీవుడుగూడ సత్ పదార్థమే యగుచున్నాడు. కాని జీవుడు బ్రహ్మముమాత్రము కాజాలడు. అతడు బ్రహ్మాంశము,

సేవకుడుగూడ అగును. జీవుడు అణురూపమున వెలుగొందును. అందు చేతనే జీవునిగూర్చి బ్రహ్మసూత్రములు విచారించునుగాన దానికి భాష్యమును రచించి, అణు భాష్యమని వల్లభాచార్యుడు నామమొసంగి యుండుట గమనార్హము. బ్రహ్మమీ విధముగ జీవ ప్రపంచరూపము నొందుటకు మాయ యను మూడవ తత్త్వము అనావశ్యకమగుటచే వల్లభాచార్యుడు మాయారహిత బ్రహ్మమును సమర్థించి, మాయారహిత అద్వైత సిద్ధాంతమును ప్రతిపాదించి, శుద్ధాద్వైతమును నెలకొల్పెనని సంప్రదాయకుల విశ్వాసము. అట్టి అక్షర పరబ్రహ్మస్వరూపమే శ్రీకృష్ణపరమాత్మ యని సిద్ధాంతము. అతని కరచరణాదిక శరీరము అప్రాకృత దివ్యతత్త్వ నిర్మితము. అతడు సచ్చిదానందవిగ్రహుడు. అతడే పురుషోత్తముడు.

శ్రీకృష్ణభగవానుని శుద్ధ సత్త్వాంశము విష్ణురూపమును ధరించి, సర్వపాలన పోషణ కార్యమును నిర్వహించును. అటులే అతని రజోతమోంశములు చతుర్ముఖబ్రహ్మ శివరూపముల దాల్చి, సృష్టి సంహారకార్యముల నొనరించుననియు బుష్టిమార్గ వాక్యము. జ్ఞాన క్రియా శక్తుల అభివ్యక్తస్వరూపమే శ్రీకృష్ణభగవానుడు. సృష్టిని తన సంకల్పశక్తిచే సృజించి, తానే భోక్త భోగ్యములై, పరమాత్మ రాణించును. భక్తపరాధీనస్వభావుడు కావుటచే, నా పరమాత్మయే భక్త వాంఛల ననుసరించి అనేక స్వరూపముల నవతారముల దాల్చి, భక్తుల దరింపజేయుచుండును. కర్మసంబంధమున నా బ్రహ్మము యజ్ఞ రూపుడై, యజ్ఞయాగాదిక కర్మల నందికొనును. జ్ఞానసంబంధమున బ్రహ్మము నాబరగి, జ్ఞాన గమ్యముగ నలరారును. కృష్ణపరమాత్మ రూపమున గీతా భాగవతానుసార భక్తికి గేంద్రస్థానమై, సర్వాకర్షణీయ మూర్తియై భక్తుల దనియింపజేయును.

జీవులలో సచ్చిదానంద లక్షణములలో నానందవిశేషము మరుగుబడ, జడరూప సృష్టిలో చిదంశముగూడ లోపించును. ఆ పరమాత్మయే సచ్చిదానందలక్షణ పరిపూర్ణుడు. బ్రహ్మము తన ఆవిర్భావ తిరోభావ స్వరూపముచే, నీ చేతన అచేతనాత్మక సృష్టియంతయు నగుచుండును. బ్రహ్మమున, అగ్నినుండి విస్ఫులింగములరీతి జీవులుద్భవించి, అణు పరిమాణమున వెలసి, ఆనందరహితులై యొప్పారుదురు అని తాత్పర్యము.

జీవులు, శుద్ధ బద్ధ ముక్త రీతి త్రివిధము. శుద్ధజీవులు, అవిద్యావరణమును బొందక, ఐశ్వర్యాదిక శక్తియుక్తులై యుందురు. బద్ధులు సంసారులై, జనన మరణ పరంపరల నిరికి, స్థూల సూక్ష్మ శరీరధారులై, సుఖదుఃఖాదుల మునిగి తేలుచుందురు. అవిద్యా నాశనమున సంసార బంధముల ద్రెంచి, విముక్తి నొందినవారు ముక్తులు. ముక్తులు పూర్వ ఆనందాది లక్షణముల గడించి, భగవంతునితో ఏకత్వము నొందుదురు. బద్ధుడు శరీరేంద్రియాదుల నాత్మగ భావించి, సంసార పాశముల దగుల్కొని బాధ నొందుచుండును. ఈ బద్ధుడు సర్వ క్షణికత్వ జ్ఞానమును గడించి, సాంసారిక సుఖదుఃఖాదుల నశ్వరత్వముల గ్రహించి, భగవంతునిపై ప్రేమ నభివృద్ధి గావించి, ధ్యానాదులచే ముక్తుడగును.

## జగత్తు

జగత్తుగూడ బ్రహ్మాత్మకమే అయినను, జడమై, పూర్వోక్తము రీతి బ్రహ్మముయొక్క సచ్చిదానంద లక్షణములలో చిదానందముల గోల్పోయి శుద్ధ సత్త్వాంశమున ననగా సదంశమున బ్రహ్మము

యొక్క అవిర్భావ తిరోభావ విశేషములచే సృష్టి లయముల బొందు చుండును. అనగా బ్రహ్మము అవిర్భావరూపమున విశ్వరూపుడై యుండి, తిరోభావరూపమున అదృశ్యుడై అవ్యక్తముగ నుండునని విదితము. అందుచేత నీ విశ్వము బ్రహ్మమువలె సత్స్వరూపము అని నిశ్చయము. లయకాలమున నది నశింపక, రూపాంతరస్థితి నుండుటచే అభావమని నిశ్చయింపదగదు. నశ్వరమన రూపాంతరత్వము అని స్పష్టము. బ్రహ్మముయొక్క శక్తిచే నది పై విధముగ అవస్థా భేదమును బొందుచుండునుగాని నశింపదు. అందుచే నది భ్రాంతి ఎట్లగును? కానేరదని నిశ్చయము. అట్లే అది బ్రహ్మమునకు భిన్న మెట్లగును? కానేరదు. అది బ్రహ్మపదార్థమే. ఆ బ్రహ్మము తన తత్త్వమునకెట్టి లోపము రానీయని విధాన, జీవ జగత్తుల రూపమును సంకల్పించి, దానే యగును. అనంతశక్తియుక్తునకు అసాధ్యమెద్ది యుండును? అందుచే నతడే జగదుపాదాన నిమిత్తకారణములు అని శుద్ధాద్వైతవాదము. అతడు కర్తయు విశ్వరూపుడునై యుండును. మాయ భ్రాంతికాక, బ్రహ్మముయొక్క శక్తియై, అతని ఆవిర్భావ తిరోభావ కార్యముల జేయించును. అందుచే మాయ అవిద్యారూపము కానేరదు.

జగదీశ్వర విభేద దృష్టియే అజ్ఞానము. దీనిచే జీవుడు ప్రపంచ బద్ధుడై, నానా యాతనలకు లోనయి దుఃఖితుడగును. దీనినుండి కడతేరుటకు భగవదనుగ్రహము నొందు పుష్టిగాక నన్యమార్గము అభావము. జ్ఞానముగూడ నుపయుక్తమైనను భక్తియే ప్రధానము, ముఖ్యము. భగవంతునియందు సంపూర్ణ భక్తి గలిగినచో నాతని అనుగ్రహము సంప్రాప్తించి, సర్వ పాపపరిహారము జీవునికగును.

భక్తి సఫలత్వము పుష్టి ననుసరించి గ్రాహ్యము. ఫలితములు లౌకిక అలౌకిములుగ ద్వివిధము. లోకమున ధర్మార్థకామమోక్షములు నా పురుషార్థముల నా పుష్టియే యొసంగును. కాని మహాపుష్టి జీవునికి సర్వ అటంకముల నివారించి, పరమాత్మప్రాప్తిని గలిగించును.

## పుష్టి స్వరూపము

పుష్టిచే భక్తియు నినుమడించును. దానిని పుష్టిభక్తి యందురు. దీనిలో ఐహిక వాంఛలు నమసి, పరమాత్మానుభూతియే ప్రధానముగ నుండును. ఈ పుష్టిభక్తి (1) ప్రవాహపుష్టిభక్తి (2) మర్యాదపుష్టిభక్తి (3) పుష్టిపుష్టిభక్తి (4) శుద్ధపుష్టిభక్తి యని చతుర్విధము. ప్రవాహ పుష్టిభక్తిలో సాధకుడు ప్రపంచ ప్రవాహమున బయనించుచు, భగవదనుగ్రహప్రాప్తికై భక్తి ననుసరించును. ద్వితీయమైన మర్యాదపుష్టి భక్తిలో, సాధకుడు ప్రపంచ వాసనల నిరసించి, శ్రవణ మనన కీర్తనముల సాగించుచు భగవత్ప్రాప్తికై యన్వేషించుచుండును. పుష్టి పుష్టిభక్తిలో సాధకుడు పుష్టిని గొంత బొంది, భగవంతుని లీలల గ్రహించి, తత్త్వజ్ఞానమున భగవంతునికి సన్నిహితుడుగ నొప్పారుటకు, అధికతర పుష్టికై యత్నించుచుండును. శుద్ధపుష్టిభక్తిలో, సాధకుడు భక్తికొరకై భగవత్సంకీర్తనాదుల మునుగుచు నుండును. ఈ భక్తి కేవలము ఈశ్వరానుగ్రహప్రాప్తముగాని, కృషి ఫలితము కాదని పుష్టిమార్గ సిద్ధాంతము.

ఈ స్థితుల నార్జింప ప్రేమాసక్తులు పరిపక్వమై, భక్తి, వ్యసన రూపము దాల్పవలెను. ఈ వ్యసనము పరమానంద స్థితిని లభింప జేయును. ఈ స్థితిని జేరిన భక్తులు ప్రపంచ వాసనల ద్రోసిపుచ్చుటయే

గాక సాలోక్య, సామీప్య, సారూప్య, సాయుజ్యములు నాబడు చతుర్విధ ముక్తులనుగూడ నిరసించి, శ్రీహరి సేవాలాలసత్వమునే అపేక్షించెదరు. పాంచరాత్రసిద్ధాంతముగూడ నదే స్థితిని బోధించునుగదా! ఈ వ్యసనరూపభక్తిచే, సాధకునకు శ్రీహరి సర్వత్ర గోచరించును. అందుచే సర్వము ప్రేమపాత్రముగ బరిణమించును. కాన అంతః బహిష్ప్రపంచము అంతయు నా భగవన్మయముగ గోచరించును.

దీని ఫలితముగ భక్తుడు శ్రీకృష్ణ లీలావిభూతిని దర్శించి, అందు బాల్గొను మహాభాగ్యము బొందును. ఆ లీలారంగమున బశు పక్షి వృక్షాది రూపముల ధరించి, భక్తులు ఆనందించెదరు. పురుషోత్తమ సాన్నిధ్యమున మహదానందము ననుభవించెదరు ఆ భక్తులు. భౌతికమైన బృందావనమునగాక, నీ ముక్తులు దివ్యమైన బృందావనమున పరబ్రహ్మమైన శ్రీకృష్ణపరమాత్మతో నిత్యలీలాదుల మునిగి, ఆనంద సాగరమున విహరించుచుందురు. మర్యాదభక్తులు సాయుజ్యముక్తి ని బొంద, పుష్టిభక్తులు దాని నిరసించి, శ్రీహరి లీలాతరంగముల దేలియాడుచు ఆనందమున తన్మయులగుచుందురు.

వల్లభాచార్యుడు విష్ణుస్వామినుండి తాత్త్వికవిషయ గ్రహణము గావించియున్నను యీ పుష్టివిధానమున దన యాంతరంగిక ప్రబోధ వలన జనింపజేసి, పెంపొందించి సిద్ధాంతీకరించెను. పాంచరాత్ర వైఖానసాదికములు, యితర వైష్ణవ సంప్రదాయములకు బ్రధానానుష్ఠేయములై తనరార, విష్ణుస్వామి ఆత్మనివేదనా భక్తిని ప్రబోధించెను. అద్దానిని వల్లభుడు స్వీకరించి, భగవదనుగ్రహప్రాధాన్యమును గుర్తించి, అనుగ్రహమార్గమైన పుష్టిమార్గమును ఆత్మనివేదన విధానమును నిర్మాణాత్మకముగ నభివృద్ధి గావించెను.

పుష్టిమార్గమున సేవ అతిప్రధానము. అది నామసేవ, స్వరూప సేవ అని ద్వివిధము. నామసేవ యనగా భగవల్లీలావిభూతుల గీర్తించుచుండుట నాబడును. స్వరూపసేవ తనుజ, విత్తజ, మానసీ రూపముల త్రివిధము. శరీరముతో గావించు సేవ తనుజము నాబరగును. ధనధాన్యాదిమూలమున నాచరించు సేవ విత్తజమగును. మనస్సుచే జేయు సేవ మానసీసేవ యనబడును. మరల నీ మానసీ సేవ మర్యాదా, పుష్టిమార్గములని ద్వివిధము. మర్యాదామార్గమున మానవ సేవ గావించుటకై శాస్త్రార్థజ్ఞానము గలిగి యుండవలెను. ఈ సాధకుడు లోకపాశాబద్ధుడై యుండి ఆత్మజ్ఞానమును నొందును. అంత భగవదారాధనలో మునుగును. క్రమమున అహంకారమమకారముల బోనాడి, ఈప్సితార్థమును బొంది ఆనందించును. పుష్టిమార్గాయాను వర్తకుడు ప్రథమమునుండి కేవలము ఈశ్వరానుగ్రహమునకై కృషి గావించును. లోకవిషయములతనికి సదా దూరములు. విష్ణుస్వామి సంప్రదాయమున భక్తి సగుణము, తామసికముగ నుండును. సగుణ భక్తి విష్ణుసంప్రదాయము. విష్ణుస్వామిని అనుసరించినను వల్లభా చార్యుడు, భక్తి అనుసరణమున దన వ్యక్తిత్వముల బ్రకటించి, అన్నింటికి దైవానుగ్రహమత్యవసరమగుటచే నీ పుష్టిమార్గమును రూపొం దించెను. ఈతని భక్తికి ప్రేమ ముఖ్య లక్షణము. నిర్గుణమే యీ భక్తి తాత్పర్యము. అనగా నిష్కామభక్తి యని యనదగును. ఇందు భక్తి భక్తికొరకై, ముఖ్యముగ శ్రీకృష్ణ కృపాసిద్ధికై యుండుట గమనార్హము. ఇది సాత్వికము.

ఈ విధముగ బూర్వాచార్య నిర్మిత భక్తిమార్గమునకును, వల్లభా చార్యసంస్థాపిత పుష్టిమార్గమునకును వ్యత్యాసము గోచరము. ఇది

భక్తి జ్ఞాన మార్గములకంటె విశిష్టము, ప్రశస్తము. ప్రేమలక్షణా భక్తి అను నిర్వచనముచే నిది శుద్ధ ప్రేమరూపముగాన నతి పవిత్రమై ప్రధానమై యొప్పారును.

## గోపికాదర్శము

ఈ పుష్టి మార్గావలంబికులకు ఆదర్శము గోపికాభక్తి. అది విశుద్ధము. ఆ గోపికా సమూహమే యీ శాఖీయులకు గురు సమానము. ఈ గోపికలు మువ్విధముగ వల్లభునిచే విభజింపబడిరి. 1. వ్రజాంగనలు 2. కుమారికలు 3. గోపాంగనలు అని యందురు. అందు ప్రథములు వ్రజాంగనలు శ్రీకృష్ణుని గోపకిశోరునిగ భావించి, వాత్సల్యభక్తితో నతని నర్చించి ఆనందించెదరు. వాత్సల్యభావము నాబడు భక్తి పుష్టి మార్గమున ముఖ్యము. ద్వితీయ శ్రేణికి జెందిన కుమారికలు శ్రీకృష్ణుని బతిగ భావన జేసి భజించెదరు. వీరి భక్తి మధురభావము నా భక్తి మార్గములలో ప్రసిద్ధము. తృతీయులైన గోపాంగనలు వీరిరువురికి అతీతులై, పవిత్ర ప్రేమవాహినీ నిమగ్నులై, సర్వ లౌకికభావనా రహితులై సర్వధర్మముల ద్యజించి, కేవలము శ్రీకృష్ణప్రాప్తికై భజించెదరు. ఇందు స్వార్థము శూన్యముగాన దీని బరకీయభావనా పూరితము అందురు. ఈ విధముగ బుష్టిమార్గమున వాత్సల్య, మధుర, పరకీయ భక్తులుమాత్రముగాక గోపబృందము, ఆదర్శముగనున్న సఖ్యభక్తియు ముఖ్యము. ఈ సంప్రదాయమున రాధకు ఎక్కువ ప్రాధాన్యము గానము. వల్లభుడు, రాధను గోపాంగనాదర్శనముగ గైకొనినను, ప్రాముఖ్యము నీయలేదు. కాని కాలాంతరమున రాధా రాణికి ముఖ్యస్థానము లభించి, రాధ శ్రీకృష్ణపరబ్రహ్మముయొక్క

ముఖ్యశక్తి స్వరూపముగ రూపొందెను. అందుచే రాధికారాణియు నీ పుష్టిమార్గమున ముఖ్యస్థానము నలంకరించినది.

## వల్లభ ప్రాశస్త్యము

ఈ విధమున వల్లభాచార్య గురుసత్తముడు పూర్వ వైష్ణవాచార్యుల మార్గానువర్తియైనట్లుండియు, దన ప్రత్యేకతను ప్రతిష్ఠించుకొని, నిష్కామ భక్తిప్రధానమైన పుష్టిమార్గమును ప్రదర్శించి, భక్త భగవంతులకు మధ్యనున్న స్వార్థావనికనుగూడ దొలగించి, భక్తుని, భగవంతుని పవిత్ర సన్నిధానమునకు త్రోసి, భక్తుని ఆదర్శ, పావన, నిస్వార్థ భక్తిమాహాత్మ్యముచే 'పుష్టి' అను భగవదనుగ్రహమును భగవంతునుండి సాధించి, ఆ పరమాత్మసాన్నిధ్య మహాభాగ్యమును ప్రాపిలజేసికొని, సదా అందు ఆతని లీలాప్రభావమున నుండు ఆనందము నొందునట్లు వల్లభాచార్యుడు గావించి, ముముక్షుకోటికి వినూత్న మార్గము నుపదేశించి చరితార్థత నార్జించెను. కర్మయందెట్లు నిష్కామత్వము గలదో, అటువలె భక్తియందుగూడ గలదని నిరూపించి, భక్తిని పావనమొనరించె నా గురుకులాలంకారుడు. ఆ భక్తిలో సాక్షాత్తు శ్రీకృష్ణభగవానుడుగాక నితరమునకెట్టి స్థానము గానరాదు. భగవంతునికి భక్తునికి సంబంధము శారీరికాదికముచేగాక, పవిత్ర హృదయమూలమున యని ఆ ఆచార్యశ్రేష్ఠుడు స్పష్టపరచెను. అదియే ముక్తిదాయకముగాని అన్యభక్తి కాదని అతడు నిరూపించెను. అదియే ముఖ్యము. అట్టి భక్తియే తారకము. అట్టి అసమాన భక్తివిశేషము ను అనుష్ఠించి, ఆనందించి, లోకమునకు బంచిపెట్టిన వల్లభాచార్యుని భక్తులెవరును మరువనేరరు. ఆతనికి సర్వ ముముక్షువులు సర్వదా సర్వథా కృతజ్ఞులు.

'శ్రీకృష్ణ శరణం మమ। సహస్రపరివత్సరమితకాల జాత కృష్ణవియోగజనితతాపక్లేశానంద తిరోభావోఽహం। భగవతే కృష్ణాయ దేవాయ దేహేంద్రియప్రాణాంతఃకరణాని తద్ధర్మాశ్చ దారాగారపుత్ర విత్తేహపరాణి ఆత్మనాసహ సమర్పయామి। దాసోహం కృష్ణ తవాస్మి॥' 'నేను శ్రీకృష్ణుని శరణమందున్నాడను. సహస్రాధిక వత్సరములనుండి శ్రీకృష్ణ వియోగము నాకు గలిగెను. ఆ విరహముచే గలిగిన తాపముచే నా యానందము వెనుదిరిగినది. అందుచే నేను దేహేంద్రియ ప్రాణాంతఃకరణములను, ధర్మము. దారా, సుత, గృహ, ధన, ఆత్మలను సర్వము నాతనికి సమర్పించితిని. ఓ కృష్ణా। నేను నీ దాసుడను. నేను నీవాడను' అని విశుద్ధ పుష్టిభక్తిచే భక్తుడు భగవంతుని నవలోకింప,

'యే దారాగారపుత్రాప్త ప్రాణాన్ విత్తమిమం పరం। హిత్వాత్మశరణం యాతాః కథతాం స్త్యక్తుముత్సహే॥' 'ఏ వ్యక్తి దారాగారపుత్రాప్త ప్రాణవిత్తములతో నా శరణు బొందునో నే నాతని నెట్లు త్యజింపగలవాడను' అని ప్రకటించుచు, శ్రీకృష్ణభగవానుడు పుష్టిరూపానుగ్రహమును భక్తునిపై వర్షింపజేసి, తన సన్నిధానము నకు గొంపోయి, అద్వితీయానందమును ప్రసాదించును.

యే త్యక్తలోకధర్మాశ్చ
మదర్థే తాన్ బిభర్మ్యహం (భాగవత. 10.46.5)

కం॥ లౌకిక మొల్లక నన్నా
లోకించు ప్రపన్నులకును లోబడి కరుణా
లోకనముల బోషింతును
నాకాశ్రిత రక్షణములు నైసర్గికముల్॥
(భాగవత. పూ. 10. 1435)

# అచింత్య భేదాభేద వాదము

## శ్రీకృష్ణ చైతన్యుడు

## నామ సంకీర్తనము

కలేర్దోషనిధే రాజన్నస్తి హ్యేకో మహాన్ గుణః।
కీర్తనాదేవ కృష్ణస్య ముక్తబంధః పరం వ్రజేత్॥
12. 3. 51

కలిదోష సంఘమునుండి తరింప శ్రీకృష్ణ కీర్తనమునమాత్రమే సాధ్యము అని పైశ్లోక రూపమున శ్రీ శుకబ్రహ్మ పరీక్షిన్మహారాజునకుపదేశించెను. ఈ కలిదోష పరిహారమునకు హరికీర్తనముగాక నితరమభావముగ మరల నా మహర్షి చంద్రుడు 'కృతే యద్ధ్యాయతో విష్ణుం త్రేతాయాం యజతో మఖైః। ద్వాపరే పరిచర్యాయాం కలౌ తద్ధరికీర్తనాత్॥' (12.3.52) కృతయుగమున విష్ణుధ్యానముచేతను, త్రేతాయుగమున యజ్ఞములచేతను, ద్వాపరమున పరిచర్యచేతను, కలిలో హరికీర్తనముచేతను మానవులు తరించెదరు అనియు, గలిలో హరికీర్తనముమాత్రము ముక్తిహేతువని శుకయోగీంద్రుడు బోధించినట్లు భాగవతశాస్త్ర కథనము.

మరియు నీ పురాణము అవ్విధమున కీర్తనముగ్గడించుటయే గాక, మహాభారతముగూడ భీష్మముఖమున హరినామకీర్తనమును స్తుతింపజేసి, సర్వ ధర్మములకు శ్రేష్ఠమైన ధర్మమును, మరియు ముక్తిదాయకమునునైన విష్ణుసహస్రనామ పఠనమును ప్రకటించి

యున్నది. బ్రహ్మపురాణమును 'కలౌ సంకీర్త్య కేశవం' (97.166) అనియు సంకీర్తన విధానమును కీర్తించియున్నది.

ఇట్లు పురాణాది గ్రంథములమాత్రముగాక నామ, జప, సంకీర్తన పద్ధతి ఋగ్వేదాదికమునగూడ సూచింపబడియున్నది. 'ఆస్యజ్ఞానంతో నామచిద్వివక్తన। మహత్తే। విష్ణో సుమతిం భజామహే' నామ జప, నామ కీర్తనములయొక్క శక్తిని స్థాపించుటకు సుమతియైన విష్ణువును భజించుచున్నాము అను దీర్ఘతముని విష్ణుసూక్తమున విష్ణుభజనము ప్రస్తాపితము. అందు నామజప నామకీర్తనములు సూచితములై, వాని శక్తి ఉగ్గడింపబడినది. అదే విధముగ గొన్ని విష్ణు సూక్తముల ఋగ్వేదము, విష్ణువు విశ్వయోని యని స్పష్టపరచి, ఆతని అనుగ్రహము విశ్వముపై వర్షింప నతని భక్తులు ప్రార్థింపగలరనియు, అతని నామము వంద్యము ప్రకాశవంతమనియు దెలిపి, పురుషార్థ సాధనమునకు హృదయపూర్వక నామసంకీర్తనము మార్గమని బోధించినది. అంత నా సూక్తము 'హే విష్ణో! నీ నామజపముచే మేము నీ యనుగ్రహమును బొంది, చివరకు దరించెదము' అనియు దెలిపియున్నది. అందుచే వేదాది స్తోత్రసాహిత్యపర్యంత సర్వ భారతీయ శాస్త్రసంచయము, హరికీర్తన మాహాత్మ్యమును బ్రస్తావించి, వివరించి, ప్రశంసించి, భక్తులకుపదేశించియుండుట సర్వ ముముక్షుజన విదితము.

ఈ సంకీర్తనాప్రవాహముయొక్క యునికిని గ్రహించి, పండిత రాజగోపాలాచారి వాక్యరీతి, రామానుజాది ఆచార్య కాలముల ; Bhajanas, Sankirtanas, festive songs etc. were practically unheard of in those days, and religious fervour never

took the form of violent demonstrations or indecent exhibitions 114 భజన సంకీర్తన ఉత్సవ గానాదులు హేయ ప్రదర్శనములు, పూర్తిగ నశ్రుతములై భక్త్యుత్సాహము తీవ్ర ప్రదర్శనరూపము దాల్చి యుండకున్నను, భాగవత ప్రధానమైన గోపికా ప్రేమామాధుర్యమును గ్రహింపనేరక, ఆచార్యులు అద్దాని విస్మరించిరని చింతించి, ప్రేమభక్తియే మానవత్వమునకు పరమావధి యనియు, అది ధర్మార్థకామమోక్షములకు మించిన పంచమ పురుషార్థ మనియు, నందుచే నది ముక్తికంటె అధికతమస్థానమునందధిష్ఠిత మనియు, నా ప్రేమ సాధనజన్యముగాక భక్తిప్రభూతమనియు, వంగ రాష్ట్రమున జనించి యావద్భారతమును దరింపజేసిన శ్రీకృష్ణచైతన్య మహాప్రభువు, యీ ప్రేమభక్తి నుద్ధరించి, అనుష్ఠించి, ఎల్లర ననుభవింపచేసెను. ఈ Prophet of Bhakti భక్తి ప్రవక్త, ఈ Prophet of Prema ప్రేమతత్త్వోద్ధారకుడు, ప్రేమభక్తి ననుసరించి, భక్తకోటిలో సంకీర్తనావిధానమును బ్రవేశింపజేసి, కీర్తన భజన పద్ధతుల రూపొందించెను. ఆ మహాప్రభుని స్వభావము అధిక ఉద్రేక పూరితము గాన, తన ప్రేమభక్తి తన్మయత్వమున నానందనృత్య మున మునిగి, పరిసరముల నొక ప్రేమ వృష్టిని గురిపించి, బాహ్య స్మృతిని మరచునట్టి సమాధుల లయమొందుచుండెడివాడు. సర్వ విధైహికానందసందోహములకంటె, శ్రీకృష్ణపరిష్వంగసుఖానుభూతి శ్రేష్ఠతరము. కాని అద్దానికంటె శ్రీకృష్ణ విరహవేదనాజన్యమైన సుఖము సర్వోత్తమము. దానిని మహాభావమందురు. అట్టి మహాభావ సమాధులలో శ్రీకృష్ణ చైతన్యుడు సర్వదా మునిగియుండును. ఈ

---

114. Sri T. Raghavachariar: The Vaishnavite Reformers of India, p. 113

విధమున Prophet of Divine Name భగవన్నామ ప్రవక్త, ఒక అద్భుత Spiritual Dynamo పారమార్థికశక్తి ప్రసారయంత్ర రూపమును దాల్చి అతని స్పృశించినవారికిగూడ, నట్టి దన్మయత్వ మును ప్రసాదించు ఆధ్యాత్మిక శక్తిస్వరూపుడై యలరారెను.

## గౌరాంగ ప్రతిభ

ఏ శాస్త్రమునకునైన వ్యాఖ్యానముల రచింపక, తన హృదయ కుహరమునుండి, తన ఆధ్యాత్మిక అనుభూతినుండి ప్రసంగించుటచేత ప్రజాసంఘమున నతని అసాధారణ ప్రభావము అజేయముగ విజృం భించి, ఇస్లాము మతావలంబకులుకూడ మతాంతరులై భక్తులు కాగల్గిరి. అందులకు దారాక్రాణము హరిదాసాది భక్తాగ్రేసరులేగాక, ఉత్తర ప్రదేశమున పఠాణ వైష్ణవగ్రామము ముఖ్యము. అందున్న మహామ్మ దీయులు ఎల్లరు చైతన్యభక్తులై వైష్ణవమును స్వీకరించిరి. శ్రీరామ కృష్ణుడు వచించినట్లు Gouranga experienced all three states. In the inmost state he would remain in samadhi, unconscious of the outer world. In the semiconscious state he could only dance. In the conscious state he chanted the name of God 115 గౌరాంగుడు త్రివిధ అనుభవ ముల నొందెను. హృదయాంతరమున లయమునన్న సమయముల నతడు సమాధులనుండి బాహ్య ప్రపంచమును మరచియుండును. తన్మయ సమయముల నాతడు నృత్యమునుమాత్రము సేయగలుగును. జాగ్రతస్థితిలో నతడు భగవన్నామము నుచ్చరించును. అదేవిధముగ

115. Sri Ramakrishna : The Gospel of Sri Ramakrishna, p. 179

In some mood he would dance, some times sing, some times weep, and with him danced, sang and wept for God the whole of Bengal, Orissa and Assam for a pretty long time 116 ఒక మానసికస్థితిలో నతడు నృత్యము చేయును, కొన్ని సమయముల గానముచేయును, కొన్నివేళల నేడ్చును. అతనితో సంపూర్ణముగ వంగ, ఒరిస్సా, అస్సాము రాష్ట్రములు చాలకాలము ఆడి పాడి ఏడ్చి యున్నవి అని సంఘముపై అతని ప్రభావము చక్కగ నభివర్ణితము. శర్మ మహాశయుడు వచించినరీతి Chaitanya's success was due to the sincerity of the ove r-poworing religious experience which he had 117 చైతన్యుని శక్తియుక్తమైన హృదయపూర్వక పారమార్థికానుభవమే అతని కార్యసిద్ధికి గారణము.

Sri Chaitanya, thus was a great social reformer and he is remembered, followed and worshipped by thousands of people as a great devotee, a founder of Bhakti cult, a prophet of Divine Name, nay, as an incarnation of the Lord Himself 18 ఈ విధముగ శ్రీ చైతన్యదేవుడు గొప్ప సంఘసంస్కర్తయయ్యెను. అతని నొక అమృత భక్తునిగను, భక్తిసిద్ధాంత సంస్థాపకుడుగను, భగవన్నామ ప్రవక్తగను, అంతియగాక సాక్షాత్తు భగవదవతారముగను అసంఖ్యాక ప్రజానీకము అతని స్మరించుచు, అనుసరించుచు, ఆరాధించుచుండును. అతని జీవిత కాలముననే అవతార పురుషుడుగ నతదర్శింపబడెను. Whatever

116. Editor: Vedanta Kesari, 1958, p 458
117. Prof. D. S. Sarma: Bhavan's Journal, 3-6-56, p. 44
118. Editor: Vedanta Kesari, 1958, p. 458

may be the truth about Chaitany's Divinity, it is clear that he was in actual life, the Sri Krishna for the sixteenth Century 119 అతని దివ్యత్వముయొక్క సత్యత్వ మెట్లున్నను, యథార్థ జీవితమున చైతన్యుడు పదునారవ శతాబ్ది శ్రీకృష్ణుడే యని విస్పష్టము. రాధికారాణి శ్రీకృష్ణమాధుర్యము నెట్లు అనుభవించుచున్నదో, అట్లు తాగూడ శ్రీకృష్ణామృతానుభవము నాస్వాదింప శ్రీకృష్ణునకు వాంఛ గలిగెను. కాని తా కృష్ణుడుగ నున్నంత కాలము అది యసాధ్యము. మరియు రాధాతత్త్వము దా బొందిన గాని సుసాధ్యము కానేరదు. అట్లైన తాను రాధాతత్త్వమును బొందుటో కృష్ణుడెట్లు? అందుచే యోచించి, బృందావనలీలావిభూతిసంపన్నుడైన కృష్ణుని తత్త్వముతోడను, అట్టి రాధాతత్త్వముతోడను, సమ్మిశ్రిత ఏకైక స్వరూపముగ దాల్చి, తన యమానుష దివ్య మాధుర్యరుచుల శ్రీకృష్ణుడానందింప సంకల్పించెను. అదియే రాధాకృష్ణసమరసైకస్వరూపము. అదియే శ్రీకృష్ణచైతన్య స్వరూప నిజతత్త్వము. అందుచే నా మూర్తిలో శ్రీకృష్ణుని జగన్మోహన స్వరూపాది లక్షణములు, రాధికారాణిలోని అద్వితీయ ప్రేమభక్తి పారవశ్యత్వ సౌందర్యములు నేకోన్ముఖముగ లయించి, నాటి భక్తకోటికి రాధాకృష్ణ తత్త్వద్వయ ప్రదర్శన మహాభాగ్యము శ్రీ చైతన్యదేవునిద్వారముగ నొనగూడెను.

వల్లభ నింబార్కాది ఆచార్యుల సిద్ధాంతముల రాధికకూడ శ్రీకృష్ణ అర్చాపీఠము నలంకరించియున్నను, చైతన్యునిలో నీ మూర్తిద్వయము మేళవించి, సమరసస్థాయిని ప్రదర్శితమగుటచే నిందు రాధాకృష్ణతత్త్వము మూర్తిద్వయము మూర్తీభవించెను. వైష్ణవ సిద్ధాంతముల గల శాంత,

119. Sri T. Raghavachariar The Vaishnavite Reformers of India, p. 127

దాస్య, సఖ్య, వాత్సల్య, మధుర భావములనెడు సాధనావిధానములలో నితరములు అన్యులకు ప్రధానమై యొప్ప, శ్రీ చైతన్యునికిమాత్రము అవి రుచింపక, పంచమమైన మధురభావము ముక్తిదముగ దోచి, అనుష్ఠానయోగ్యముగ నాతడు పరిణమింపజేసెను. చైతన్యుని భక్తి పారవశ్యమును తిలకించిన ప్రజానీకమునకు శాస్త్రార్థములు ప్రత్యక్షములయ్యెను. చారిత్రాత్మకముగ రాధ లేకున్నను, శాస్త్రముల నభివర్ణిత భక్తితన్మయత్వాది అనుభూతి సంచయమును ప్రత్యక్షముగ నాస్వాదించిన చైతన్యుడు శాస్త్రవచనముల సత్యత్వమును స్థిరపరచెను. రాధాదేవి యనుభవసంపద యంతయు నతనిలో మూర్తిభవించి యుండుటచే, ముఖ్యముగ నా దేవియొక్క మధురభావము సువ్యక్తమగుటచే, నతడు రాధికావతారమనియు గొందరి విశ్వాసము. శ్రీకృష్ణుని మాధుర్యరూపానుభూతిని రాధికవలె బొందగోరువారు యీ మార్గము ననుసరింపవలెనని చైతన్యుడు అనుభవయోగ్యముగ జూపరచెను. శ్రీకృష్ణుని ఐశ్వర్యరూపముగాక, అతని మాధుర్యరూపముమాత్రము భక్తులకు ప్రధానము అని ఆతని తాత్పర్యము.

వంగరాష్ట్రమున శాక్తేయ విధానమునగల శివశక్తుల నాధారముక గైకొని, విష్ణుపురాణ, హరివంశ, భాగవతాది మహాశాస్త్రముల మూర్తిభవించిన శ్రీకృష్ణతత్త్వమును గైకొని, నింబార్క వల్లభుల నుండి రాధికామూర్తిని స్వీకరించి, by his personality and character gave a new form to the Vaishnava faith 120 చైతన్యుడు వైష్ణవమతమునకు తన స్వభావ, మూర్తిమత్త్వములచే నొక వినూత్న స్వరూపము నొసంగెను. అతడు వంగీయ వైష్ణవ

120. Dr. S. Radhakrishnan : Indian Philosophy, Vol. 2, p. 761

సాహిత్యమునకు గేంద్రమూర్తి యగుటయేగాక, తన సువిశాల సర్వ స్వామ్యభావప్రాబల్యమున అసంఖ్యాక అనుచరుల నార్జించి, వివేకానంద వచనములలో became one of the greatest teachers of Bhakti, the world has ever known, mad Chaitanya! 121 నీ యున్మత్తుడైన చైతన్యుడు, ప్రపంచము మున్నెన్నడు ఎరుంగని అత్యద్భుత భక్తిమార్గప్రవక్తలలో నొకడుగ రూపొందెను.

## రాధాదేవి

I have only one pair of eyes; they blink and so hinder my vision. And further, on account of streams of tears I could not see enough of my Beloved. O! friends I shall not be able of keep my life-breath. After my death, place my body on a branch of the dark tamala tree and inscribe on my body Krishna's sweet name 122 నాకొక్కటే చక్షుర్ద్వయము గలదు. అది నిమేషములచే నా దృష్టి నాటంకపరచుచున్నది. మరియు, గన్నీటిధారలచే నా ప్రియత ముని నా తృప్తిదీర వీక్షింపజాలకున్నాను. ఓ మిత్రులారా, నా ప్రాణ మును నేను బట్టియుంపలేకున్నాను. నేను మరణించిన పిమ్మట, నా దేహము నా కృష్ణతమాల వృక్షశాఖలపై నునిచి, నా తనువుపై శ్రీకృష్ణ మధుర నామమును లిఖింపుడని వాంఛించు రాధికాదేవి విరహవేదనాస్వరూపము నెవరు గ్రహింపగలరు? How can people, who are vicious to their very core, and have no idea

121. Swami Vivekananda : The Complete Works, Vol. 3, p. 266

122. Sri Ramakrishna : The Gospel of Sri Ramakrishna, p. 145

of what morality is, understand all this? 123 సమూలము గ్రూరచిత్తులై నీతియననేమో నెఱుంగనివారెట్లు గ్రహింపగలరు అని వివేకానందుడు రాధికాభక్తిని ప్రస్తావించి, ప్రశ్నించెను.

కాని రాధికాపాత్ర అద్భుతము. ఆ నామమున కృష్ణలీలల వర్ణించు హరివంశ, విష్ణుపురాణ, భాగవతాది గ్రంథముల నా మూర్తి అభావము. పాంచరాత్ర భాగవత సిద్ధాంతముల నా తత్త్వము గానము. కాని నింబార్క, వల్లభ, చైతన్య సంప్రదాయముల, నామె, సంపూర్ణ వ్యక్తిత్వమును బొంది, శ్రీకృష్ణ సహధర్మచారిణియై, మహారాష్ట్రి భక్తకోటిచే శ్రీకృష్ణునితో నర్చింపబడుచున్న రుక్మిణీదేవిని మరుగున ద్రోసి, జయదేవ, విద్యాపతి, చండీదాసాది భక్త కవివరేణ్య రచనము లతో నమృతత్త్వమునందినదీ రాధికాదేవి. భాగవతమున నొక ప్రత్యేక గోపిక ఏకాంతముగ శ్రీకృష్ణునితో నరణ్యముల గ్రుమ్మరుచు, నితర గోపికాకన్యల అసూయాదృష్టులకెరయైనట్లు గాంతుము కాని, అందు రాధా నామము లుప్తము. Out of this shadowy figure arose Radha; who became in later literature the symbol of the most passionate love which human heart is capable of 124 ఈ ఛాయామాత్రమూర్తినుండి కాలాంతర వాఙ్మయమున మానవహృదయసాధ్యమైన, ఆవేదనాపూరిత, అద్భుత ప్రేమ చిహ్నముగ నీ రాధామూర్తి ఆవిర్భవించెను. అట్లుద్భవించిన అద్భుతమూర్తి Took captive the hearts of innumerable men and women and became the heroine of thousands of songs, pcems

123. Swami Vivekananda : The Complete Works, Vol 3, p. 364

124. Prof. D. S. Sarma : Bhavan's Journal, 3-6-56, p. 42

and dramas and, what is most astonishing, the live centre of more than one theology and the queen of more than one paradise 125 అగణిత స్త్రీ, పురుష హృదయములఁ బంధించి అసంఖ్యాక, కీర్తన పద్య నాటకముల నాయికయై, అన్నింటికంటె విచిత్రముగ అనేక సిద్ధాంతములకు సజీవకేంద్రముగను, అనేక వైకుంఠధామములకు రాణిగను ఆమె అధిష్ఠించెను.

'జప దాన వ్రత హోమ సంయమ తపస్స్వాధ్యాయ ముఖ్యంబులన్, నిపుణుల్ గోరియు నే విభున్ మనములన్ నిల్పంగలేరట్టి సత్। విపులాకారునిపై మహామహిముపై విశ్వేశుపై మీకజ, ప్రసవటుధ్యానములిట్లు నిల్చెనె భవచ్చారిత్రముల్ చిత్రముల్' (భాగవత. పూ. 10. 1466) అని శ్రీకృష్ణపనుపున వ్రజమునకేతెంచి, గోపికాస్త్రీల అతుల భక్తిపారవశ్యముల దిలకించి ఆశ్చర్యానందతన్మయత్వమున ఉద్ధవునిచే స్తుతింపబడిన గోపాంగనాసంఘమున అసమస్థానమునధిష్ఠించిన యీ రాధాంగన ఎవరు? ఈమె విచిత్రలీల విచిత్రమైన సంబంధమున శ్రీకృష్ణునితో మెలగి, అట్టి చిరస్మరణీయ విచిత్రస్థానము భక్త హృదయముల నలంకరించినది. ఆమె కృష్ణునకు దూరము, దగ్గరకాని బంధుత్వము గలది. కేవలము క్రొత్త యగుచో కృష్ణునితో నెక్కువ చనవున మనుట కష్టసాధ్యమై యుండెడిది. లేక, సన్నిహిత బంధువేయైన నీ సంబంధము సామాన్యమై యుండెడిది. అటులే ఆమె అవివాహితయుగాదు. వివాహితయై యున్నను, భక్తురాలై, కృష్ణసాంగత్యమున కాటంకపరుపని భర్తను గలిగియున్నది. అవివాహితలు, కన్యలు యువకుడైన శ్రీకృష్ణునితో జనవునుండుట

125. Prof. D. S. Sarma : Bhavan's Journal, 3-6-56, p. 44

యందేమియు విశేషము గానము. భర్తయుండగా నాతని ఎదుటనే పరపురుషునివెంట దిరుగుటలో విశేషము గ్రాహ్యము. కేవలము భార్యయై యుండి, ఏకాంతమున భర్త యగు పురుషునితో వ్యవహరించుటయు సామాన్యమే. కాని భార్యకాక, భర్తకాని పురుషుడైన కృష్ణునితో రాధిక విహరించుటయందధికతర విశేషమిమిడియున్నది. ఈ విధముగ నీమె శ్రీకృష్ణునితో నపూర్వ సంబంధమున జారిత్రకయై రాజిల్లుట ఆమెయొక్క అనైహిక, నిర్విషయ, అలౌకిక దృష్టియే యని చెప్పకతప్పదు. అతీంద్రియ మానసికస్థితిలో భక్తి తన్మయత్వమున స్త్రీ యెందు ఎట్లున్న ఏమి? ఎవనితో వ్యవహరించిన యేమి? విషయత్వము అభావమైన ఆవ్యక్తి అగ్నివలె బరమ పవిత్ర, మేరువు వలె అచంచల, సర్వవిధ సమారాధ్య. అందును రాధికకు బరమాత్ముడైన శ్రీకృష్ణ సాంగత్యమే లభింప నందు దోషమెటనుండును; అందుచేత నసంఖ్యాక గోపాంగనలలో నీమెయే అద్వితీయ స్థానము శ్రీకృష్ణుచెంత నార్జించి, సార్థకజన్మయై ననేకులకు మార్గదర్శియై వెలుగొందినది. పంచ మహాభావములలో మధురభావము యీమె ద్వారమున అభివ్యక్తమై ఆదర్శమైనది.

ఈ విధముగ రాధికారాణి గోపీభావమును అత్యున్నతస్థాయిని వ్యక్తపరచి, ధన్యయై, వంగీయ వైష్ణవమునకేగాక, మధురభావాపేక్షనున్న సర్వ ముముక్షువుల హృదయపీఠము నలంకరించినది. 'రాధాకృష్ణస్స భగవాన్ పూర్ణబ్రహ్మసనాతనః' (3.118/1) సనాతనుడైన పూర్ణబ్రహ్మమే భగవాన్ రాధాకృష్ణుడు అని భవిష్యత్పురాణము వచించురీతి, శ్రీకృష్ణుని పారమార్థిక అర్ధాంగలక్ష్మియై శ్రీకృష్ణుని అప్రాకృతిక శక్తియై రాణించినది.

ఈ ఆదర్శముచే వంగీయ వైష్ణవము శ్రీకృష్ణుని బురుషోత్తమునిగ బరిగణించి, విశ్వమునగల సర్వ మానవులు స్త్రీ, పురుష విభేదములేక స్త్రీసమూహముగమాత్రము గ్రహించినవి. అందుచే నీ వైష్ణవభక్తులు గోపీభావము నవలంబింప, గొందరు స్త్రీవేషములగూడ దాల్చి సాధన గావించుచుందురు. శ్రీరామకృష్ణ పరమహంసయు నట్లే మధురభావ సాధనసమయమున, స్త్రీరూపధారియై, సిద్ధి గాంచెను గదా! కేవలము సాధనకాలములమాత్రముగాక, యావజ్జీవము స్త్రీ రూపమున కాలముగడిపినవారును వంగరాష్ట్రమున గలరు.

ప్రజాహృదయముల నింత పరివర్తనమునకు కారణము ఏమి? పరబ్రహ్మముయొక్క అతిమధుర సర్వాకర్షణీయ గుణ సంపద్విభూతితో మూర్తీభవించిన జగన్మోహన శ్రీకృష్ణమూర్తియే యని వేరుగ వచింపనేల? స్కాంద పురాణమురీతి నతని నామమెంత మధురము! సర్వ మధుర శబ్దములకంటె సహస్రాధిక మాధుర్యముగలదాతని నామము. ఒక్క పర్యాయము నామమును భక్తితో నుచ్చరించిన, కైవల్యము హస్తామలకముకదా!

దీని నిరూపించి వర్ణించుచు, మానవ హృదయముల గదలించు రీతి గోపికాకృష్ణ లీలల భక్తుల ముందుంచు 'సర్వ వేదాంతసారం యచ్ఛ్రీ భాగవతముచ్యతే' (భాగ. 12.13.15) అనియు, 'నిమ్నగానాం యథా గంగా దేవానామచ్యుతో యథా। వైష్ణవానాం యథా శంభుః పురాణానామిదం తథా॥' (భాగ. 12.13.16) నదులలో గంగయు,

దేవతలలో అచ్యుతుడును, వైష్ణవులలో శివుడును ఎట్లు శ్రేష్ఠమో, అట్లు పురాణములన్నింటిలో భాగవత పురాణము శ్రేష్ఠము అని స్తుతింపబడిన, భాగవతపురాణము రసభూయిష్ఠమై 'తద్రసామృత తృప్తస్య నాన్యత్ర స్యాద్రతిః క్వచిత్' (భాగ. 12.13.15) ఆ రస సంతృప్తచిత్తులకెక్కడను ఏ రసమునుగూడ రుచింపదనినరీతి అస మానమైనదీ భాగవత గ్రంథము. అందుచే నది ముఖ్యముగ వంగీయ వైష్ణవమునకు సర్వోత్తమ ప్రామాణిక గ్రంథముగ బరిగణింపబడినది.

దీనికి ప్రబల సహకారిగ, వంగీయ శ్రీకృష్ణుడనియు, పదు నారవశతాబ్ద కృష్ణుడనియు, ప్రశస్తుడైన శ్రీకృష్ణ చైతన్యుని అవ తరణము అత్యధికోత్సాహమును వంగరాష్ట్రమున గల్పించి, దేశము నల్లడల మహాసంచలనము గలిగించి, భక్తిసిద్ధాంతమునకు వినూత్న శోభను, వికాసమును నిర్మించి, వైష్ణవసిద్ధాంతమును అనుష్ఠానమున నుచ్ఛస్థాయికి గొంపోయినది.

అందుచే వైష్ణవమున నింత మహోన్నత పరిణామమునకు గారణుడైన శ్రీకృష్ణచైతన్యుని జీవిత కథా గ్రహణమునుగూడ సుమంత గావించెదముగాక.



# శ్రీకృష్ణ చైతన్యుడు

## జననము

ఏ మూర్తి తన అసాధారణ దివ్య సుందరస్వరూపముచేతను, అపార భక్తిరసామృతసింధు విహార మాధుర్యముచేతను, ఆ బ్రహ్మ స్తంబపర్యంత జీవరాసులకు స్థానమొసంగి, తన సువిశాల పావన హృదయ అగాధత్వముచేతను, శ్రీకృష్ణనామసంకీర్తనా కిరణప్రసార కాంతులచే మానవ అజ్ఞానతిమిర విచ్ఛిన్నత్వము నొందింపగల అకుంఠిత శక్తిసామర్థ్యములచేతను, దేశము నుర్రూతలూగించి, పారవశ్యముల ముంచి, అలౌకిక దృష్టుల బ్రసాదించి, భక్తిమూర్తి అనియు, రాధావ తారమనియు, పదునారవశతాబ్ది కృష్ణుడనియు, మధురావతారమనియు బ్రశస్తి గనిన యీ శ్రీకృష్ణచైతన్యమహాప్రభువు ఎవరు? ఆ ప్రభువు యొక్క మహాత్మ్యమెద్ది?

వంగరాష్ట్రమున, బవిత్ర గంగానదీతీరమున, నవద్వీపమున, జగన్నాథమిశ్ర శచీదేవీ దంపతులకు ద్వితీయ పుత్రరత్నము. ప్రస్తుతము పాకిస్థానమునయున్న సిల్హెటు మండలము ప్రథమమున వీరి వాసస్థానము. కాని కారణాంతరములచే నీ దంపతులు నవద్వీపమున కేతెంచి నివసింపదొడంగిరి. వీరు సద్బ్రాహ్మణులై సదాచారసంపన్నులై, శుద్ధసంస్కారులై, ఆదర్శ దంపతులై యలరారుచుండిరి. జగన్నాథుడు అసమాన పండితోత్తముడని ప్రతీతి. వీరికి విశ్వరూపుడను ప్రథమ కుమారుడుండెను.

అంత, క్రీ. శ. 1486 వ సంవత్సరము ఫాల్గుణ శుద్ధ పూర్ణిమ శుభదినమున, నవద్వీపపట్టణమున ద్వితీయ పుత్రుడై, మహాప్రభువు

జనించెను. జాతకర్మాదికములు యథోక్తరీతి గావించి, జగన్నాథుడు పుత్రునికి విశ్వంభరుడు అని నామకరణము గావించెను. కాని బిడ్డని స్వరూపము అతి సుందరమును గౌరవర్ణమును గలిగియుండుటచే గౌరాంగుడు అని యెల్లరు బిలువజొచ్చిరి. ఈ నామమే మిగుల ప్రఖ్యాతిని గడించెను. మరియు శిశువు వేపచెట్లక్రింద జనించుటచే, నింబవృక్షముగ సంస్కృత నామమైనందున నిమాయి అనియు శచీదేవి మొదలైనవారు పిలువజొచ్చిరి. ఆ నిమాయి నామముగూడ వంగ దేశమున అధిక వ్యవహారముననున్నది.

శిశువు అసాధారణతేజోసంపన్నుడై, చూపరకానందదాయకుడై యలరారుచుండెను. తరచు నా శిశువు దివ్యత్వమును జననీజనకులకు ప్రదర్శించుచునుండెను. బాల్యమున, బాలుని సౌందర్యము ననుసరించి, తల్లియు నతని వస్త్రాభరణపుష్పాదులతో నలంకరించి ఎంతగనో ఆనందించెడిది. చిన్నతనమునుండియే యీ బాలుడు మధుర కంఠమున శ్రీకృష్ణసంకీర్తనము గావించుచు, ప్రజానీకము నాకర్షించుచు, తన ఆనందనృత్యమున నెల్లర నా బిడ్డడు తన్మయుల గావించును.

## బాల్యము

బాలునకు బంచ వర్షములు నిండగ, జగన్నాథుడు సుముహూర్తమున నక్షరాభ్యాసము జరిపించి, పాఠశాలకు నంపెను. విద్యా సముపార్జనమునందు బాలుడు తన అద్వితీయ కౌశల్యమును బ్రక టించెను. అచిరకాలమున నీ బాలుడు సంస్కృత విద్వాంసుడనియు గీర్తి నార్జింపగలిగెను. ఆ కాలమున గొప్ప కీర్తి గలిగియున్న రఘునాథశిరోమణియే గౌరాంగుని ఆచార్యుడు. రఘునాథశిరోమణి

గౌరాంగుని ఆచార్యుడు. రఘునాథశిరోమణి గౌరాంగుని సహాధ్యాయి యనియు, వీరిరువురికి ప్రఖ్యాత పండితుడైన వాసుదేవ సార్వభౌముడే ఆచార్యుడనియు కొందరు వాకొందురు. ఈ విధముగ నసాధారణ ప్రజ్ఞచే విద్యల నభ్యసించుచున్నను, గౌరాంగుడు యింట గొంటె పనుల జేయుచు, భక్తిగీతముల, నామ సంకీర్తనమున పారవశ్యమును బొందుచు నుండెడివాడు. ఎంత పాండిత్యమును గడించినను, భగవచ్చింతనామృతపానమునుమాత్రము నేనాడును మరచెడువాడుకాడు. అట్లయ్యును పండిత ప్రకాండులచే నిండిన నవద్వీపమున జరుగుచుండు విద్వత్సభలలో బాల్గొనుచు, తన అసమాన ధీకుశలతను జూపెట్టును గౌరాంగుడు. ముఖ్యముగ న్యాయ, వ్యాకరణశాస్త్రముల నాతనికాతడే సాటి యని యశస్సును గౌరాంగుడార్జించెను.

విద్యాభ్యాసము పూర్తియగుసంత నచ్చటనే యొక సంస్కృత పాఠశాలను నెలకొల్పి. శిష్యుల జేర్చి విద్యను గౌరాంగుడు బోధించుచుండెను. ఈ కాలమున కాశ్మీరమునుండి ఓటమి నెరుంగని కేశవ మిశ్ర పండితుడు నవద్వీపమునకు అరుదేర, ఆ పట్టణమునగల పండితవర్గము అతని నెదిరింప వెనుకంజవేయ, గౌరాంగుడతని నెదుర్కొని, శాస్త్రవిషయముల బరాభూతుని గావించి పంపెను. ఈ సంఘటనముచే గౌరాంగుని కీర్తి దిగంతవ్యాప్తమయ్యెను. పాఠశాలా స్థాపన కాలమునకు అతనికి పదునారువత్సరములుమాత్రమే వయస్సు. తనకంటె ముందు 1486 వ సంవత్సరమున సోదరుడుగ జనించిన విశ్వరూపుడు, అతని పదునారవయేట విరాగమున తల్లిదండ్రుల ద్యజించి, సన్న్యసించి దేశాంతరముల వెడలిపోవుటయు, దన పదునాల్గవయేట దండ్రి జగన్నాథుడు లోకాంతరగతుడగుటయు, నందుచే

మాతృమూర్తియగు శచీదేవియొక్క పోషణభారము తనపైబడుటచే గౌరాంగుడు చిరుప్రాయమునమాత్రమే పాఠశాలను స్థాపింపవలసి వచ్చెను. కాని దేహము బాల్యముననున్నను, అతని బుద్ధి వికసించి, పెద్దలకుగూడ నలభ్యమైన పాండిత్యప్రకర్ష ప్రౌఢత్వముల గలిగి యుండుటచే, నతని మూర్తియు నత్యంతాకర్షణీయమగుటయు, ప్రవర్తనముగూడ పవిత్రమగుటచే ననేక విద్యార్థిసంఘములతని జేరెను.

కాని నవద్వీప పండితులకు గౌరాంగుని ప్రతిష్ఠ అసూయా జనకమయ్యెను అయినను ఎందును వారు గౌరాంగునితో సమము కాకుండుటచే చింతించుచుండిరి. కాని గౌరాంగుడు వారిని లక్ష్యపెట్టక, వారిజోక్యములకు బోవక, దన పాఠశాలాకార్యమును నిర్వహించు కొనుచు నుండెడివాడు.

## వివాహము

ఇట్లుండ, గుమారుని రూపలావణ్యములచే బొంగిపోయిన తల్లి, పుత్రుని అసమాన పాండితీగరిమకు సంపాదనా సామర్థ్యమునకుగూడ ఆనందించి, అతనికొక కన్యకారత్నమును పరిణయము గావించి, అతని, గృహస్థాశ్రమప్రవేశము జేయింప సంకల్పించెను. అందుల కనుకూలముగ లక్ష్మీదేవి యను కన్యను సుముహూర్తమున గౌరాంగునికిడి వివాహము గావించిరి. కాని భగవదిచ్ఛ అన్యముగ నుండుటచే నా సాధ్వి అకాల మృత్యువాత బడియెను. అందులకు వగచి, శచీదేవి నవద్వీపపురీ నివాసి సనాతనమిశ్రుని కుమార్తె విష్ణుప్రియ అను కన్యకామణిని నిచ్చి, గౌరాంగునకు ద్వితీయ వివాహము చేయించెను. అత్తవారింటికి నరుదెంచిననాటినుండి విష్ణుప్రియ, అత్తకు భర్తకుకూడ

ప్రియరూపిణియై, తలలోని నాలుకవలె మెలగుచు, వారికి ప్రీతికర ముగ నుండెను. అట్లు యీ కుటుంబము సంతోషకరముగ నుండెను.

## సద్గురుకృప

అంత గౌరాంగునకు దన తండ్రి జగన్నాథునికి, గయా క్షేత్ర మున శ్రీ గదాధరపాదపద్మముల సన్నిధి పిండప్రదానము గావింప గౌరాంగునకు సంకల్పము గలిగెను. అట్లు గయాక్షేత్రమున సర్వ కార్యముల గావించిన పిమ్మట, దలవనిదలంపుగ, మధ్వమతమునకు జెందిన మాధవేంద్రపురీస్వామియొక్క ముఖ్యశిష్యుడు, ఈశ్వరపురీ స్వామియొక్క సందర్శనప్రాప్తి గౌరాంగునకు గలిగెను. ఈశ్వర పురీస్వామి పరివ్రాజకుడై దిరుగుచుండువాడు. ఒండొరులకు సన్ని హితత్వమచిర కాలమున నేర్పడి, ఈశ్వరపురీస్వామి గౌరాంగుని భక్తిశ్రద్ధలకు విద్యాసాధనలకు సంతోషించి, మంత్రోపదేశము జేసెను. ఆ క్షణమునుండి గౌరాంగుని దృష్టి మారిపోయెను. అతనికి ప్రాపంచిక వ్యవహారములపై హేయభావమేర్పడెను. ప్రపంచము నిస్సారముగ నతనికి జూపడెను. శ్రీకృష్ణ పాదారవిందజన్యమకరందాస్వాదనామాధు ర్యములేని జీవితము వ్యర్థమని అతనికి గాఢవిశ్వాసమేర్పడెను.

గయాక్షేత్రమునుండి నవద్వీపమునకు దిరిగి వచ్చినను గౌరాం గుని దృష్టి మారలేదు. మీదుమిక్కిలి అతని వైరాగ్యము అధిగ మింపజొచ్చెను. పాఠశాలగాని, తల్లిగాని, భార్యగాని అతని మనస్సును ఏ విధముననైన మార్పు చేయజాలకపోయిరి. సంతత ధారావృష్టిగ నతని కన్నులనుండి అశ్రువులు ప్రవహించును. అతని నేత్రములు

ఎందెందో చూచుచుండునుగాని ప్రత్యక్షముల జూడవు. చిత్తమెందో దిరుగుచుండునుగాని లౌకికములగూర్చి యోచింపదు. అతని పనుల నతడే నిర్వహింపజాలని స్థితియు నేర్పడెను. శ్రీకృష్ణ సందర్శన, సంస్పర్శన, సంభాషణ, ఆలింగన మహాభాగ్యమునకై అతని చిత్తము ఆతురపడజొచ్చెను.

గౌరాంగుడు పాఠశాలను నిర్వహింపజాలని స్థితియు నేర్పడెను. అతడు బిగ్గరగ శ్రీకృష్ణసంకీర్తనము గావించుచు మైమరచుచుండును. క్రమముగ ననేకులు అతనివెంట సంకీర్తనామృతమును అరగించుచు, దన్మయులగుచుండిరి. నానాటికి సంకీర్తనలు అధికమయ్యెను. రాత్రి యనిలేక, పగలు అని లేక, సర్వ బాహ్యముల మరచి తదేకనిష్ఠతో సంకీర్తనా పారవశ్యమున గౌరాంగుని కాలము గడుచుచుండెను. ఈ కాలమున నతనికనేక సిద్ధులుగూడ లభించి, అనేక మహత్కార్య ముల జేయజొచ్చెను. కొందరు భక్తులకాతడు సాక్షాత్తు శ్రీకృష్ణపర మాత్మవలె దర్శనమిచ్చెను.

## అనుచరులు

ఈ కాలమున నితాయి, అని గౌరాంగుని అనుచరులలో ప్రథము డైన నిత్యానందుడు గౌరాంగుని జేరెను. ఈతడు తన పండ్రెండవ సంవత్సర ప్రాయమున ప్రపంచమును త్యజించి, సన్న్యాసియై, దేశ దేశముల బర్యటించి, గౌరాంగుని అద్వితీయ భక్తితన్మయత్వముల గర్ణాకర్ణిగ విని, నవద్వీపమునకరుగు దెంచెను. ఇతడు బృందావన క్షేత్రమున ఈశ్వరపురీస్వామిని కలిసికొని యుండెను. ఇతడుగూడ మాధవేంద్రపురీస్వామి శిష్యుడని వాకొందురు. ఒకదినమున గౌరాంగుడు

భక్తితన్మయత్వమున మైమరచి ఆ సమయమున నున్న భక్తాదులకు శ్రీకృష్ణమూర్తిగ గనుపించెను. అందు నిత్యానందునకు ఆరు హస్తము లతో దర్శనమిచ్చెను. నాటనుండి నిత్యానందుడు గౌరాంగుని ఊణమైన పీడక నుండెను.

అటులే నవద్వీపమునకు దగ్గరనున్న అద్వైతాచార్యుడును, తన అపారపాండిత్యమును ప్రదోసిపుచ్చి, నవద్వీపమునకరుదెంచి, గౌరాంగుని పాదముల ప్రాలి అనుచరుడయ్యెను. అతడుగూడ మాధ వేంద్రపురీ శిష్యుడనియు గొందరి మతము. ఈ విధముగ శిష్యులును, అనుచరులును, అధికము అగుటతోడ గౌరాంగుని సంకీర్తనములును బారవశ్యములును అధికమై, దేశవ్యాప్త కీర్తియు గలిగెను.

నవద్వీపమున మాధవ జగన్నాథులనువారిరువురు గలరు. అతి దుర్మార్గులై, ప్రజల బీడించుచు హింసించుచు నుండిరి. వారికి భక్తి ప్రబోధము గావింప నిత్యానందుడును, మహమ్మదీయుడైన హరి దాసును చాల ప్రయత్నము జేసిరి. కాని తత్ఫలితముగ వారిచే దెబ్బల దినిరి. ఒకనాడు నిత్యానందుని వారు గట్టిగ గొట్టుటచే నాతని ముఖము రక్తసిక్తమయ్యెను. అందులకు వగచి, గౌరాంగుడే ఆట కరిగి, మాధవ జగన్నాథుల సంబోధించి ప్రబోధింప, వారు పరి వర్తనము నొంది, భక్తులై వెంటనే నిత్యానందుని గౌగిలించుకొని గౌరాంగ శిష్యులైరి.

ఈ విధముగ అనంత లీలావిభూతుల జూపించుచు, నవద్వీప పౌరులలో మహాసంచలనమును కలుగజేయుచున్న గౌరాంగుని మహత్వ మును జూచి యోర్వలేనివారుకూడ ననేకులుండిరి. వారు ఆ ప్రాంత

ముల ప్రభువైన నవాబునకు ఫిర్యాదు జేసిరి. గౌరాంగుడు హిందూ మత విరుద్ధమైన నగర సంకీర్తనాదుల గావించుచు, సంఘమును జెరచుచున్నాడని వీరి కష్టము. అనుచరులతో తమ గృహముల ప్రవే శించి, తమ ధనముల దొంగలించునేమో యనియు వీరి ఆలాపము. ఈ యవకాశమును గొని, నవాబు తన సిపాయిల నవద్వీపమునకు బంపెను. నగరసంకీర్తనలు బహిష్కరింపబడెను. కాని గౌరాంగుడు, సుల్తానుని సంకీర్తనా బహిష్కారాజ్ఞను నిరసించి సంకీర్తనాబృంద ముతో వీధుల బయలుదేర సంకల్పించెను. అందులకు ఆ నవాబు అలిగి, తానే స్వయముగ నేతెంచి, ఒక సంకీర్తనబృందమును జెల్లా చెదురు గావించి, మృదంగముల బగులగొట్టించెను. అనేకులు చెరసాల నుంపబడిరి. ఆ వార్త నాలకించి గౌరాంగప్రభువు, నాటిరాత్రి స్త్రీ పురుష భక్త సంఘముతో వీధులవెంట నొక గొప్ప సంకీర్తనము ప్రారంభించెను. మెడలలో పుష్పహారములు, చేతులలో దివిటీలు, కంఠముల భగవన్నామముతో నా సంఘము ఎంతయో ఆనందజనక ముగ నొప్పారెను. సుల్తానునగరి చేరునంతలో, నా భజన సంఘము నకు ఆశ్చర్యచకితులై, సుల్తాను మారినవాడై గౌరాంగానుచరుడుగ నయ్యెను.

ఈ రీతిగ నసూయగనున్న పండితబృందము గౌరాంగుని యగౌరవము పాలుజేయ గావించిన యత్నములన్నియు విఫలము లగుటచే చింతించి, వాసుదేవసార్వభౌమునివద్ద పాఠశాలలో గౌరాంగుని సహపాఠియైన కృష్ణానందుడను తంత్రజ్ఞుని గౌరాంగునితో శాస్త్రచర్చ గావించి, అగౌరవపరుప పంపిరి. కాని కృష్ణానందుడు సఫలీకృతుడు గాక పారిపోయెను. ఈ విధముగ బరిసర సంఘమున ముఖ్యులు

తనను గుర్తింపకున్నను, శాంతముగ నూరకుండక, తన మార్గమున కాటంకముల గల్పించి బాధింపజూచుచుండుటకు గౌరాంగుడు చింతించి, వారి నెట్లయిన మార్పు జేయనెంచి, దానికై తానే మార్పుజెంద సంకల్పించుకొనెను. అంతియగాక, గృహస్థాశ్రమము తన మార్గమునకు సహకారి కాజాలనిదయ్యెను. అందుచే సన్న్యాసము నాశ్రయించినచో, దా స్వతంత్రముగ సంకీర్తనోన్మత్తునిచందము ఎటనున్నను ఎట్లున్నను ఆటంకము కానేరదనియు దలంచి, గౌరాంగుడు సన్న్యసింప సన్నద్ధుడయ్యెను. శ్రీకృష్ణసాన్నిధ్యమహాభాగ్యము యీ సంసారపిడూరము. ఇది దగ్గర నుండునంతకాలము ఆ యదృష్టప్రాప్తి దుర్లభమనియు నాతడు తీర్మానించుకొనెను.

## సన్న్యాసము

కాని సన్న్యసించుటకు బూర్వము మాతా సతుల అనుజ్ఞ గైకొనవలయునని శాస్త్రవచనము. నాటికాతనికి నిరువది నాలుగు వత్సరముల ప్రాయము, జననికి నలువదియేడు వర్షములు. పెద్ద కుమారుడైన విశ్వరూపుడు సన్న్యసించుటచే జింతించుచుండిన తల్లి, యీ కుమారుని గూడ బోగొట్టుకొన నిచ్చగించునా? అది కల్ల. అటులే భార్య యగు విష్ణుప్రియయుగూడ గౌరాంగుని సన్న్యాసమునకానతి నిడ విముఖత్వమును బ్రదర్శింప, అయినను గౌరాంగుడు పట్టువిడువక మాత్రాజ్ఞ కొరకు సమాధానవచనముల నెంతయో యత్నించుచుండెను. ఒకనాడు అతడు తన తల్లిని జేరి, ఆమెకు సంకల్పబలముచే జ్ఞానమునొసంగి, తన సన్న్యాసమునకు అనుజ్ఞను బడసి, మరల నాజ్ఞానము నామె నుండి గ్రహించినట్లు కొందరు వాకొనిరి. అట్లుగాక, నొకనాడు గౌరాంగుడు కడుపునొప్పి వచ్చినట్లు నటించి, మరణావస్థలో నున్నట్లు,

బాధ నొందినట్లు అభినయించుచు, కైవల్యప్రాప్తికి సన్న్యాసమావశ్యక మని మాతా, భార్యలకు నచ్చజెప్పి, సన్న్యసింప వారి యాజ్ఞను బొంది, శాంతముగ శరీరత్యాగము గావించెదనని వేడుకొనగ, వారాజ్ఞ నిడిరనియు, నంత నాతడు ఆనందము జెందెననియు గొందరి కథనము. ఏది ఎట్లున్నను. గౌరాంగుడు ఎటులో ఆ స్త్రీ ద్వయమునుండి అనుజ్ఞ బొందెనని చరిత్ర. ఈ విధముగ ననుజ్ఞాసంపాదనము గావించి, వారికి సమ్మతముగ వారి సంతృప్తికై దూరదేశవాసముగాక, నవ ద్వీపమునకు అతిదూరముగాని జగన్నాథక్షేత్రమున దా నుండునట్లును, వారు దలంచునంత దర్శనమొసంగునట్లును ఆన నిడి, యా వనితా మణుల జిత్తముల నాతడు గుదుటపరచెను.

అంత 1509 వ సంవత్సరమున, తన యిరువది నాల్గవయేట, నర్ధరాత్రమున గౌరాంగుడు గృహాదుల విసర్జించి, ఆ చీకటిరాత్రి పయనించి, గంగను దాటి, కాత్వానగరమున గల కేశవభారతీస్వామి ఆశ్రమమును చేరుకొనెను. కేశవభారతియు యువకుని స్వరూప సౌందర్యాదికమునుమాత్రమేగాక విద్యావినయాది సర్వసుగుణసంపత్తిని గ్రహించి, సన్న్యసింప సంపూర్ణాధికారి యని నిర్ణయించి, గౌరాంగునికి సన్న్యాసమొసంగి, శ్రీకృష్ణనామామృతపానపారవశ్యము గలవాడగుటచే శ్రీకృష్ణచైతన్యుడను యోగపట్ట ప్రదానము జేసెను.

కేశవభారతిని జేరుటకు బూర్వము, గయాక్షేత్రమున గౌరాంగుడు ఈశ్వరపురీస్వామి దగ్గర మంత్రోపదేశమును గైకొనినట్లు చూచి యున్నాము. ఈశ్వరపురీ మాధవేంద్రపురీస్వామి శిష్యుడనియు గని యున్నాము. ఈతడు మాధ్వ, వైష్ణవ సంప్రదాయమునకు జెందిన వాడనియు బ్రతీతి. కేశవభారతియు మాధవేంద్రుని శిష్యుడని కొందరి

వాదము. కాని అతడు రామానుజీయ సంప్రదాయమునకు జెందిన సన్న్యాసి అని కొందరి భావము. అందుచే చైతన్య సంప్రదాయము మాధ్వమా రామానుజీయమా అను ప్రశ్నయు విద్వల్లోకమున కలిగెను. మంత్రోపదేశమట్లైనను తురీయాశ్రమము కేశవునివద్ద గౌరాంగుడు స్వీకరించుటచే గౌరాంగుని గురువు కేశవభారతియే యగుననియు, నందుచే గౌరాంగుని సంప్రదాయము రామానుజీయమనియు విశ్వసించి, వంగీయ వైష్ణవము అనగా శ్రీకృష్ణచైతన్యసంప్రదాయము రామానుజీయ వైష్ణవముగ రూపొందించిరి కొందరు. ఈ శాఖ ప్రాచీనము అనియే చెప్పనొప్పును. కాని యీ మీమాంసను పైకి నుద్ధరించి, అది మాధ్వమనియే నిర్ణయించి, చైతన్యసంప్రదాయమువారు కొందరు గౌడీయమఠము నొకదానిని నెలకొల్పిరి. నవద్వీపపట్టణమున గంగ కావలిదరినున్న మియాపురము దీని కేంద్రము. ప్రథమ శాఖీయులు, పూర్వాచారపారీణులై యుండ, గౌడీయులు కొంచెమాధునికభావ విభూషితులై, పాశ్చాత్యదేశగమనమునుగూడ శ్రీరామకృష్ణమఠ సన్న్యాసులవలె జేసి అందందు మఠముల స్థాపించి, దేశవ్యాప్త ప్రచారము గావించుచున్నారు. కించిదభిప్రాయభేదములుత్పన్నములైనను ఈ శాఖాద్వయమునకు శ్రీకృష్ణచైతన్యుడే ఆదర్శము, ఆరాధ్యుడు.

కాని వైష్ణవమున, దశ నామ సన్న్యాసము గానము. మాధ్వమతమున తీర్థసంప్రదాయమమాత్రము దక్షిణదేశమున గలదు. మధ్వాచార్యుడుగూడ అద్వైతసంప్రదాయమున సన్న్యసించి, ఆనందతీర్థుడయ్యెనుగదా. రామానుజీయ సంప్రదాయ సన్న్యాసులు జియ్యరు అనియు, నుత్తరదేశమున గోస్వామిగ నింబార్క వల్లభాదుల సంప్రదాయమున ప్రఖ్యాతము. కాని నింబార్క వల్లభులు సన్న్యాసమును

విధింపలేదుగదా! మరియు మాధవేంద్రపురినుండి సన్న్యసించినచో కేశవుడు భారతిగాక పురి యను దశనామమును బొందియుండనగును. కాని గౌడీయము ఈ నియమమును బాటింపక, వారి సంప్రదాయ మున తీర్థ పురి భారతి సరస్వతీ నామముల తమ సన్న్యాసులకు ఒసంగుచున్నారు. శంకరసాంప్రదాయిక మఠములలో నట్లు జరుగుట కవకాశమావంతయు గానరాదు. సన్న్యసమేసంప్రదాయమైయున్నను, చైతన్యుడు, పురి భారతి పట్టముల గ్రహింపక, శ్రీకృష్ణచైతన్య నామమునుమాత్రము స్వీకరించి, కాలక్రమమున శ్రీకృష్ణచైతన్య మహాప్రభువు అని మహాప్రభువనెడి వ్యవహారము నొందుట గమ నార్హము. అటులేగదా తోతాపురిస్వామిదగ్గర సన్న్యసించిన గదాధరుడు శ్రీరామకృష్ణపురిస్వామిగాక, శ్రీరామకృష్ణ పరమహంసయై, ప్రపంచ వ్యాప్త యశస్సు నార్జించుట! వ్యక్తిత్వము లేనివారికి సంప్రదాయ ములుగాని, ప్రత్యేక సంప్రదాయకర్తలకు బూర్వ సంప్రదాయములేల ?

## జగన్నాథక్షేత్ర వాసము

అంత శ్రీకృష్ణచైతన్యుడు భక్తులయొక్కయు, దల్లియొక్కయు గోర్కె ననుసరించి, జగన్నాథ క్షేత్రముననుండ దీర్మానించుకొనెను. జగన్నాథుని ప్రథమ దర్శనమాత్రమున నతడు గర్భాలయమున దేహ స్మృతి బాసి పారవశ్యము నొందెను. జగన్నాథమున శ్రీ చైతన్యునికి వాసస్థానము నేర్పాటు గావించి, నిత్యానంద హరిదాసాది భక్తబృంద మంతయు నటకేగుదెంచి, శ్రీకృష్ణచైతన్య సన్నిధానమున సేవల జేయుచు, నామామృతమును గ్రోలుచు, అతని అవ్యయానంద అను భూతుల వీక్షించుచు, నుండిపోయిరి.

# యాత్రలు

స్థిరవాసరము పూరీక్షేత్రమైనను చైతన్యుడు, తరచు యాత్రల కేగుచుండెడివాడు. ఇచట చేరిన బిమ్మట ప్రథమమున దక్షిణయాత్ర గావింప నాతనికి సంకల్పముదయించెను. సన్న్యసించి దక్షిణదేశమేగి యున్న తన సోదరుడు, విశ్వరూపుడెందైన కానిపించునేమో యను భావముండెను. పాదచారియై, గోవిందభట్టు నా నొకనిమాత్రము వెంట గొని, యాతడు గ్రామారణ్యముల బయనించి, అనేక గ్రామముల దిరిగి, అసంఖ్యాకులచే సంకీర్తనము గావింపజేయుచు శ్రీకూర్మమును జేరెను. అట వసుదేవుడను కుష్ఠరోగికి స్పర్శమాత్రమున నా మహావ్యాధిని నిర్మూలించి, గోదావరీ తీరమునగల రాజమహేంద్రపురిని గౌరాంగుడు చేరెను.

గోదావరికావలి యొడ్డున, కొవ్వూరు నగరమున రామానందుని గాంచి, చైతన్యుడు కొంత ప్రసంగము గావించి, యాతనికి శ్రీకృష్ణ భక్తితన్మయత్వము గావించెను. ఈ రామానందుడు సుప్రసిద్ధ రామానందసన్న్యాసికాడనియు, నితడు ఒక దేశపాలకుడనియు గొందరందురు. అంత మరల దక్షిణాముఖముగ శ్రీకృష్ణచైతన్యుడు గమనించి మంగళగిరి, తిరుపతి, కంచి, రామేశ్వర, సేతుబంధ, అనంతశయన, క్షేత్రముల వీక్షించి, యింక, శ్రీరంగాది అనేక దక్షిణదేశ యాత్రల గావించి, మహారాష్ట్రమునగల పూనా నగరమును జేరెను. అటనుండి బరోడా యాస్థానమును గౌరాంగుడు జేరెను. పండరీక్షేత్రమున తుకారామాది భక్తుల గాంచెను. ఈ విధముగ సర్వక్షేత్రముల చైతన్య ప్రభువు రెండు వత్సరములు బర్యటించి మరల జగన్నాథమును జేరెను.

మరల గొంతకాలమునకు బృందావన దర్శనాపేక్ష హృదయమున వొడముటచే, శ్రీకృష్ణచైతన్యుడు శ్రీకృష్ణవిరహవేదన భరింపజాలక నటకు బయనమయ్యెను. మార్గమధ్యమున వారణాసీ పట్టణమున గొంతకాలముండి, రాత్రింబవలులు ప్రయాణము సాగించి, చైతన్యస్వామి మధురానగరమును జేరెను. అటనుండి బృందావనమును జేరి, ఆనందముగ సంకీర్తనాదుల మైమరచి, ప్రజానీకమునుగూడ ఆనందోత్సాహముల గౌరాంగుడు అచట ముంచెను. తిరుగు ప్రయాణమున మరల కాశికాక్షేత్రమున గొన్ని దినములు వాసంబుండి, ప్రకాశానందసరస్వతీస్వామి యను సన్న్యాసిని పరివర్తనుని జేసి, జగన్నాథము మరల చైతన్యస్వామి జేరెను.

## తన్మయత

జగన్నాథ క్షేత్రమున నుండుకాలమున, గౌరాంగుని వల్లభాచార్యుడు దర్శించెను. ఒక దినమున చైతన్యునికి కృష్ణవిరహవేదన అధికమై భరింపరానిదయ్యెను. అందుచే నా రాత్రిసమయమున నేకాంతముగ సముద్రతీరమునకరిగి, ఆ జలముల ప్రతిబింబించుచున్న చంద్రుని గాంచి, శ్రీకృష్ణుడే యని విశ్వసించి, ఒకదాటున గౌరాంగుడు సముద్రమున దుమికెను. ఆ ప్రాంతముల మత్స్యములకై వలను వేయుచున్న జాలరి వలలో గౌరాంగుని శరీరము జిక్కెను. ఒడ్డునకు బలముతో లాగిజూచిన యా చేపలవాడు భయాందోళనములతో నగరికేగి, విషయము దెల్ప, శిష్యులు వెళ్ళి గాంచిరి. శరీరము బహుస్థూలాకృతి దాల్చియుండుటచే ఆశ్చర్యము నొంది, భయవిహ్వలులై, దుఃఖమున నామసంకీర్తనము శిష్యులు గావించిరి. క్రమమున శరీర స్థౌల్యము తగ్గి, సహజ శరీరముగా మారి, గౌరాంగప్రభువు కన్నులం

దెరచెను. అట్టి అసమాన తన్మయతాలోకమున జగన్నాథమున చైతన్య ప్రభువు శిష్యులతో నుండెను.

## మహాసమాధి

ఈ విధముగ భక్తిపారవశ్యమున నున్న గౌరాంగుడు క్రీ. శ. 1533, ఆషాఢ మాసమున నొక రాత్రి, పూర్వమువలె సముద్ర తీరమునకరిగి, అంతర్ధానమయ్యెను. ఆ పవిత్రమైన శరీరము ఎవరికిని లభింపలేదని చరిత్ర. ఈ విధముగ గౌరాంగుడు, సుమారు నలువది ఏడు వత్సరములు భౌతిక దేహమును ధరించి, నాలుగు యుగము లకు సరిపడు. భక్తివృష్టిని ధరామండలముపై గురిపించి, శ్రీకృష్ణావ తారకాలమున బృందావనమున గలిగిన భక్తిచైతన్య తరంగముల మరల గల్పించి, రేకెత్తించి, దేశమునంతటిని ముంచెత్తెననవగును. ఆ మూర్తి స్వరూపపారవశ్యములు నాదేగాక, నేడును భక్తకోటి హృదయము నావేశించియుండి, సంకల్పించినమాత్రమున భక్త్యావేశ ముల గల్పించుచు, దారణోపాయమును జూపుచున్నవి. ఈ విధముగ శ్రీకృష్ణచైతన్యుడు పూర్వాచార్యులవలె కేవలము గురుతుల్యుడు మాత్రముగాక, సర్వ ముముక్షుహృదయాధివాసుడై, హృదయపతియై, అధినాథుడై, పాలకుడై, మహాప్రభువను సార్థకనామమును బొందెను. అందుచే నితరులవలెగాక గౌరాంగుడు శ్రీకృష్ణచైతన్యమహాప్రభువని ప్రఖ్యాతి నొందెను. అతని అనుభూతిసంచయము అవాఙ్మానసగోచరము, అతులము. ముముక్షుకోటికాతని స్థితులు ఆదర్శప్రాయములు అనుభవైక వేద్యము. పూర్వాచార్యులు సిద్ధాంతముల బోధింప, నీ మహాప్రభువు ఆచరించి, అనుభవించి, అనుభవింప జేసి, ముముక్షులోకమునకు సర్వదా సర్వథా కృతజ్ఞతాపాత్రుడు. ఎంతకాలము శ్రీకృష్ణభక్తి

విశ్వమున నుండునో అంతకాలమువరకు శ్రీకృష్ణచైతన్యమహాప్రభు నామము స్థిరస్థాయి నిలచియే యుండును.

Hail thee O Chaitanya - the Victor of my heart,
Mark the rhythm of his mystic dance in lofty ecstasy quite alone.
Merrily sounds the tabour and the cymbal's note keeps time.
The joyous band following him sing and dance merrily - merrily;
He steps a pace or two onwards in his dancing gait,
And knows the rest - intoxicated with his own over - flowing joy.
Oh my heart's Lord, how can I express the love I have for thee?
Saha Akbar craves drop from the sea of thy piety and love 126

నా హృదయాధినాథుడైన ఓ చైతన్యా! నీకు జయమగుగాక. ఆతని సమున్నత పారవశ్యముతోగూడిన ఆనందనృత్యశ్రావ్యత్వము నేకాంతముగ గాంచుము. మృదంగమానందముగ మ్రోగ, తాళము లయ వేయుచున్నది. తన్మయులగు భక్తబృందము అనుసరించుచు సంతోషముగ నృత్యగానముల గావించుచున్నది. ఆతడు తన నృత్యగమనమున నొకటిరెండడుగులు ముందునకు వేయును. సముద్ధృత పారవశ్యముతో నితరుల నెరుంగును. ఓ నా హృదయ పతీ! నీపై నా ప్రేమ నెట్లు తెలుపగలను? సాహ అక్బరు నీ భక్తిప్రేమ సాగరమున నొక బిందువుకొరకై అపేక్షించుచున్నాడు.

126. Editor: Vedanta Kesari, 1958, p. 458

# అచింత్య ద్వైతాద్వైత వాదము

## నామ సంకీర్తనము

కలేర్దోషనిధే రాజన్నస్తి హ్యేకో మహాన్ గుణః ।
కీర్తనాదేవ కృష్ణస్య ముక్తబంధః పరం వ్రజేత్ ॥

12. 13. 51.

రాజా ! కలిదోషనిధి నివారించి, మహాగుణాత్మకమైన శ్రీకృష్ణ సంకీర్తనచేతనే బంధవిముక్తి గలుగునని శుకయోగీంద్రుడు పరీక్షిన్మహారాజునకు భాగవతమున నుపదేశించెను. 'సంకీర్త్యమానో భగవాననంత శ్రుతానుభావో వ్యసనం హి పుంసాం। ప్రవిశ్య చిత్తం విధునోత్యశేషం యథా తమోఽర్కోఽభ్రమివాతివాతః॥' (12.12.49) సంకీర్త్యమానుడై, శ్రుతానుభావుడైన భగవానుడు పురుషుని చిత్తమును ప్రవేశించి, గిరి గుహాంతరమైన అంధకారమును సూర్యుడు నివారించు చందము అతని దుఃఖము నిశ్శేషముగ నిరాసమొనరించును అను భాగవతశాస్త్రవచన విశ్వాసముచే, శ్రీకృష్ణచైతన్యుడు వివిధరూప సిద్ధాంతముల విచారణా గ్రహణము గావించి యుండియు, నవియన్నియు సారహీనములని నమ్మి, కేవలము హరికీర్తనామూలమున మాత్రమే సాక్షాత్తు శ్రీకృష్ణపరమాత్మ దర్శన, స్పర్శన, సంభాషణాది మహాభాగ్యము లభించుననియు గ్రహించి, భక్తిముందు ముక్తియు అసారమనియు, నందును భక్తికంటె ప్రేమ మిగుల ఫలదాయకమనియు నాతడు తెలిసి, దానినే అనుష్ఠానమునందుంచెను. ఎచటకేగినను, ఎవరితో వాదించినను, సంభాషించినను, చైతన్యుడు శాస్త్రచర్చయు సిద్ధాంతవాదముల రానీయక, కేవలము భక్తిసాధనా ఫలిత

ములగూర్చియు, శ్రీకృష్ణనామామృతానుభవ ప్రభావమునుగూర్చియు దెలుపుచు, తా ననుభవించి, అందలి మాధుర్యమును ప్రదర్శించి పంచిపెట్టుచు, తన సర్వాకర్షణీయ మోహనరూపముచే జనుల నాకర్షించి, సత్యపథానువర్తులనుగ నొనరించెనుగాని శాస్త్రచర్చాఫలితముగ గాదు.

అందుచే నతడు ఇతరాచార్యులచందము నేదేని సిద్ధాంతమును నిర్మింప నెంచి, శాస్త్రవ్యాఖ్యానముల రచింపలేదు. ఆతనిచే రచింపబడిన శిక్షాష్టకము, శ్రీజగన్నాథ స్తోత్రములు సిద్ధాంత విషయముల నేమాత్రము దెలిపియుండలేదు.

## రచయితలు

అయినను శ్రీకృష్ణచైతన్య అనుచరకోటిలో ముఖ్యులైన సనాతనగోస్వామి, రూపగోస్వామి, జీవగోస్వామి, విశ్వనాథ చక్రవర్తి, బలదేవ విద్యాభూషణుడు, నాబడు నీ యైదుగురు సిద్ధాంతభాగమును గైకొని, యొక సిద్ధాంతముగ రూపొందించి గ్రంథముల రచించిరి. వంగీయ వైష్ణవ సిద్ధాంతమునకు వీరే ఆచార్యులు. విదగ్ధ మాధవము, లలిత మాధవము అను రెండు నాటకములను, భక్తిరసామృత సింధువు, ఉజ్జ్వల నీలమణి, లఘు భాగవతామృతములనెడు గ్రంథముల రూపగోస్వామి నిర్మించెను. ఇవి వైష్ణవ సిద్ధాంత వివరణమున ముఖ్యములు. బృహద్భాగవతామృతము, వైష్ణవతోషిణి యను భాగవత పురాణవ్యాఖ్యను సనాతనగోస్వామి లిఖించెను. భాగవత సందర్భము అని జీవగోస్వామి నిర్మింప, రసకాదంబిని, భావార్థదీపిక యను భాగవతవ్యాఖ్యను విశ్వనాథ చక్రవర్తి రచించెను. బ్రహ్మసూత్రములకు, గోవిందభాష్యము అని బలదేవ విద్యాభూషణుడు రచింప,

చైతన్యచంద్రోదయమని పరమానందుడు రచించి, వంగీయ వైష్ణవ సాహిత్య సృష్టి గావించి, సిద్ధాంత స్వరూపమును గల్పింప గలిగిరి.

## మాధ్వమా? రామానుజీయమా?

The influence of Madhva is very definitely demonstrable in the commentary of Baladeva Vidyabhushana 127 మధ్వాచార్యుని ప్రభావము బలదేవవిద్యాభూషణుని భాష్యమున స్పష్టముగ ప్రదర్శితము అని సురేంద్రనాథ దాసుగుప్త అభిప్రాయము. చైతన్యసంప్రదాయము మధ్వ వల్లభాచార్యుల సిద్ధాంతముల ననుసరించెనని కొందరి తాత్పర్యము 128 Though some of the writers belonging to this school call themselves the followers of Madhva, in their thought they are really nearer Ramanuja, since they emphasize identity, even while they admit differences 129 ఈ వాదమునకు జెందిన వాదులు మధ్వాను చరులమని తెలుపుకొనియున్నను, వారు భేదమును దెలుపుచు, నభేదమునుగూడ నొక్కి వక్కాణించుచుండుటచే వీరు తమ భావముల రామానుజునకు సన్నిహితులు అని పండిత రాధాకృష్ణుని అభిప్రాయము. మధ్వసాంప్రదాయిక సన్న్యాసులుత్తరహిందూస్థానమున అరుదుగ నుండుటయు, చైతన్యసాంప్రదాయిక సన్న్యాసులు మధ్వానుచరులనియు మాధ్వగౌడీయు లనియు తెలియబడుట స్పష్టము.

---

127. Prof. Surendranath Das Gupta : The Cultural Heritage of India, Vol. 3, p. 6

128. Editor : Vedanta Kesari, 1959, p. 162

129. Dr. S. Radhakrishnan : Indian Philosophy, Vol. 2, p. 764

అయినను వీరు మధ్వసిద్ధాంతమునకు భిన్నులు. చైతన్యుడు మధ్వ కేంద్రమైన ఉడిపి నగరమునకు వెడలియుండునపుడు, అచట వైష్ణవ మునుగూర్చి ప్రసంగించెనట. అట్లయినను వీరికి, మధ్వమతస్థుల కెట్టి పోలికలును గానరావు. వైష్ణవ చతుస్సంప్రదాయములలో నింబార్క సంప్రదాయమునకు వీరితో మిగుల సామ్యము గోచరమని ఘుర్యే పండితుని తాత్పర్యము. 130

ఏ ముఖ్య సిద్ధాంతము ననుసరించినట్లు బాహ్యమునకు దోచినను, చైతన్యేయులు ఒక విశిష్ట సిద్ధాంతమును నెలకొల్పగలిగిరి. అదియే అచింత్య భేదాభేదవాదము నా బరగును. అది a unique feature in Indian thought 131 అని జగదీశ్వరానందుని విశ్వాసము. అది, రామానుజ మధ్వ విష్ణుస్వామి నింబార్క వల్లభాది భక్తి సిద్ధాంత ప్రబోధకాచార్యులకు భిన్నమై యొప్పెను. The consorted figure of Radha and Krishna most adequately symbolizes this doctrine. The Bheda and Abheda of Radha and Krishna is Achintya 131 రాధాకృష్ణద్వయమూర్తియే యీ సిద్ధాంత రూపము. రాధాకృష్ణుల భేదాభేదము అచింత్యము. జీవగోస్వామి అభిప్రాయమున, శక్తి శక్తిమానులైన రాధాకృష్ణులు అభేదమును భేదమునైన సంబంధమున నుందురు. ఇరువురు. చిత్స్వరూపులుగాన భేదాభేదమున నుందురు.

---

130. Prof. G. S. Ghurye : Indian Sadhus, p. 179

131. Swami Jagadiswarananda : Prabuddha Bharata, 1946, p. 149

# బ్రహ్మము

అద్వైతులచే బ్రహ్మము నాబడిన తత్త్వము, భక్తులకు భగవానుడై శ్రీకృష్ణరూపమున నవతరించెను. ఈ పరమాత్మ తన అచింత్యశక్తిప్రభావమున స్వరూప, వైభవ, జీవ ప్రధానరూపముల చతుర్విధమై, సూర్యుడు తేజోమండలము, కిరణములు, ప్రతిబింబములు, ప్రకాశము నా జతుర్విధముగ నైనటుల అగును. శ్రుతి, సాకారనిరాకారములను, సగుణనిర్గుణములను ప్రతిపాదించినది. అటులే భేదశ్రుతులు అభేద శ్రుతులును శాస్త్రముల గలవు. వాని వాఖ్యానమున ముఖ్యవృత్తి పరముగ ననువదించు నర్థముల బోనాడి, లక్షణ, గౌణవృత్తులచే దాత్పర్యముల గల్పించుటయు నసమంజసము. మరియు, నిరాకార, నిర్గుణత్వములకు అధిక ప్రామాణ్యము నొసంగి, సాకార, సగుణములకు ఔపచారిక అర్థముల గల్పించుట అన్యాయమని జీవ గోస్వామి తాత్పర్యము. అందుచే నీ రెండు సగుణ నిర్గుణములు సత్యములే యగుచున్నవి. అతని దృష్టిలో వేదాంతుల బ్రహ్మము, వైష్ణవుల భగవానుడు ఒక్కడే. కాని వివిధ సిద్ధాంతములు ఒక్కొక్క స్థితికి ప్రాధాన్యము నొసంగియున్నవి. ఆ పరమాత్మ గ్రహణమునకు వేదవేదాంతములెంత ప్రామాణికములో, పురాణేతిహాసములుగూడ అంత ప్రమాణములే యగును. అవి బ్రహ్మమును సచ్చిదానంద లక్షణోపేతుడైన విష్ణువుగ నిర్వచించుచున్నవిగదా! ప్రాకృతిక గుణ శూన్యుడగుటచే నాతడు నిర్గుణుడు అనబడెను. సర్వజ్ఞత్వాది సర్వశక్తిత్వాది లక్షణోపేతుడగుటచే నతడు సగుణుడు. ఈ గుణములతని సూచించి, అతనియందిమిడి యుండును. అతడే యీ సృష్టికి ఉపాదాన, నిమిత్తకారణుడు. అతడు తన పరాశక్తిమూలమున నిమిత్తకారణుడై,

అవిద్యాశక్తిద్వారమున ఉపాదానకారణుడగును. అతడనంత అవతారముల దాల్చుచుండును. అందు శ్రీకృష్ణపరమాత్మ సంపూర్ణావతారము.

బ్రహ్మమునకు సచ్చిదానందములతో స్వరూప, మాయా, జీవ శక్తులు నా త్రివిధ శక్తులు గలవు. స్వరూపశక్తి చిచ్ఛక్తి నాబడి అతనియందే యుండి, అంతరంగికశక్తి యనబడినది. అదియే సచ్చిదానందరూపమున సంధినీ, సంవిత్, హ్లాదినీ అనబడు లక్షణముల గలిగియున్నది. సంధినీ గుణముమూలమున బ్రహ్మము తా సత్స్వరూపుడై, ఇతరులకు సత్తా నొసంగును. సంవిదంశమున దా గ్రహించుకొనుచు నితరుల దెలియ సమర్థుల జేయును. హ్లాదినీ లక్షణమున దా నానందించుచు, నితరులకు ఆనందప్రదానము గావించును. ఈ లక్షణ త్రయమే శుద్ధసత్త్వము నాబరగును. దానిలో సంధినీశక్తి అధికమగుచో ఆధారశక్తిగను, సంవిదాధిక్యమున ఆత్మవిద్యగను, హ్లాదినీ యభివృద్ధిచే గుహ్యావిద్య యగు భక్తిగను బరిణమించును.

మాయాశక్తి బ్రహ్మముయొక్క స్వరూపశక్తిపై నాధారపడుచు జడమై యుండును. దీని బహిరంగశక్తి యనియు నందురు. అది గుణమాయా అనియు, జీవమాయా అనియు ద్వివిధము. గుణమాయ సత్త్వరజస్తమోరూపమై సృష్టికాలమున స్థూల జగద్రూపము గాంచ, ద్వితీయమైన జీవమాయ జీవుని తన సహజస్థితి మరచునట్లు జేయుచు సృష్టికార్యమునకు సహకారి యగును.

జీవశక్తి సర్వజీవస్వరూపము. దీనినే తటస్థశక్తి యనియు నందురు. ఈ శక్తిచే జీవులు సృజింపబడుదురు.

ఈ శక్తులు బ్రహ్మమున నవినాభావసంబంధమున నుండి, స్వరూపశక్తి గుణములమాత్రము బొంది, మాయాగుణముల బొందకుండుటచే, బ్రహ్మము సగుణమనియు నిర్గుణమనియు నేకకాలమున వచింపబడును. జీవులు అంశరూపముగాక, బ్రహ్మశక్తియొక్క మూర్తులని బలదేవ, జీవగోస్వాముల సిద్ధాంతము.

మాయాశక్తిబద్ధులై జీవులు తమ నిజస్థితిని మరచి యున్నారు. మాయాశక్తిపాశముల ద్రెంచి, తమ నిజతత్త్వము నెరుంగ మార్గము భక్తి. శ్రీకృష్ణభగవానునియందు రుచినభివృద్ధి గావింపగ సాధకునికి భగవదనుభూతి సిద్ధించును. ఆ భక్తిసాధనమునకు రాధికాదేవియే యుదాహరణము. ఆమె అనుభవించిన విరహవేదనయే భక్తునకు మార్గదర్శకము. బ్రహ్మమునకై జీవుని నిర్విరామఆర్తియొక్క ప్రత్యక్షనిదర్శనమును, అభివ్యక్తమూర్తియు నా రాధిక యగును. అటులే ఆమెయందు శ్రీకృష్ణునికిగల అపార ప్రేమానుగ్రహసంచయమే పరమాత్మకు జీవునియందుగల ప్రేమసంపద. అందుచే భక్తిసాధనమునకు రాధావధూటియొక్క శ్రీకృష్ణసందర్శనా తృష్ణయు, నందులకామె అనుభవించిన తీవ్రావేదనయు వంగీయ వైష్ణవమతావలంబకులకు బరమాదర్శము.

## విరహవేదన

తత్సాధన, సిద్ధికై శ్రీకృష్ణచైతన్యుడు పూర్వాచార్యుల మార్గమును వీడి, వినూత్న పథమును ద్రొక్కెను. భక్తి యన అర్చనాదిక సాధనములుగాక, ఆ పరమాత్మను ఐహికవిషయముల నన్నింటికంటె నెక్కువగ బ్రేమించుట యని బోధించెను. అందుచే నతనికి

బృందావనక్షేత్రమున, యమునానదీతీరమున, శ్రీకృష్ణ సన్నిధాన ప్రాప్తికై యలమటించు వ్రజకన్యకలే యాదర్శము. వారిలో నగ్రగణ్య యగు రాధికాదేవియే పరమ గురుమూర్తి.

## నామ సంకీర్తనము

శ్రీకృష్ణచైతన్యుడందులకై అర్చనాది వైధికభక్తిని త్రోసి, పరాభక్తి యను ఆర్తభక్తినే యుపాసించి, భక్తులచే నుపాసింపజేసెను. కావున ఆ మూర్తి ఉద్భవించి పెంపొందుటకై యీతడు, విరహ వేదనాభారమున గన్నీటిని ప్రవాహతుల్యముగ గార్చుటయేగాక, సంకీర్తనము, సత్సాంగత్యముల భక్తులకు ముఖ్యముగ గావించెను. ఆ సాంగత్య సంకీర్తనములలోగూడ నాతని మార్గమునందు విశిష్టత గాంచెదము. సంకీర్తనమునకు అర్హులని తనకు నమ్మకము గలవారినే రా నవకాశమొసంగెడివాడు. అర్హతలేక పాల్గొన కౌతూహలమున నున్నవారు లో ప్రవేశింప వలనుపడెడిదిగాదు. అటులే సంకీర్తనయు ప్రత్యేకమే. త్యాగరాజు, సూరదాసు, మీరాది భక్తులవలె నతని సంకీర్తన కీర్తనారూపము గాదు. కీర్తనములు భావయుక్తములై భగవంతునికి భక్తుడు, తన బాధలనో, ఆనందమునో వ్యక్తము గావించునట్లుండును. అట్టి సంబంధము శ్రీ చైతన్యునికి మనస్కరించినది కాదు. అది ఏకాగ్రతకు భంగము కలుగునని ఆతని విశ్వాస మేమో! అందుచే నతడు తన యిష్టదైవమైన శ్రీకృష్ణుని వివిధ నామములమాత్రము రాగ తాళ యుక్తముగ జేసి, భావరహితముగ సంకీర్తనము జేయుచుండును. ఒక నామమును సంకీర్తనముగ గైకొని నచో నా నామము కనీసము అర్ధగంటకాలము పట్టెడిదట. సంకీర్తనా సమయమున నెల్లరు కూరుచుండక, మృదంగతాళములు లయస్థాన

మున మ్రోయుచుండ, ఉచ్చస్వరమున గంఠములు గానము జేయుచుండ, పాదములు లయ ననుసరించి నృత్యము గావించుచుండ, హస్తాది సర్వేంద్రియములు వివిధ భంగిమముల బ్రదర్శించుచు, మనోవాక్కాయములుమాత్రమేగాక బరిసరములుగూడ నొక భక్తిపార వశ్య ప్రవాహమున మునిగి తేలుచుండవలెను. మరియు నా నామము ప్రథమతః తదనుగుణ నామములతో గూడియుండియు, క్రమక్రమముగ ముఖ్యమైన నొకే నామముపై సంకీర్తనము నిలచి, హృదయముల నిండి, కంఠముల బొంగి, పరిసరముల బ్రవహించి, నెల్లర నానందతన్మయత్వమున నీదులాడజేయును. ఉదాహరణమునకు 'నంద నందన గోపాలా। నవనీతచోరా గోపాలా' అను నామము ప్రథమతః పూర్తిగా నున్నను, సంకీర్తన కొంతకాలము కావుటతోడ, నగమున 'నందనందనగోపాలా' శబ్దములకే కేంద్రీకృతమై, మరల కొంత కాలమునకు 'గోపాలా' అను పదముపై నిలచిపోవును.

ఈ సంకీర్తనా విధానముచే, క్రమక్రమముగ హృదయము ప్రచలితమై, సర్వ నాడీ సంచయము పరిస్పందితమై, మనోవాక్కాయములు ఏకస్వనములై, అలౌకికమును, అద్వయమును, అద్వితీయమును అయిన అత్యద్భుతానందమున భక్తులు మునిగిపోవుదురు. ఒక్కొక్క నాడు, సంకీర్తనమున విరహము ప్రదర్శితముకాగా, నొక్కొక్క నాడు శ్రీకృష్ణసందర్శనానందము ప్రకటితమగును. ఆ సంకీర్తనమునకు గేంద్రస్థానమున గల శ్రీకృష్ణచైతన్యుని యా యా సమయముల గల చిత్తప్రవృత్తి నాటి వాతావరణమును సంచలనము గావించి, ఎల్లర హృదయముల నేకత్రాటి నీడ్చుకొనిపోవును. అందుచే నెల్లర కేకీభావము ఏకానుభూతి గలిగి, భగవదనుభూతియందు దన్మయులగు చుండెడివారు.

పూర్వ వైష్ణవ విధానములలో నిట్టి సంకీర్తనాపద్ధతి అభావము. భారతదేశమున నీ సంకీర్తన శ్రీకృష్ణచైతన్యునితోడనే ప్రారంభ మేమో? 'పరి త్వా గిర్వణో గిర ఇమా భగవంతు విశ్వతః' (ఋ. 1. 10. 12) ఓ సంకీర్తనప్రియుడా! ఈ కీర్తనములు నిన్నన్ని దిక్కుల నావరించునుగాక అను ఋగ్యజుర్వేదీయ మంత్రమును వ్యాఖ్యానించుచు, డాక్టరు బోసు మహాశయుడు The Vedic sages discovered the secret that the song was the medium of expression for the intensest feelings. So their love of God expressed itself in songs 132 వేదఋషులు గాఢమైన మనోప్రవృత్తుల నభివ్యక్తము జేయ కీర్తనములు మార్గమను రహస్యమును గ్రహించిరి. అందుచే వారి భగవత్ప్రేమ కీర్తనారూపమున వ్యక్తమయ్యెను అని తెలిపి, This tradition of prayer through song has persisted through the ages in India 132 కీర్తన రూపమున ప్రార్థించు సంప్రదాయము భారతావనిలో యుగములనుండి గలదని వాకొనెను. ఈ విధముగ Down through the ages the sky of India has rung with songs of love and devotion 133 అనేక యుగములనుండి భారతవర్ష గగనము భక్తి ప్రేమ కీర్తనములచే మారుమ్రోగినది అనియు నాతడు దెల్పుచు, Here prayer is the musical out-burst from the love-filled heart of man. This simple and direct prayer comes from the child as well as from the adult 133 ఇచట ప్రార్థన మానవుని ప్రేమప్రపూర్ణ హృదయమునుండి గానరూప ఉద్వేగము. శిశువునుండి వృద్ధునివరకు నెల్లరనుండి యీ నిరాడంబర

132. Prof. A. C. Bose : The Call of the Vedas, p. 94
133. Prof. A. C. Bose : The Call of the Vedas, p. 82

ప్రత్యక్ష ప్రార్థనము వెలువడును అని వచించును. ఈ సంకీర్తన విధానము హృదయవీణను మీటి సుసూక్ష్మ నాడులకూడ గదిలించును. భేకుశలత లేనివారినిగూడ జలింపజేయును. అందుచేతనే రవీంద్ర నాథుడుగూడ, Music is the most directt of the arts, proceeding from the physical to the spiritual with seeking the aid of the intellect 134 సర్వకళలలో సంగీతము ప్రత్యక్ష తమమై, ప్రజ్ఞాసహాయము నపేక్షింపక, స్థూలమునుండి పారమార్థికము నకు వెడలును అని వాకొనెను.

ఈ కీర్తనవిధానమును బూల్వోక్తచందము నారద, శాండిల్య భక్తిసూత్రములుగూడ నుతించియున్నవి. భాగవతశాస్త్రముగూడ 'శ్రవ ణం కీర్తనం విష్ణోః స్మరణం పాదసేవనం। అర్చనం వందనం దాస్యం సఖ్యమాత్మనివేదనం॥' (7.5.23) అని నవవిధ భక్తి విధా నములలో కీర్తనమునుగూడ జేర్చియున్నది. అట 'కీర్తనం నామో చ్చారణాత్మకం' అని నిర్వచింపబడినది.

అందులకు శ్రీకృష్ణనామమును అవిచ్ఛిన్నముగ కీర్తించువారు ముక్తిని బొందుదురని వచించినది. స్కాందపురాణమున శ్రీకృష్ణ నామమాధుర్యమును వర్ణించి, అది మధురతమమనియు, సర్వోత్తమ మనియు, దానిని భక్తితో గీర్తించు మానవుడు ముక్తి గాంచుననియు వాగ్దానమొసంగినది. అందుచేత, వంగీయ వైష్ణవమునకు నామజప, నామసంకీర్తనములే ప్రధాన సాధనములు.

---

134. Prof. A. C. Bose : Prabuddha Bharata, 1955, p. 374

# నేటి నామ సంకీర్తనము

కాని యీ విధాన, అనుష్ఠానవిధానము సర్వత్ర విపరీత ధోరణుల నభివృద్ధి గాంచినది. ఏకాంతిక భక్తి విధానముగ నున్న యీ సంకీర్తన పద్ధతి, బహిరంగ ప్రదర్శనరూపము దాల్చి, ప్రత్యేక ప్రదేశములగాక బహిరంగ స్థలముల, అధికారి నిర్ణయ నియమమున గాక అనర్హులగూడ జేర్చుకొనుచు, సన్నిహిత వాతావరణ పారిశుద్ధ్యము పారవశ్యత్వములకొరకు గాక బాహ్యప్రదేశ, దూరప్రదేశ ఉద్ధరణము నకై యనునట్లు దూరశ్రవణ యంత్రముల ధరించి, వికృత రూపమును దాల్చి హేయత్వము నొందినది. అంతియగాక, ఏకనామ ప్రాధాన్యము గతించి, సర్వ నామసంకీర్తనమై ఏకాగ్రతకుగాక మనో చంచలత్వమునకు దారి దీయుచున్నది. ప్రకృతమున 'హరే రామ హరే రామ రామ రామ హరే హరే। హరే కృష్ణ హరే కృష్ణ కృష్ణ కృష్ణ హరే హరే॥' అను షోడశాక్షరీ నామము సర్వత్ర సంకీర్తనములకుపయుక్తమగుచున్నది. ఇందు ప్రథమ పాదము రాముని, ద్వితీయము కృష్ణుని దెలుపుచున్నది. రామత్వ కృష్ణత్వములతో నిర్వురు విష్ణ్వావతారములనెడిదొక్క విషయముగాక సర్వేతర విషయముల బోలికల గానము. అయినను ఉపాసకుడుగాని, భక్తుడుగాని, మనస్సును ప్రథమపాద కీర్తనసమయమున రామునిపై గేంద్రీకరించి, వెంటనే ద్వితీయ పాదమున కృష్ణునిపై నుంచుట గష్టసాధ్యమగుటయేగాక, అట్లు గావింపగల్గినను, అది చిత్తచాంచల్యమును, ఉపాస్య వైరుధ్యమును సూచించునుగాని ఉపాసనము ఏమాత్రము కానేరదు. అది చైతన్యుని విధానమునకు విరుద్ధమగుటయేగాక ఉపాస్య విధానమునకుగూడ ప్రబల విరుద్ధము, ఇదేవిధముగ ననేక నామములతో

దేశమున సంకీర్తనముతో నేకాహాదికములు జరుగుచు, భక్తులకు సరియైన మార్గదర్శకములుగాక వ్యర్థముగ వ్యయప్రయాసలతోగూడిన వేడుకలై పరిణమించినవి. అందు ఏమాత్రము భక్తిప్రవృత్తులు జనింపక, అర్థుల నుద్ధరింపక, ననర్థులకు వినోద స్థానములుగ రూపొందినవి. అందుచే భక్తులు దీని గమనించి, శ్రీకృష్ణచైతన్యుడు జూపిన ఉత్కృష్ట పద్ధతిని గ్రహించి అనుసరించెదరు గాక! 'ఆదౌ శ్రద్ధా తతః సాధు సంగోఽథ భజనక్రియా। తతోఽనర్థనివృత్తిః స్యాత్ తతో నిష్ఠా రుచి స్తతః॥ అథాసక్తి స్తతో భావ స్తతః ప్రేమాభ్యుదంచతి। సాధకానామయం ప్రేమః ప్రాదుర్భావే భవేత్ క్రమః॥' మొదట శ్రద్ధా, అంత సాధుసంగతియు, నంత నామసంకీర్తన భజనయు, గలుగును. అంత ననర్థనివృత్తి జరుగ నిష్ఠయు, భక్తి నాపడు రుచియు జనించును. అంత భావము నాబరగు భగవదాసక్తియు, నట ప్రేమయు నుద్భవించు నని జీవగోస్వామి వాక్యము. అందుచే నా ప్రేమ జనించి, భగవత్సాక్షాత్కారప్రాప్తికి ముందు అవసర సోపానముల గమనించి, అభ్యసించి, అనుభవించి ఆనందించెదరుగాక!

ఈ విధముగ పరిశుద్ధ ప్రేమోన్మత్తత మైమరచి, జీవితము నడుపుకొను సాధకుడు ముక్తిని బొందును. శాశ్వత ప్రీతి, అనుభూతియే ముక్తి యని వీరి సిద్ధాంతము. ముక్తిదశలో జీవుడు భగవంతుని సేవకుడుగ గుర్తెరింగి, ఆ పరమేశ్వర సేవాభాగ్యమున నందుండును. బలదేవుని తాత్పర్యమున ముక్తుడు భగవంతునియం దైక్యముగాక సమానత్వము నొందును.

ఈ యసమానవిధానమున శ్రీకృష్ణచైతన్యమహాప్రభువు ఆర్యావర్తమున నచింత్యలీల భక్తితన్మయత్వమున అవిద్యాగంధమును బారద్రోలి, ప్రపంచ విషయముల పాదధూళిగా దులిపి, భగవద్దర్శన మహాభాగ్యమునకు ముఖ్యమైన హృదయపరివర్తనమునకు బరితాప రూపవిరహమే ప్రధానమనియు, నదియు శాంత, దాస్య, సఖ్య, వాత్సల్యభావముల మూలమునగాక అతిసన్నిహితమగు మధురభావమున మాత్రమే సాధ్యమని, యా మధుర రసమును ఉచ్చస్థాయికి బరిణమింపజేసి, శ్రీకృష్ణసన్నిధానభాగ్యము తా నొంది, భక్తులకు ప్రసాదించి, ఒక్కొక్క సమయమున దానె శ్రీకృష్ణరూపవిభూతిని బ్రదర్శించి, భక్తిసాధన సాధ్యముల నేకమూర్తిలో బ్రస్ఫుటము గావించి, మానవ హృదయమున సాధ్యముగానిదేదియు లేదని నిరూపించి, సర్వోత్తమాచార్యుడై, భారతీయ పారమార్థిక రంగమున, ముఖ్యముగ భక్తి సాధనా గగనమునకొక మహాదాదర్శక భానుడై ప్రకాశించెను. ఆ మహాపురుషుని ఆదర్శము సర్వదా అనుష్ఠానయోగ్యమై, భక్తకోటి నాకర్షించి, భక్తితన్మయతానందసుధాస్వాదనము నెల్లరకు విరివిగ బంచిపెట్టును గాక! అందులకు శ్రీకృష్ణ పరమాత్మ అనుగ్రహించును గాక!



# వైష్ణవ సిద్ధాంతము

## శ్రీరామచంద్ర ప్రధానము

శ్రీరామచంద్రశ్శ్రితపారిజాతస్సమస్తకళ్యాణ గుణాభిరామః।
సీతాముఖాంభోరుహచంచరీకో నిరంతరం మంగళమాతనోతు॥
రామాయ రామభద్రాయ రామచంద్రాయ వేధసే।
రఘునాథాయ నాథాయ సీతాయాః పతయే నమః॥

'మత్స్యః కూర్మ వరాహశ్చ నారసింహశ్చ వామనః। రామో రామ రామశ్చ బుద్ధః కల్కి....' అను భారతీయ సంస్కృతీ క్షేత్రమున దుష్టశిక్షణార్థమును, శిష్టరక్షణార్థమును, శ్రీమహావిష్ణువు అవతరించినవి దశ రూపములు. ఆ యవతార దశకముయొక్క ముఖ్యోద్దేశ్యమున తారతమ్యమభావమై యున్నను, వాని వాని వ్యక్తిత్వమున వ్యత్యాసము విస్పష్టము. ఆ యా సమయముల భూమిపై నేర్పడిన అవాంతర భయంకర పరిస్థితుల నెదుర్కొని, శిష్టరక్షణార్థము దుష్టనివారణము గావించి, శాంతి నెలకొల్పుట ప్రబలోద్దేశ్యమైనప్పటికిని, ఆ యా సమయముల నేర్పడిన అవతార మూర్తులుమాత్రము వ్యత్యస్తము. అదియు నొక పరిణామమునను సరించి శ్రీమహావిష్ణువు ఆ యవతారముల ధరించెనేమో యను సందియముగూడ పుట్టొందును. ఆ పరిణామము కేవలము స్థూలదేహము నందుమాత్రమే గాక, మానసిక పారమార్థికములగూడ గోచరము.

జలచరమై కరచరణాద్యవయవములులేనిదై, ప్రేమానురాగములు గాననిదై, అండజమై మత్స్యము జరింప, కూర్మము జలచర

భూచరమైనదై, కంఠ, చరణ విశిష్టత్వముగలదై, మమకారములులేని యండజమై, ప్రాణరక్షణార్థము అహంకారమున మెలంగును. వరాహము పూర్తిగ భూచరమై, జరాయుజమై. జలముల ప్రేమించుచు, అహంకార మమకారముల గలిగి, గమనవేగముగూడ గలిగి మనును. అంత గంఠమువరకు మానవాకృతి గలిగి, శిరముమాత్రము మృగరాజ శిరమును ధరించి, మానవత్వము లోపించి, అహంకారజన్య క్రూరత్వమున నరసింహుడు పరిణమించి యుండవచ్చునేమో!

వామనునికి పూర్తి మానవాకృతిగలిగి, వాగింద్రియమేగాక, విద్యాసంపదకూడ అభివృద్ధి గాంచియుండెను. పరశురామునిలో మానవత్వము పూర్తిదై అంగ, బుద్ధి, సౌష్ఠవములు సిద్ధించి, మంచి చెడ్డల వివేకజ్ఞానముదయించి, అనుచిత పాపకార్యవర్తనులపై నాగ్రహము జెంది, వారిననేకుల బరిమార్చెను. ఇంతవరకు గల యీ ఆరు అవతారములు కేవలము అర్చావతారములై, వారిలో అనుసరింప విశేషములభావములై యుండుట గమనార్హము.

కాని రామావతారముతో అనుసరణము ప్రారంభము. ముముక్షువులకు ఆతనితోడనే యొక అనుష్ఠానయోగ్యమైన ఆదర్శము వ్యక్తము. మానవత్వము పరిపూర్ణత్వము నొందుటయేగాక, పారమార్థిక స్థితియు బరిణమించుచు, పుణ్యపాప వివేకముమాత్రముగాక, బ్రహ్మప్రాప్తికై, బ్రహ్మవిద్యా కుశలత్వములును, తదనుష్ఠాన విధానము, లలితములైన కరుణ, ముదిత మైత్ర్యాది కల్యాణసంపదయు, నీ రామచంద్రుని నుండి అవతారములలో ప్రారంభము. ఇవి కృష్ణ, బుద్ధ, కల్క్యవతారములలో పూర్తిగ బరిణమించి, క్రమముగ ఉచ్చస్థాయినొందును.

అందుచే అనుసరణీయమైన రామావతారమునుండియే రామ కృష్ణాద్యవతారములు నాపడు వ్యవహారము లోకమున ప్రఖ్యాతము.

ఈ రహస్యము ననుసరించి, వైష్ణవమున ముఖ్యముగ, రామ, కృష్ణమూర్తులే స్వీకరింపబడి, సత్యాదర్శమూర్తులై అర్చన అనుసరణ స్వరూపులై ముముక్షువుల ననంఖ్యాకముగ దరింపజేయుచున్నారు. సర్వతోముఖాదర్శము యీ మూర్తిద్వయమున ప్రస్ఫుటముగ గోచరించుటచే, ముముక్షులోకమును వీరనేకవిధముల నాకర్షించి, తమ యడుగుజాడల ననుసరింపజేసి, వైష్ణవమునకు ముఖ్య ఆరాధ్య దేవతలై యలరారుచున్నారు. శ్రీమహావిష్ణు స్థానమును వీరిదువురధిష్ఠించి, తామే పరమాత్మ స్వరూపమునుగూడ నావరించి, సచ్చిదానందాది లక్షణము లనుగూడ బొంది, వైష్ణవ, స్మార్త భక్తకోటిని దరియింపజేయు చుండుట సువిస్పష్టము.

పూర్వమింతవరకు వైష్ణవమున శ్రీకృష్ణభగవానునికి సంబంధించిన శాఖల విషయముమాత్రము ప్రస్తావింపబడినవేమో అనిపించును. బాహ్యమునకట్లు దోచినను బూర్వోక్త శాఖలు శ్రీరామ ద్వేషమును గలిగినవి లేవు. కాని కృష్ణునిమాత్రము ముఖ్యమూర్తిగ నా శాఖలు గైకొనియుండెను. శ్రీరామచంద్రునికంటె, శ్రీకృష్ణమూర్తి అధికతరముగ వారి నాకర్షించెను.

కాని శ్రీకృష్ణునిలో అభావమైన యనేక ఆదర్శ విషయములు శ్రీరామునిలో గోచరము. గృహస్థాశ్రమ నిర్వహణమునకత్యంతావసర

విషయములు ఆదర్శవంతములుగ శ్రీరామునిలో మూర్తీభవించి యున్నవి. మానవత, బరిపూర్ణత్వము నొంద నర్హత, సాధకులకు అవసర విషయములు, ఆ మూర్తిలో అభివ్యక్తము. ఆతని జీవిత చరిత్రము శ్రీకృష్ణుని చరిత్రముభంగి సంక్లిష్టముకాక, ప్రస్ఫుటము స్పష్టము. అవతార పురుషుడై యుండియు, దాని బ్రదర్శింపక, సంఘములో నొక అపూర్వమును ఆదర్శమును అయిన వ్యక్తి మాత్రుడుగ నాతడు వ్యవహరించెను. ఉత్తమోత్తమ గుణసంపదచే నతడు సంఘమును బావనమొనర్చెను. 'యద్యదాచరతి శ్రేష్ఠః తత్తదే వేతరో జనః' అను భగవద్గీతచందము 'యథా రాజా తథా ప్రజా' అను అర్యోక్తిరీతి నీతని జరితము సర్వదా ఆచరణయోగ్యమై, సంఘమునకు అధికతరోపయుక్తమై యున్నదనుటయు నుచితమేమో!

చిన్ననాటినుండి తన కళ్యాణగుణములచే నాబాల గోపాలముచే బ్రేమింపబడి, సంఘ నావకు చుక్కానివలె నాదర్శకమూర్తి యగుచు, నాతనిసముడుగూడ నాటి ప్రపంచమున అభావమని కీర్తిగాంచెను రామచంద్రుడు. విషమఘట్టము అడుగుదెంప, పితృాజ్ఞను బాటించి, సామ్రాజ్యమును బరిత్యజించి, జటావల్కలధారియై యరణ్యముల దపోనిష్ఠనుండిన అనుద్వేగమూర్తి అతడు. ఆదర్శ పుత్రుడుగ, అనుజుడుగ, భర్తగ, ప్రభువుగ, గురువుగ, విరోధిగ, మిత్రుడుగ, నింక ననేక ప్రపంచ సంబంధములలోగూడ బ్రస్ఫుటాదర్శమూర్తి గదా రామరాఘవుడు!

లౌకిక ధార్మిక విషయములమాత్రముగాక, వాయునందనునికి గురుస్థానము వహించి, పాత్రోచిత బోధ జేసి, అతని సంపూర్ణ ఆధ్యాత్మికానందమయుని గావించెను. ఆ శ్రీరామానుగ్రహవిశేషము చేతనేగదా ఆ హనుమంతుడు 'దేహబుద్ధ్యాస్మి దాసోహం జీవబుద్ధ్యా త్వదంశకః ఆత్మబుధ్యా త్వమేవాహం ఇతి మే నిశ్చితామతిః॥' దేహబుద్ధి నున్నపుడు నీకు దాసుడనను బుద్ధితోడను, జీవుడనను స్ఫురణము గలుగగా నే నీయంశము ననియు, నే నాత్మ యని బోధపడినంత నీవే నేనను స్థిరభావము గలుగుననియు, ఇది నా నిశ్చయమని ఆంజనేయుడు స్థిరప్రజ్ఞుడై, ముముక్షువు క్రమక్రమముగ దేహాత్మభావమున నున్న ద్వైతమునుండి, 'అహం బ్రహ్మాస్మి' యను అద్వైతమునకెట్లు అభివృద్ధి గాంచునో, తా ననుభవించి ప్రకటించియున్నాడు. కావున శ్రీరాఘవరామచంద్రుడు సర్వవిషయముల బురుషోత్తముడై, మానవోద్ధరణకార్యమున అతి ప్రధాన పాత్రను ధరించి, సమర్థముగ నిర్వహించి, సర్వతోముఖాదర్శమూర్తిగ ప్రకాశించెను.

అందుచే నిట శ్రీరామాదర్శమును గైకొని, అనుసరించిన గొన్ని వైష్ణవశాఖలగూర్చి విచారించెదము. ఇందు సిద్ధాంతభాగము కొంచెమేనియు గానము. అయినను వైష్ణవ పరిణామమున, ముఖ్యముగ ఆచరణానుష్ఠానముల శ్రీకృష్ణునివలె శ్రీరామచంద్రమూర్తియు మిగుల తోడ్పడెను. కావున శ్రీరామచంద్రుని కేంద్రస్థానమున నిల్పి, ముముక్షువులకు దారణోపాయమును జూపిన ఆచార్యులగూర్చి కొంత వరకు క్లుప్తసరణి గాంచెదముగాక:

# శ్రీ రామానందస్వామి

Both a religious leader and social reformer, Ramananda occupies an eminent position in the history and development of Bhakti cult 135 మతనాయకుడుగను, సంఘ సంస్కర్తగను, భక్తిసిద్ధాంత చారిత్ర పరిణామముల రామానందుడు ఉన్నత స్థానము నలంకరించెననురీతి, రామానందుడు ఉత్తర హిందూస్థాన వైష్ణవచారిత్రమున తన యసాధారణ శక్తిసామర్థ్యముల చేత, సువిశాల హృదయముచేతను, అద్వితీయ స్థానము నధిష్ఠించెను. శ్రీశంకరాచార్యుని అద్వైత పరబ్రహ్మమువలె కాకున్నను, రామానుజుని శ్రీమహావిష్ణువుగూడ సామాన్య ప్రజాసమూహమునకు అగ్రాహ్యమై సన్నిహితము గాకుండుటచే, యీ మహానుభావుడు సమాలోచించి, పూర్వమే వాల్మీకి మహర్షి రచనము ద్వారమున నెల్లర హృదయముల నాక్రమించియున్న శ్రీరామచంద్రుడే సర్వసామాన్య మానవుల కాప్తుడనియు, నతడే సర్వవిధాదర్శమనియు గుర్తెరింగి, శ్రీరామచంద్రుని ప్రజల ముందు ఆదర్శముగ, ఆరాధ్యదైవముగ నుంచినచో, మత జీవనము, దానితో సంఘజీవనము, మరియు భక్తియు, నభివృద్ధి గాంచునని విశ్వసించి, రామానందుడు శ్రీరామచంద్రుని ముందుకు దెచ్చెను.

ఈతడు రామానుజుని చాలవరకు సిద్ధాంత విషయముల ననుసరించియున్నను, In every way Ramananda tried to make his religion more popular and more simple, his sole aim was to make religion an easier affair than what

135. Prof. Nonika Handoo : Vedanta Kesari, 1960, P. 278

the priests and philosophers made it 136 సర్వవిధముల మతజీవనమును రామానందుడు మిగుల సామాన్యమును, సర్వజన ప్రియకరమైనదానిగ జేయ యత్నించెను. శాస్త్రజ్ఞులు తత్త్వజ్ఞులు గావించినరీతిగాక, మతమును సులభతరము గావింప రామానందుడు ప్రథమ కార్యముగ నెంచెను.

అందులకై రామానుజునిరీతి ఏకేశ్వర సిద్ధాంతమును ప్రతిపాదించుచు, నంతు శ్రీరాముడే నిరాకార దైవముగ నాతడే సర్వాంతర్యామియై విశ్వమున నిత్యపరమాత్మునిగ నాతడు బోధించెను. మరియు నా రామచంద్రుని సగుణ దైవముగ అర్చాపీఠముపై నధిష్ఠింపజేసి, ఆ పరబ్రహ్మము సీతారాములలో నవతరించెనని బోధించెను. నింబార్క వల్లభాదులు శ్రీకృష్ణుని బోధింప, రామానందుడు శ్రీరామునిగూర్చి బోధించి, If he did anything new, it is his deification of the greatest hero known in India It was he who deified Rama and introduced the worship of the great hero all over the Northern India 137 రామానందుడేదేని వినూత్న కార్యమును గావించెనని యనినచో, భారతదేశమున మహాయోధుడుగ దెలియబడియున్న శ్రీరాముని దేవునిగ నొనర్చుటయే యగును. ఇతడే శ్రీరాముని దేవుడని బోధించి, అతనికి బూజాదుల నుత్తరహిందూస్థానమున బ్రవేశపెట్టెను అను కీర్తిని రామానందు డార్జించెను. ఈతని అనుచరులైన వైరాగులు, లేక రామాయతులకు

136. Prof. Manmath Nath Dath : The Prophets of Ind, p. 181

137. Prof. Manmath Nath Dath : The Prophets of Ind, p. 178

యీ సిద్ధాంతమునకు గర్భగ సీతామహాదేవిని అతడు జూపించెను. ఆ సీతాసాధ్వి యీ సిద్ధాంతమును భక్తశిఖామణియైన అంజనీసుతునకు బోధింప, నా మారుతీపుత్రుడు లోకమునకు ప్రకటింపజేసెనట. అందుచే నీ సంప్రదాయము శ్రీ సంప్రదాయముగ వ్యవహార్యము. అందుచే నీ సంప్రదాయమువారికి రామతారకమంత్రము శరణ్యము.

మరియు నీతడు పూర్వాచార్యులవలె సంస్కృతభాష నవలంబింపక, ప్రజాభాషయైన హిందీభాష నుపయోగించుటయు, దా త్రిదండి సన్న్యాసియై యుండియు, నందు జాతి, వర్ణ వివక్షతను బాటింపక నెల్లరు హరిసేవకులే యని బోధించి, సర్వజాతుల శిష్యులనుగ జేసికొని, భోజనాది వ్యవహారముల సమానత్వమును ప్రకటించుట చేతను, అతని కాలమునుండి భక్తిప్రవాహము పెల్లుబికి, మీరాబాయి, తులసీదాసు, కబీరు, సూరదాసుల ప్రతిభాయుత గానమాధుర్యముచే దేశముల ప్రవహించి, మతజీవనపద్ధతి భక్తిమార్గమున వినూత్నత్వము నొంది, రామానందునిమూలముగ వైష్ణవము శక్తిసామర్థ్యముల సంపాదించుకొనెను. అతని భక్తివిధాన వివరణములు నూత్నత్వమును గలిగి, He is the very fountain-head of this gigantic movement 138 అతడు యీ విధానమునకు నిత్య ప్రసవంతి యని కీర్తి నార్జించెను. యథార్థమున నాతడు నూత్న సిద్ధాంతమునుగాని, నూత్న మతజీవనమునుగాని నెలకొల్పకపోయినను, అతడు సుప్రశస్తి సంపాదించి, అతని సంప్రదాయము అచిరకాలమున జనాదరణమును గడించి, ఉత్తరదేశమున బహుళ వ్యాప్తి గాంచెను.

---

138. Prof. Nonika Handoo: Vedanta Kesari, 1960, p. 278

ఈ విధముగ నితని ప్రభావము దేశవ్యాప్తమై There is a virility in his views, and their expression is new and refreshing 139 అతని భావజాలములలో సామర్థ్యము, ఉచ్చారణ మున వినూత్నత్వము, హాయి యుండుటచే, అతని ప్రతిభ, కబీరు దాసు అనుచరుడైన నానకుచే సంస్థాపితమైన శిఖుమతమునను, యింక ననేక సంప్రదాయములకెగ్రాకి భారతావనియందంతట ప్రసరించెను.

రామానుజాచార్యునికి తర్వాత, నైదవ తరమునకు జెందిన వైష్ణవాచార్యుడు రామానందుడు ప్రయాగ క్షేత్రమునగల కన్యాకుబ్జ బ్రాహ్మణవంశమునకు జెందిన మహనీయుడు. తండ్రి పుణ్యసదనుడు, తల్లి సుశీల అని యందురు. ఈ కుటుంబము దక్షిణహిందూస్థానము నకు జెందియు గారణాంతరములచే ఉత్తరదేశము జేరి, ప్రయాగ క్షేత్రమున స్థిరనివాసము నేర్పరచుకొని యుండెను. ఆ పుణ్యదంపతుల పుణ్యఫల విశేషమున క్రీ. శ. 1299 వ సంవత్సరమున మగశిశువు జనింప, వారు అతనికి రామదత్తుడని నామకరణమొనరించిరి.

బాల్యమునుండి యీ బాలుడు మిగుల మేధాయుతుడై, తండ్రి దగ్గర వ్యాకరణ, యోగవిద్యల నార్జించి, అధిక శ్రద్ధతో శ్రీ వాల్మీకి రామాయణ శ్రవణముగూడ గావించెను. ఉపనయనానంతరము తన ఎనిమిదవయేట రామదత్తుడు వారణాసికేగి, విద్యాభ్యాసము గావింప సంకల్పించినందులకు మాతాపితలు అంగీకరించి, ఓంకారేశ్వరముదగ్గర నివాసమేర్పాటు గావించి, పుత్రుని విద్యాసముపార్జనమునకు అవకాశ మును గల్పించిరి. బాలునకు పండ్రెండు సంవత్సరముల ప్రాయము వచ్చునాటికి సకలవిద్యాపారంగతుడయ్యెను.

---

139. Ramananda to Rama Tirtha, p. 9

రామదత్తునకు యౌవనము ప్రాప్తించుటతో జనకులు యోచించి, వివాహయత్నములు జేయ సంకల్పించుచుండ గమనించి, తనకు పరిణయము వలదనియు, తా సన్న్యసింప తలంపు గలదనియు వారికి బాలుడు స్పష్టపరచెను. జనకులెంత బోధించినను తన పట్టుదలను రామదత్తుడు వీడడయ్యెను. అట్లు జననీజనకుల వీడి, రామదత్తుడు అందేగల రాఘవానందస్వామి యను రామానుజీయ వైష్ణవమత సంప్రదాయమునకు జెందిన సన్న్యాసిని ఆశ్రయించెను. రాఘవానందుని గురుపరంపర హరియానందుడను కాశీవాస్తవ్యుడైన సన్న్యాసిని జేరి, అటనుండి ఇరువదియైదు తరములు దాటి, సీతామహాదేవిచే నుపదేశింపబడిన హనుమంతునివరకు నరిగినది. కొంతకాలము గురుశుశ్రూషానంతరము గురు అనుగ్రహమును బొంది, తురీయాశ్రమమును స్వీకరించి, రామానందస్వామి అను యోగపట్టమును బొంది, వారణాసీనగర పంచగంగాఘట్టమువద్ద నొక కుటీరనిర్మాణము గావించి, అందు ఘోరతపశ్చర్యకు బూనెను.

క్రమన్యాయమున రామానందుని తపోబలముచే అనుచరకోటి అధికము కాజొచ్చెను. పండిత పామర వ్యత్యాసములేక, ఆబాలవృద్ధులాతని జేరి ఆత్మశాంతిని బొందుచుండిరి. అతడు సంకీర్తనకాలమున శంఖారవము జేయ, నా శబ్దముచే నాకర్షింపబడి భక్తులనేకులు జేరుచుండిరి. ఈ విధముగ రామానందుని భక్తిప్రభావము దేశదేశముల ప్రబసరించెను.

ఈ కాలమున హిందువులను మహమ్మదీయ నవాబులు ఎక్కువ బాధల బెట్టుచుండిరి. హిందూసంఘము తమ కష్టముల రామానందునితో విజ్ఞప్తి జేసికొన, రామానందుడు మహమ్మదీయ ప్రముఖులతో

సంప్రతించి, నవాబుచే హిందూసంఘముయొక్క కష్టముల నవ్మతింప జేసి, కొన్ని శాసనముల గావింపజేసెను. అప్పటినుండి హిందువుల బాధలు సమసిపోయినవట. అందుచే రామానందుని యశశ్చంద్రిక లింకను వ్యాప్తినొందెను.

అంత నా యతిరాజునకు దక్షిణయాత్రలగావింప దలంపు ఏర్పడి, అందులకు శిష్యసమేతముగ బయనమయ్యెను. జగన్నాథము నుండి బయలుదేరి, బుక్కరాయలకాలమున విజయనగరమును రామానందుడు జేరెను. పిమ్మట, భారతమునకు దక్షిణ మహాక్షేత్రము నా బ్రఖ్యాతినొందిన రామేశ్వరమును రామానందుడు దర్శించెను. తిరుగు ప్రయాణమున నాతడు అనేక మహాక్షేత్రముల దర్శించుచు, నందందు గల మహాపురుషులతో సంప్రతించుచు, గొంతకాలమునకు కాశీక్షేత్ర మును జేరెను.

కాని అసూయాగ్రస్థులైన వైష్ణవసంఘము, యాత్రాసమయ మున వైష్ణవులకవసరమైన ఆహారనియమముల రామానందుడు పాటింప నవకాశముండదనియు, అట్లు నియమ విరుద్ధముగ బ్రవర్తించుటచే నతడు సంఘబహిష్కారార్హుడనియు దీర్మానించిరి. సనాతనపరుడైన రాఘవానందునితో రామానందునికి అనేక భేదభావములుత్పన్నము లయ్యెను.

అందుచే విసివి, రామానందుడు వైష్ణవ సంఘమునుండియు గురుదేవునినుండియు దొలగినవాడై, స్వతంత్రుడై, భగవద్భక్తివిశేష ముల వర్ణాది వ్యవస్థత అసమంజసమనియు, సర్వప్రజలకు భగవంతు నారాధించి పొంద నధికారము గలదనియు, ప్రత్యక్షముగ బహిరంగ

ముగ జాటుచు, వర్ణనియమముల బాటించుట బూర్తిగ విరమించెను. తన సంఘమున జాతి, వర్ణ వ్యవస్థను బాటింపక నెల్లర జేర్చి కొనెను. రామానందుడు సప్త ద్వారములనెడు సన్న్యాసమఠముల నెలకొల్పెను. ఒక్కొక్కదానికి తన ముఖ్య శిష్యుల నొక్కొక్కని అధిపతిని గావించెను. శంకరసంప్రదాయ సన్న్యాస నియమములు యిచ్చట అనుష్ఠేయములు. కాని శంకరసంప్రదాయము శివశక్తుల నర్చింప, రామాయతులు సీతారాముల నారాధించెదరు.

ఇట్లు విస్తరించిన రామానందీయ శాఖ బహుముఖముల శాఖోప శాఖలుగ వ్యాపించి, అతనికి సహస్రాధిక శిష్యకోటి యేర్పడ, నందు ముఖ్యులనబడువారు అయిదువందలమంది గలరు. అందుగూడ పండ్రెండు గురు అతిప్రధానులు, అంతరంగికులు. అందు పీపా యను సిపాయి, కబీరు అను మహమ్మదీయుడు, సేన యను మంగలి, ధన్న అను రైతు, రైదాసు అను పంచముడు, అనంతానంద, సుర్సురానంద, నరహరియానంద, యోగానంద, సుఖానందులు బ్రాహ్మణులు. పద్మావతి యనియు సుర్సరి యను స్త్రీలును ఉండుట గమనార్హము. ఈ శిష్యుల స్థితి ననుసరించిచూచుచో, రామానందుడు ఎంత సర్వసామ్యము గలవాడో, ఎంతటి విశాల హృదయుడో సువిదితము. వీరిలో రైదాసు మీరాబాయికిని, నరహరియానందుడు తులసీదాసునకును ఉప దేశకులై చరితార్థులైరి. మరియు నిందు కబీరు, సేన, రైదాసులు ప్రత్యేక శాఖలకు మూలపురుషులై వెలుగొందిరి. ఈతని అచార్య స్థానమున నెలకొల్పుకొను తులసీదాసు ఒకమార్గమున ప్రత్యేకత నార్జింప, కబీరుదాసు మరియొక మార్గము ననుసరించి, ప్రత్యేక శాఖకు మూలపురుషుడై, గురువునకు మించిన శిష్యుడై వెలుగొందుట గమనార్హము.

ఈ విధముగ రామానందస్వామి నూటపదునొకండు వర్షముల ముదిమివరకు సహస్రాధిక శిష్యకోటిచే, దేశవ్యాప్త యశోవిభూతిచే సేవరింపబడి, సిద్ధసంకల్పుడై క్రీ. శ. 1410 వ వత్సరమున అయోధ్యా పురికి దా బయనింపుమన్నట్లు శిష్యకోటికిదెలిపి శరీరమును జాలించెను.

పూర్వాచార్యులనుండి సమస్త విషయముల స్వీకరించి, అందు గల దోషముల త్యజించి, ప్రజాబాహుళ్యమునకు భగవత్సాధన అనుభవముల సులభ గ్రాహ్యముగను అనుష్ఠానయోగ్యమును గావించి, ముముక్షుకోటికి అఖండ సేవ యొనరించిన రామానందుడు అసమానుడు. అతడు అతనికే సాటి. ఇట్టి విశిష్టమార్గమును ద్రొక్కి, కాలాంతర ఆచార్యులకెందరికో ఆదర్శకుడైన రామానందుడు, భారతీయ భక్తి చారిత్రమున ప్రముఖ స్థానము నలంకరించి యుండుట స్పష్టము.

రామానందుని మతముల నెవ్వరైన ఆశ్రయియున్నవారు జేత నర్హులు. ఆ విధముగ He tried to establish Rama-Rajya, or kingdom of the Lord on the earth, by purifying the individual and society, by castelessness and righteousness 140 రామానందుడు వర్ణరహితమును, ధర్మబద్ధమునైన వ్యక్తులను, సంఘమును, పవిత్రము గావించి, భూమిపై రామరాజ్య మును స్థాపింప యత్నించెను.

అతని రచనములు దురదృష్టకరముగ నలభ్యములు. భారతీయ సంప్రదాయమున ముఖ్యవిషయముల నాతడు స్వీకరించి సమన్వయము

140. Prof. Nonika Handoo: Vedanta Kesari, 1960, p. 280

గావించెను. భక్తిప్రపత్తుల గైకొనెను. వర్ణ వ్యవస్థాదికమును ద్రోసి వైచెను. అతడు ప్రజాసమూహమునకు జెంది, సదా వారి యవసరముల యోచించువాడు. పారమార్థిక అవసరముల దీర్ప బద్ధకంకణుడై వెలుగొందెను. ఈతని ప్రభావమున, నితని శిష్యుడైన కబీరు మూలమునను, తర్వాత అతని శిష్యుడైన నానకు శిఖమతము ద్వారముననుబరస్పర విరుద్ధములైన హిందూమహమ్మదీయ సిద్ధాంతములు సమన్వయము వొందినట్లయ్యెను. ఇతని సన్న్యాససంప్రదాయము రామాయతులు అనబడి అసంఖ్యాకముగ బరిణమించెను.

ఈ విధముగ రామానందుడు ప్రముఖుడై, భక్తిసంప్రదాయమున మరువరాని వ్యక్తియై, హైందవ సంఘమునకు, ముఖ్యముగ వైష్ణవమునకు అకుంఠిత సేవ జేసి, ఆచంద్రార్కస్థాయి యశస్సును సంపాదించెను. ఈతనితో శ్రీరామచంద్రమూర్తి ఆదర్శము, ఆరాధనములు ప్రముఖములై, దేశమున విస్తరించి, అనేకులకు దారణోపాయముగ నయ్యెను. అందుచే రామానందుడు చిరస్మరణీయుడు, ఆదర్శవంతుడు, మాన్యుడు, వంద్యుడు. ఆతని యుద్యమమునకు జయము లభించునుగాక!



# కబీర్ దాసు

O servant, where doest thou seek Me?
Lo! I am beside thee.
I am neither in temple nor in mosque;
I am neither in Kaba nor in Kailash;
Neither am I in rites and ceremonies,
nor in Yoga and renunciation.
If thou art a true seeker, thou shalt at
once see Me: thou shalt meet Me
in a moment of time.
Kabir says, O Sadhu! God is the
breath of all breath 141

ఓ సేవకా! నన్నుగూర్చి నీవెట వెదికెదవు? నేను నీవద్దనే యున్నాను. నేను దేవాలయమునగాని, మసీదునగాని లేను. నేను కాబాలోగాని కైలాసమునగాని లేను. నేను కర్మలగాని ఆచారములగాని లేను. అటులనే యోగమున లేను. విరాగమున లేను. నీవు యథార్థమైన అన్వేషివైనచో నన్ను నీవు వెంటనే గాంచగలవు. ఒక క్షణములో నన్ను గలిసికొనగలవు. ఓ సాధువా! భగవంతుడు ప్రాణమునకు ప్రాణమై యున్నాడని కబీరు వచించును అను కీర్తనము కబీరుని భావజాలముల నొకించుక తెలుపుచున్నది.

Once of the most interesting personalities in the history of Indian mysticism 142 భారతీయ పారమార్థిక

141. Dr. Rabindra Nath Tagore: Kabir's Poems, 1.
142. Prof. Evelyn Underhill: One Hundred Poems of Kabir, p. v.

చరిత్రమున, అత్యంత మనోహరమైన వ్యక్తులలో నొకడుగ పేర్వడ పిన కబీరుదాసుని చరిత్రము అద్భుతము. ఈతని గురువుగ బరిగ ణింపబడు రామానందుడు ఆహార నియమముల బాటింపలేదని అతని గురువర్యుడైన రాఘవానందునిచే బహిష్కరింపబడుటయు, నందులకు విసివి రామానందుడు పరిపూర్ణ స్వాతంత్ర్య భావజాలములతో వర్ణ జాతి వ్యవస్థల బోద్రోసి, పారమార్థిక జీవనవిధానము భగవత్ తృష్ణ గలవారెల్లరికి అవకాశము గలదని బ్రాహ్మణాది చండాలురవరకు, స్త్రీ శూద్రులకుగూడ బోధించి, రామచంద్రమూర్తిని అధిష్ఠానదైవ ముగ నెలకొల్పి, దేశవ్యాప్త సులభతర వైష్ణవ మతమును సంస్థా పించినట్లు గాంచితిమి. కాని రామానందుని శిష్యులలో ముఖ్యుడని కీర్తిగాంచిన కబీరుదాసు మన్మథనాథదత్తుని వాక్యములలో surpassed his own master and teacher. He perhaps became a greater man than what Ramananda was, 143 తన ఆచా ర్యుని, గురువును అతడు అతీతించెను. బహుశః రామానందునికంటె అతడు గొప్పవాడయ్యెను. రామానందుని పంద్రెండుగురు శిష్యులలో నీతడు seems to have produced, directly or indirectly, a greater effect in the state of popular belief than any other,... 144 ప్రత్యక్షముగగాని, పరోక్షముగ గాని, యితరులకంటె ప్రజాదరణరూపమతమున నధికతర ప్రభావమును జూపినట్లు దోచును

143. Prof. Manmath Nath Dath : The Prophets of Ind, p. 181.

144. Prof. H. H. Wilson : Hindu Religions, p. 37

అని విల్సను పండితుడుగూడ వచించెను. గురువర్యుడైన రామానందునికంటె మత జీవన విధానమును కబీరు సులభతరము గావించెను. రామానందుడు కొంత కర్మకలాపముల బోధింప, Kabir went thoroughly against all rituals and formalities. His religion was a religion of simplicity; his motto was love 145 కబీరుదాసు కర్మకలాపముల, ఆచారముల బూర్తిగ వ్యతిరేకించెను. అతని మతము నిరాడంబరత్వము, ప్రేమ అతని సూత్రము.

ఆతనికి no caste, no creed, he had no worship no adoration, he had no idols, no mythology, he sang the praise of God alone 146 కులము జాతి లేదు. అతనికి పూజస్తోత్రములు లేవు. అతనికి అర్చామూర్తిగాని, శాస్త్రముగాని అభావము. భగవంతునిగూర్చి అతడు స్తుతి చేయుచు గానము జేసెను. ఎవ్వరినిగూడ దన ననుసరింపమని అతడు ప్రబోధింపక, తన కీర్తనముల గానము చేయుచు దేశముల గ్రుమ్మరువాడు కబీరు. అతని మతము ప్రేమమై, సర్వమానవ సౌభ్రాతృత్వము నతడు ప్రకటించెను. అతని బోధనావిధానములో నొక విశిష్టత గలదు. అతడు బోధింపక, తన పాటల బాడుచు, అద్భుత గానమాధుర్యమున నెల్లరమురింపచు, గ్రమముగ దన అనుయాయుల గావించుకొనుచు విర్యటించువాడు.

145. Prof. Manmath Nath Dath : The Prophets of Ind, p. 185

146. Prof. Manmath Nath Dath : The Prophets of Ind, p. 188

ఈ విధముగ నక్రాపండితుని వాక్యములలో A simple and unlettered man, Kabir was the poet saint of the common man 147 నిరాడంబరుడును, నిరక్షరుడును అయిన కబీరు సామాన్య మానవులకు కవి, మహాత్ముడై వెలుగొందెను. Bold and blunt in expression and rugged in style, his poetry is the outpouring of a soul that apssionately felt the call of a true faith 147 సాహసవంతమును, నిష్కర్షములైన అభిభాషణమును, కరకైన శైలితో నాతని కీర్తనములుండినను, అవి యథార్థ విశ్వాసముయొక్క పిలుపును అనురాగ యుక్తముగ ననుభవించి, పెల్లుబికిన హృదయ ఆవేదనములే అతని కీర్తనములు. అట్టి అతని వ్యక్తిత్వమే అతని సిద్ధాంత ప్రాపక వ్యాపకమునకు మిగుల దోడ్పడెను. అతడు నాటి వాతావరణమునకనుగుణమైనమూర్తియై, మహమ్మదీయమునకు గల ఏకేశ్వరోపాసనయు, వేదాంతమునగల ముఖ్య సిద్ధాంతములను సమ్మేళనమొనరించి, అమరగానమొనరించెను. నాటి సంఘమున, హిందూ మహమ్మదీయ సంఘమున గొప్ప విప్లవకారుడై, సంచలనము గలుగజేసి, అండర్ హిల్ వచనముల plainly a heritic; his reputation as a dangerous man 148 శుద్ధమైన వ్యతిరేకిగ నుండి, ప్రమాదకరమైనవాడుగ బరిగణింపబడినను, మహమ్మదీయులతని సుఫీ ఫకీరుగను, హిందువులతని రామభక్తి తన్మయునిగను స్వీకరించి, అతని మృత కళేబరమునకై పోరాడి

147. Prof. D. S. Nakra : Vedanta Kesari, 1959, p. 65

148. Prof. Evelyn Underhill : One Hundred Poems of Kabir, p. xv

యుండుట అతని అద్భుత వ్యక్తిత్వమునకు, ఆకర్షణమునకు, ప్రజా గౌరవమర్యాదలకు దార్పాణములు. అతని తమ మతమువాడని చెప్పు కొనుటయే భాగ్యముగ విశ్వసించి, ఇరు మతములవారు పోరాడి యుండిరిగదా! ఏమి యీ అసమానమూర్తియొక్క వ్యక్తిత్వము! అది అద్భుతము.

రామానందునిచందము యీతనికిగూడ ప్రముఖులైన ఐంద్రెండు గురు శిష్యులు గలరు. వారెల్లరు ప్రత్యేకమైన మఠముల నెలకొల్పి, కబీరు భావజాలముల ఐహుళ ప్రచారము నొనర్చిరి. ఈ విధముగ నతని ప్రభావము అనేక సంప్రదాయముల దోచి, గరీబాదాసులు, రామస్నేహులు, కిన్నరమి, అఘోరులు మొదలైనవారికి మార్గదర్శకములగుటయేగాక, హిందూ మహమ్మదీయములకు సమన్వయమార్గముగ నెలకొల్పబడిన శిఖుమతమునకు సంస్థాపక గురువర్యుడైన నానకుమీదగూడ నితని బోధ పనిచేసినది. అటులే దాదు యితనికి సాక్షాత్తు శిష్యుడు కాకపోయినను, యితని భావములు దాదు హృదయమును గదలించి, దాదు సాంప్రదాయిక వైష్ణవమును రూపొందించెను. ఘుర్యే పండిత వాక్యమున, గృహస్థులై రాధాస్వామి సిద్ధాంతము ననుసరించు సత్సంఘీయులు, సురత శబ్దయోగము మూలమున కబీరు పంథాను అనుసరించువారే యగుదురు. 149 వీరందరు యిటులుండ, కబీరు పంథ నాబడు సన్న్యాసవర్గము కేవలము కబీరు భావముల

149. Prof. G. S. Ghurye: Indian Sadhus, p. 214

ననుసరించుచు కబీరు పరమహంసలు నాబడుచు, నేటికిని ఉత్తర హిందూస్థానమున ప్రఖ్యాతులై యుండుట గమనార్హము.

కబీరు శాసనముల ననుసరించి, కబీరు పరమహంస సన్న్యాసులు యితర సన్న్యాసులవలెగాక శ్వేతాంబరధారులై ఏకేశ్వరోపాసకులై, విగ్రహారాధనమును ద్యజించి, బాహ్యాడంబరముల వీడి, మత్తుపదార్థముల దూరమొనర్చి, ఇంద్రియముల జయించి యుందురు. వీరు తీర్థయాత్రలగూడ గావించెదరు. నింబార్క బైరాగులవలె వీరు తిలకమును నుదుట ధరించెదరు. రెండు శ్వేతరేఖల నూర్ధ్వముగ లిఖించి, మధ్యమున నొక చందనబిందువు నుంచెదరు. కొందరు యీ బిందువును గూడ దీసివైచిరి. కబీరుపంథలోని వివిధ శాఖీయులు వివిధరీతుల తిలకాదుల ధరించెదరు. కొందరు తులసి తావళముల గంఠమున ధరించెదరు. అందరికి నామముల చివర దాస శబ్దముండును. స్త్రీలను గూడ నీ సంప్రదాయము స్వీకరించి సన్న్యాసము నొసంగెను. ఈ విధముగ భారతీయ మతజీవనమున మహత్తర పరివర్తనమును గలిగించిన కబీరుదాసుని పుట్టుపూర్వోత్తరముల జూచెదముగాక :



# కబీరు జీవితము

ఈతని జీవితము అజ్ఞాతమై కాలగర్భమున జాలవరకు అంతరించెను. దేశమున వ్యాప్తమునమున్న స్వల్పసంఖ్యాక విషయముల నాధారముగ గొని, అనేక అద్భుత సంఘటనములను, మహత్తులను కాలాంతర రచయితలు జేర్చి, చరిత్రాకథనదూరముగ అతని జీవితము నొనర్చిరి. అది సామాన్యముగ భారతీయ మహాపురుష జీవిత కథనమున గాంచుచున్నాము. అటులే కబీరుదాసుని పుట్టుపూర్వోత్తరములు అభూతకల్పనాయుక్తములై యున్నవి.

అతని జన్మదినవిషయమున ననేక సమస్యలు పుట్టొంది విజ్ఞులలో నభిప్రాయ విభేదముల గల్పించెను. అతడు క్రీ. శ. 1440 వ సంవత్సరమున జనించినట్లు గొందరును, క్రీ. శ. 1398 వ సంవత్సరమున పుట్టినట్లు గొందరును అభిప్రాయముల వెలిబుచ్చిరి. కాలాంతరమున నితడు రామానందునికి శిష్యుడైనట్లు చరిత్ర సంప్రదాయములే గాక, కబీరుగూడ నా రామానందుని శిష్యుడైనట్లును, రామానందుడే తనకు జ్ఞానము గలిగించినట్లును జెప్పుకొని యుండుట గమనార్హము. రామానందుడు 1299 వ సంవత్సరమున జనించి, 1410 వ సంవత్సరమున, దన 111 వ సంవత్సర ప్రాయమున బరమపదించినట్లు పూర్వము గాంచియున్నాము. అందుచే కబీరుదాసు రామానందుని గలియుటకనుకూలముగ, రామానందుని చరమదశలోనైన గలిసి యుండుటకనుకూలముగ క్రీ. శ. 1398 వ సంవత్సరము అతని జన్మదినముగ దీర్మానించుచో, దన బాల్యమున గబీరు, వృద్ధుడైన రామానందుని దర్శన ప్రాప్తినొంది, అతని శిష్యుడై యుండుటకవకాశ మేర్పడును. అట్లుకాక, కబీరు జననము 1440 వ సంవత్సరమైనచో

రామానందునికి కబీరుదాసునకు సంబంధముండ నేరదు. అదియునుగాక, జననకాలము అటులుండ, నీతని మరణకాలమును క్రీ. శ. 1518 వ సంవత్సరమని కొందరు వచించెదరు. దానిని విశ్వసించచో, నిక కబీరుదాసు రామానందుని శిష్యుడనుటయే పొరపాటు కానగును. కబీరుదాసుని రామానంద శిష్యత్వము, సాంప్రదాయిక కల్పనమని ఘుర్యే పండితుని తాత్పర్యము. 149 కాని కబీరుదాసు స్వయముగ తన కీర్తనలలో రామానందుడు తన గురువనియు, తనకు అతడు జ్ఞానోదయము గలిగించెనని వాకొనియుండుటచే, నాతని వచనముల వమ్ముగ ద్రోసిపుచ్చుట అసమంజసము. చరిత్రకారుల గణనమున పొరపాటులుండునేమోగాని వారి గురుశిష్య బాంధవ్యము అసంభవమని వచించుట దోషభూయిష్టముగ దోచును. అందుచే రామానంద, కబీరుదాసుల జనన మరణకాలములెట్లు పండితులచే గుణింపబడినను వీరి గురుశిష్య బాంధవ్యముమాత్రము సత్యమనియే దోచును.

మరల నతని పుట్టుకగూడ విచిత్రము. అండర్ హిల్ పండితుని అభిప్రాయమున కబీరుదాసు మహమ్మదీయ దంపతుల సుతుడు. పిల్లలులేని మహమ్మదీయ దంపతులు అతని పెంచుకొనిరి. 150 కాని సంప్రదాయ కథనము ప్రకారము, అతడు ఒక బ్రాహ్మణ వితంతువునకు దైవ వరప్రసాదముచే జనింప, నామె లజ్జావదనయై గోప్యముగ నతని గని, నరణ్యముల విసర్జించినదనియు, 151

---

149. Prof. G. S. Ghurye : Indian Sadhus, p. 214

150. Prof. Evelyn Underhill : One Hundred Poems of Kabir, p. v

151. Prof. Manmath Nath Dath : The Prophets of Ind, p. 186

నట్లుగాక నా శిశువు నదీప్రవాహమున దేలుచు కొట్టుకొని వచ్చి మహమ్మదీయ దంపతులకు దొరికినదనియు, నదియుగాక నా శిశువు వారణాసీ నగరమునగల లాహర్ తాళ్ అను సరస్సులో వారికి లభించెననియు చరిత్ర. 152 కాని యీ కల్పనములన్నియు గాలాంతర ప్రక్షిప్తములుగ దోచును. మహమ్మదీయుడై యుండి హైందవ సంప్రదాయముననుసరించి, ప్రఖ్యాతి నార్జించి యుండుటచే హైందవ సంప్రదాయస్థులు అతనికి హైందవత్వమును నిరూపింప నిట్టి కల్పనముల గావించియుందురు. రామానందుడు అతని మహమ్మదీయుడే యని విశ్వసించియు, దన విశాలబుద్ధిచే శిష్యునిగ స్వీకరించియుండ, నతనికి హైందవత్వమును గల్పింప ననావశ్యకమనిపించును. కల్పనమున హద్దులు మీరి, శుకయోగీంద్రుడే కబీరుదాసుగ జనించినట్లు గొందరు చిత్రించిరి.

సంతానప్రాప్తి లేని తమాల నిరు దంపతులు అతని గాంచి పుత్రునిగ బెంచుకొనిరి. ఆ బాలుని అసాధారణ స్వరూపమును దిలకించి, ఆనందించి, అతనికి కబీరు అని నామకరణమొనర్చిరి. అరబ్బీ భాషలో గొప్పవాడని ఆ పదమునకు అర్థము.

బాలుడు చిన్ననాటనుండి అత్యంత భక్తియుక్తుడై, సతతము ఏకాంతవాసమున గన్నుల మూసి ధ్యానమగ్నుడై యుండువాడు. తండ్రియైన తమాలుడు వస్త్రముల నేసి, వాని నగరమున విక్రయించి జీవించు వృత్తిగలవాడు. కాని పుత్రుడు ముద్దుగ బెరుగుచుండుటచే, నా వృత్తిలో నెక్కువ గౌరవ కబీరుదాసునకు ప్రథమమున నేర్పడ దయ్యెను.

---

152. Ramanand to Rama Tirtha, p. 17

ఈ విధముగ కబీరునకు బాల్యత్వము పోయి యౌవనత్వ ముదయింప, తమాలుడును, బిడ్డనికి నేతపనిని నేర్పి, అందు కౌశల మును గలిగించుచుండెను. యౌవనుడై యుండుటచే గబీరునకు వివాహమునుగూడ దండ్రి తమాలుడు గావింపచేసినట్లు కొంచరి భావము. కాని కొందరి అభిప్రాయమున, కబీరు భక్తియుక్తుడై దిరుగుచు, తమ పట్టణమైన వారణాసీ నగరమున ప్రఖ్యాతుడై, సహస్రాధిక శిష్యపరివృతుడై యున్న రామానందునిగూర్చి విని, తారణోపాయము నకై యన్వేషించి, అతని శిష్యుడైనట్లు వచించెదరు. ఒక దినమున కబీరు రామానందుని జేరి, యుపదేశింపగోర నా యాచార్యుడు కబీరు మహమ్మదీయుడగుటచే నిరాకరించెను. అందులకు వగచి, కబీరు ఎట్టులైన నా మహాత్మునినుండి యుపదేశము నొంద కాంక్షించి, రామానందుడు నిత్యము గంగాస్నానమునకై యరుదెంచు సమయము నకు, ఆ గంగాఘట్టమునకు జేరి, గంగయొద్దునగల సోపానములపై రహస్యముగ బరుండి యుండెను. ప్రతిదినమువలె నా గురువరేణ్యుడు బ్రహ్మముహూర్తమున గంగను జేరి, సోపానముల దిగుచుండ, నా మందాంధకారమున నందు పరుండియున్న బాలునిపై నాతని కాలు పడెను. ఒక యువకుని దెలియక ద్రొక్కుటచే వగచి, తన సహజ విధానమున 'రామ రామ' అని రామానందుడు వచించెను. ఆ రామనామమే రామతారకముగ విశ్వసించి, కార్యసిద్ధి యైనందులకు ఆనందించి, గురువర్యునకు సాష్టాంగవందనమాచరించి, గురువునకు నెదుట నిలువ, విశాల హృదయుడైన రామానందుడు అమందా నందము నొంది, మఠమునకు అతనిని గొనిపోయి, మంత్రోపదేశ మును గావించి శిష్యునిగ జేసికొనెను.

ఈ సంఘటనము ననుసరించి చూచుచో, రామానందునికి వర్ణాతీత వ్యవస్థ ఏర్పడక బూర్వము కబీరుదాసు జేరినట్లు వ్యక్తము.

అందుచే గబీరు రామానందుని జీవితశేషమునగాక, ప్రథమ దశలలో జేరినట్లు స్పష్టము. కబీరును అట్లు చేర్చిన రామానందుని పై సవర్ణులు తమ అయిష్టతను ప్రకటించి, అతని నిందించినట్లుగూడ చరిత్ర. అందుచే నీ రిరువురి కాలనిర్ణయము యింకను అనిశ్చితమై గవేషణీయాంశమే యని నిశ్చయము.

ఈ విధముగ రామానందుని సన్నిధానమున శుశ్రూషాసాధనాదుల గావించుచు గబీరుండెను. కాని అతడు గురుసాన్నిధ్యమున నెంతకాలముండినది అనవగతము. అతడేయే సాధనల గావించినదియు కాలగర్భ గుప్తము. అంతియగాక, నితడింతకాలము, అనగా బాల్యయౌవనముల నెట్లు గడిపియున్నదిగూడ చరిత్రకందరాదయ్యెను.

రామానందుని జేరక పూర్వమో, లేక యనంతరమోగాని, యితడు లోయి అను కన్యకను పరిణయమాడెను. ఈమెనుగూర్చియు నొక విచిత్ర గాథ గలదు. ఈమె యొక పేద కుటుంబమున జనింప, పోషింపజాలమను భయమున నామె జనకులు ఆమెను లోయి అను గుడ్డలో నుంచి, దాని నొక పెట్టెనుంచి, విసర్జించిరి. ఆ పేటిక నీటిపై దేలుచు నొక నదీ ప్రవాహమున స్నానమాచరించుచున్న నొక సాధువును జేరెను. ఆశ్చర్యమున నాతడాపేటిక దీసిచూడ నందు యీ బాలిక గనబడెను. అందులకతడు మిగుల అచ్చెరువంది ఆ సంఘటనము ఈశ్వరప్రేరణజన్యముగ భావించి, ఆ బిడ్డని ఆశ్రమమున బెంచెను. ఆమె వయస్కయగుటయు, నంత ఆమె దురదృష్టమున నా సాధువర్యుడు దివంగతుడగుటయు నాయెను. కొంతకాలమునకు కబీరు అట కేగి, ఆమెను బరిణయమాడెను. ఆమె మూలమున అతనికి కమాలుడు, కమలి అని యిద్దరు బాల బాలికలు జనించిరి.

అటుల కబీరుదాసు మరణపర్యంతము గృహస్థాశ్రమమునమాత్రమే యుండెను. కుటుంబపోషణార్థము అతడు తండ్రియైన తమాలుని నేత్రవృత్తినే అవలంబించి ధనార్జనము చేసికొనెడివాడు.

కబీరుదాసుని గురువు రామానందుడు సన్న్యాసియై యుండ, మరల నతని అనుచరులనేకులు కబీరుపంథ నేర్పాటుజేసి, సన్న్యాసులై, ప్రత్యేక సన్న్యాస సంప్రదాయమును నిర్మింప, నీతడుమాత్రము విచిత్రముగ మరణపర్యంతము గృహస్థుగమాత్రమే యుండెను. ఇతడెంతకాలము గురువునాశ్రయించి, అతని విధానము ననుసరించెనో గాని మన్మథనాథదత్తుని వాక్యములలో, whatever be the fact, with in a very short time Kabir became a greater man than Ramananda and his religion became more powerful than any other religion in existence in India 153 యథార్థ మెట్లున్నను కొద్దికాలములో, కబీరు రామానందుని మించినవాడై, అతని మతము నాటి భారతీయమతముల నన్నింటిలో అధికతర శక్తివంతమై యలరారెను.

గృహస్థాశ్రమ నిర్వహణమున నతని జీవితమున నొక ఘట్టము శ్రుతమగుచున్నది. కొందరు సాధువులు అతని ఆతిథ్యమునకై వచ్చిరి. కాని నాడు యింట పదార్థములెవ్వియు అభావము. ఎట్లని యోచించి, అతని పత్ని దుకాణమునకరిగి, అరువునకు గొన్ని వస్తువుల నర్థించెను. అది యవకాశముగ గైకొని, లోయిపై వ్యామోహమున నున్న వర్తకుడు తన వాంఛను దీర్చినచో సామానుల నుచితముగ నిచ్చెదనని తెల్పెనట. **అతిథి** సత్కారకాంక్షనున్న యా సాధ్వి అందులకు

153. Prof. Manmath Nath Dath : The Prophets of Ind, p. 187

అంగీకరించి, వస్తువుల దెచ్చి సాధువుల దృప్తిపరచి, రాత్రి సమయమున, విషయమును భర్తకు దెలిపెనట. అందులకు గబీరు సమ్మతించి, తానే ఆమెను వర్తకుని వద్దకు జేర్చి వచ్చెనట. భార్యాభర్తలు యిట్లు వచ్చుట గాంచిన వర్తకుడు ఆశ్చర్యచకితుడై, వారి భక్తి విశ్వాసములకు ఆనందించి, తన కామాతురతకు వగచి, వారి క్షమాపణము గోరి అనుచరుడయ్యెనట. ఇందు అసందర్భములు గోచరము. అటే విధముగ మరియొక పర్యాయము కమాలుని వచనముల నంగీకరించి, తాగూడ చోరత్వమునకై వెడలి, కన్నము చేసి ఒక యింట దొంగిలించి, కమాలుడు చిక్కుపడ నతని గుర్తింపకుండుటకై కబీరు, కన్నమున గావలనున్న తనయుని శిరమును ఖండించి తెచ్చెనట. మరునాడుదయము ఆ శిరమును శేషదేహమునకు అంటింప, కమాలుడు సజీవుడయ్యెనట. ఈ గాథలు కేవలము కల్పితములుగా జూపడును. కబీరుయొక్క మహాత్మ్యమును చిత్రింప నవి కాలాంతర కల్పితములని దోచును.

ఈ విధముగ ప్రఖ్యాతుడై, హిందూ మహమ్మదీయ సంఘముల బహుముఖ పరివర్తనమునకు గారణుడై ప్రకాశించు కబీరుదాసు ననసంఖ్యాకులు విశ్వసించి, అనుసరించుచుండ యీ రెండు సంఘముల ననూయాపరులుగూడ నధికసంఖ్యాకులై యుండిరి. అందు నతని బాధింప సంకల్పించు మహమ్మదీయులు, నాటి చక్రవర్తియైన శిక్కిందర్ లోడి నవాబునకు కబీరుదాసునుగూర్చి అనేక కల్పనములతో అభియోగము జేసిరి. అతడు కోపించి, కబీరుదాసును విచారించి, అనేక కష్టములపాలు గావించెను.

అయినను కబీరుదాసు తన పద్ధతుల మార్చుకొనకుండుటచే, నా చక్రవర్తి, వారణాసీ పురమున అతని యునికి శాంతిభద్రతలకు

భంగకరమని తీర్మానించి, అటనుండి కబీరుని బహిష్కరించెను. అప్పటి కాతనికి అరువది వర్షముల ప్రాయమని కొందరి యూహ. కాని కబీరు చింతింపక, వారణాసీపురమును వీడి, మాఘర్ అను గ్రామమున వాసంబుండెను.

అండర్ హిల్లు కథనము ప్రకారము In 1518, an old man broken in health, and with hands so feebele that he could no longer make the music which he loved, he died at Maghar near Gorakhpur 154 క్రీ. శ. 1518 వ సంవత్సరమున, వృద్ధుడై, ఆరోగ్యభంగమున తనకు ప్రీతికరమైన గానము గావింపజాలక బలహీన హస్తద్వయముతో గోరఖ్పూరు దగ్గరగల మాఘర గ్రామమున కబీరుదాసు దేహమును త్యజించెను. అతనికి అప్పుడు ఎనుబది వత్సరముల ప్రాయమని కొందరి అభిప్రాయము. అట్లుగాక కబీరుదాసు నూటపదునొకండు వత్సరములు జీవించెననియు గొందరి తాత్పర్యము.

ఈ విధముగ నన్యమతస్థుడై యుండియు, సంసారియై యుండియు, విద్యాగంధవిహీనుడై యుండియు, గబీరుదాసు, దేశవ్యాప్త కీర్తి నార్జించి, సిద్ధిపొందుట గాంచి, నతని హిందూమహాత్మునిగ బరిగణించి ఆతని దేహమును గైకొని దహన సంస్కారముల గావింప హిందూసంఘము యత్నించెను. అదేవిధముగ, నతడు రామ శబ్దము నుచ్చరించినను, సూఫీమతమునకు జెందిన ఫకీరు అని పరిగణించి, మహమ్మదీయులు అతని శరీరమును ఖననము జేయ యత్నించిరట. అదియు విశేషమేగదా! అది ఆతని అద్భుత సర్వతోముఖ, సర్వాకర్షణీయ జీవితవిధానమాహాత్మ్యము. అతనిదొక మహత్తర పారమార్థిక శక్తిస్వరూపము. అట్టివారు వంద్యులు చిరస్మరణీయులు.

---

154. Prof. Evelyn Underhill : One Hundred Poems of Kabir, p. xviii

# తులసీదాసు

భరోసో జహి దుస్రో సో కరో
మోకో తో రామ్‌కో నామ్
కల్పతరు కలి కళ్యాణ ఫరో॥

— వినయ పత్రిక.

మనుష్యుడు తా విశ్వసించు కార్యమును జేయనిమ్ము. నాకు సంబంధించినంతవరకు గలియుగమునకు రామనామము కల్పతరువు. ఆ వృక్షము పురుషార్థఫలమును బ్రసాదించినది. 'ప్రీతి-ప్రతీతి జహా జాకే, తహం తాకో కాజ్ సరో। మేరే తో రామాయ్-బాప్ దోఉ ఆఖర్ హౌ, సిసు అరణి అరో' (వినయపత్రిక) మానవుని జయము అతని నమ్మకముపైనను, ప్రియవస్తువుపైన నాధారము. 'రా' 'మ' శబ్దములు నాకు మాతాపితలు. ఆ తల్లిదండ్రులముందు నేను గొణుగు కొందును అని తన సంపూర్ణ విశ్వాసముతో దన సర్వస్వమును శ్రీరామార్పణము గావించి, తన యసమాన శక్తిసామర్థ్యముల సంకేతము జేయుచు, బ్రజాభాషయైన హిందీభాషలో అత్యంత మాధుర్యరుచులచే నెల్లర తన్మయుల గావింపగల అమృతమయ రామకథను విరచించిన తులసీదాసునిగూర్చి కొంచెము విచారించెదముగాక। యథార్థమున నీతడు ఏ సిద్ధాంతమునైన బ్రతిపాదింపక, నే మతమునుగాని సంస్థనుగాని నెలకొల్పక, భారతీయ తత్త్వసిద్ధాంతములకెట్టి సేవయు గావింపకున్నను, అతడు జెందియున్న వైష్ణవ మతమునకు దన అవ్యయమైన రామాయణ కథామృతముచే ఉత్తరహిందూస్థానమున గొప్పసేవ జేసియున్నాడు. అతని కవితామాధుర్యమద్భుతమై, సరస్వతి అతని వాక్కునుండి పలికినట్లు దోచును.

రామానందునితో ప్రారంభింపబడిన, శ్రీరామచంద్రమూర్తిని ఆరాధ్య దైవముగ గైకొనియున్న వైష్ణవ శాఖ, పూర్వము మనము గాంచినచందము కబీరుదాసుమూలమున నతి విశాలమై, వర్ణ వర్ణాంతర, జాతి జాత్యంతరముల నాలింగనము జేసికొనుచు, దేశవ్యాప్తినొంద, నటులే, రామానందుని శిష్యులలో ముఖ్యుడైన నరహరియానందు డనియు నరహరిదాసుడనియు ప్రతీతుడైన శిష్యునిద్వారమున నా రామానందీయ సిద్ధాంతము తులసీదాసును జేరి, పూర్వాచార సమన్వితమై, సనాతన వైష్ణవ సంప్రదాయమునకు బట్టుగొమ్మయై, ప్రబలమై దేశము నల్గడల వ్యాపించెను. నాటనుండి నేటివరకు, సన్న్యాసులేమి. గృహస్థులేమి, ఉత్తరదేశమున తులసీదాసు రచితమైన రామాయణ గాథను పఠించి ఆనందింపని వైష్ణవుడుండడు. కబీరుదాసు గృహస్థ జీవితమును గడుప, దులసీదాసు సాధు జీవితమును గడిపెను. రామాయతులనబడు సాధువులకెల్లరకు తులసీరామాయణమే నిత్యపారా యణ స్థానము నలంకరించి, వారి హృదయముల గదలించి, రామా నందుని గార్యసిద్ధికి గారణమగుచున్నది. అంతియగాక నాతని రామా యణము హిందీభాషకే యొక మహదలంకారమై, భాషాభివృద్ధికి దోహదకారియునైనది. అతని భక్తి అకుంఠితము, మూర్తి అసమానము. అతని విజేత విశేషముల నిసుమంత గాంచెదముగాక :

అక్బరు చక్రవర్తి భారతదేశమున ఉత్తర ప్రాంతముల బాలించు కాలమున, హస్తినాపురమున ఆత్మారాముడను నొక బ్రాహ్మణుడు గలడు. అతడు సరయూపారణ బ్రాహ్మణ శాఖకు జెందినవాడని గొందరును, కన్యాకుబ్జశాఖీయుడని గొందరును అందురు. ఆ బ్రాహ్మ ణోత్తమునికి హుల్సిదేవి యను సాధ్వీ భార్యగ నుండెను. ఆ పుణ్య

దంపతులకు క్రీ. శ. 1532 వ సంవత్సరమున ఒక బాలుడుదయించెను. కాని సుతుడు దుష్టగ్రహవీక్షణజాతకుడై జనించెనను కారణముచేత నాతని వారు అరణ్యముల విసర్జించిరి. జనన కాలము స్థిరముకాక, ననేకరీతుల చరిత్రకారులు లిఖించిరి. కొందరు క్రీ. శ. 1588 అని వచింప, గొందరు క్రీ. శ. 1497 అనియు దెలిపిరి. కాని అధిక సంఖ్యాకుల విశ్వాసమున క్రీ. శ. 1532 వ వత్సరమే తులసీదాసు యొక్క జన్మసంవత్సరము.

అట్లు విసర్జింపబడిన బాలకుడు, ఈశ్వరేచ్ఛచే నట బర్యటించు చున్న నరహరిదాసు అను సాధుపుంగవునిచే నవలోకింపబడి, పెంప బడెను. ఈ సన్న్యాసియే రామానందుని శిష్యుడైన నరహరియానందు డని యందురు. అతడే అబ్బాలకునకు తులసీదాసు అని నామకరణము నొసంగెను. అట్లుగాక అతని నామము ప్రథమతః రాంబోలాయై యుండెననియు, తర్వాత తులసీదాసుగ సంసారపరిత్యాగమున నేర్పడె ననియు గొందరి విశ్వాసము. ఆ బాలుని అత్యంత ప్రేమ వాత్సల్య మున నరహరిదాసు పెంచి, పెద్దవానిగజేసి, అతనికి తారకమంత్రోప దేశముగూడ చేసి, చిన్నతనముననే తులసిని ఆధ్యాత్మికమార్గమున ప్రవేశింపజేసి, అతని భావి జీవిత విధానమునకు బునాదుల నిర్మించెను. అంతియగాక శేషసంతానుడను సాధుపుంగవుదగ్గర, పదునైదు సంవత్సర ములు తులసీదాసు వేదవేదాంతములగూడ బఠించెను.

పై విధమునగాక మాతాపితలు తులసిని విసర్జింపలేదనియు, వారు, బాలుని ఎనిమిదవసంవత్సర ప్రాయమున దివంగతులగుటచే, నరహరిపండితుడు చూచి, కరుణించి, బాలుని జేరదీసెననియు గొంద రందురు. ఎట్లు అయినను తులసీదాసుని అదృష్టవశమున, చిన్నతన

మున తనకాప్తమైన శ్రీరామాధిష్ఠానముగల వైష్ణవ సంప్రదాయము పరిచయమయ్యెను. శ్రీరామచంద్రునియందతనికి అధిక భక్తి జనింప జొచ్చెను. అపారవిద్యయు, శ్రీరామభక్తియు నతనికలంకారములుగ రాజిల్లెను.

తులసీదాసునకు గొంతకాలమునకు వివాహ వాంఛ గలిగి రత్నావళి యను వనితను బరిణయమాడెను. కొందరి అభిప్రాయమున నతడు ప్రథమమున మాతాదేవి యను సాధ్విని వివాహమాడెననియు, నామె యీతడు కాశీనగరమున విరాగియై యుండుటచే జింతించి, గంగాప్రవాహమున ఆత్మహత్య గావించుకొనెననియు, నంతట తులసీదాసు మరల చింతించి, రత్నావళిని బరిణయంబాడెననియు రచించిరి. కాని అధికసంఖ్యాకుల దృష్టికి తులసీదాసు ఒకే వివాహము గావించుకొనినట్లు, రత్నావళియే అతని భార్యయనియు నిశ్చయము. రత్నావళి గర్భమున తారకుడను పుత్రుని తులసీదాసు బొందెను.

తులసీదంపతులధిక అన్యోన్యప్రేమలతో నుండిరి. ఒక్కక్షణమైనను తులసీదాసు భార్యను వదలక, అధిక మమకారవ్యామోహముల గ్రుంకి యుండెను. అట్లుండ, అతడు గృహమున లేనిసమయమున రత్నావళియొక్క జననీ జనకులు వచ్చి, రత్నావళిని సమ్మతింపజేసి, తమ గ్రామమునకు గొంపోయిరి. గృహమునకు దిరిగి వచ్చి చూచిన తులసీదాసు, రత్నావళి లేకుండుటగాంచి భరింపజాలక, నామె నెల్లైన ద్వరితముగ జేర సంకల్పించి బయనమయ్యెను. కాని దురదృష్టవశమున సూర్యుడస్తమించెను, బీభత్సరూపమున వర్షము

ప్రారంభించెను. మార్గమధ్యమునగల నదియు గట్టుల దన్నుచు ప్రవహించుచుండెను. కాని కామాతురుడైన తులసికి అవి యన్నియు నాటంకములుగ దోచుటలేదు. వర్షమున జూర్తిగ దడిసి, ఒడ్డునగల నౌక శవముపై నదిని దాటి, తుఫానుగాలిలో నెట్టకేలకు అతడు గ్రామమును గాంచి, భార్యను జేరెను.

అన్ని కష్టములకోర్చి, కామముచే భర్త యిట్లు వచ్చుట గాంచిన సాధ్వి రత్నావళి, అతని అజ్ఞానమునకు జింతించి, విరక్తి వచనముల బోధించి, భార్యయైన తనమీద తులసీదాసు ఉంచినరీతి మనస్సును ఆ రామచంద్రునిపై నుంచినచో, నా దేవదేవునియొక్క సాక్షాత్కార మహాభాగ్యమెన్నడో సంప్రాప్తించి యుండెడిదిగదా అని చరమ వాక్యముల బల్కెను. అదియే నతనికి మహోపదేశమయ్యెను. ఆ క్షణముతో నతనికి హృదయపరివర్తనమయ్యెను. ఒక రెప్పపాటులో ప్రపంచ నశ్వరత్వము అతని గన్నుల గట్టినట్లయ్యెను. శ్రీరామ చంద్ర మహాప్రభువుయొక్క సాక్షాత్కారమహాభాగ్యసంపద అతని దృష్టికి ఒకపర్యాయము దోచెను. ముందున్న భార్య అపర దేవత వలె గోచరించి, తనను దరింపజేయ నేతెంచిన గురువరేణ్యుని చందము గోచరించెను.

వెంటనే జ్ఞాననేత్రము విప్పారిన తులసీదాసు, రత్నావళికి సాష్టాంగవందనమాచరించి, బయల్వెడలి సన్న్యాసి యయ్యెను. దేశముల బర్యటించి, బదరికాశ్రమాది రామేశ్వరపర్యంత మహాక్షేత్రముల దర్శించి, కాశీనగరమునకేతెంచి, తపోనిష్ఠ నందు వాసంబుండెను.

అంత కొంతకాలమిచట తపోదీక్ష నుండి, తన నలువది రెండవ సంవత్సరమున రామాయణ కథారచనము గావింప వాంఛ

గలిగి, అయోధ్యా నగరమును తులసీదాసు జేరెను. ప్రజాసమూహము నకు నర్థమగు హిందీభాష నుపకరణముగ గైకొని, పద్యరూపముగ నాతడు రామాయణమును లిఖింపసాగెను. అయోధ్యా కాండమును రచించుచుండగా అయోధ్యానగరమున గొందరు వైష్ణవులతో నభిప్రాయ భేదములు వొడముటచే తులసీదాసు, మరల వారణాసికరుగుదెంచి, అట కొన్ని వత్సరములు కృషించి, రామాయణ మహాకావ్యమును సర్వజనాహ్లాదకరముగ లిఖించెను. నృత్యగానములకనుకూల ఛందముల నతడు రామాయణమును నిర్మించుటచే నచిరకాలమున నది ప్రజా దరణమును బొంది, దేశదేశముల నల్లినదై, ఎచ్చట జూచిన నదియెయై, ఎల్లరకు నిత్య పారాయణశాస్త్రమై, ఉపనిషద్గీతాశాస్త్రము లకు నీడగుచు, గొంతవరకు వానిమించిన యశస్సునుగూడ సంపా దించెను. ఈ రచనముచే దులసీదాసుని కీర్తి దిగంతముగ బ్రాకెను.

సామాన్యప్రజలుమాత్రముగాక అక్బరు పాదుషాయొక్క మంత్రులు, రాజా తోడర్‌మల్, మాన్‌సింగులిరువురును దులసీదాసు శిష్యులయిరి. అక్బరు చక్రవర్తియు గాశీనగరమునకతని యాహ్వానించి, సత్కరించిపంపెనట. రాజస్థానమునకు జెంది, అమోఘ కీర్తిని దేశమునందంతట దన కృష్ణభక్తిచే బొందిన మీరాబాయియు, దులసీ దాసుని సలహాప్రకారము సంఘమును బరిత్యజించి, గృహమును బంధువులను వీడి విరాగియై, బృందావనమును జేరి మహావ్యక్తిగ రూపొందెను.

ఈ విధముగ బహుముఖ యశశ్శ్రీవిరాజితుడైన తులసీదాసును జూచి, ఎందరో ఆనందించి, చేరి తరించుచుండ, కొందరు అసూయా పరులై, అతని బాధింప దొడంగిరి. హత్య గావించి, పరివర్తిత

మనస్కుఁడై తులసీదాసును ఆశ్రయించి, రామనామోచ్చారణామహాత్మ్యమున బునీతుడైన నొక భక్తునితో, తులసీదాసు సపంక్తిభోజనము జేయుటచే సనాతనపరులతనికి కష్టముల గలుగజేసిరి. రామనామ మాహాత్మ్యమును వారికెంత బోధించినను, శాస్త్రపాఠముననెంత జూపినను, వారికి సమ్మతము కాజాలదయ్యెను. అంత తులసీదాసు మానవుల సమ్మతింపజేయుట వెర్రియని గ్రహించి, తనకాత్మశాంతి నొసంగ బ్రార్థించుచు శ్రీరామచంద్రునకి 'వినయ పత్రము' నాబడు నొక పద్యగ్రంథమును రచించెను. మరియు రామానందునివలె గొన్ని హిందీ గ్రంథముల బ్రజోపయోగార్థమై అతడు నిర్మించెను. అతని గ్రంథములలో నాటి వైష్ణవ సాంప్రదాయిక భావజాలములు పెక్కుఁ గోచరములు. అందుచే వైష్ణవులకు దులసీదాసు గ్రంథములు ప్రామాణికములగుటయేగాక, పారాయణస్థానమును పూజాస్థానములగూడ నలంకరించి, వారి హృదయముల నిండినవి.

తులసీదాసు దేశప్రఖ్యాతుడై, అసంఖ్యాక ప్రజానీక గౌరవాదరముల బొందుచున్నను, నిరాడంబరుడై, శిష్యవర్గమును జేర్పక, మఠాది సంస్థల నెలకొల్పక, ఏకాంతవాసమున నుండుచు, శ్రీరామచంద్రపాదపద్మధ్యాననిమగ్నచిత్తమున గాశీనగరముసగల అసీఘట్టమున నుండెడివాడు. అతనికి గురుపీఠ వాంఛగాని, చక్రవర్తులు తన చరణముల జేరుచున్నను అధికార కాంక్షగాని, ధనాధికులు తనను శరణుజొచ్చుచున్నను ఐహికసంపదల గోర్కెగాని లేక, వినిర్మలహృదయమున నుండెను. అవ్విధి తులసీదాస భక్తశిఖామణి మిగుల వృద్ధాప్యము గలుగువరకు అనగా దన తొంబది యొకటవ వత్సరప్రాయమువరకు ప్రశాంతి అచ్చంచల జీవితమును గడిపెను.

అంత క్రీ. శ. 1623 వ సంవత్సరమున తులసీదాసు తన యసాధారణ భక్తిజీవితమును ముగించి, శ్రీరామచంద్రచరణ యుగ్మమున నిరంతర వాసము జేయ గాంక్ష జనించియుండుటచే నేమియో స్థూలశరీరమును వీడి, పరలోకమున ప్రవేశించెను. దేహత్యాగమునకుబూర్వము అనుచరుల సంబోధించుచు. తులసీదాసు, 'శ్రీరామచంద్రుని నామప్రభావ గానము నేను గావించియుంటిని. ఇకముందు నేను మౌనము వహింపనుంటిని. కావున తులసీపత్రమును, సువర్ణమును నానోట నుంపుడు' అని, ఆదేశించి యసువుల నాతడు బాసెను. కాని అతని దివ్యనామము, అతని 'రామచరిత మానస' మను రామాయణము, భారతీయుల హృదయముల హత్తుకొని చిరస్థాయిని బొంది యున్నవి. అతని తులసీదాస నామము, భారతీయ భక్తకవుల చారిత్రమున సువర్ణాక్షరముల లిఖితము. అతనికి నిత్యమెందరు భక్తులు ప్రణమిల్లుచున్నారో! అసంఖ్యాకము. అతడు సార్థక జన్ముడు.

చాటర రహో ఖాన్ పాతరీ జ్యోం కవహుం న పేట్ భరో!
సో హై సుమిరత్ నాం సుధారస్ పేఖత్ పరూసి ధరో॥
— (వినయపత్రిక).

ప్రజల భుక్తశేషాన్నమును భుజించు శునకమువలె నేను దిరిగితిని .... కాని నా యాకలి దీరలేదు. అంత నేను శ్రీరాముని నామము గైకొంటిని. అందు నాకమృతము సంసిద్ధముగ నే గాంచితిని. నా క్షున్నివారణమాయెను.



# పరిసమాప్తి

ఈ గ్రంథభాగమున శ్రీ కృష్ణ, శ్రీ రామచంద్ర మూర్తుల నధిష్ఠానదైవముగ విశ్వసించి, ఆ మూర్తుల పరబ్రహ్మరూపములగను, సృష్టి స్థితి లయ శక్తియుక్తులగు పరమాత్మగను, షడైశ్వర్యసమేతుడైన భగవంతునిగను చూచి, ఆ యవతారపురుషుల నాధారముగ జేసికొని కొన్ని తాత్త్వికసిద్ధాంతములను మోక్షప్రాప్తిహేతువైన సాధనానుష్ఠానవిధానములను చిత్రించి, అగణిత ముముక్షువులకాధారమును ప్రసాదించిన కొందరు మహాత్ముల జీవిత విశేషములను, వారి మహాత్మ్యములను వారి సిద్ధాంత విషయములను క్లుప్తముగ నవలోకించియున్నాము. ఆ మహాపురుషుల దైవములు ఒక్కొక్క దానికొక్కొక్క మహాగ్రంథరచనము గావించినగాని సర్వవిషయసాకల్య వివరణము జరుగనేరదు. అయినను 'సౌరభము' తన విశాల కార్య క్రమమున నింతకంటె నవకాశము నొసంగజాలనందులకు విచారించు చున్నది. ఆ మూర్తుల విషయ విజ్ఞానకాంక్షులు వారి వారి ముఖ్య గ్రంథముల పరిశీలించి, అధికతరముగ సంతృప్తి గాంచెదరుగాక అని 'సౌరభ' ఆకాంక్ష.

సిద్ధాంత విచారణమునకై యూనిన 'సౌరభము' ముఖ్యముగ నీ భాగమున భారతీయ తత్త్వసిద్ధాంతమున గొంచెమేని విషయముల జేర్పని కొందరు మహామహుల జీవితోల్లేఖనము గావించినది. ప్రత్యక్షముగ గాకున్నను పరోక్షముగ నా మహనీయులు, నాడేగాక నేటికిని ముముక్షు హృదయముల గదలించి, వారికి దాత్త్వికవిషయ తృప్తిని గూడ నొసంగి, ప్రశాంతచిత్తమున సాధనానుష్ఠానమార్గముల నవలంబింప మిగుల దోడ్పడుచుండుట విజ్ఞులకు విదితము. అందుచే నిందు

నట్టివారు గొందరుమాత్రము స్వీకరింపబడిరి. కాని యీ భాగమున జేర్పబడని మహామహులు యింకెందరో భారత మహాచరిత్రమున గలరు. వారెల్లర గైకొని రచింపబూనుచో యిప్పటికే అగాధముగ బరిణమించిన 'సౌరభ' కార్యము అనంతమై ఎప్పటికైన బరిపూర్ణత్వము నొందక నసంపూర్తిగ నుండునేమో!

ముఖ్యముగ మహారాష్ట్ర దేశమున జ్ఞానదేవునితో ప్రారంభమైన భక్తసంతతి, తమ అపార భక్తి ప్రకాశముచేత, తన్మయమైన అభంగకీర్తనావాహినులచేత, నా దేశమునేగాక భారతావని నంతటను వ్యాపించి, పవిత్రము గావించియున్నది. జ్ఞానదేవు 'జ్ఞానేశ్వరి' యను గీతాభాష్యము, సమర్థ రామదాసుని 'దాసబోధ', నామదేవ తుకారామాదుల అభంగ గానామృతముల ముముక్షువులెవరును మరవజాలరు. వారి పవిత్ర ప్రభావము ప్రజానీకముపై బడి, ఎందరికో మార్గదర్శకమై వెలుగొందినది. కాని వీరు భారతీయ తత్త్వసిద్ధాంత శాస్త్రమునకు ఎక్కువ యుపయుక్తము కాలేదనిపించును. భక్తులుగమాత్రముండి, భగవంతుని సాక్షాత్కారమునొంది, తన్మయులై, అయస్కాంతమువలె నెల్లర నాకర్షించి, పారవశ్యత్వమును బంచియిడి, అపారముగ భక్తిచారిత్రగగనమున నిత్యభాస్కరులై ప్రకాశించిరి.

అదేవిధముగ ఆంధ్రదేశమున పూర్వప్రోక్త సిద్ధాంతములు బహుళ వ్యాప్తములై యున్నను, సిద్ధాంత నిర్మాతలు అభావమై యుండుట జింతాకరము, ఆచార్యులలో నధికసంఖ్యాకులు ఆంధ్రులై యుండియు, ఉత్తర హిందూస్థానమునకరిగి, అందే వాసంబుండి, ఆ ప్రజానీకమునకు ఆ యా భాషలలో బోధించి, రచించి, అందే

తరించి తరింపజేసిరి. కాని తెలుగుదేశమున నొక్కరును వాసముజేసి, ఆంధ్రులకుపయోగించి యుండరైరి. ఎందుచేతనో? ఆంధ్రులలో నాధ్యాత్మికతృష్ణ అభావమా? మహాత్ముల నాదరింపగల శక్తిలోపమా? అట్టి గురువరేణ్యుల ననుసరించు నభ్యాసము అరిదియా? ఎందులకో ఆచార్యులెల్లరు జన్మభూమిని వర్జించి, పరభూముల నుద్ధరింపబూనుట? ఒక్క వైష్ణవమునమాత్రమేగాక, శైవమున, నద్వైతమునగూడ నిదే విచిత్రము ఆంధ్రదేశమున గోచరము. పారమార్థిక రంగమునమాత్రము గాక రాజకీయ సాహిత్యాదికములగూడ నిదియే విధానము దోచెడిని. అందులకు ఆంధ్రమహాశయులు ఆత్మపరీక్ష గావించుకొని, మహాత్ముల, మహాపురుషుల నాదరించి, గౌరవించి, అనుసరించి, దేశమునకు, ముముక్షుకోటికి నుపయుక్తమగుదురుగాక!

అయినను ఆంధ్రులనదగినవారు పై భక్తకోటిలో జేర్పదగినవారు కొందరు గలరు. అందు ముఖ్యముగ త్యాగరాజు రామదాసులు గోచరము. త్యాగరాజు ఆంధ్రుడైనను తిరువైయారున తమిళదేశస్థ గ్రామమున జనించెను. నాడు ఆ ప్రదేశము ఆంధ్రరాజుల పాలనమున నుండెను. అట నుండి విద్యాభ్యాసము గావించి, సంగీతము నేర్చి, సంసారియయ్యు విరక్తుడై నిరాడంబరజీవితము గడుపుచు, శ్రీ రామాయణమును గీర్తనారూపమున లిఖించి, గానముచేసి తరించెను. అవి సర్వధా సంగీతశాస్త్రయుక్తముగ నుండుటచేనై యుండనోపు, నా త్యాగరాజకృతులు సంగీతవిద్వాంసులకధీనమై ప్రజావ్యాప్తి నొందక, శాస్త్రీయ కర్ణాటక సంగీత వర్ధమానమునకు బహూళోపయుక్తమయ్యెను. ఆ సంగీత విద్వాంసులుగూడ ఆ కృతుల సులభగానమునకు అవకాశమీయని విధానమున పలచి, ముముక్షుజనదూరముగ వాని నొన

రించిరని దోచును. అందుచే త్యాగరాజు తన స్వంత యుపయోగము నకై లిఖించుకొని పాడి, శ్రీరామచంద్రదసందర్శనమహాభాగ్యము నొంది, తరించి, మహాభక్తుడని పేరెన్నిక గాంచినను అతనివలె హృదయ స్పందనము గాంచుచురీతి గీర్తనల గానము చేయువారు అభావమగుట త్యాగరాజు సంగీతవిద్వాంసుల సృజించినట్లు అయ్యెనుగాని తనవలె భక్తాగ్రగణ్యుఁ కాదర్శము కాజాలదయ్యెను. అతని కృతులు భుక్తి కుపయోగించుచున్నటుల ముక్తికుపయోగించుచుండుట లేదేమో అని యనిపించును.

రామదాసుహాద మహాభక్తుడు. కాని అతనికి నితరుల జోక్య మవసరమనిపించలేదు. తానే ఏకాంతభక్తుడై, శ్రీరామకైంకర్యకార్య దీక్షాదక్షుడై యలరారెను. అతని కాలమున నతనిచే ప్రేరేపింపబడి, భక్తులై తరించినవారి గానము. తన తృప్తికొరకై దాశరథీ శతకము రచించుకొనెనుగాని యితరులకొరకు గాదు. అందుచే నతనికాలమున నతని ప్రభావము, నాటి సంఘమున వ్యాప్తము కాజాలదయ్యెను. కాని కాలాంతరమున, నతని చరిత్రము, అతని కవిత్వములు ఆంధ్ర దేశమున నింటింట వెలసి, ఆబాలగోపాల ప్రజానీకముల హృదయ ముల గదిలించి, ఏకాంతభక్తులకు సమష్టిగ భజనల గావించు భక్త బృందమునకు అతని కీర్తనలాధారములై వెలుగొందినవి. ఆ మహాను భావుని అచంచల భక్తిప్రభావమే అందులకు గారణము. హృదయ ముల గదిలించు అతని కష్టములు, ఉద్వేగపూరితములై మనసుల మార్పుజేయు నతని కీర్తనలు, జీవనపరివర్తనమును గలుగజేయు నతని పద్యములు, చిరస్థాయి నాంధ్రమహాజనుల హృదయముల నేనాటికి వీడజాలవు. అతడు స్వప్రయోజనపరుడై శ్రీరాముని గీర్తించెను

గాని నితరుల దరింపజేయు నుద్దేశ్యము అతని హృదయమున నెచ్చటగూడ గానము. అదియే ఆ చరితార్థుని అసమాన ప్రతిభ. ఆ ధన్యజీవునివలన నాంధ్రమున నెందరో హృదయములు ద్రవించి, భక్తులై యలరారిరి. అతని ఆదర్శమున నెందరో విరాగులై వెలుగొందిరి. ఆ మహాత్ముని అగోచరశక్తి యింకను తెలుగునాట అద్భుతముగ గోచరము.

ఇదేవిధముగ నింక ఎందరు మహాపురుషులు చరితాకథనదూరులై భారతావని నుండిరో, వారి సునిర్మలహృదయప్రసారితకిరణములు ముముక్షుకోటి హృదయముల నవ్యక్తవిధాన ప్రకాశమొనరించి మార్గదర్శకములగుచునే యున్నవి. కాని అవి యస్పష్టము. అవ్వారినందరిని భక్తకోటి సదా స్మరించుచుందురుగాక!

'సౌరభము' ఈ భాగములో వైష్ణవ ఖండమున, వైష్ణవ భాగమునుగూడ వివరించి ధన్యమైనది. వేదాది నేటిపర్యంతముగల వైష్ణవ మహాభక్తులందరి కృపావీక్షణములచే 'సౌరభము' న కీ కార్యసిద్ధి కలిగినది. 'సౌరభ' పాఠకులు, 'సౌరభ' ఆదర్శమును స్వీకరించి, ఆ యా మహాపురుషమార్గముల నన్వేషించి, గ్రహించి, సర్వాంతరమైన భక్తితృష్ణను గ్రహించి, అద్దాని ననుసరించి తరించెదరుగాక! 'సౌరభ' సంకల్పమీడేరును గాక! అందులకు బరమేశ్వరుడు అనుగ్రహించునుగాక!

హరిః ఓం తత్ సత్



